శ్రీమతే రామానుజాయ నమః.



# శ్రీ విష్ణు సహస్రనామము

( శ్రీ పరాశరభట్టరుల భాష్యమననుసరించిన )

## ఆంధ్ర వ్యాఖ్యానము



శ్రీ పెరుంబూదూరు విద్వాన్
కిడాంబి-రామానుజాచార్యులు వారిచే
ఆంధ్రీకరింపబడినది.



శ్రీ శింగంశెట్టి-యతీంద్రులు శెట్టి చారిటీసువారిచే
( 407, మింటుస్ట్రీటు, మదరాసు-1 )
ద్వితీయ ముద్రణము.

1958



శ్రీ భగవద్రామానుజులు.

(ఉడైయవర్లు)

అవతారస్థలదివ్యమంగళ విగ్రహము.

పుణ్డ్రైః ద్వాదశభిర్యుతం విలసితం దణ్డైస్త్రిభిర్మణ్డితమ్
కాషాయేణ శిఖోపవీతరుచిరం దోర్మూలచక్రామ్బుజమ్ ।
ఆసీనం జలజాసనేచ తులసీపద్మాక్షమాలాఞ్చితమ్
యుక్తఞ్జాఞ్జలిముద్రయా రవినిభం శ్రీభాష్యకారం భజే ॥



ది॥ శే॥ శ్రీమాన్ శింగంశెట్టి-యతీంద్రులు శెట్టిగారు.

చారిటీ స్థాపకులు.



ఈ గ్రంథము

1949-వ సం॥ జూన్ నెల 28.వ తేదీన జరిగిన

శ్రీ శింగంశెట్టి - యతీంద్రులు శెట్టి

చారిటీవారి

స్వర్ణమహోత్సవమునకు

జ్ఞాపకార్థముగా ముద్రింపబడినది.



శ్రీ లింగంశెట్టి-యతీంద్రులు శెట్టి చారిటీయొక్క-

# ప్రస్తుత పరిపాలకులు.

**1958**



అగ్రాసనాధిపతి.

శ్రీ చీతిరాల-సుబ్రహ్మణ్యం శెట్టిగారు.

కార్యదర్శి.

శ్రీ అల్లత్తూరు-వేదాచలం నంబెరుమాళ్లు శెట్టిగారు.

కోశాధ్యక్షులు.

శ్రీ గొల్లపూడి-వెంకటసుబ్బారావుగారు.

ట్రస్టీలు.

శ్రీ పాతాళం-వీరరాఘవులు శెట్టిగారు, B.A., B.L.
,, ఉప్పుటూరు-ఎంబెరుమానారు శెట్టిగారు.
,, నాదెళ్ల-సంపత్తు శెట్టిగారు.
,, గట్టు-సుబ్బుకృష్ణ శెట్టిగారు, B.A., B.L.
,, రాచమడుగు-నారాయణస్వామి శెట్టిగారు.
,, సత్రసాల-వెంకటరంగం శెట్టిగారు.
,, వీరబొమ్మల-రంగనాథం శెట్టిగారు.

మేనేజరు.

శ్రీ బండారం-వెంకటేశపెరుమాళ్లు శెట్టిగారు B. A.



# ప్రకాశకుల మనవి.

శ్రీమన్నారాయణ కృపాకటాక్షముచే ఆంధ్రవ్యాఖ్యాన సహిత శ్రీవిష్ణు సహస్రనామగ్రంథపు మొదటి కూర్పు ప్రతులు భాగవతులకు అందజేసితిమి. చాలమంది ఈ గ్రంథ వ్యాఖ్యానము భోగనీయముగా నున్నదనియు, ఇంకను కొన్ని ప్రతులను ముద్రింపించిన చాల ఉజ్జీవకరముగనుండుననియు కోరినందున ద్వితీయముద్రణమును గావించితిమి.

ఈ గ్రంథరాజము శ్రీవైష్ణవ భక్తశిఖామణులకు మోక్షదాయకమగుటవలన ఈ రెండవ ముద్రణము వెలువడింపజేసితిమి.

ఇట్లు

శ్రీ శింగంశెట్టి-యతీంద్రులు శ్రేష్ఠి చారిటీ-ట్రస్టీలు.

శ్రీమతే రామానుజాయనమః

# తొలిపలుకు.



శ్రీమన్నారాయణుని యవతారవిశేషముగా ప్రసిద్ధిజెందిన శ్రీ వేదవ్యాసులు లోకోజ్జీవనార్థమై దుర్గ్రాహమైన వేదార్థమును వివరింపదలంచి పంచమవేదమగు మహాభారతమును రచించిరి. సపాదలక్షగ్రంథముగల యీ మహాభారతమున భగవద్గీతయు శ్రీవిష్ణుసహస్రనామాధ్యాయమును సారతమములైనవి. ఈ రెంటిలోను, భగవద్గీత భగవంతుని మూలముగా వెలువడెను. శ్రీవిష్ణుసహస్రనామస్తోత్రము పరమభాగవతులగు భీష్ముల మూలముగా వెలువడెను. అప్పుడు భగవద్గీతా ప్రవర్తకుడగు శ్రీ కృష్ణుడుగూడ ఆ సభలో నొకడైయుండి వినుచుండెను. కనుక భగవద్గీతకన్న శ్రీవిష్ణుసహస్రనామస్తోత్రమే సారతరము. కాకయు, *ధ్యాయన్ కృతే యజన్ యజ్ఞైః త్రేతాయాం, ద్వాపరేఽర్చయన్। యదాప్నోతి తదాప్నోతి కలౌ సంకీర్త్య కేశవమ్* అనినట్లు కృతయుగమున ధ్యానించియు, త్రేతాయుగమున యాగమొనరించియు, ద్వాపరయుగమున అర్చించియు లభించు ఫలమును కలియుగమున. కేవలస్తోత్రమాత్రముననే మానవునికి లభించుచుండును. కనుకనే మహర్షులందఱు నొకప్పుడు నాలుగు యుగములలోను ఏ యుగముత్కృష్టమగునని వ్యాసమహర్షులనడుగగా "కలిస్సాధుః" అని కలియుగమునే యుత్కృష్టమైనదిగా వచించిరి. భగవంతుని స్తోత్రము చేయుటకు అధికారులు వీరేయను నియమములేదు. అందఱు నధికారులే. భగవంతుని వశీకరించుటకు ఇతరోపాయము లనేకములుండియు కేవల వాఙ్మూలముగ చేయు స్తోత్రమాత్రముననే సమస్తఫలములను లభించుటచే ఇదియే యుత్కృష్టమముగాన ఈ యుపాయమే ముముక్షువులకు శరణముకాగలదు.

అట్టి యీ సహస్రనామస్తోత్రమునకు నిర్గుణ బ్రహ్మవాదులగు శంకరాచార్యులు అద్వైతమతరీతిగా భాష్యము రచించిరి. భగవద్గుణములను బ్రహ్మానందముగా అనుభవించుటకనియే యమరియుండు ఈ స్తోత్రమునకు నిర్గుణబ్రహ్మవాదుల భాష్యమి సుమంతయు పొసగదనిదలంచి ఉడైయవర్లు తమశిష్యులైన కూరత్తాళ్వానుల కుమారులగు శ్రీపరాశరభట్టారకులను నియమించియుండిరి. ఆ నియమనంబును శిరసావహించి భట్టరు తమశిష్యులగు నంజీయరుల సహాయముతో ఈ భాష్యమును రచించినట్లు పెద్దలు వచింతురు.

ఈ భట్టరు శుభకృత్ సం॥ వైశాఖమాసమున అనూరాధనక్షత్రమున శ్రీరంగమున ఉడైయవర్ల శిష్యులును విరక్తాగ్రేసరులునగు కూరత్తాళ్వానునకును ఆండాళమ్మాళునకును కుమారులై యవతరించిరి. శ్రీరంగనాథులును శ్రీరంగ నాచ్చ్యారును ఈ శిశువును పుత్ర స్వీకారముగా గ్రహించి తమ సన్నిధిలోనే ఉయ్యాల నిడి పోషించుచుండిరి. పిమ్మట, వీరు ఉడైయవర్లు కూరత్తాళ్వాను ఎంబారు అను మహా చార్యులహస్తమునుండి వెలువడిన ఆణిముత్యమై వెలయుచు తమ యాచార్యులగు ఉడైయవర్లకు పిమ్మట విశిష్టాద్వైతసిద్ధాంత నిర్వాహకులుగా వెలసిరి. ఉడైయవర్లు పరమపదించునపుడు నియమించిన ప్రకారము పశ్చిమదేశమున సుప్రసిద్ధ విద్వాంసులై షడ్దర్శన పారంగతులై మహాధనికులైయుండిన వేదాంతియనువారిని అచ్చటికివిచ్చేసి వాదంబున జయించి తమకు శిష్యులు గావించుకొనిరి. వీరే 'నంజీయరు' అని సంప్రదాయమున సుప్రసిద్ధులైరి. భట్టరు పిమ్మట శ్రీరంగము చేరి దర్శనమును నిర్వహించుచు తమ శిష్యులకు రహస్యార్థములను వర్షించుచు ఇరువదియెనిమిది సంవత్సరములు లీలా విభూతి నలంకరించి యుండిరి. వీరు సాయించిన గ్రంథములు :— శ్రీగుణరత్నకోశము, శ్రీరంగరాజస్తవము, భగవద్గుణదర్పణమనబడు శ్రీవిష్ణు సహస్రనామభాష్యము, క్రియాదీపము, అష్టశ్లోకి, లక్ష్మీకళ్యాణము అను నాటకము మున్నగునవి. ముక్తకశ్లోకము లనేకములనుగూడ సాయించియున్నారు.

భట్టరు సాయించిన శ్రీ విష్ణుసహస్రనామస్తోత్రభాష్యము 'భగవద్గుణదర్పణము' అనబడును. భగవద్గుణములను అనుభవించుటకు ప్రధానోపకరణముగా నుండు నీ భాష్య మునకు ఇట్టి పేరమరినది దీనికే తగునని రసికులందురు. శంకరాచార్యుల భాష్యమున కును భట్టరుభాష్యమునకును పాఠభేదమును అర్థభేదమును అనేకస్థలములందు గలవు.

ఈ సహస్రనామ స్తోత్రమునకు భట్టరు సాయించిన భాష్యము సంస్కృత మననే యుండుటచే ఆంధ్ర సోదరులకు నుపయోగించునట్లు ఆంధ్రభాషలో నొక వ్యాఖ్యానముండినచో లోకోపకారముగా నుండగలదని దలంచిన మదరాసు శ్రీసింగం శెట్టి-యతీంద్రులు శెట్టి చారిటి ట్రస్టీలగు కీ॥ శే॥ శ్రీ కొత్తూరు-రంగనాయకులు శెట్టిగారు ప్రోత్సాహముమీద నాయల్పబుద్ధికి గోచరమైనంతవరకు ఆంధ్రీకరించితిని. శ్రీపరాశరభట్టారకుల భాష్యమో మహాసముద్రమువంటిది. దానిలో నవగాహించుటకు వలసిన జ్ఞానశక్త్యాదుల లేని మందుడనగు నేను నాంధ్రీకరింప ప్రయత్నించిన యీ సాహసమునకు పెద్దలను మన్నింప ప్రార్థించుచున్నాడను. అయినను అస్మదాచార్యులగు శ్రీమాన్ ఉ. వే. జగదాచార్య సింహాసనాధిపతి. శ్రీ కాంచీ ప్రతివాది భయంకరం అణ్ణంగరాచార్యులవారికృపాకటాక్షమే యీకార్యమును పూర్తి చేయించెను. ఈయల్పజ్ఞుని భ్రమ ప్రమాదాదులచే ఈ వ్యాఖ్యానమున నేర్పడిన తప్పులను మహనీయులు దెల్పి దిద్దించి నన్ను కృతార్థునింజేయ ప్రార్థించెద. దురవగాహములగు శాస్త్రార్థవిషయము లనేకములు భట్టరుల భాష్యమునం గలవు. అవి శ్రీభాష్యాధికారులకు మాత్రమే రసించునుగాని యితరులకు రసింపవని దలంచి వానిని విడువవలసివచ్చెను. ఈ భాష్యమున ప్రమాణశ్లోకము లనేకములుండియు గ్రంథవిస్తరభీతిచే కొన్ని ప్రమాణ వాక్యములే యుదాహరింపబడినవి. ఈ గ్రంథమున వ్యాకరణనియమము అంతగా పాటింపబడలేదు.

ఈ గ్రంథమును హార్దప్రేమతో పరిష్కరించిన శ్రీ సింగంశెట్టి-యతీంద్రులు శెట్టి చారిటీ కాలక్షేపస్వాములగు శ్రీమాన్ ఉభయవేదాంత విద్వాన్ తి. న. చక్రవర్తి శ్రీనివాసరంగాచార్యులువారికిని, ఈ గ్రంథమును ముద్రింపజేసిన శ్రీ సింగంశెట్టి-యతీంద్రులు శెట్టి చారిటి ట్రస్టీలకును, తన శరీరశ్రమము నిసుమంతయు పాటింపక ముద్రణమునకై పలుపాటుపడిన పైచారిటీ మేనేజరు శ్రీ నూలు-వెంకటరమణగారికిని మదీయ కృతజ్ఞతను తెల్పుచున్నాడను.

ఇట్లు,

శ్రీ పెరుంబూదూరు

విద్వాన్, కిడాంబి - రామానుజాచార్యులు,

శిరోమణి.

శ్రీమతే రామానుజాయ నమః

శ్రీ పరాశర భట్టార్యాయ నమః

శ్రీమద్వరవరమునయే నమః

శ్రీకాంచీ, జగదాచార్యసింహాసనాధిపతి ప్రతివాదిభయంకరమ్ అణ్ణంగరాచార్యులువారు.



# పీఠిక.

శ్రీ విష్ణుసహస్రనామమునకు త్రిమతస్థులును భాష్యము రచించియుండియు మనవిశిష్టాద్వైతసంప్రదాయమునకు అనితరసాధారణముగ ననతరించిన భాష్యము శ్రీపరాశరభట్టరులదే. ఇమ్మహాచార్యులు ఆళ్వారులదివ్యప్రబంధములలోను ఆప్రబంధముల దివ్యార్థములలోను అ న వ ర త ము అ వ గా హిం చి న వా ర గు ట చే సహస్రనామస్తోత్రములోని ప్రతినామమునకును వీరికి స్ఫురించు అర్థ విశేషము పరమవిలక్షణముగ నేయుండును. భగవద్గుణములను స్పష్టముగా ప్రతిపాదించు తమభాష్యమునకు "భగవద్గుణదర్పణము" అని పేరిడియుండునదియు న్యాయమే.

భగవద్గుణములను అత్యద్భుతముగ అనుభవించుటకనియే యమరిన యీ సహస్రనామస్తోత్రమునకు నిర్గుణబ్రహ్మవాదులగు మతాంతరస్థులు వ్యాఖ్యానము చేయ నారంభించి అర్థస్వారస్యమును పాడుచేసిరేయని దుఃఖించి పరాశరభట్టరు శ్రీభగవద్రామానుజులనియమనమునొంది వ్యాఖ్యానింపపూనిరి. అట్టి యీ భాష్యమునకును మతాంతరస్థులభాష్యమునకునుగల అర్థభేదములును తెల్పుటకు పూర్వము ఈ సహస్రనామ భాష్యమున ఉపోద్ఘాతప్రకరణములోని విషయములను సంగ్రహముగ దెల్పెదము.

## ఉపోద్ఘాత ప్రకరణసారము

ప్రపంచమున జనించిన వారలను బద్ధులు ముముక్షువులు అని ఇరుతెఱంగుగా విభ జింపవచ్చును. బద్ధులనగా సంసారులు. వీరలవిషయము జగత్ప్రసిద్ధమగుటచే ముముక్షు వులంగూర్చిమాత్రము చర్చింతము. ముముక్షువులనగా మోక్షమున నిచ్ఛగలవారలు. వీరలకు ఇది ఉపాయము, ఇది ఉపేయము అను నిర్ణయజ్ఞానము ముఖ్యము. ఆజ్ఞాన మెట్టిదియన్న, భగవంతుడే యుపాయము, వాడే యుపేయము అనియే సమస్త శాస్త్రములచేతను నిష్కర్షింపబడియుండును. పరస్పరవిరుద్ధములగు ఈరెండు

ధర్మములును భగవంతునియందే గూడియుండును. ఇతరమునపేక్షింపని యుపాయమై యుండు సర్వేశ్వరుడు *సర్వజ్ఞోఽపి హి విశ్వేశస్సదా కారుణికోఽపి సన్! సంసారతన్త్రవాహిత్వాత్ రక్ష్యాపేక్షాం ప్రతీక్షతే* అనినట్లు తాను సర్వజ్ఞుడై విశ్వేశ్వరుడై పరమకారుణికుడై యుండియు రక్ష్యవర్గమగు చేతనునియొద్దనుండి వ్యాజరూపముగ ఏదోనొకదాని నపేక్షించుచుండును.

ఆవ్యాజములలో కొన్ని లఘూపాయములుగను, మఱికొన్ని గురూపాయములుగను ఉండును. జ్ఞానశక్త్యాదులు పూర్ణముగానుండువారలు గురూపాయంబులకు నధికారులు. అవి లేనివారలు లఘూపాయంబులకు నధికారులు. ఇట్లు వ్యవస్థను కల్పించుటచే గురూపాయంబులను విధించు శాస్త్రములకు వైయర్థ్యము గలుగనేరదు. ఈ లఘూపాయములలో భగవన్నామసంకీర్తనమే ముఖ్యమైనది. జ్ఞాన శక్తి పరిపూర్ణులు గురుతరోపాయములచే లభించు ఫలములను కేవల భగవన్నామ సంకీర్తన రూపమగు లఘూపాయముచే జ్ఞానశక్త్యాదులిసుమంతయు లేని మనము అనుభవించుచున్నామని శాస్త్రప్రసిద్ధము. కనుకనే *కిమేకం దైవతం లోకే* ఇత్యాదిగ ప్రశ్నించిన యుధిష్ఠిరులకు పరమాప్తులగు భీష్మాచార్యులు. *అనాదినిధనం విష్ణుమ్ .........ఏష మే సర్వధర్మాణాం ధర్మోఽధికతమో మతః* అని నామసంకీర్తనమునే ప్రధానోపాయముగా నిష్కర్షించిరి. అట్టి భగవన్నామములను సనక సనందన నారదాది మహర్షులు పరమనిధిగాగొని కీర్తించుచుండిరి. తుమ్మెద ప్రతిపుష్పము నుండి తేనెను సేకరించి యొకచోట మొత్తముగా పెట్టునట్లు వేదవ్యాసులు ఆయా మహర్షులనుండి యొక్కొక్క నామమును సంగ్రహించి స్తోత్రరూపముగా గ్రుచ్చిరి.

ఇక మతాంతరస్థుల భాష్యములకన్న భట్టరులభాష్యమునంగల అర్థభేదమును స్థాలీపులాకన్యాయముగ రసికులకుందెల్పెదము.

## భాష్యాంతరములు—భట్టరుల భాష్యము.

*సద్గతిస్సత్కృతిస్సత్తా సద్భూతి స్సత్పరాయణః* (నా. 704–708) అనుచోట మతాంతరస్థులు 'సత్కృతిః' అను నామమునకు జగత్సృష్టిమున్నగు కార్యములను కావించువాడు. అని వ్యాఖ్యానించిరి. *భట్టరు వసుప్రదో వాసుదేవో వసుర్వసుమనా హవిః *అని పూర్వశ్లోకమున వాసుదేవనామముండుటచే ఈ ప్రకరణములోని నామములన్నియు శ్రీ కృష్ణావతారవిషయములుగానే యుండ

దగునని నిశ్చయించి శ్రీకృష్ణుని గుణచేష్టితవర్ణనపరముగా వ్యాఖ్యానించిరి. ఈప్రకరణమున నేయుండు 'సత్కృతిః' అను నీనామమునకు మతాంతరస్థులు చెప్పిన "శ్రేష్ఠమైన జగద్రక్షణరూపవ్యాపారము గలవాడు" అను నర్థము విరసమనిదలంచి భట్టరు "సత్కృతిః=నవనీతచౌర్యము రోల గట్టుపడుట రాసక్రీడ మున్నగు దివ్యచేష్టితముల నొనరించినవాడు" అనిరి. శంకరాచార్యులనినట్లు జగత్సృష్ట్యాదులు భగవంతునకు ఉత్కృష్ట వ్యాపారములు కాజాలవు. దేనిని తలంచినంతనే భక్తులు మనసునీరై *ఆహ్లాదశీత నేత్రామ్బుః* అనినట్లగుదురో; అదియే వానియుత్కృష్టకార్యములగును. అట్టివి *వెణ్ణెయూణెన్న మీనచ్చోల్లే* *ఎత్తిఱమురలినోడి హైద్దిరు నేజ్జియ వెళివే* అని యిట్లు ఆళ్వార్లను మోహింపజేసిన హీనకృత్యములే. వాడును ఇట్టి కృత్యములనే తనకు గౌరవముగాదలంచును. కనుకనే గోవర్ధనపర్వతంబు నెత్తినప్పుడు ఈ యతిమానుష చేష్టితముంజూచి యతి శంకించి *దేవో వా త్వమ్* అని యిట్లన్న వారిమీదనలిగి* అహంవో బాన్ధవో జాతః* అని తన్ను గొల్లవానిగనే చెప్పుకొనెను. దీనినింక వివరింపవలసియుండియు విస్తరభీతిచే నింతటితో విరమింతము.

మఱొక శ్లోకము *విజితాత్మావిధేయాత్మా సత్కీర్తిః ఛిన్నసంశయః* (నా. 626_629) ఈ శ్లోకమున ప్రతినామమునను భట్టరు భాష్యములోని స్వారస్యమును తెల్పెదము. "విజితాత్మా=జితేంద్రియుడు" అనిరి శంకరాచార్యులు. భట్టరు 'తన్నాశ్రయించినవారలకు తాను అణగియుండుటచే జయమును భక్తులకునిచ్చి అపజయమును తాను కైకొనువాడు" అనిరి. *మమ శిరసి మణ్డనం గోపికా దణ్డనమ్* అని వచించిన సర్వేశ్వరునకు ఏ యర్థము రుచించునో విమర్శింపుడు. కనుకనే *కూడారై వెల్లుజ్జీర్ కోవిన్దా!* అను తిరుప్పావై పాశురమునకు 'అభక్తులను ఓడించుటయు, భక్తులకు నీవు ఓడుటయు నీ స్వభావము' అని ఆచార్యులు వ్యాఖ్యానించిరి.

ఇక పైనామమగు "విజితాత్మా విధేయాత్మా" అనునీ శ్లోకమున 'అవిధేయాత్మా' అని పదచ్ఛేదము చేసి 'ఎవరికిని వశముగాని స్వరూపముగలవాడు' అనిరి ఇతరులు. భట్టరు 'విధేయాత్మా' అనియే పదవిభాగము చేసి 'భక్తులయాజ్ఞకు లోబడిన స్వరూపముగలవాడనిరి.' *జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్* (గీత) అని సర్వశరీరియగు భగవంతుడే తన్ను భక్తులకు శరీరభూతునిగా చెప్పుకొనెను. ఆత్మకు సర్వాత్మనా విధేయమైయుండునదిగదా శరీరము ? భక్తులకు తాను

విధేయుడుగాకున్నచో "జ్ఞానీత్వాత్మైవ మే మతమ్" అను తనవాక్యమునకు గతియేమి? కనుకనే * సేనయోరుభయోర్మధ్యే రథం స్థాపయ మేఽచ్యుత * అని యర్జునుడు ఆజ్ఞాపించినదే తానటులే యొనరించి 'పార్థసారథి' అని పేరొందెను. ఇట్లు భక్తవిధేయుడైయుండు వీనిని అవిధేయునిగా చెప్పినచో వాడు సంతసించునాయని విమర్శింపుడు.

పై నామములు "సత్కీర్తిః, ఛిన్నసంశయః" (నా. 628-629) అని. ఇచట మతాంతరస్థులు "సత్కీర్తిః = మంచికీర్తిగలవాడు, ఛిన్నసంశయః = సమస్తమును కరతలామలకమువలె సదా చూచుచుండుటచే సందేహములేనివాడు, అనగా మహాజ్ఞాని అనిరి, ఈ యర్థమున నెట్టి రసము లేదనిదలంచి భట్టరు "సత్కీర్తిః సౌలభ్య గుణయుక్తుడగుటచే యథార్థమగు కీర్తిగలవాడు. ఛిన్నసంశయః = వీడు సులభుడో? దుర్లభుడో? వశుడో? కాడో? మున్నగు రీతిగా తనవిషయంబున గల్గు సందేహములను తన సౌలభ్యముచే తీర్చువాడనిరి.", వీడు సందేహము లేనివాడు అని చెప్పుటకన్న ఇతరులను సందేహము తొలగినవారుగా చేయువాడు అనునర్థముననే స్వారస్యముండునని వివరింపవలయునా యేమి?

ఇట్టి స్వారస్యార్థ రత్నములు లక్షోపలక్షముగా ఈ భాష్యమున వెలయుచున్నవి.

## ఉపసంహారము

ఈ సహస్రనామమునకు భట్టరు సంస్కృత భాషలోనే భాష్యము రచించియుండుటచే ఆ భాషా జ్ఞానము లేనివారలకు ఈ యర్థవిశేషములను అనుభవించు భాగ్యమింతవఱకు లేకుండినది. ఆకొఱత దీర శ్రీ పెరుంబూదూరు విద్వాన్ కిడాంబి రామానుజాచార్యులు ఆంధ్రభాషలో లలితసరణిలో అనువదించిన యీ గ్రంథమును చూచి పరమానందము నొందితిమి. ఇటులే లోకోపకారముగా అనేక గ్రంథములను రచించుటకై ఆయురారోగ్యైశ్వర్యాది సమస్త సంపదలను శ్రీ లక్ష్మీవల్లభుడు అనుగ్రహింపవలయునని ఆశాసించుచున్నాము.

# గ్రంథ సంకేత వివరణ

## పట్టిక.

| గ్రంథ సంకేతములు. | గ్రంథముల నామములు. |
| --- | --- |
| ఆశి. | అగ్నిర్వాశిరః. |
| అష్ట. | అష్టకమ్. |
| ఆ. పు. | ఆదిత్య పురాణమ్. |
| ఆర. | ఆరణమ్. |
| క. ఉ. | కఠోపనిషత్. |
| కౌ. | కౌషీతకీ బ్రాహ్మణమ్. |
| గీ. | భగవద్గీతా. |
| చ. సం. | చరక సంహితా. |
| ఛా. ఉ. | ఛాందోగ్యోపనిషత్. |
| జ. సం. | జయసంహిత. |
| జి. | జితన్తా స్తోత్రమ్. |
| తై. ఉ. | తైత్తిరీయోపనిషత్. |
| నీలా. | నీలాసూక్తమ్. |
| న్యా. త. | న్యాయతత్త్వమ్. |
| పా. | పారాశర్యమ్. |
| పా. సూ. | పాతంజలసూత్రమ్. |
| పు. సూ. | పురుషసూక్తమ్. |
| పూ. మీ. | పూర్వమీమాంస. |
| పౌ. సం. | పౌష్కర సంహిత. |
| బా. స్మృ | బార్హస్పత్య స్మృతి. |
| బృ. ప. | బృహత్పరాశరీయమ్. |
| బృ. ఉ. | బృహదారణ్యకోపనిషత్. |
| బ్ర. సూ. | బ్రహ్మసూత్రమ్. |
| బ్రా. | బ్రాహ్మపురాణమ్. |
| భాగ. | శ్రీభాగవతమ్. |
| భా. | మహాభారతమ్. |
| భృ. | భృగువల్లి. |
| మను. స్మృ. | మనుస్మృతి. |
| మ. ఉ. | మహోపనిషత్. |
| మా. పు: | మాత్స్యపురాణమ్. |

| గ్రంథ సంకేతములు. | గ్రంథముల నామములు. |
|---|---|
| మా. శా. | మాధ్యందినీ శాఖ. |
| ము. ఉ. | ముండకోపనిషత్. |
| మో. ధ. | మోక్షధర్మము. |
| మూ. సం. లేక మూ. సం. | మూలసంహిత. |
| య. వే. | యజుర్వేదము. |
| య. స్మృ. | యమస్మృతి. |
| యా. స్మృ. | యాజ్ఞవల్క్యస్మృతి. |
| రా. లేక శ్రీరా. | శ్రీరామాయణమ్. |
| లి. పు. | లింగ పురాణమ్. |
| వ. పు. | వరాహ పురాణమ్. |
| వా. | వార్ష్ణేయాధ్యాత్మమ్. |
| వామ. | వామన పురాణమ్. |
| వా. పు. | వాయుపురాణమ్. |
| వి. త. | విష్ణుతత్వమ్. |
| వి. ధ. | విష్ణుధర్మము. |
| వి. పు. | శ్రీ విష్ణు పురాణమ్. |
| వై. సం. | వైతరణ సంహిత. |
| వై. స్త. | శ్రీ వైకుంఠ స్తవము. |
| శ. బ్రా. | శతపథబ్రాహ్మణము. |
| శై. | శైవపురాణమ్. |
| శ్వే. ఉ. | శ్వేతాశ్వతరోపనిషత్. |
| సా. సం. | సాత్వతసంహిత. |
| సు. ఉ. | సుబాలోపనిషత్. |
| స్తో. ర. | స్తోత్రరత్నము. |
| హ. వం. | హరివంశము. |
| హా. | హారీతస్మృతి. |
| హై. శా. | హైరణ్యగర్భశాఖ. |
| * | ప్రమాణ వాక్యములు. |
| [ ] | ప్రమాణవాక్య తాత్పర్యములకు మాత్రము. |
| ( ) | తాత్పర్యముదప్ప ఇతరములకు. |
| ...... | నడుమ కొన్ని వాక్యములుండుటను తెల్పును. |

శ్రీమతే రామానుజాయనమః

[శ్రీ సహస్రనామాధ్యాయమున చేరకుండినను శిష్ట సంప్రదాయమున పారాయణమున అందులును అనుసంధించుటచే వ్యాఖ్యానము చేయబడును. భట్టరుల వ్యాఖ్యానము గాదు.]

శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్ ।
ప్రసన్నవదనం ధ్యాయేత్సర్వవిఘ్నోపశాన్తయే ॥

తా॥ తెల్లని వస్త్రమును ధరించి, చంద్రునివంటి దేహకాంతియు నాలుగు భుజములును గల్గి, ప్రసన్న ముఖముతో వెలయు శ్రీమహావిష్ణువును సమస్త విఘ్నములును తొలగుటకై ధ్యానింపగలడు.

యస్య ద్విరదవక్త్రాద్యాః పారిషద్యాః పరశ్శతమ్ ।
విఘ్నం నిఘ్నన్తి సతతం విష్వక్సేనం తమాశ్రయే.

తా॥ ఎవనియొక్క పరిచారకులగు ద్విరదవక్త్రాదులు మున్నగువారు తన్ను ధ్యానించువారలవిఘ్నములను సదా తొలగించుచుందురో, అట్టి విష్వక్సేనులను (అనగా విష్ణువుయొక్క సేనానాయకులను) ఆశ్రయించెద.

వ్యాసం వసిష్ఠనప్తారం శక్తేః పౌత్రమకల్మషమ్ ।
పరాశరాత్మజం వన్దే శుకతాతం తపోనిధిమ్ ॥

తా॥ వశిష్ఠులయొక్క మునిమనుమడును, శక్తి మహర్షి యొక్క పౌత్రుడును, పరాశరుల పుత్రుడును, శుకబ్రహ్మముయొక్క తండ్రియు, తపోనిధియునగు వ్యాసమహర్షిని మ్రొక్కెద.

వ్యాసాయ విష్ణురూపాయ వ్యాసరూపాయ విష్ణవే ।
నమోవై బ్రహ్మనిధయే వాసిష్ఠాయ నమోనమః ॥

తా॥ వ్యాసులే విష్ణువా? లేక విష్ణువే వ్యాసులా? అని అతిశయింప దగినవారై తపోనిధియై వసిష్ఠవంశమున నవతరించినవారై వెలయు వ్యాసుని మ్రొక్కెద.

అవికారాయ శుద్ధాయ నిత్యాయ పరమాత్మనే ।
సదైకరూపరూపాయ విష్ణవే సర్వజిష్ణవే ॥

తా॥ నిర్వికారుడై శుద్ధుడై నిత్యుడై పరమాత్ముడై సదా ఏకరూపముగల దివ్యదేహమును పరిగ్రహించినవాడై సమస్తమును జయించువాడైయుండు విష్ణువును నమస్కరించెద.

యస్య స్మరణమాత్రేణ జన్మసంసార బంధనాత్ ॥
విముచ్యతే నమస్తస్మై విష్ణవే ప్రభవిష్ణవే ॥
ఓమ్ నమో విష్ణవే ప్రభవిష్ణవే ।

తా॥ ఎవనిని స్మరించినంతనే జన్మముమున్నగు సంసారబంధములన్నియు తొలగునో; సర్వసమర్థుడగు అట్టి విష్ణువును నమస్కరించెద.

———

శ్రీ మహాలక్ష్మ్యై నమః

శ్రీ మతే రామానుజాయ నమః

# శ్రీ లక్ష్మ్యష్టోత్తరశతనామస్తోత్రము.



ఓమ్ దేవ్యువాచ :—

దేవదేవ మహాదేవ త్రికాలజ్ఞ మహేశ్వర ।
కరుణాకర దేవేశ భక్తానుగ్రహకారక ॥
అష్టోత్తరశతం లక్ష్మ్యాః శ్రోతుమిచ్ఛామి తత్వతః ॥

ఈశ్వర ఉవాచ :—

దేవి సాధు మహాభాగే మహాభాగ్యప్రదాయకమ్ ।
సర్వైశ్వర్యకరం పుణ్యం సర్వపాపప్రణాశనమ్ ॥
సర్వదారిద్ర్యశమనం శ్రవణాత్ భుక్తిముక్తిదమ్ ।
రాజవశ్యకరం దివ్యం గుహ్యాత్ గుహ్యతరం పరమ్ ॥
దుర్లభం సర్వదేవానాం చతుష్షష్టికలాస్పదమ్ ।
పద్మాదీనాం వరాన్తానాం నిధీనాం నిత్యదాయకమ్ ॥
సమస్తదేవసంసేవ్యం అణిమాద్యష్టసిద్ధిదమ్ ।
కిమత్ర బహునోక్తేన దేవీప్రత్యక్షదాయకమ్ ॥
తవ ప్రీత్యాద్య వక్ష్యామి సమాహితమనాః శ్రుణు ।
అష్టోత్తరశతస్యాస్య మహాలక్ష్మీస్తు దేవతా ॥
క్లీం బీజపదమిత్యుక్తం శక్తిస్తు భువనేశ్వరీ ।
అఙ్గన్యాసః కరన్యాసః స ఇత్యాది ప్రకీర్తితః ॥

## ధ్యానమ్.

వన్దే పద్మకరాం ప్రసన్నవదనాం సౌభాగ్యదాం భాగ్యదామ్
హస్తాభ్యామభయప్రదాం మణిగణైః నానావిధైః భూషితామ్ ।
భక్తాభీష్టఫలప్రదాం హరిహర బ్రహ్మాదిభిః సేవితామ్
పార్శ్వే పఙ్కజశఙ్ఖపద్మనిధిభిః యుక్తాం సదాశక్తిభిః ॥
సరసిజనయనే సరోజహస్తే ధవళతరాంశుకగన్ధమాల్యశోభే ।
భగవతి హరివల్లభే మనోజ్ఞే త్రిభువనభూతికరి ప్రసీద మహ్యమ్ ॥

---

ఓమ్॥ ప్రకృతిం వికృతిం విద్యాం సర్వభూతహితప్రదామ్ ।
శ్రద్ధాం విభూతిం సురభిం నమామి పరమాత్మికామ్ ॥ ౧

వాచం పద్మాలయాం పద్మాం శుచిం స్వాహాం స్వధాం సుధామ్ ।
ధన్యాం హిరణ్మయీం లక్ష్మీం నిత్యపుష్టాం విభావరీమ్ ॥ ౨

అదితిఞ్చ దితిం దీప్తాం వసుధాం వసుధారిణీమ్ ।
నమామి కమలాం కాన్తామ్ కామాం క్షీరోదసంభవామ్ ॥ ౩

అనుగ్రహపరాం బుద్ధిమ్ అనఘాం హరివల్లభామ్ ।
అశోకామ్ అమృతాం దీప్తాం లోకశోకవినాశినీమ్ ॥ ౪

నమామి ధర్మనిలయాం కరుణాం లోకమాతరమ్ ।
పద్మప్రియాం పద్మహస్తాం పద్మాక్షీం పద్మసున్దరీమ్ ॥ ౫

పద్మోద్భవాం పద్మముఖీమ్ పద్మనాభప్రియాం రమామ్ ।
పద్మమాలాధరాం దేవీం పద్మినీం పద్మగన్ధినీమ్ ॥ ౬

పుణ్యగన్ధాం సుప్రసన్నాం ప్రసాదాభిముఖీం ప్రభామ్ ।
నమామి చన్ద్రవదనాం చన్ద్రాం చన్ద్రసహోదరీమ్ ॥ ౭

చతుర్భుజాం చన్ద్రరూపాం ఇన్దిరామ్ ఇన్దుశీతలామ్ ।
ఆహ్లాదజననీం పుష్టిం శివాం శివకరీం సతీమ్ ॥ ౮

విమలాం విశ్వజననీం పుష్టిం దారిద్ర్యనాశినీమ్ ।
ప్రీతిం పుష్కరిణీం శాన్తాం శుక్లమాల్యామ్బరాం శ్రియమ్ ॥ ౯

భాస్కరీం బిల్వనిలయాం వరారోహాం యశస్వినీమ్ ।
వసున్ధరామ్ ఉదారాఙ్గాం హరిణీం హేమమాలినీమ్ ॥ ౧౦

ధనధాన్యకరీం సిద్ధిం స్త్రైణసౌమ్యాం శుభప్రదామ్ ।
నృపవేశ్మగతానన్దాం వరలక్ష్మీం వసుప్రదామ్ ॥ ౧౧

శుభాం హిరణ్యప్రాకారాం సముద్రతనయాం జయామ్ ।
నమామి మఙ్గళాం దేవీం విష్ణువక్షస్స్థలస్థితామ్ ॥ ౧౨

విష్ణుపత్నీం ప్రసన్నాక్షీం నారాయణసమాశ్రితామ్ ।
దారిద్ర్యధ్వంసినీం దేవీం సర్వోపద్రవవారిణీమ్ ॥ ౧౩

నవదుర్గాం మహాకాళీం బ్రహ్మవిష్ణుశివాత్మికామ్ ।
త్రికాలజ్ఞానసమ్పన్నామ్ నమామి భువనేశ్వరీమ్ ॥ ౧౪

———

లక్ష్మీం క్షీరసముద్రరాజతనయాం శ్రీరఙ్గధామేశ్వరీమ్
దాసీభూతసమస్తదేవవనితాం లోకైకదీపాఙ్కురామ్ ।
శ్రీమన్మన్దకటాక్షలబ్ధవిభవబ్రహ్మేన్ద్రగఙ్గాధరామ్
త్వాం త్రైలోక్యకుటుమ్బినీం సరసిజాం వన్దే ముకున్దప్రియామ్ ॥

మాతర్నమామి కమలే కమలాయతాక్షి
శ్రీవిష్ణుహృత్కమలవాసిని విశ్వమాతః ।
క్షీరోదజే కమలకోమలగర్భగౌరి
లక్ష్మి ప్రసీద సతతం నమతాం శరణ్యే ॥

త్రికాలం యోజపేత్ విద్వాన్ షణ్మాసం విజితేన్ద్రియః
దారిద్ర్యధ్వంసనం కృత్వా శ్రియమాప్నోత్యయత్నతః ॥
దేవీనామసహస్రేషు పుణ్యమష్టోత్తరం శతమ్ ।
యేన శ్రియమవాప్నోతి కోటిజన్మదరిద్రతః ॥

భృగువారే శతం ధీమాన్ పఠేద్వత్సరమాత్రకమ్ ।
అష్టైశ్వర్యమవాప్నోతి కుబేర ఇవ భూతలే ॥
దారిద్ర్యమోచనం నామస్తోత్రమమ్బాపరం శతమ్ ॥
యేన శ్రియమవాప్నోతి కోటిజన్మదరిద్రతః ॥

భుక్త్వాతు విపులాన్ భోగాన్ అస్యాస్సాయుజ్యమాప్నుయాత్ ।
ప్రాతఃకాలే పఠేన్నిత్యం సర్వదుఃఖోపశాన్తయే ॥

పఠంస్తు చిన్తయేద్దేవీం సర్వాభరణభూషితామ్ ॥

ఓమ్ సర్వం శ్రీకృష్ణార్పణమస్తు.



శ్రీమతే రామానుజాయ నమః

# (శ్రీ) విష్ణు సహస్రనామ స్తోత్రము.



శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్ ।
ప్రసన్నవదనం ధ్యాయేత్సర్వవిఘ్నోపశాన్తయే ॥

యస్య ద్విరదవక్త్రాద్యాః పారిషద్యాః పరశ్శతమ్ ।
విఘ్నం నిఘ్నన్తి సతతం విష్వక్సేనం తమాశ్రయే ॥

వ్యాసం వసిష్ఠనప్తారం శక్తేః పౌత్రమకల్మషమ్ ।
పరాశరాత్మజం వన్దే శుకతాతం తపోనిధిమ్ ॥

వ్యాసాయ విష్ణురూపాయ వ్యాసరూపాయ విష్ణవే ।
నమో వై బ్రహ్మనిధయే వాసిష్ఠాయ నమో నమః ॥

అవికారాయ శుద్ధాయ నిత్యాయ పరమాత్మనే ।
సదైకరూపరూపాయ విష్ణవే సర్వజిష్ణవే ॥

యస్య స్మరణమాత్రేణ జన్మసంసారబన్ధనాత్ ।
విముచ్యతే నమస్తస్మై విష్ణవే ప్రభవిష్ణవే ॥

ఓమ్ నమో విష్ణవే ప్రభవిష్ణవే.



శ్రీ వైశంపాయన ఉవాచ—

శ్రుత్వా ధర్మానశేషేణ పావనాని చ సర్వశః ।
యుధిష్ఠిరశ్శాన్తనవం పునరేవాభ్యభాషత ॥

యుధిష్ఠిర ఉవాచ—

కిమేకం దైవతం లోకే కిం వాఽప్యేకం పరాయణమ్ ।
స్తువన్తః కం కమర్చన్తః ప్రాప్నుయుర్మానవాశ్శుభమ్ ॥ 2

కో ధర్మస్సర్వధర్మాణాం భవతః పరమో మతః ।
కిం జపన్ ముచ్యతే జన్తుః జన్మసంసారబన్ధనాత్ ॥ 3

శ్రీ భీష్మ ఉవాచ—

జగత్ప్రభుం దేవదేవమనన్తం పురుషోత్తమమ్ ।
స్తువన్నామసహస్రేణ పురుషస్సతతోత్థితః ॥ 4

తమేవచార్చయన్నిత్యం భక్త్యా పురుషమవ్యయమ్ ।
ధ్యాయన్ స్తువన్నమస్యంశ్చ యజమానస్తమేవ చ ॥ 5

అనాదినిధనం విష్ణుం సర్వలోకమహేశ్వరమ్ ।
లోకాధ్యక్షం స్తువన్నిత్యం సర్వదుఃఖాతిగో భవేత్ ॥ 6

బ్రహ్మణ్యం సర్వధర్మజ్ఞం లోకానాం కీర్తివర్ధనమ్ ।
లోకనాథం మహద్భూతం సర్వభూతభవోద్భవమ్ । 7

ఏష మే సర్వధర్మాణాం ధర్మోఽధికతమో మతః ।
యద్భక్త్యా పుణ్డరీకాక్షం స్తవైరర్చేన్నరస్సదా । 8

పరమం యో మహత్తేజః పరమం యో మహత్తపః ।
పరమం యో మహద్బ్రహ్మ పరమం యః పరాయణమ్ ॥ 9

పవిత్రాణాం పవిత్రం యో మఙ్గళానాం చ మఙ్గళమ్ ।
దైవతం దేవతానాం చ భూతానాం యోఽవ్యయః పితా ॥ 10

యతస్సర్వాణి భూతాని భవన్త్యాదియుగాగమే ।
యస్మింశ్చ ప్రలయం యాన్తి పునరేవ యుగక్షయే ॥ 11

తస్య లోకప్రధానస్య జగన్నాథస్య భూపతే ।
విష్ణోర్నామసహస్రం మే శృణు పాపభయాపహమ్ ॥ 12

యాని నామాని గౌణాని విఖ్యాతాని మహాత్మనః ।
ఋషిభిః పరిగీతాని తాని వక్ష్యామి భూతయే ॥ 13

విష్ణోర్నామసహస్రస్య వేదవ్యాసో మహామునిః ।
ఛన్దోఽనుష్టుప్ తథా దేవో భగవాన్ దేవకీసుతః ॥ 14

అమృతాంశూద్భవో బీజం శక్తిర్దేవకినన్దనః ।
త్రిసామా హృదయం తస్య శాన్త్యర్థే వినియుజ్యతే ॥ 15

విష్ణుం జిష్ణుం మహావిష్ణుం ప్రభవిష్ణుం మహేశ్వరమ్ ।
అనేకరూపదైత్యాన్తం నమామి పురుషోత్తమమ్ ॥ 16

అస్య శ్రీవిష్ణోర్దివ్య సహస్రనామస్తోత్ర మహామన్త్రస్య, శ్రీ వేదవ్యాసో భగవాన్ ఋషిః । అనుష్టుప్ఛన్దః । శ్రీమహావిష్ణుః పరమాత్మా శ్రీమన్నారాయణో దేవతా । అమృతాంశూద్భవో భానురితి బీజమ్ । దేవకీనన్దనస్స్రష్టేతి శక్తిః । ఉద్భవః క్షోభణో దేవ ఇతి పరమో మన్త్రః । శఙ్ఖభృన్నన్దకీ చక్రీతి కీలకమ్ । శార్ఙ్గధన్వా గదాధర ఇత్యస్త్రమ్ । రథాఙ్గపాణిరక్షోభ్య ఇతి నేత్రమ్ । త్రిసామా సామగస్సామేతి కవచమ్ । ఆనన్దం పరబ్రహ్మేతి యోనిః । ఋతుస్సుదర్శనః కాల ఇతి దిగ్బన్ధః । శ్రీ విశ్వరూప ఇతి ధ్యానమ్ । శ్రీమహావిష్ణుకైఙ్కర్యరూపే శ్రీ సహస్రనామజపే వినియోగః ।

॥ధ్యానమ్॥

క్షీరోదన్వత్ప్రదేశే శుచిమణివిలసత్సైకతే మౌక్తికానామ్
మాలాక్లృప్తాసనస్థః స్ఫటికమణినిభైర్మౌక్తికైర్మణ్డితాఙ్గః ।

శుభ్రైరభ్రైరదభ్రైరుపరివిరచితైర్ముక్తపీయూషవర్షైః ॥
ఆనన్దీ నః పునీయాదరినళినగదాశఙ్ఖపాణిర్ముకున్దః ॥ 1

భూః పాదౌ యస్య నాభిర్వియదసురనిలశ్చన్ద్రసూర్యౌ చ నేత్రే
కర్ణావాశాశ్శిరోద్యౌర్ముఖమపి దహనో యస్య వాస్తేయమబ్ధిః ।
అన్తస్థం యస్య విశ్వం సురనరఖగగోభోగిగన్ధర్వదైత్యైః
చిత్రం రంరమ్యతే తం త్రిభువనవపుషం విష్ణుమీశం నమామి ॥ 2

శాన్తాకారం భుజగశయనం పద్మనాభం సురేశమ్
విశ్వాకారం గగనసదృశం మేఘవర్ణం శుభాఙ్గమ్ ।
లక్ష్మీకాన్తం కమలనయనం యోగిహృద్ధ్యానగమ్యమ్
వన్దే విష్ణుం భవభయహరం సర్వలోకైకనాథమ్ ॥ 3

మేఘశ్యామం పీతకౌశేయవాసమ్
శ్రీవత్సాఙ్కం కౌస్తుభోద్భాసితాఙ్గమ్ ।
పుణ్యోపేతం పుణ్డరీకాయతాక్షమ్
విష్ణుం వన్దే సర్వలోకైకనాథమ్ ॥ 4

[సశఙ్ఖచక్రం సకిరీటకుణ్డలమ్
సపీతవస్త్రం సరసీరుహేక్షణమ్ ।
సహారవక్షస్స్థలశోభికౌస్తుభమ్
నమామి విష్ణుం శిరసా చతుర్భుజమ్ ॥] 5

ఓమ్ ॥ విశ్వం విష్ణుర్వషట్కారో భూతభవ్యభవత్ప్రభుః ।
భూతకృద్భూతభృద్భావో భూతాత్మా భూతభావనః ॥ 1

పూతాత్మా పరమాత్మా చ ముక్తానాం పరమా గతిః ।
అవ్యయః పురుషస్సాక్షీ క్షేత్రజ్ఞోఽక్షర ఏవ చ ॥ 2

యోగో యోగవిదాం నేతా ప్రధానపురుషేశ్వరః ।
నారసింహవపుః శ్రీమాన్ కేశవః పురుషోత్తమః ॥ ౩

సర్వశ్శర్వశ్శివః స్థాణుః భూతాదిర్నిధిరవ్యయః ।
సమ్భవో భావనో భర్తా ప్రభవః ప్రభురీశ్వరః ॥ 4

స్వయమ్భూశ్శమ్భురాదిత్యః పుష్కరాక్షో మహాస్వనః ।
అనాదినిధనో ధాతా విధాతా ధాతురుత్తమః ॥ 5

అప్రమేయో హృషీకేశః పద్మనాభోఽమరప్రభుః ।
విశ్వకర్మా మనుస్త్వష్టా స్థవిష్ఠః స్థవిరో ధ్రువః ॥ ౬

అగ్రాహ్యః శాశ్వతః కృష్ణో లోహితాక్షః ప్రతర్దనః ।
ప్రభూతస్త్రికకుద్ధామ పవిత్రం మఙ్గలంపరమ్ ॥ 7

ఈశానః ప్రాణదః ప్రాణో జ్యేష్ఠః శ్రేష్ఠః ప్రజాపతిః ।
హిరణ్యగర్భో భూగర్భో మాధవో మధుసూదనః । 8

ఈశ్వరో విక్రమీ ధన్వీ మేధావీ విక్రమః క్రమః ।
అనుత్తమో దురాధర్షః కృతజ్ఞః కృతిరాత్మవాన్ ॥ ౯

సురేశశ్శరణం శర్మ విశ్వరేతాః ప్రజాభవః ।
అహస్సంవత్సరో వ్యాళః ప్రత్యయస్సర్వదర్శనః ॥ 10

అజస్సర్వేశ్వర స్సిద్ధః సిద్ధిస్సర్వాదిరచ్యుతః ।
వృషాకపిరమేయాత్మా సర్వయోగవినిస్సృతః ॥ 11

వసుర్వసుమనాస్సత్య స్సమాత్మా సమ్మితస్సమః ।
అమోఘః పుణ్డరీకాక్షో వృషకర్మా వృషాకృతిః ॥ 12

రుద్రో బహుశిరా బభ్రుః విశ్వయోనిశ్శుచిశ్రవాః ।
అమృతశ్శాశ్వత స్థాణుః వరారోహో మహాతపాః ॥ 13

సర్వగస్సర్వవిద్భానుర్విష్వక్సేనో జనార్దనః ।
వేదో వేదవిదవ్యఙ్గో వేదాఙ్గో వేదవిత్కవిః ॥ 14

లోకాధ్యక్షస్సురాధ్యక్షో ధర్మాధ్యక్షః కృతాకృతః ।
చతురాత్మా చతుర్వ్యూహశ్చతుర్దంష్ట్రః చతుర్భుజః ॥ 15

భ్రాజిష్ణుర్భోజనం భోక్తా సహిష్ణుర్జగదాదిజః ।
అనఘో విజయో జేతా విశ్వయోనిః పునర్వసుః ॥ 16

ఉపేన్ద్రో వామనః ప్రాంశురమోఘశ్శుచిరూర్జితః ।
అతీన్ద్రస్సంగ్రహస్సర్గో ధృతాత్మా నియమో యమః ॥ 17

వేద్యో వైద్యస్సదాయోగీ వీరహా మాధవో మధుః ।
అతీన్ద్రియో మహామాయో మహోత్సాహో మహాబలః ॥ 18

మహాబుద్ధిర్మహావీర్యో మహాశక్తిర్మహాద్యుతిః ।
అనిర్దేశ్యవపుః శ్రీమాన్ అమేయాత్మా మహాద్రిధృత్ ॥ 19

మహేష్వాసో మహీభర్తా శ్రీనివాసస్సతాంగతిః ।
అనిరుద్ధస్సురానన్దో గోవిన్దో గోవిదాంపతిః ॥ 20

మరీచిర్దమనో హంసః సుపర్ణో భుజగోత్తమః ।
హిరణ్యనాభస్సుతపాః పద్మనాభః ప్రజాపతిః ॥ 21

అమృత్యుస్సర్వదృక్సింహః సన్ధాతా సన్ధిమాన్ స్థిరః ।
అజోదుర్మర్షణశ్శాస్తా విశ్రుతాత్మా సురారిహా ॥ 22

గురుర్గురుతమో ధామ సత్యస్సత్యపరాక్రమః ।
నిమిషోఽనిమిషస్స్రగ్వీ వాచస్పతిరుదారధీః ॥ 23

అగ్రణీర్గ్రామణీశ్శ్రీమాన్ న్యాయో నేతా సమీరణః ।
సహస్రమూర్ధా విశ్వాత్మా సహస్రాక్షస్సహస్రపాత్ ॥ 24

ఆవర్తనో నివృత్తాత్మా సంవృతస్సంప్రమర్దనః ।
అహస్సంవర్తకో వహ్నిః అనిలో ధరణీధరః ॥ 25

సుప్రసాదః ప్రసన్నాత్మా విశ్వసృగ్విశ్వభుగ్విభుః ।
సత్కర్తా సత్కృతస్సాధుర్జహ్నుర్నారాయణో నరః ॥ 26

అసఙ్ఖ్యేయోఽప్రమేయాత్మా విశిష్టశ్శిష్టకృచ్ఛుచిః ।
సిద్ధార్థస్సిద్ధసఙ్కల్పః సిద్ధిదస్సిద్ధిసాధనః ॥ 27

వృషాహీ వృషభో విష్ణుర్వృషపర్వా వృషోదరః ।
వర్ధనో వర్ధమానశ్చ వివిక్తశ్శ్రుతిసాగరః ॥ 28

సుభుజో దుర్ధరో వాగ్మీ మహేన్ద్రో వసుదో వసుః ।
నైకరూపో బృహద్రూపశ్శిపివిష్టః ప్రకాశనః ॥ 29

ఓజస్తేజోద్యుతిధరః ప్రకాశాత్మా ప్రతాపనః ।
ఋద్ధః స్పష్టాక్షరో మన్త్రశ్చన్ద్రాంశుర్భాస్కరద్యుతిః ॥ 30

అమృతాంశూద్భవో భానుశ్శశబిన్దుస్సురేశ్వరః ।
ఔషధం జగతస్సేతు స్సత్యధర్మపరాక్రమః ॥ 31

భూతభవ్యభవన్నాథః పవనః పావనోఽనలః ।
కామహా కామకృత్కాన్తః కామః కామప్రదః ప్రభుః ॥ 32

యుగాదికృద్యుగావర్తో నైకమాయో మహాశనః ।
అదృశ్యో వ్యక్తరూపశ్చ సహస్రజిదనన్తజిత్ ॥ 33

ఇష్టోఽవిశిష్టశ్శిష్టేష్టశ్శిఖణ్డీ నహుషో వృషః ।
క్రోధహా క్రోధకృత్కర్తా విశ్వబాహుర్మహీధరః ॥ 34

అచ్యుతః ప్రథితః ప్రాణః ప్రాణదో వాసవానుజః ।
అపాంనిధిరధిష్ఠానమప్రమత్తః ప్రతిష్ఠితః ॥ 35

స్కన్దః స్కన్దధరో ధుర్యో వరదో వాయువాహనః ।
వాసుదేవో బృహద్భానురాదిదేవః పురన్దరః ॥ 36

అశోకస్తారణస్తారః శూరశ్శౌరిర్జనేశ్వరః ।
అనుకూలశ్శతావర్త్తః పద్మీ పద్మనిభేక్షణః ॥ 37

పద్మనాభోఽరవిన్దాక్షః పద్మగర్భశ్శరీరభృత్ ।
మహర్ద్ధిః ఋద్ధోవృద్ధాత్మా మహాక్షో గరుడధ్వజః ॥ 38

అతులశ్శరభో భీమస్సమయజ్ఞో హవిర్హరిః ।
సర్వలక్షణలక్షణ్యో లక్ష్మీవాన్ సమితిఞ్జయః ॥ 39

విక్షరో రోహితోమార్గో హేతుర్దామోదరస్సహః ।
మహీధరో మహాభాగోవేగవానమితాశనః ॥ 40

ఉద్భవః క్షోభణోదేవః శ్రీగర్భః పరమేశ్వరః ।
కరణం కారణం కర్త్తా వికర్త్తా గహనో గుహః ॥ 41

వ్యవసాయో వ్యవస్థానస్సంస్థానః స్థానదోధ్రువః ।
పరర్ద్ధిః పరమస్పష్టః తుష్టః పుష్టః శుభేక్షణః ॥ 42

రామో విరామో విరజోమార్గో నేయో నయోఽనయః ।
వీరశ్శక్తిమతాంశ్రేష్ఠో ధర్మోధర్మవిదుత్తమః ॥ 43

వైకుణ్ఠః పురుషః ప్రాణః ప్రాణదః ప్రణమః పృథుః ।
హిరణ్యగర్భ శ్శత్రుఘ్నో వ్యాప్తో వాయురధోక్షజః ॥ 44

ఋతుస్సుదర్శనః కాలః పరమేష్ఠీ పరిగ్రహః ।
ఉగ్రస్సంవత్సరోదక్షో విశ్రామో విశ్వదక్షిణః ॥ 45

విస్తారః స్థావరస్థాణు ప్రమాణం బీజమవ్యయమ్ ।
అర్థోఽనర్థో మహాకోశో మహాభోగోమహాధనః ॥ 46

అనిర్విణ్ణః స్థవిష్ఠోభూర్ధర్మయూపో మహామఖః ।
నక్షత్రనేమిర్నక్షత్రీ క్షమః క్షామస్సమీహనః ॥ 47

యజ్ఞ ఇజ్యో మహేజ్యశ్చ క్రతుస్సత్రం సతాంగతిః ।
సర్వదర్శీ నివృత్తాత్మా సర్వజ్ఞో జ్ఞానముత్తమమ్ ॥ 48

సువ్రతస్సుముఖస్సూక్ష్మస్సుఘోషస్సుఖదస్సుహృత్ ।
మనోహరో జితక్రోధో వీరబాహుర్విదారణః ॥ 49

స్వాపనః స్వవశో వ్యాపీ నైకాత్మా నైకకర్మకృత్ ।
వత్సరో వత్సలో వత్సీ రత్నగర్భో ధనేశ్వరః । 50

ధర్మగుబ్ధర్మకృద్ధర్మీ సదక్షరమసత్క్షరమ్ ।
అవిజ్ఞాతా సహస్రాంశుర్విధాతా కృతలక్షణః ॥ 51

గభస్తినేమిస్సత్త్వస్థస్సింహో భూతమహేశ్వరః ।
అదిదేవో మహాదేవో దేవేశో దేవభృద్గురుః ॥ 52

ఉత్తరో గోపతిర్గోప్తా జ్ఞానగమ్యః పురాతనః ।
శరీరభూతభృద్భోక్తా కపీన్ద్రో భూరిదక్షిణః ॥ 53

సోమపోఽమృతపస్సోమః పురుజిత్పురుసత్తమః ।
వినయో జయస్సత్యసన్ధో దాశార్హస్సాత్త్వతాం పతిః ॥ 54

జీవో వినయితా సాక్షీ ముకున్దోఽమితవిక్రమః ।
అమ్భోనిధిరనన్తాత్మా మహోదధిశయోఽన్తకః ॥ 55

అజో మహార్హః స్వాభావ్యో జితామిత్రః ప్రమోదనః ।
ఆనన్దో నన్దనో నన్దస్సత్యధర్మా త్రివిక్రమః ॥ 56

మహర్షిః కపిలాచార్యః కృతజ్ఞో మేదినీపతిః ।
త్రిపదస్త్రిదశాధ్యక్షో మహాశృఙ్గః కృతాన్తకృత్ ॥ 57

మహావరాహో గోవిన్దస్సుషేణః కనకాఙ్గదీ ।
గుహ్యో గభీరో గహనో గుప్తశ్చక్రగదాధరః ॥ 58

వేధాః స్వాఙ్గోఽజితః కృష్ణో దృఢస్సఙ్కర్షణోఽచ్యుతః ।
వరుణో వారుణో వృక్షః పుష్కరాక్షో మహామనాః ॥ 59

భగవాన్ భగహా నన్దీ వనమాలీ హలాయుధః ।
అదిత్యో జ్యోతిరాదిత్యః సహిష్ణుర్గతిసత్తమః ॥ 60

సుధన్వా ఖణ్డపరశుః దారుణో ద్రవిణప్రదః ।
దివిస్పృక్సర్వదృగ్వ్యాసో వాచస్పతిరయోనిజః ॥ 61

త్రిసామా సామగస్సామ నిర్వాణం భేషజం భిషక్ ।
సన్న్యాసకృచ్ఛమశ్శాన్తో నిష్ఠా శాన్తిః పరాయణః ॥ 62

శుభాఙ్గశ్శాన్తిదస్స్రష్టా కుముదః కువలేశయః ।
గోహితో గోపతిర్గోప్తా వృషభాక్షో వృషప్రియః ॥ 63

అనివర్తీ నివృత్తాత్మా సంక్షేప్తా క్షేమకృచ్ఛివః ।
శ్రీవత్సవక్షాః శ్రీవాసః శ్రీపతిః శ్రీమతాం వరః ॥ 64

శ్రీదః శ్రీశః శ్రీనివాసః శ్రీనిధిః శ్రీవిభావనః ।
శ్రీధరః శ్రీకరః శ్రేయశ్శ్రీమాన్ లోకత్రయాశ్రయః ॥ 65

స్వక్షః స్వఙ్గః శతానన్దో నన్దిర్జ్యోతిర్గణేశ్వరః ।
విజితాత్మా విధేయాత్మా సత్కీర్తిశ్ఛిన్నసంశయః ॥ 66

ఉదీర్ణస్సర్వతశ్చక్షురనీశ శ్శాశ్వతస్థిరః ।
భూశయో భూషణో భూతిర్విశోకశ్శోకనాశనః ॥ 67

అర్చిష్మానర్చితః కుమ్భో విశుద్ధాత్మా విశోధనః ।
అనిరుద్ధోఽప్రతిరథః ప్రద్యుమ్నోఽమితవిక్రమః ॥ 68

కాలనేమినిహా శౌరిః శూరశ్శూరజనేశ్వరః ।
త్రిలోకాత్మా త్రిలోకేశః కేశవః కేశిహా హరిః ॥ 69

కామదేవః కామపాలః కామీ కాన్తః కృతాగమః ।
అనిర్దేశ్యవపుర్విష్ణుర్వీరోఽనన్తో ధనఞ్జయః ॥ 70

బ్రహ్మణ్యో బ్రహ్మకృత్ బ్రహ్మా బ్రహ్మ బ్రహ్మవివర్ధనః ।
బ్రహ్మవిద్బ్రాహ్మణో బ్రహ్మీ బ్రహ్మజ్ఞో బ్రాహ్మణప్రియః ॥ 71

మహాక్రమో మహాకర్మా మహాతేజా మహోరగః ।
మహాక్రతుర్మహాయజ్వా మహాయజ్ఞో మహాహవిః । 72

స్తవ్యః స్తవప్రియః స్తోత్రం స్తుతః స్తోతా రణప్రియః ।
పూర్ణః పూరయితా పుణ్యః పుణ్యకీర్తిరనామయః ॥ 73

మనోజవస్తీర్థకరో వసురేతా వసుప్రదః ।
వసుప్రదో వాసుదేవో వసుర్వసుమనా హవిః ॥ 74

సద్గతిస్సత్కృతిస్సత్తా సద్భూతిస్సత్పరాయణః ।
శూరసేనో యదుశ్రేష్ఠస్సన్నివాసస్సుయామునః ॥ 75

భూతావాసో వాసుదేవస్సర్వాసునిలయోఽనలః ।
దర్పహా దర్పదోదృప్తో దుర్ధరోఽథాపరాజితః ॥ 76

విశ్వమూర్తిర్మహామూర్తిర్దీప్తమూర్తిరమూర్తిమాన్ ।
అనేకమూర్తిరవ్యక్తశ్శతమూర్తిశ్శతాననః ॥ 77

ఏకో నైకస్సవః కః కిమ్ యత్తత్పదమనుత్తమమ్ ।
లోకబన్ధుర్లోకనాథో మాధవో భక్తవత్సలః ॥ 78

సువర్ణవర్ణో హేమాఙ్గో వరాఙ్గశ్చన్దనాఙ్గదీ ।
వీరహా విషమశ్శూన్యో ఘృతాశీరచలశ్చలః ॥ 79

అమానీ మానదో మాన్యో లోకస్వామీ త్రిలోకధృత్ ।
సుమేధా మేధజో ధన్యస్సత్యమేధా ధరాధరః ॥ 80

తేజో వృషో ద్యుతిధరస్సర్వశస్త్రభృతాం వరః ।
ప్రగ్రహో నిగ్రహో వ్యగ్రో నైకశృఙ్గో గదాగ్రజః ॥ 81

చతుర్మూర్తిశ్చతుర్బాహుశ్చతుర్వ్యూహశ్చతుర్గతిః ।
చతురాత్మా చతుర్భావశ్చతుర్వేదవిదేకపాత్ ॥ 82

సమావర్తో నివృత్తాత్మా దుర్జయో దురతిక్రమః ।
దుర్లభో దుర్గమో దుర్గో దురావాసో దురారిహా ॥ 83

శుభాఙ్గో లోకసారఙ్గస్సుతన్తుస్తన్తువర్ధనః ।
ఇన్ద్రకర్మా మహాకర్మా కృతకర్మా కృతాగమః ॥ 84

ఉద్భవస్సున్దరస్సున్దో రత్ననాభస్సులోచనః ।
అర్కో వాజసనిః శృఙ్గీ జయన్తస్సర్వవిజ్జయీ ॥ 85

సువర్ణబిన్దురక్షోభ్యస్సర్వవాగీశ్వరేశ్వరః ।
మహాహ్రదో మహాగర్తో మహాభూతో మహానిధిః ॥ 86

కుముదః కున్దరః కున్దః పర్జన్యః పావనోఽనిలః ।
అమృతాశోఽమృతవపుః సర్వజ్ఞస్సర్వతోముఖః ॥ 87

సులభస్సువ్రతస్సిద్ధః శత్రుజిచ్ఛత్రుతాపనః ।
న్యగ్రోధోదుమ్బరోఽశ్వత్థశ్చాణూరాన్ధ్రనిషూదనః ॥ 88

సహస్రార్చిస్సప్తజిహ్వస్సప్తైధాస్సప్తవాహనః ।
అమూర్తిరనఘోఽచిన్త్యో భయకృద్భయనాశనః ॥ 89

అణుర్బృహత్కృశస్స్థూలో గుణభృన్నిర్గుణో మహాన్ ।
అధృతః స్వధృతః స్వాస్యః ప్రాగ్వంశో వంశవర్ధనః ॥ 90

భారభృత్ కథితో యోగీ యోగీశః సర్వకామదః ।
ఆశ్రమః శ్రమణః క్షామః సుపర్ణో వాయువాహనః ॥ 91

ధనుర్ధరో ధనుర్వేదో దణ్డో దమయితాఽదమః ।
అపరాజితస్సర్వసహో నియన్తా నియమో యమః ॥ 92

సత్త్వవాన్ సాత్త్వికస్సత్యస్సత్యధర్మపరాయణః ।
అభిప్రాయః ప్రియార్హోఽర్హః ప్రియకృత్ ప్రీతివర్ధనః ॥ 93

విహాయసగతిర్జ్యోతిః సురుచిర్హుతభుగ్విభుః ।
రవిర్విరోచనస్సూర్యః సవితా రవిలోచనః ॥ 94

అనన్తహుతభుగ్భోక్తా సుఖదో నైకదోఽగ్రజః ।
అనిర్విణ్ణస్సదామర్షీ లోకాధిష్ఠానమద్భుతః ॥ 95

సనాత్సనాతనతమః కపిలః కపిరవ్యయః ।
స్వస్తిదః స్వస్తికృత్ స్వస్తి స్వస్తిభుక్ స్వస్తిదక్షిణః ॥ 96

అరౌద్రః కుణ్డలీ చక్రీ విక్రమ్యూర్జితశాసనః ।
శబ్దాతిగశ్శబ్దసహశ్శిశిరశ్శర్వరీకరః ॥ 97

అక్రూరః పేశలో దక్షో దక్షిణః క్షమిణాంవరః ।
విద్వత్తమో వీతభయః పుణ్యశ్రవణకీర్తనః ॥ 98

ఉత్తారణో దుష్కృతిహా పుణ్యో దుస్స్వప్ననాశనః ।
వీరహా రక్షణస్సన్తో జీవనః పర్యవస్థితః ॥ 99

అనన్తరూపోఽనన్తశ్రీర్జితమన్యుర్భయాపహః ।
చతురశ్రో గభీరాత్మా విదిశో వ్యాదిశో దిశః ॥ 100

అనాదిర్భూర్భువో లక్ష్మీస్సువీరో రుచిరాఙ్గదః ।
జననో జనజన్మాదిః భీమో భీమపరాక్రమః ॥ 101

ఆధారనిలయోధాతా పుష్పహాసః ప్రజాగరః ।
ఊర్ధ్వగస్సత్పథాచారః ప్రాణదః ప్రణవః పణః ॥ 102

ప్రమాణం ప్రాణనిలయః ప్రాణధృత్ ప్రాణజీవనః ।
తత్త్వం తత్త్వవిదేకాత్మా జన్మమృత్యుజరాతిగః ॥ 103

భూర్భువస్స్వస్తరుస్తార స్సవితా ప్రపితామహః ॥
యజ్ఞో యజ్ఞపతిర్యజ్వా యజ్ఞాఙ్గో యజ్ఞవాహనః ॥ 104

యజ్ఞభృద్యజ్ఞకృద్యజ్ఞీ యజ్ఞభుగ్యజ్ఞసాధనః ।
యజ్ఞాన్తకృద్యజ్ఞగుహ్యమన్నమన్నాద ఏవచ ॥ 105

ఆత్మయోనిః స్వయఙ్జాతో వైఖానసామగాయనః ।
దేవకీనన్దనః స్రష్టా క్షితీశః పాపనాశనః ॥ 106

శఙ్ఖభృన్నన్దకీ చక్రీ శార్ఙ్గధన్వా గదాధరః ।
రథాఙ్గపాణి రక్షోభ్య స్సర్వప్రహరణాయుధః ॥ 107

శ్రీ సర్వప్రహరణాయుధ ఓన్నమ ఇతి ।

---

(వనమాలీ గదీ శార్ఙ్గీ శఙ్ఖీ చక్రి చ నన్దకీ ।
శ్రీమాన్నారాయణో విష్ణుర్వాసుదేవోఽభిరక్షతు ॥)

ఇతీదం కీర్తనీయస్య కేశవస్య మహాత్మనః ।
నామ్నాం సహస్రం దివ్యానా మశేషేణ ప్రకీర్తితమ్ ॥ 1

య ఇదం శృణుయాన్నిత్యం యశ్చాపి పరికీర్తయేత్ ।
నాశుభం ప్రాప్నుయాత్కిఞ్చిత్సోఽముత్రేహ చ మానవః ॥ 2

వేదాన్తగో బ్రాహ్మణః స్యాత్ క్షత్రియో విజయీ భవేత్ ।
వైశ్యో ధనసమృద్ధస్స్యాత్ శూద్రస్సుఖమవాప్నుయాత్ ॥ 3

ధర్మార్థీ ప్రాప్నుయాద్ధర్మమర్థార్థీ చార్థమాప్నుయాత్ ।
కామానవాప్నుయాత్కామీ ప్రజార్థీ చాప్నుయాత్ప్రజాః ॥ 4

భక్తిమాన్యస్సదోత్థాయ శుచిస్తద్గతమానసః ।
సహస్రం వాసుదేవస్య నామ్నామేతత్ప్రకీర్తయేత్ ॥ 5

యశః ప్రాప్నోతి విపులం జ్ఞాతిప్రాధాన్యమేవచ ।
అచలాం శ్రియమాప్నోతి శ్రేయః ప్రాప్నోత్యనుత్తమమ్ ॥ 6

న భయం క్వచిదాప్నోతి వీర్యం తేజశ్చ విన్దతి ।
భవత్యరోగో ద్యుతిమాన్ బలరూపగుణాన్వితః । 7

రోగార్తో ముచ్యతే రోగాద్బద్ధో ముచ్యేత బన్ధనాత్ ।
భయాన్ముచ్యేత భీతస్తు ముచ్యేతాపన్న ఆపదః ॥ 8

దుర్గాణ్యతితరత్యాశు పురుషః పురుషోత్తమమ్ ।
స్తువన్నామసహస్రేణ నిత్యం భక్తిసమన్వితః ॥ 9

వాసుదేవాశ్రయో మర్త్యో వాసుదేవపరాయణః ।
సర్వపాపవిశుద్ధాత్మా యాతి బ్రహ్మ సనాతనమ్ ॥ 10

న వాసుదేవభక్తానామశుభం విద్యతే క్వచిత్ ।
జన్మమృత్యుజరావ్యాధిభయం నాప్యుపజాయతే ॥ 11

ఇమం స్తవమధీయానః శ్రద్ధాభక్తిసమన్వితః ।
యుజ్యేతాత్మసుఖక్షాన్తి శ్రీధృతిస్మృతికీర్తిభిః ॥ 12

న క్రోధో న చ మాత్సర్యం న లోభో నాశుభా మతిః
భవన్తి కృతపుణ్యానాం భక్తానాం పురుషోత్తమే ॥ 13

ద్యౌస్సచన్ద్రార్కనక్షత్రం ఖం దిశో భూర్మహోదధిః ।
వాసుదేవస్య వీర్యేణ విధృతాని మహాత్మనః ॥ 14

ససురాసురగన్ధర్వం సయక్షోరగరాక్షసమ్ ।
జగద్వశే వర్తతేదం కృష్ణస్య సచరాచరమ్ ॥ 15

ఇన్ద్రియాణి మనోబుద్ధిస్సత్త్వం తేజో బలం ధృతిః ।
వాసుదేవాత్మకాన్యాహుః క్షేత్రం క్షేత్రజ్ఞ ఏవచ ॥ 16

సర్వాగమానామాచారః ప్రథమం పరికల్పితః ।
ఆచారప్రభవో ధర్మో ధర్మస్య ప్రభురచ్యుతః ॥ 17

ఋషయః పితరో దేవా మహాభూతాని ధాతవః ।
జఙ్గమాజఙ్గమం చేదం జగన్నారాయణోద్భవమ్ ॥ 18

యోగజ్ఞానం తథా సాంఖ్యం విద్యాశ్శిల్పాది కర్మ చ ।
వేదాః శాస్త్రాణి విజ్ఞాన మేతత్సర్వం జనార్దనాత్ ॥ 19

ఏకో విష్ణుర్మహద్భూతం పృథగ్భూతాన్యనేకశః ।
త్రీన్ లోకాన్ వ్యాప్య భూతాత్మా భుఙ్క్తే విశ్వభుగవ్యయః ॥ 20

ఇమం స్తవం భగవతో విష్ణోర్వ్యాసేన కీర్తితమ్ ।
పఠేద్య ఇచ్ఛేత్పురుషః శ్రేయః ప్రాప్తుం సుఖాని చ ॥ 21

విశ్వేశ్వరమజం దేవం జగతః ప్రభుమవ్యయమ్ ।
భజన్తి యే పుష్కరాక్షం న తే యాన్తి పరాభవమ్ ॥ 22

న తే యాన్తి పరాభవమ్ ఓమ్ నమ ఇతి ॥

అర్జున ఉవాచ :—

పద్మపత్రవిశాలాక్ష పద్మనాభ సురోత్తమ ।
భక్తానామనురక్తానాం త్రాతా భవ జనార్దన ॥

శ్రీభగవానువాచ —

యో మాం నామసహస్రేణ స్తోతుమిచ్ఛతి పాణ్డవ ।
సోఽహమేకేన శ్లోకేన స్తుతఏవ న సంశయః ॥

స్తుత ఏవ న సంశయ ఓమ్ నమ ఇతి ॥

వ్యాస ఉవాచ —

వాసనాద్వాసుదేవస్య వాసితం తే జగత్త్రయమ్ ।
సర్వభూతనివాసోఽసి వాసుదేవ నమోఽస్తు తే ॥

శ్రీవాసుదేవ నమోస్తుతే ఓమ్ నమ ఇతి ॥

పార్వత్యువాచ —

కేనోపాయేన లఘునా విష్ణోర్నామసహస్రకమ్ ।
పఠ్యతే పణ్డితైర్నిత్యం శ్రోతుమిచ్ఛామ్యహం ప్రభో ॥

ఈశ్వర ఉవాచ —

శ్రీరామ రామ రామేతి రమే రామే మనోరమే ।
సహస్రనామతత్తుల్యం రామనామ వరాననే ।

శ్రీరామనామ వరానన ఓమ్ నమ ఇతి ॥

బ్రహ్మోవాచ —

నమోఽస్త్వనన్తాయ సహస్రమూర్తయే
సహస్రపాదాక్షి శిరోరుబాహవే ।
సహస్రనామ్నే పురుషాయ శాశ్వతే
సహస్రకోటీయుగధారిణే నమః ॥

శ్రీసహస్రకోటీయుగధారిణే ఓమ్ నమ ఇతి ॥

సఞ్జయ ఉవాచ —

యత్ర యోగేశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః ।
తత్ర శ్రీర్విజయో భూతిర్ధ్రువా నీతిర్మతిర్మమ ॥

శ్రీభగవానువాచ —

అనన్యాశ్చిన్తయన్తో మాం యే జనాః పర్యుపాసతే ।
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్ ॥

పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్ ।
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే ।

ఆర్తా విషణ్ణాశ్శిథిలాశ్చ భీతాః ఘోరేషుచ వ్యాధిషు వర్తమానాః ।
సఙ్కీర్త్య నారాయణశబ్దమాత్రం విముక్తదుఃఖాస్సుఖినో భవన్తి ॥

యదక్షరపదభ్రష్టం మాత్రాహీనం చ యద్భవేత్ ।
తత్ సర్వం క్షమ్యతాం దేవ నారాయణ నమోఽస్తు తే ॥

కాయేన వాచా మనసేంద్రియైర్వా
బుద్ధ్యాఽఽత్మనావా ప్రకృతేస్స్వభావాత్ ।
కరోమి యద్యత్ సకలం పరస్మై
నారాయణాయేతి సమర్పయామి ॥

సర్వం శ్రీ కృష్ణార్పణమస్తు.

శ్రీ విష్ణు సహస్రనామస్తోత్రమ్
సంపూర్ణమ్.

శ్రీమతే రామానుజాయ నమః.



# శ్రీ విష్ణుసహస్రనామము.

## ఆంధ్రవ్యాఖ్యానము.



[శ్రీ భట్టరుల తనియను.]

శ్లో॥ శ్రీపరాశరభట్టార్యః శ్రీరంగేశ పురోహితః ।
శ్రీవత్సాంకసుతః శ్రీమా న్ఛ్రేయసే మే స్తు భూయసే ॥



[మంగళ శ్లోకములు.]

శ్లో॥ వన్దే గోవిందతాతౌ మునిమథ మనవై లక్ష్మణార్యం మహాన్తమ్
ధ్యాయేయం యామునార్యం మమ హృది తనవై రామమేవాభి
యాయామ్ ।
పద్మాక్షం ప్రేక్షిషీయ ప్రథమమపిమునిం నాథమీడే శఠారిమ్
స్తౌమి ప్రేక్షేయ లక్ష్మీం శరణమశరణః శ్రీధరం సంశ్రయేయమ్ ॥

ఓంనమో గజవక్త్రాద్యైః పారిషద్యైః ప్రశాసతే।
శ్రీరంగరాజసేనాన్యే సూత్రవత్యా సమేయుషే ॥

నమో నారాయణాయేదం
కృష్ణద్వైపాయనాత్మనే ।
యదాముష్యాయణాః వేదాః
మహాభారత పంచమాః ।

జాతో లక్ష్మణమిశ్ర సంయమిధనాత్ శ్రీవత్సచిహ్నాద్వృషేః
భూమ్నో భట్టపరాశరేతి ఫణితః శ్రీరంగభర్త్రా స్వయమ్ ।
శ్రీ శ్రీరంగపతిప్రసాదతృషయా శ్రీరంగనాథాహ్వయః
శ్రీరంగేశ్వరకారితః వివృణుతే నామ్నాం సహస్రం హరేః ।

సంసారోఽయమపండితో భగవతి ప్రాగేవ భూయః కలౌ
పూర్ణంమన్యతమః జనే శ్రుతిశిరోగుహ్యం బ్రువే సాహసాత్ ।
తత్ర స్తోత్రమిదం ప్రకాశయతి యస్తుత్యశ్చయస్తౌ పుభౌ
వ్యాసః కారుణికో హరిశ్చ తదిదం మౌర్ఖ్యం సహేతాం మమ ॥

అర్థేహరా తదభిధాయిని నామవర్గే
తద్వ్యంజకే మయిచ బంధవిశేషమేత్య ।
సేవధ్వమేతదమృతం ప్రణిపత్య యాచే
మధ్యస్థమత్సరిజనా ఇహ మాచ భూవన్ ॥

---

శ్రీమతే రామానుజాయ నమః.

# శ్రీవిష్ణుసహస్రనామ వ్యాఖ్యానము.

## ఉపోద్ఘాతము.

### శ్రీరామాయణమువలె మహాభారతముగూడ ప్రమాణమనుట.

ఈలోకమున నందఱును ప్రమాణంబులచే ప్రమేయంబుల నెఱింగి ఆప్రమేయములు అనుకూలములయినచో వానిని గ్రహింతురు. (ఉ॥ పుష్పమాల, చందనము మున్నగునవి.) ప్రతికూలములయినచో వీడుదురు. (ఉ॥ ముల్లు మున్నగునవి.) ఈ రెండునుగాక ఉదాసీనములుగానుండువానిని ఉపేక్షింతురు. (ఉ॥ తృణము మున్నగునవి.) ఇయ్యది లోకస్వభావము. కనుకనే ధర్మార్థకామమోక్షంబులను నాలుగు పురుషార్థములలో అర్థకామములు అత్యల్పములు అనర్థకరములు భయంకరములు ఒక క్షణముననే నశించునవి దుఃఖములతో కూడుకొన్నవి ఇత్యాది బహుదోషంబులతో కూడియుండుటచే అవి త్యాజ్యములుగాను, ధర్మ పరతత్త్వములు పూర్వోక్త కారణంబులకు విపరీతములగుటవలనను సర్వమంగళములు నిండియుండుట వలనను అవి గ్రాహ్యములుగాను అయినవి. ఇట్లనియే పౌరాణికులును ఐతిహాసికులును అందురు.

సత్యం సత్యం పునస్సత్యం ఉద్ధృత్య భుజముచ్యతే ।
వేదశాస్త్రాత్ పరం నాస్తి న దైవం కేశవాత్ పరమ్ ॥

[తా. సత్యము సత్యము, మఱియు సత్యము. భుజంబును పైకెత్తి ప్రమాణము చేయుచు చెప్పుచున్నాడను. వేదశాస్త్రంబునుమించిన ప్రమాణములేదు. శ్రీమన్నారాయణునిమించిన ప్రమేయము లేదు.]

పదునాలుగు విద్యలలోను ప్రధానమగు వేదముయొక్క అర్థమును.

ఇతిహాస పురాణాభ్యాం వేదం సముపబృంహయేత్ ।
బిభేత్యల్పశ్రుతాద్వేదః మామయం ప్రతరిష్యతి ॥

]భార. ఆది. అ. ౧. శ్లో. ౨౬౩.]

[తా. ఇతిహాస పురాణంబులచే వేదార్థంబును వివరింపవలయును. ఏలయనగా; అల్పజ్ఞులను చూచినచో వేదము 'అయ్యో! వీరు నన్ను మోసగింతురే. (అనగా అపార్థము చేయుదురే, అని భయపడును.)] అను ప్రమాణరీతిగా ఇతిహాసపురాణంబులను అనుసరించియే వేదార్థము నిర్ణయింపదగును. ఈరెంటిలోను 'ఇతిహాస పురాణాభ్యామ్' అనుచోట ఇతిహాసపదము ప్రథమమున నుండుటచే అదియే ఉత్కృష్టము (గొప్పది). శ్రీరామాయణమువలె మహాభారతముగూడ ఇతిహాసమే యగుటచే శ్రీరామాయణమువలె భారతముగూడ ప్రమాణమే యగును.

## శ్రీ సహస్ర నామాధ్యాయంబునకు ఉత్కర్ష సమర్థనము.

(1) మహాభారత సారత్వాత్ (2) ఋషిభిః పరిగానతః ।
(3) వేదాచార్య సమాహారాత్ (4) భీష్మోత్కృష్టమతత్వతః ॥
(5) పరిగ్రహాతిశయతః (6) గీతాద్యైకార్థ్యతశ్చనః ।
సహస్రనామ్నామధ్యాయః ఉపాదేయతమో మతః ॥

[తా. (1) శ్రీ మహాభారత సారమగుట (2) మహర్షులు కొనియాడియుండుట (3) వేదవ్యాసులు స్తోత్రరూపముగా సేకరించియుండుట (4) భీష్మాచార్యుల ముఖ్యమతమగుట (5) పరిగ్రహాతిశయముగలదగుట (6) గీతాదులతో సమానార్థముగా నుండుట అను నీ కారణంబులచే సహస్రనామాధ్యాయము ఉత్కృష్టముగా నుండును.] ఇక వీనిని వివరింతము :—

## 1. మహాభారతోత్కర్ష సమర్థనము.

### మహాభారత సారత్వ కథనము.

మహాభారతము ఇతిహాస మగుటచ్చే ప్రబలమగును. ఇదిగాక పురాణములుగూడ మహాభారతమును ప్రబల ప్రమాణముగా నొప్పుకొనినవి. చూడుడు :—

మతిమన్థానమావిధ్య యేనాఽసౌ శ్రుతిసాగరాత్ ।
జగద్ధితాయ జనితో మహాభారత చంద్రమాః ॥

(వాయు పురాణము, శైవ పురాణము.)

[తా. బుద్ధి యను కవ్వమును నాటి వేదంబను సముద్రమునుండి మహాభారతంబను చంద్రుడు లోకహితమునకై ఎవనిచే జనింపబడినదో ;]

బిభేతి గహనాత్ శాస్త్రాత్ నరః తీవ్రాదివౌషధాత్ ।
భారతః శాస్త్రసారోఽయం అతః కావ్యాత్మనా కృతః

(భవిష్యత్పురాణము.)

[తా. చోరజాలని శాస్త్రంబును జూచి తీవ్రమగు ఔషధమును చూచినట్లు మనుష్యుడు భయపడునుగాన శాస్త్ర సారముగా నీ మహాభారతము కావ్యరూపముగా రచింపబడియె.]

యస్య ద్వైపాయనః పుత్రః స్వయం విష్ణు రజాయత ।
ప్రకాశో జనితో యేన మహాభారత చంద్రమాః ॥

(మాత్స్య పురాణము.)

[తా. మహా భారతంబను చంద్రుఁడు ఎవరిచే ప్రకాశించెనో; అట్టి ద్వైపాయనులను పుత్రులుగా విష్ణువే ఎవరికి అవతరించెనో;]

కృష్ణ ద్వైపాయనం వ్యాసం విద్ధి నారాయణం ప్రభుమ్ ।
కోహ్యన్యో భువి మైత్రేయ మహాభారతకృత్ భవేత్ ॥

(శ్రీ విష్ణు పురాణము, అం. 3. అ. 4. శ్లో. 5.)

[తా. కృష్ణద్వైపాయనుండను వ్యాసుని సర్వవ్యాపియగు నారాయణునిగా నెఱుంగుము. ఓ మైత్రేయా! ఆయన తప్ప మఱెవ్వడు భూలోకంబున మహాభారతంబును రచింపగలడు.]

వ్యాసవాక్య జలౌఘేన కుధర్మతరుహారిణా ।
వేదశైలావతీర్ణేన నీరజస్కా మహీకృతా ।

(మార్కండేయ పురాణము.)

[తా. వేదంబు అను పర్వతంబునుండి దిగిన, చెడుధర్మంబులు అను వృక్షంబులను పెల్లగించుచువచ్చు వ్యాస వాక్యంబు అను జలప్రవాహంబుచే భూలోకము రజస్సు (దుమ్ము, పాపము, రజోగుణము) లేనిదిగ చేయబడియె.]

అని యితర పురాణములు పొగడియున్నవి. అదిగాక ఈ మహాభారతమునందే,

యోవిద్యా చ్చతురోవేదాన్ సాఙ్గోపనిషదాన్ ద్విజః ।
నచాఖ్యానమిదం విద్యాత్ నైవ సః స్యాత్ విచక్షణః ॥
(భార. ఆది. 2_376.)

[తా. ఏ ద్విజుడు అంగములు ఉపనిషత్తులు వీనితో నాలుగు వేదంబుల నెఱింగియు, ఈ మహాభారతంబు నెఱుంగఁడో; వాడు పండితుడు కాజాలడు.] ఇత్యాది అనేక వచనంబులచే కొనియాడబడియున్నది. ఇట్లు అంగంబులతో గూడిన శ్రుతి స్మృతి ఇతిహాసము పురాణము మున్నగునవియన్నియు ఏకకంఠముగా చెప్పియుండుటవలనను,

యదిహాస్తి తదన్యత్ర యన్నేహాస్తి న తత్క్వచిత్ ।
(భార. ఆది. 62_53.)

[ఈ భారతమునం గలవే ఇతర గ్రంథంబులందు గలవు. దీనిలో లేనిది మఱెచ్చటను లేదు.] అని లౌకికవైదికములగు సకల పురుషార్థంబులను నిర్ణయించుటకనియే యేర్పడి ఎచటను నిష్పక్షపాతముగా నుండుటచేతను, ఇతిహాసములను పురాణములకన్న నతిశ్రేష్ఠముగా పరిగణింతురు. అట్టి మహాభారతమునందే ప్రాణస్థానముగా నుండు అనుశాసనికపర్వమున దానధర్మాదిసకలశాస్త్రార్థములను నిర్ణయించి ముగించునపుడు సారసంగ్రహరూపముగా నీ సహస్రనామాధ్యాయము అవతరింప జేయబడియె. కనుక ఇది ప్రమాణమనుటకుగల ప్రబల కారణంబులును, తత్త్వార్థప్రకాశనమే దీనికి ముఖ్యాభిప్రాయము అనుటకు గల చిహ్నములనేకములు నుండుటచేతను ఈ సహస్రనామాధ్యాయము ప్రమాణమో కాదో అను శంకకు ప్రసక్తియే లేదు. ఉత్కృష్టార్థములను ప్రకటించునది యగుటచే భోగమును మోక్షమును గోరునందఱకు ఇదియే అవశ్యముగా స్వీకరింపఁదగును.

---

## 2. మహర్షులందఱు సహస్రనామాధ్యాయంబును పొగడిరనుట.

ఈ విషయము "ఋషిభిః పరిగీతాని" అను శ్లోక వ్యాఖ్యాన ప్రకరణమున నుపపాదింపబడును. (పుట. 51)

---

## 3. వేదవ్యాసులు స్తోత్రరూపముగా గ్రుచ్చిరనుట.

ఆ కృష్ణద్వైపాయనులు అను వేదవ్యాసులు పరమాప్తులు. (అనగా, తత్త్వార్థములను ఉన్నదియున్నటులే తప్పులేక చెప్పువారు) శ్రీమన్నారాయణావతారమగుటచే జ్ఞానము ఐశ్వర్యము మున్నగు కల్యాణగుణములతో నిండియుండువారు, పూర్వాపర విరోధాదిదోషము లొకింతియు వారివాక్యములందుండ జాలవు, కలిప్రభావముచే జ్ఞానము తగ్గియుండు మనుష్యులకై పరమకృపచే వేదములను విడదీసినవారు, వేదార్థము తెలుగుటయందును వాని ననుష్ఠించువిషయమునను గల్గిన సందేహములను దీర్చుటకు గానే అయిదవవేదమనబడు మహాభారతమును రచించినవారు, తనవాక్కుచేతనే క్షత్రియుడగు విశ్వామిత్రుని బ్రాహ్మణుడుగా మార్చిన వసిష్ఠమహర్షికి మునిమనుమడు, వసిష్ఠులు పులస్త్యులు అనువీరల వరబలముచే పరదేవతా స్వరూపమును ఉన్నది యున్నట్లు ఎఱుంగుటకును పురాణసంహితలను రచించుటకును శక్తులై లైఙ్గాది పురాణంబులందు విశేషముగా కొనియాడబడియుండు శ్రీ పరాశర మహర్షి యొక్క కుమారులు. మహాతపస్వియగుటచే అనేకమహర్షులచే పూజింపబడినవారు. ఈ కారణంబులచే వ్యాసులు పరమాప్తులు యదార్థవాసి. అట్టి యీ వేదవ్యాస మహర్షి యాకాలమున మహర్షులందఱు విశేషముగా గొనియాడుచునుండిన భగవన్నామముల నన్నింటిని చేర్చి స్తోత్రరూపముగా సమకూర్చిరిగాన ఇది గ్రాహ్యమే యగును.

---

## 4. భీష్మాచార్యుల ముఖ్య మతము.

వేదవ్యాసులవలె భీష్మాచార్యులుగూడ పరమాప్తులు. చూడుడు :— ధర్మరాజునకు రాజధర్మముల నుపదేశించునపుడు వేదవ్యాసులు :—

> శ్రోతుమిచ్ఛసిచేద్ధర్మాన్ నిఖిలేన నరాధిప ।
> ప్రైహి భీష్మం మహాబాహో వృద్ధం కురుపితామహమ్ ॥ (౬)
> స తే సర్వరహస్యేషు సంశయాన్మనసిస్థితాన్ ।
> ఛేత్తా భాగీరథీపుత్రః సర్వజ్ఞః సర్వతత్త్వవిత్ ॥ (౭)
> సాక్షాద్దదర్శయోదేవాన్ సర్వాన్ శక్రపురోగమాన్ ॥ (౮)

యస్య బ్రహ్మర్షయః పుణ్యాః నిత్యమాసన్ సభాసదః ।
యస్య నావిదితంకించిత్ జ్ఞానం జ్ఞేయేషువిద్యతే ॥ (౧౫)

(భార. శాంతి. అధ్యా. ३८.)

[తా. మహారాజా! ధర్మములనెల్ల నీవు వినగోరినచో కురువంశంబునకు పితామహులగు భీష్మాచార్యులను జేరుము. వారు సర్వరహస్యములందును నీకుండు సందేహములను పోగొట్టగలరు. గంగాపుత్రులగు వారు సర్వజ్ఞులు. సర్వతత్త్వములను ప్రత్యక్షముగా నెఱిగినవారు. ఇంద్రాది దేవతలనందఱను ప్రత్యక్షముగా చూచినవారు............ఎవరికి బ్రహ్మర్షులనేకులు సభికులో; ఎవరికి తెలియని జ్ఞానమొకటియులేదో; అట్టి మహనీయులు సకలధర్మ సూక్ష్మములను జెప్పగలరు.]

శరతల్పగతోభీష్మః శామ్యన్నివ హుతాశనః ।
మాం ధ్యాతి పురుషవ్యాఘ్రః తతో మే తద్గతంమనః ॥ (౧౧)
దివ్యాస్త్రాణి మహాతేజాః యోధారయతి బుద్ధిమాన్ ।
సాంగాంశ్చ చతురోవేదాన్ తమస్మి మనసాగతః ॥ (౧౨)
సహి భూతం భవిష్యచ్చ భవచ్చ భరతర్షభ ।
వేత్తి ధర్మ భృతాంశ్రేష్ఠః తతో మే తద్గతం మనః ॥ (౧౫)
తస్మిన్నస్తమితే భీష్మే కౌరవాణాం ధురంధరే ।
జ్ఞానాన్యల్పీ భవిష్యన్తి తస్మాత్త్వాం చోదయామ్యహమ్ ॥ (౨౩)

(భార. శాంతి. అధ్యా. ౪౬.)

యచ్చ త్వం వక్ష్యసే భీష్మ పాండవాయానుపృచ్ఛతే ।
వేదప్రవాద ఇవ తే స్థాస్యన్తి వసుధాతలే ॥ (౨౫

(అధ్యా. ౫౪.)

యద్ధి భూతం భవిష్యచ్చ భవచ్చ భరతర్షభ ।
సర్వం తత్ జ్ఞానవృద్ధస్య తవ పాణావివాహితమ్ ॥ (౧౮)
అహంచ త్వాభిజానామి స్వయం పురుషసత్తమ । (౨౬)

తపసాహి భవాన్ శక్తః స్రష్టుంలోకాన్ చరాచరాన్ ॥ (29)
(అధ్యా. 50.)

నతే గ్లాని ర్నతే మూర్ఛా ॥ అని యారంభించి (16)
సత్వస్థంచ మనోనిత్యం తవ భీష్మ భవిష్యతి ।
రజ స్తమోభ్యా మస్పృష్టం ఘనై ర్ముక్త ఇవోడురాట్ ॥ (17)
(18. అధ్యా. 52.)

[తా. (11) బాణశయ్య (బాణములచే నేర్పఱచిన పడక) లోనుండు భీష్ములు అఱుమన్న నిప్పువలెనుండి నన్నెప్పుడును ధ్యానము చేయుచున్నారుగాన నామనస్సు భీష్ముని చేరిపోయినది. (17) ఏ మహనీయుడు దివ్యాస్త్రములను అంగములతో గూడిన నాలుగు వేదములను ధరించియుండునో; అతనిని నామనస్సుచే నేనేపొందితిని. (19) ఆయన భూత భవిష్య ద్వర్తమానములను మూడు కాలములను ఎఱింగినవారు. ధర్మముల నెఱింగినవారలలో శ్రేష్ఠులు. కనుక నామనసు ఆయనను పొందినదయ్యె. (23) కౌరవశ్రేష్ఠుడగు ఆ భీష్ముడు అస్తమించినచో (మరణించినచో) జ్ఞానము (సన్మార్గములు) సన్నగిల్లును. అందుచే నిన్ను ప్రేరేపించుచున్నాను. (23) ఓ భీష్మా! నిన్ను అనువర్తించి ప్రశ్నించు ధర్మపుత్రులకు వేనిని చెప్పుదువో; అవియన్నియు వేదవాక్యములవలె భూమండలమున నిలిచియుండును. (18) భూత భవిష్యద్వర్తమానములన్నియు జ్ఞాన వృద్ధులగు నీ చేతిలో నణగియున్నవి. (29) చరాచరములు (స్థావర జంగమములు) నిండియుండు ఈ ప్రపంచమును నీ తపముచే సృజింప గలవని నేనుదలచెద. (16) నీకు బడలికలేదు మూర్ఛలేదు (18) (అని యారంభించి) ఓ భీష్మా! నీ మనసు ఎల్లప్పుడును సత్త్వగుణముననే యుండగలదు. అదియు రజోగుణ తమోగుణములతో చేరక మేఘములతొలిగిన చంద్రుని పగిది ప్రకాశించును.] అని భగవంతుడును,

కృత్స్నాన్హి వివిధాన్ధర్మాన్ చాతుర్వర్ణ్యస్య వేత్త్యయమ్ ॥ (9)
తచ్ఛీఘ్ర మనుయుంజీధ్వం సంశయాన్ మనసి స్థితాన్ ॥ (10)
(భా. శా. అ. 54.)

[తా. ఈయన నాలుగు వర్ణముల సమస్తధర్మముల నెఱుగును గాన మనసులోగల సందేహములను శీఘ్రముగా తెలుపుడు] అని నారదులును జెప్పినట్లు ప్రమాణము లనేకములు గలవు. మఱియు భీష్ములు అనేక బ్రహ్మవేత్తలను సేవించి

దీర్ఘ బ్రహ్మచర్యమునొంది తపస్సు సమాధి వీనిచే సమస్తము తెలుంగునంత మహా ప్రభావము నొందినవారని అనేకులు వక్కాణించియున్నారు. ఇంకను శ్రీ కృష్ణుడు పరతత్వమును ధర్మమును ప్రవర్తింప వరమిచ్చి నియమించుటవలనను, మాతాపితలకు శుశ్రూషచేసి వరమొందియుండుట వలనను,

దాహో మోహః శ్రమశ్చైవ క్లమో గ్లాని స్తథా రుజః ।
తవ ప్రసాదాత్ గోవింద సద్యో వ్యపగతాని మే ॥ (౧౭)

యచ్చ భూతం భవిష్యచ్చ భవచ్చ పరమచ్యుత ! ।
తత్సర్వ మనుపశ్యామి పాణౌ ఫల మివా హితమ్ ॥ (౧౮)

వేదోక్తాశ్చైవ యే ధర్మాః వేదాంతనియతాశ్చ యే ॥
తాన్ సర్వాన్ సంప్రపశ్యామి వరదానా త్తవాచ్యుత ॥ (౧౯)

[తా. గోవిందా ! ఆశ మోహము శ్రమము గ్లాని వ్యాధి ఇవి యన్నియు మీయనుగ్రహంబుచే వెంటనే తొలగెను. అచ్యుతా ! భూతభవిష్యద్వర్తమాన విషయములన్నియు చేతిలోనియుసిరికాయవలె నాకు గనబడుచున్నవి. వేద వేదాఙ్గంబులంగల ధర్మములన్నియు మీ వరబలంబుచే స్పష్టముగా స్ఫురించుచున్నవి.]

యువేవచాస్మి సంవృత్తః త్వదనుధ్యానబృంహితః ।
వక్తుం శ్రేయః సమర్థోస్మి త్వత్ప్రసాదాత్ జనార్దన ॥ (౨౩)

(భా. శా. అ. ౫౪.)

[ఓ జనార్దనా ! మిమ్ములను సదా ధ్యానముచేయుటచే పునః యౌవనము నొందినవానివలె అయితిని. మీ యనుగ్రహంబుచే శ్రేయమును చెప్ప శక్తుండను.] ఇత్యాదులందును ప్రతిజ్ఞచేసి యుండుటచే వీరు పరమాప్తులను విషయమున సంశయము లేదు. అట్టి భీష్ములే —

ఏషమే సర్వధర్మాణాం ధర్మోఽధికతమోమతః ॥

[ఇయ్యదియే సర్వ ధర్మములలోను ఉత్కృష్టమయిన (గొప్ప) ధర్మముగా నేను నిశ్చయించియున్నాను.] అని ప్రతిజ్ఞ చేసియున్నారు. ఈ కారణములచే నీ సహస్రనామాధ్యాయము అవశ్యము స్వీకరింపదగినది.

---

## ౯. పరిగ్రహాతిశయము.

ఈ భగవన్నామ సహస్రమును సమస్తలోకములును పరిగ్రహించియున్నవి. చూడుడు :— శాస్త్రములలో

దేవో నామసహస్రవాన్ ॥

(భా. స. అ. ౩౮. శ్లో. ౧౧.)

[తా. సహస్రనామములంగల దేవుడు.] అని భగవంతునకుగూడ ఈ సహస్రనామ సంబంధముచే నుత్కర్షము చెప్పబడియున్నది. శ్రీ విష్ణు ధర్మంబున గజేంద్రమోక్ష ప్రకరణమున

సహస్ర శుభనామానం ఆదిదేవమజం విభుమ్ ॥

(అ. ౭౯.)

[తా. సహస్రనామంబులు గలవాడై ఆదిదేవుడై జన్మము లేనివాడై వ్యాపకుడై యుండువానిని] అని గలదు. దీనిలోగూడ ఉపోద్ఘాతమునను, ఫలశ్రుతిలోను భగవద్గుణములు విశేషముగా గనబడుచున్నయవి. (అనగా ; గుణంబులు చెప్పినంతనే ఆ గుణవాచకములగు నామములు చెప్పినట్లాయె నని యభిప్రాయము.) దృష్టాదృష్ట శాస్త్రములగు ఆయుర్వేదాదులందు చరకసంహితలో

విష్ణుం సహస్రమూర్ధానం చరాచరపతిం విభుమ్ ।
స్తువన్నామ సహస్రేణ జ్వరాన్ సర్వాన్ వ్యపోహతి ॥

[తా. వెయ్యి తలలు గలవాడై స్థావరజంగమములకు పతియైయుండు విష్ణువును సహస్రనామములచే నుతింపగా సమస్త జ్వరములును పోవును] అని గలదు. శిథిలమై ఇప్పుడు అచ్చటచ్చట కొంచ మగపడుచుండు మేహరోగ ప్రాయశ్చిత్తంబున

జప్యం పురుషసూక్తకమ్ ॥

అని యారంభించి

తథైవ భగవన్నామసహస్రం భారతోదితమ్ ।

[తా. పురుషసూక్తమును....భారతమునగల సహస్రనామమును జపింపదగును]. జ్వరవిశేషంబునకు

హోమస్తు పూర్వవజ్జప్యం విష్ణోర్నామ సహస్రకమ్ ॥

[తా. అటులే విష్ణు సహస్రనామము పారాయణము చేయనగును. హోమము పూర్వమువలె చేయనగును.] కష్ట ప్రాయశ్చిత్తంబున

తథైవ భగవన్నామ్నాం సహస్రం పరికీర్తియేత్ ॥

[తా. అటులే సహస్రనామపారాయణము చేయనగును.] గ్రహాది ప్రాయశ్చిత్తమున

ఆసత్మతం మరుత్సూక్తం విష్ణోర్నామ సహస్రకమ్ ॥

ఇట్లు పరశ్శతములు గలవు. సాధారణ కవులుగూడ దీనిని సర్వజీవరక్షగా వర్ణించియున్నారు :—

భట్టబాణుడు పూర్వకాదంబరిలో సూతికాగృహ (పురుటిల్లు) వర్ణన ప్రకరణమున

అవిచ్ఛిన్న పఠ్యమాన నారాయణ నామసహస్రమ్

[తా. ఎడతెగక పఠింపబడు సహస్రనామము గలది.] అని వర్ణించెను. లోకముగూడ ఈ సహస్రనామమును గ్రహించి ధరించి విని జపించి పాడి వ్యాఖ్యానించి వ్రాసి దీనిలో నిష్ఠచేసి దీనిని పూజించి ఇట్లనేకవిధములచే విషము పిశాచము వ్యాధి గ్రహము దుస్స్వప్నము దుర్నిమిత్తము మున్నగు అమంగళములు నశించుటకును, మహా పాపాదులు నశించుటకును, ఇహపరము (ఈ లోకము పైలోకము) ల యందు మేలు గల్గుటకును, సంసార సంబంధము తొలగుటకును, పరమపదము సిద్ధించుటకును, పరమపదము సిద్ధించిన పిమ్మటగూడ భగవద్గుణామృతమును గ్రోలుటకును, బిడ్డలు స్త్రీలు మూగవారు మూర్ఖులు నాస్తికులు మున్నగువారిచే శ్రద్ధావిశ్వాసములతో పరిగ్రహింపబడుచున్నయది. ఇట్టి పరిగ్రహము వేదములకుగూడ లేదు. వేదమును మూర్ఖాదులు పరిగ్రహించలేరు. వేదమునకు కుల-చరణ-గోత్రాది వ్యవస్థలేర్పడి ప్రతి శాఖలోను పరిగ్రహింపవలసిన విధము నిర్బంధింపబడియున్నది. ఇట్లు పరిగ్రహాతిశయము గలదగుటచే నియ్యది గ్రాహ్యము.

మూ॥ శ్రీ వైశంపాయన ఉవాచ

శ్రుత్వా ధర్మా౯ అశేషేణ పావనానిచ సర్వశః ।
యుధిష్ఠిరః శాంతనవం పునరేవ అభ్యభాషత ॥ (౧)

[తా॥ సమస్త ధర్మములను, శుద్ధికరములగు వ్యాపారములను పలువిధములుగా విని యుధిష్ఠిరుడు భీష్ములను మరల అడిగెను]

---

## 6. గీతాదులతో సమానార్థము గలది.

భారతసారమగు భగవద్గీత నారాయణీయము యానము సంధి అగ్రపూజ ఉత్తమానుశాసనము ఇత్యాదులయందు నిష్కర్షింపబడిన తాత్పర్యమువలె నియ్యదియు వానితో నేకార్థముగా నుండుటచేతను, ఈ సహస్రనామాధ్యాయము ఉపాదేయతమము.

పై ఆఱు కారణములచ్చే ఆదరణీయముగా నిర్ణయింపబడి, వ్యాస - దేవశ్రవ - దేవస్థాన-నారద-వాత్స్యాయన - అశ్మ-సుమంతు ప్రభృతులగు సకల విద్యాచార్యులు బ్రహ్మవేత్తలు దేవర్షులు మహర్షులు వీరుగాక వీరలకును మనపూర్వులకును గురువై గీతను ఉపదేశించినవాడునై యుండు శ్రీ కృష్ణభగవానుడుకూడ శ్రోత [వినువాడు] గా నుండి భీష్మునివలన విని సంతసించినది ఈ సహస్రనామాధ్యాయము. అట్టి యీ సహస్రనామాధ్యాయమును భగవంతుని కల్యాణగుణములను చక్కగా నెఱుగుటకై వ్యాఖ్యానింతము.

---

(అవతారిక.) పూర్వమే మాటిమాటికి పరతత్వ విషయములగు ఆయా ప్రదేశములయందు సకలార్థములను నిర్ణయింపగా విని అందుచే తృప్తులైనట్లు కనబడుచు అందుచే నే ప్రశ్నయు చేయక మానముగానుండు జనమేజయుని జూచి వైశంపాయనులు పరమకృపతో నిక గొన్ని రహస్యార్థములను తెలుపఁదలంచి తామే చెప్పుచున్నారు.

శ్రుత్వాధర్మా నిత్యాది :— [ధర్మా౯] శ్రుతి స్మృతి మున్నగువానిలో రాజధర్మము దానధర్మము అని యనేకవిధములుగా చెప్పబడు ధర్మములనన్నిటిని [పావనానిచ] తపస్సు తీర్థసేవ ఇత్యాది అనేక విధములుగా చెప్పబడు శుద్ధికరములగు వ్యాపారములను [సర్వశః శ్రుత్వా] ఫలము అర్హము స్వరూపము అధికారము అను సర్వ ప్రకారములతోను విని ధర్మపుత్రుడు [శాన్తనవమ్] శంతను

మహారాజునకు గంగాదేవియందు బుట్టిన మహావీరుడైన భీష్ముని జూచి మరల ప్రశ్న చేయుచున్నాడు. ఆయన కభిమతంబగు మత మెయ్యది (ఇటువంటిది) అని యెఱుగుటకే యీ ప్రశ్న. కనుకనే ప్రశ్నలో "భవతః పరమో మతః" "తా. మీ కిష్టమగు మత మెయ్యది?] అని గలదు. సత్పురుషులు, తమ యాచార్యులు ప్రీతితో ననుష్ఠించు వానిని ఆదరింతురేగాని శాస్త్రప్రమాణమును మాత్రము విశ్వసింపరుగాన భీష్ముల యాచారమునంగల ప్రీతిచే మీయభిమత మెయ్యది అని పైప్రశ్న కభిప్రాయము. (౧)

(అవతారిక.) యుక్తా యుక్త వివేకముగల పురుషుడు ప్రమాణములచే ప్రమేయముల నెఱింగి వానిలో అనుకూలమైనవానిని (ప్రమేయమును) ఆదరించును. ప్రతికూలమైనవానిని వీడునని మొట్టమొదట చెప్పియున్నాముగదా? అట్టి ప్రమేయము, † ఉపాయము ఉపేయము అని ఇరుతెఱంగుగ నుండును. వానిలో ఉపేయము— ప్రియము ప్రియతరము ప్రియతమము అని ముువ్విధంబగును. ఉపాయముగూడ హితము హితతరము హితతమము అని ముువ్విధంబు ‡. వీనిలో ఉపేయమునకు జన్మము వృద్ధి పరిణామము (మార్పు) నాశము మున్నగు అచేతన ధర్మములును, క్లేశము మున్నగునవియు దోషములు. దోషసంబంధములేని స్థిరమయినజ్ఞానము, ఆనందము, ఐశ్వర్యము మున్నగునవి గుణములు. అటులే యుపాయమునకును దోషములు:—వ్యయము, మహాయాసము, కోరిన ఫలంబు నివ్వకుండుట, అల్పఫలము నిచ్చుట అనునవి. గుణములో యన్న:—ఫలమును తప్పక ఇచ్చుట, అపాయము లేకుండుట, మిగుల సులువుగా నుండుట, అధిక ఫలంబు నిచ్చుట మున్నగునవి.

ఇట్టి గుణదోషములు ఇంచుమించుగా నుండుటచే ఉపాయోపేయములలో తారతమ్య మేర్పడియె. దీనిలో ఉత్కృష్ట తమంబుకన్న (మిక్కిలి మేలయినదానికన్న) ఉత్కృష్ట - ఉత్కృష్టతరంబులుగూడ నికృష్టములవలె త్యాజ్యంబులేయగును. కనుక ధర్మపుత్రుడు తనకు ఇష్టముగాను అనిష్టముగాను ఉండు నికృష్టవిషయంబులను త్రోసివైచి ఉత్కృష్టతమంబును గ్రహింపదలంచి, ఉపాయోపేయములను వాని తారతమ్యముతో చక్కగ నడిగి తెలిసికొనవలయునను తమయభిప్రాయప్రకారము దానిని ఆఱువిధములుగా విభజించి రెండు శ్లోకములచే ప్రశ్న చేయుచున్నారు.

---

† ఉపాయ మనగా ఏదేనొక ఫలమును సాధించు సాధనము. ఉపేయమనగా ఆ సాధనముచే సాధింపబడు ఫలము ప్రియము.

‡ ఈ యుపాయోపేయములకు గుణదోషములుండుటచే ఆ గుణదోషముల న్యూనాతిరేకములకు దగినట్లు తారతమ్యమేర్పడి అందుచే నిట్లు మూడు భేదము లేర్పడినవి.

మూ. యుధిష్ఠిర ఉవాచ
కిమేకం దైవతం లోకే

అర్థము. లోకే = శాస్త్రమున, ఏకమ్ = ప్రధానమయిన, దైవతమ్ = దేవత, కిమ్ = ఏది ?.

---

వానిలో, ఉపాయము ఉపేయార్థముగాన ప్రధానమయిన ఆయుపేయమును ప్రశ్నింపదలంచెను. ఆయుపేయము తత్వశాస్త్రములలో పరతత్వమనియు పరమ ప్రాప్యమనియు రెండు విధములుగా చెప్పబడియున్నది. వానిలో మొట్టమొదట పర తత్వరూప ప్రశ్న చేయుచున్నారు :—

## 1. పరతత్వరూప ఉపేయప్రశ్న.

కిమేకం దైవతం లోకే 'లోకే' అనుపదంబును, సింహావలోక నన్యాయంబున విభక్తిని మార్చుకొనిన 'భవతః పరమోమతః' అనుపదింబును ప్రతి ప్రశ్నలోను సంబంధించును. 'లోక్యతే అనేన ఇతి లోకః, శాస్త్రమ్' దీనిచే సమస్తము ప్రత్యక్షముగా చూడబడుచున్నదిగాన లోకపదమునకు శాస్త్రమని యర్థము. "ఏకమ్" సమముగానో అధికముగానో ఉండు వేఱు వస్తువు లేనిదై, ప్రకాశాది పరమేశ్వర గుణంబులు పూర్ణముగానుండు దేవత ఏది? అని మొదటి ప్రశ్న.

ఈ ప్రశ్న కభిప్రాయమేమనగా:— శాస్త్రములలోను ప్రతి మతంబునందును, పరతత్వ మొకటియున్నదని యొప్పుకొనిన ఆస్తికులుగూడ ఆ పరతత్వము మాయ యున్న గు ఉపాధివశంబుచే వికారమునొంది తన్మూలంబున జ్ఞాన శక్త్యాది ఐశ్వర్యముల నొంది యున్నవాః? స్వాభావికముగానే సకలైశ్వర్యములును నిండియున్నవాః? అనియు సామాన్యముగా సంశయింతురు. అదిగాక బ్రహ్మ - విష్ణువు - మహేశ్వరుడు అను మూడు తత్వములలో న్యూనాధిక భావమునను విశేషముగ సంశయింతురు. ఇట్లుండుటచే ఆ సంశయమును నివర్తించుకొనుటకయి యీ ప్రశ్న చేయబడియె.

## 2. పరమోపేయ ప్రశ్న.

(అవతారిక.) ఫలమును ప్రతిపాదించు శాస్త్రములలో మోక్ష విషయముల ననేక సంశయములు గలుగుచున్నయవి. మోక్షమనునది స్వరూపావిద్యచేగల్గు

మూ॰ కింవాప్యేకం పరాయణమ్ ।
స్తువన్తఃకమ్ కమర్చన్తః ప్రాప్నుయుః మానవాః శుభమ్ ॥ (౨)

అర్థము. ఏకం=సమములేని, పరాయణమ్ = పురుషార్థము, కిమ్=ఎయ్యది ? మానవాః = మనుష్యులు, కమ్ = ఎవనిని, స్తువన్తః = స్తోత్రము చేయుచు, (అనగా గుణములను సంకీర్తనము చేయుచు), కమ్-ఎవనిని, అర్చన్తః=ఉపాసన రూపమైన భక్తిచే పూజించుచు, శుభమ్=శుభంబును, ప్రాప్నుయుః=పొందుదురు ?

---

గుణవిశేషములు నశించుటయేయనియు, పరమాత్మతో సమాన ధర్మమునొందుటయే యనియు, పరమాత్మయొక్క గుణములు వీనిని చేరుటయేయనియు. పరమాత్మ యొక్క ఛాయ జీవునకు గల్గుటయేయనియు, తనయానందాది స్వరూపము ప్రకాశించుటయేయనియు, పరమాత్మ సన్నిధిలో నిత్యకైంకర్యము గావించుట అను తన స్వరూపము నొందుటయేయనియు ఇట్లు పలు తెఱంగుగనుండుటంబట్టి అనేక సందేహములు గలుగును. అవ్విషయమున సందేహములుదీఱ పరమపురుషార్థమెయ్యది ? అని ప్రశ్న చేయుచున్నారు :—

“కింవాప్యేకం పరాయణమ్” సమాధికరహితమై అద్వితీయమై [పరమ్] నిర్దోషము నిరతిశయ మంగళస్వభావము వీనిచే నుత్కృష్టతమమైయుండు [అయనం] పొందదగిన పురుషార్థము ఎయ్యది ? అనగా ఐహికము ఆముష్మికము అనువానిలో మీరుగొప్పగా నిశ్చయించిన పురుషార్థము ఎయ్యది ? అని భావము ఇట్లు ఉపేయము రెండు విధములుగా అడుగబడియె.

---

(అవతారిక.) ఇక ఉపాయ ప్రశ్న. ఆయుపాయము ఆయాశాస్త్రములలో కర్మయోగము జ్ఞానయోగము భక్తియోగము అనిచెప్పబడి, అవి ప్రత్యేకముగా ఉపాయమనియు మొత్తముగాచేరి యుపాయమనియు అంగాంగిభావముచే (ఒకటి అంగి ఇతరములంగములు) నుపాయమనియు వివాదముండుటచే అవ్విషయమై ప్రశ్నచేయవలసివచ్చె. ఆయుపాయము సిద్ధము సాధ్యము సాలంబనము అని ముత్త్రివిధమగును. (ఇది ఆయాప్రశ్నలో వివరింపబడును.) సిద్ధోపాయంబనగా ; ఆరాధనముచే ప్రసన్నమై ఫలము ననుగ్రహించు దేవత, ఆదేవతను లఘువైన (సులభమైన) ఉపాయము చేతను, అలఘువైన (కష్టమైన) ఉపాయముచేతను సాధింపవచ్చునుగాన దానిని రెండు విధములుగా విభజించి ప్రశ్న చేయుచున్నారు.

మూ. కో ధర్మః సర్వధర్మాణాం భవతః పరమో మతః ।
కిం జపన్ ముచ్యతే జన్తుః జన్మసంసారబంధనాత్ ॥ (3)

సర్వధర్మాణామ్=సమస్త ధర్మములలోను, కః=ఏ, ధర్మః=ధర్మము, భవతః=మీకు, పరమః = సమమో అధికమో లేనట్టి గొప్పదిగా, మతః = ఆపద్ధనముగా నిశ్చయించి గ్రైకొనబడినది? జన్తుః = జన్మము నొందినవాడు, కింజపన్ = దేనిని జపించుచు, జన్మ సంసారబంధనాత్ = జన్మము సంసారము అను బంధములనుండి, ముచ్యతే = వీడబడును ?

---

## 3. లఘూపాయసాధ్య 4. అలఘూపాయసాధ్య సిద్ధోపాయ ప్రశ్న.

మనుజులు ఏదేవుని గుణసంకీర్తనమాత్రంబుచే నారాధించియు, ఉపాసన రూపమగు భక్తిచే పూజించియు భోగమోక్షములు అను శుభములను పొందగలరు ?

## 5. సాధ్యోపాయ ప్రశ్న.

(అవతారిక.) సాధ్యధర్మమనగా:—వాక్కు మనసు కాయము అను కరణత్రయముచే సిద్ధింపబడు జపధ్యానార్చనాదిదేవతావశీకరణవ్యాపారము. వీనిలో ఉత్తమమైనది ఏయ్యది అని ప్రశ్న చేయుచున్నారు:—

"కో ధర్మ ఇత్యాది" సమస్తధర్మములలోను శ్రేష్ఠమగు మీరు సమ్మతించిన ధర్మ మెయ్యది?

## 6. సాలంబనోపాయ ప్రశ్న.

(అవతారిక.) సాలంబనోపాయమనగా:—స్తోత్రము మంత్రము శుభాశ్రయము [భగవంతునిదివ్యమంగళవిగ్రహాదులు] గంధము పుష్పము మున్నగు నుపకరణములచే జేయదగినది. వీనిలో వాచికజపమనబడు సాలంబనోపాయంబును ప్రశ్నించుచున్నారు.

"కింజపన్ ఇత్యాది" పరమపదంబు నొందుటకు ప్రతిబంధకము (అడ్డము) కావించు జర (ముసలితనము) మరణము గర్భవాసము నరకవాసము యాతన మున్నగు సంసారముయొక్క కార్యవర్గము, అవిద్య కర్మవాసన రుచి మున్నగు సంసారముయొక్క కారణవర్గము అనునీరెంటిని (చేతనుడు) దేనిని జపించి దాటును? (అనగా మోక్షము నొందును?)

జపమనగా మంత్రాదులను నియమముతో ఆవృత్తిచేయుట. కాయికము (శరీరసంబంధమయినది) వాచికము (వాక్కుసంబంధమయినది) మానసికము (మనస్సంబంధమయినది) అను నీమూటిలోను వాచికమే శ్రేష్ఠమని శాస్త్రములు వక్కాణించుటచే దానిని మాత్రము ప్రశ్న చేసిరి. ఆ శాస్త్రములు:—

జప్యేనైవతు సంసిద్ధ్యేత్ బ్రాహ్మణో నాత్ర సంశయః ।
కుర్యాదన్యన్నవాకుర్యా న్మైత్రో బ్రాహ్మణ ఉచ్యతే ॥

(మ-స్మృ. అ. ౨. శ్లో. ౮౭)

[బ్రాహ్మణుడు ఇతరమును చేసినను చేయకపోయినను జపము మాత్రము చేసి సిద్ధినొందుచున్నాడు అని మైత్రబ్రాహ్మణునివార్త.]

ద్రవ్యయజ్ఞాత్ జపోయజ్ఞో విశిష్టో దశభిర్గుణైః ॥

(మ-స్మృ. అ. ౨. శ్లో. ౮౫)

[ద్రవ్య యజ్ఞముకన్న జపయజ్ఞము పదిరెట్లు విశేషము.]

యజ్ఞానాం జపయజ్ఞోస్మి ॥ (గీ. అ. ౧౦. శ్లో. ౨౫)

[యజ్ఞములలో జపయజ్ఞమగుచున్నాను.]

ఇకమీద జపాదులు సమస్త ఫలములను సాధించునని చెప్పియుండుటచే ఇచట "మోక్షము నొందును" అన్నది సమస్త ఫలములకును ఉపలక్షణము. "శ్రుత్వా ధర్మాన్ అశేషేణ పావనానిచ సర్వశః" అని యారంభించి "లోకే మానవాః శుభమ్" అని చెప్పియుండుటచే కాలము అధికారి అంగము అను వీనిలో ఉత్కృష్ట మెయ్యది అనియు నడిగినట్లు సూచింపబడియె.

శ్రీ భీష్మః ఉవాచ.

మూ. జగత్ప్రభుం దేవదేవమ్ అనన్తం పురుషోత్తమమ్ ।
స్తువన్నామసహస్రేణ పురుషః సతతోత్థితః ॥ (౮)

అర్థము. శ్రీ భీష్మః=శ్రీ భీష్మాచార్యులు, ఉవాచ = చెప్పిరి, జగత్ప్రభుం = లోకస్వామియై, దేవదేవం = దేవతలకును దేవుడై, అనన్తం = అంతములేని వైభవము గలవాడైయుండు, పురుషోత్తమం = పరమోదారుని, సతతోత్థితః = ఎల్లప్పుడు పూనిక గలవాడై, నామసహస్రేణ = సహస్రనామములతో, స్తువన్ = స్తోత్రముచేయు, పురుషః = పురుషుడు, (సర్వదుఃఖాతిగః = సమస్త దుఃఖములను దాటినవాడుగా, భవేత్ = అగును, అను పై శ్లోకములో అన్వయము.)

---

ఈ ప్రశ్నలకు నుత్తరము

(అవతారిక.) ఈ యాఱు ప్రశ్నలకును భీష్ములు బదులు చెప్పుచున్నారు. ఉపాయమూలముగా ఉపేయమును పొందవలయును గాన ఈయాఱు ప్రశ్నలలో ఉపాయ విషయమగు ప్రశ్నకు సమాధానము చెప్పదలంచి ప్రక్కన (దగ్గఱ) నుండుట వలనను, అదియే తనకు ముఖ్యమతిమయినది యగుటవలనను ఆఱవ (జపాలంబన) ప్రశ్నకు మొట్టమొదట సమాధానము చెప్పుచున్నారు:—

జగత్ప్రభు మిత్యాది. చేతనాచేతనములకు ప్రభువై, ఐశ్వర్యము పరిచర్య వీనిచే నెట్లు దేవతలు మనుష్యులకన్న ఉత్కృష్టులో; అటులే యాదేవతలకన్న ఉత్కృష్టుడై, అపరిచ్ఛిన్నమయిన మహిమగలవాడైయుండు పరమోదారుని, వాని నామసహస్రమును సదా జపించుచు స్తోత్రముచేసినచో సకలదుఃఖములును తొలగినవాడగును.

సదా భగవంతుని స్తోత్రముచేసినను ధ్యానించినను అది పరమప్రియముగాను, ఒక నిమిషము నిలిచినను అది మహాదుఃఖకరముగాను ఉండునని శ్రుతిస్మృతి సిద్ధము. చూడుడు:—

యదా హ్యేవైష ఏతస్మిన్ అదృశ్యేఽనాత్మ్యేఽనిరుక్తేఽ
నిలయనే అభయం ప్రతిష్ఠాం విన్దతే। అథసోఽభయఙ్గతో
భవతి। యదా హ్యేవైష ఏతస్మి న్నుదరమంతరం కురుతే।
అథ తస్య భయం భవతి॥ (తై. ఉ. -21.)

మూ. తమేవచార్చయన్నిత్యం భక్త్యా పురుషమవ్యయమ్ ।
ధ్యాయన్ స్తువన్ నమస్యంశ్చ యజమాన స్తమేవచ ॥౫॥

అర్థము. అవ్యయం = నాశములేని, తం పురుషమేవ = ఆ పురుషునే, నిత్యం = ఎల్లప్పుడు, అర్చయన్ = పరిచర్యజేయువాడు, భక్త్యా = భక్తితో, ధ్యాయన్ = ధ్యానించియు, స్తువన్ = స్తోత్రము చేసియు, నమస్యంశ్చ = నమస్కారముచేసియు, యజమానః = పూజించియు, [సర్వదుఃఖాతిగోభవేత్.]

---

[చూడశక్యముకానివాడై ధ్యానింపనలవికానివాడై వచింప సాధ్యము కానివాడై అగోచరుడైయుండు ఈ పరమాత్మయందు ఈపురుషుడు ఎప్పుడు ఎడతెగక నిష్ఠచేయునో ; అప్పుడు వాడు నిర్భయుడగుచున్నాడు. ఎప్పుడు సందు విడుచుచున్నాడో ; అప్పుడే వీనికి భయము వచ్చియున్నది.]

యన్ముహూర్తం క్షణంవాపి వాసుదేవో నచిన్త్యతే ।
సాహాని స్తన్మహచ్ఛిద్రం సాభ్రాన్తిః సాచవిక్రియా ॥

[వాసుదేవుని ఒక ముహూర్తమో లేక ఒక క్షణమో ధ్యానింపకుండినచో ; అదియే వీనికి హాని. ఆపదగల్గు పెద్ద సందు. అదియే భ్రాంతి. అదియే ఆపద్దశ.]

వరం హుతవహజ్వాలా పంజరాన్తర్వ్యవస్థితిః ।
న శౌరిచింతావిముఖజనసంవాసవైశసమ్ ॥

[అగ్నిజ్వాలయొక్క మధ్యలోనుండుగూటిలో వసించుట శ్రేష్ఠము. అయితే విష్ణుధ్యానము కొంచమయినను లేని జనులమధ్య వసించు దుఃఖముమాత్రము వలదు.]

ఏకస్మిన్నప్యతిక్రాన్తే ముహూర్తే ధ్యానవర్జితే ।
దస్యుభి ర్ముషితేనేవ యుక్తమాక్రందితుం భృశమ్ ॥

[విష్ణుధ్యానములేక ఒక ముహూర్తము గడచినను, దొంగలు కొల్లగొట్టుకొని పోయినట్లు ఏడ్వవలసివచ్చును.]

ఇట్లు సాధ్యోపాయములలో జపమును సాలంబనోపాయము చెప్పబడియె.

## మూడవ, నాలుగవ ప్రశ్నల కుత్తరము.

(అవతారిక.) పూజయు స్తోత్రముమాత్రమే పరమధర్మమని వీరి యాశయముగాన ధర్మ విషయమయిన అయిదవ ప్రశ్నను వదలివేసి, ఆయర్చనా విషయముగాను స్తోత్రవిషయముగాను ఉండు మూడవ నాలుగవ ప్రశ్నల కుత్తరము చెప్పదలంచి పూజింపదగినవానిని పూజా ప్రకారముతో జెప్పుచున్నారు :—

తమేవేత్యాది. క్రిందచెప్పబడిన జపమునకు ఎవడు విషయమో; వాడే పూజకును దగినవాడు. ఇటులే యనేకప్రమాణములు కేకలిడుచునున్నయవి, చూడుడు :—

తమిమం సర్వసంపన్నం ఆచార్యం పితరం గురుమ్ ।
అర్చ్య మర్చితు మిచ్ఛామః సర్వే సమ్మన్తుమర్హథ ॥

(భా. స. ప. 38_21.)

[సర్వము నిండియుండు ఆచార్యుడై, తండ్రియై, గురువై పూజింపదగిన వాడైయుండు ఈకృష్ణుని పూజింపగోరుచునున్నవారము. మీరందఱు సమ్మతింప వలయును.]

తస్మాత్ పూజ్యతమం నాన్యం అహంమన్యే జనార్దనాత్ ॥

[ఆ జనార్దనుని దప్ప నితరుడెవ్వడు పూజింపదగినవాడుగాడని నేను తలంచు చున్నాడను.]

బ్రహ్మాణం శితికంఠంచ యాశ్చాన్యాః దేవతాః స్మృతాః ।
ప్రతిబుద్ధాః నసేవన్తే యస్మాత్ పరిమితం ఫలమ్ ॥

(భా. మో. ప. 342_36.)

[బ్రహ్మనో రుద్రనో ఇతర దేవతలనో వివేకులు సేవింపరు. ఏలయనగా ; వారలిచ్చు ఫలము మితమయినది.]

అన్తవత్తు ఫలం తేషామ్ ॥ (గీ. 7_23.)

[వారలిచ్చు ఫలము అంతముగలది.] ఇత్యాదులనేకములు.

కనుక, పుండరీకాక్షుడై ఎంతయనుభవించినను కొంచమయిన తగ్గక అభివృద్ధి నొందు కల్యాణగుణ పరిపూర్ణుడైయుండు పరమపురుషుని, [అర్చయన్] తత్పరిచర్యా రూపమగు భక్తియోగంబును అవలంబించినవాడు [నిత్యం] * మచ్చిత్తాః మద్గత ప్రాణాః * (గీ. 10-9) [నాయందే చిత్తమును నిల్పి నాయధీనమయిన ప్రాణముగల మహనీయులు] అని భగవానుడు నియమించిన రీతిగనే ఆతనిపరిచర్యలేక ఒకక్షణ మయినను నిల్వజాలక [భక్త్యా] (†) భక్తితోగూడి [ధ్యాయన్] ఎడతెగక ప్రవహించు అమృతధారవలె మధురమై తాపత్రయమును నిశ్శేషముగా పోగొట్టగలదైయుండు భగవద్గుణధ్యానము చేయుచు [స్తువన్] ఆ ధ్యానముచే గల్గిన సంతోషాతిశయంబుచే ఒడలు గగుర్పాటునొందినవాడై డగ్గుత్తికనొందిన యెలుంగు (హీనకంఠస్వరము) గలవాడై తదీయగుణంబులనే అనవరతము కీర్తనముచేయుచు [నమస్యన్] భక్తిపారవశ్యముచే మమకారము తొలంగి వంగిన అంతఃకరణము బాహ్యకరణము శరీరము వాక్కు వీనిచే 'నాదియను నభిమానముతోనుండిన సర్వమును నీవే నీదిగాగై కొనవలయను' అని భగవత్పాదారవిందమున అహంకారదూషితమైన తన్ను సమర్పించి, [యజమానః] ఆతండు తన్ను విషయీకరించిన మహోపకారమునకు దగిన ప్రత్యుపకారము లేకుండుటచే నేర్పడిన సంభ్రమముతోను నిజమయిన భక్తితోను సంపాదింపబడిన అర్ఘ్యము పుష్పము మధుపర్కముమున్నగు ఔపచారికము సాంస్పర్శికము ఆభ్యవహారికము అని ప్రసిద్ధములై ఆతని భోగమునకు దగినవియైయుండు భోగోపకరణములచే ఆతని (భగవంతుని) కత్యాదరముతో ఆరాధనము చేయుచు నుండినచో సమస్తదుఃఖములను తొలగినవాడగును.

ఈ భక్తి యోగమే మోక్షమును పొందజేయు రాజమార్గమని వేదాంత ప్రసిద్ధము. చూడుడు. పరంపరగా నుపకరించు వర్ణాశ్రమాచారములచేతను, శమము దమము మున్నగు ఆత్మగుణములచేతను సిద్ధించునదై, వేదనము ధ్యానము ధ్రువానుస్మృతి మున్నగు పర్యాయపదంబులచే చెప్పబడు (నామాంతరములుగల) బుద్ధి విశేషములచేత సదా సర్వకాలము ప్రవాహమువలె ఆవృత్తిచేయబడిన ఆదరముతోగూడిన బుద్ధి విశేషంబుచే గల్గు సంస్కారాతిశయముచే నేర్పడు విలక్షణ ప్రత్యక్షమును అంతముగా

---

(†) భక్తియనగా ; స్వామియందు దాసుడు ఉంచియుండు వినయపూర్వక ప్రీతి విశేషము.

గలదై, సద్విద్య ఆనందవిద్య పురుషవిద్య ఉపకోసలవిద్య మున్నగు పరవిద్యలలో చేర్పడిన గుణోపసంహార న్యాయసిద్ధమయిన బ్రహ్మోపాసనమును, వ్యాసమహర్షి బ్రహ్మసూత్ర న్యాయములతో వేదాంత వాక్యములను తఱచి మోక్షసాధనముగా నిర్ణయించిరి. ఆవేదాన్త వాక్యములు

తమేవం విద్వాన్ ॥ (తై. పు. 20.)

[అతనిని తెలిసినవాడు,]

బ్రహ్మవిదాప్నోతి పరమ్ ॥ (తై. ఆ. 2-1-1.)

[బ్రహ్మ నెఱింగినవాడు పరమపురుషుని పొందును]

యజ్ఞేన దానేన తపసాఽనాశకేన ॥

(బృ. ఉ. 6-4-22.)

[స్వరూప విరుద్ధముగాని యాగము దానము తపము వీనిచే]

శాన్తః దాన్తః ॥ (బృ. ఉ. 6-4-23.)

[అంతఃకరణ బాహ్యకరణ నిగ్రహము గలవాడై] ఇత్యాదులు. బ్రహ్మసూత్ర న్యాయములు :—

శమదమాద్యుపేతఃస్యాత్ ॥ (బ్ర. సూ. 3-4-27.)

[శమదమాదిగుణములతో కూడియుండవలయును.]

ఆవృత్తి రసకృదుపదేశాత్ ॥ (బ్ర. సూ. 4-1-1.)

[శాస్త్రము చెప్పియుండుటచే పలుమారు అనుష్ఠింపవలయును.]

అనునవి. వాక్యకారులుగూడ

వేదన ముపాసనం స్యాత్ తద్విషయే శ్రవణాత్ ॥

[శ్రుతిచెప్పుటచే వేదనమన్నది ఉపాసనను] అని ఆటులే తీర్మానించిరి.

ఈ యుపాసనమే పరిపక్వమయినచో భక్తియనబడునుగాని అది వేఱుగాదు. ఏలయనగా ; ఉపాసనకువలె భక్తికిగూడ మోక్షదాయకత్వముగలదగుటచే భక్తి ఉపాసన అనునీ రెంటికిని ఒకే ఫలముతో సంయోగముగలదనుటవలన సంయోగంబను విధి రెంటికిని సమము. ఇటులే శాస్త్రములుగూడ ఘోషించుచున్నయవి చూడుడు.

నసంద్రుశే తిష్ఠతి రూపమస్య నచక్షుషా పశ్యతి కశ్చనైనమ్ ।
హృదా మనీషా మనసాభిక్లృప్తః య ఏనం విదురమృతాస్తేభవన్తి ॥

(తై. నా. 1-10)

[ఈతని రూపము నేత్రములకు విషయము గాదు. ఈతని నెవడును నేత్రములచే జూడజాలడు. శుద్ధమయిన మనసుచేతనే సమీపింపగలడు. ఈతని నెఱింగినవాడు మరణాదులనుండి వీడబడును.] ఈ శ్రుతివాక్యమున "హృదా" (మనసుచే) అనగా భక్తిచే అని యర్థము. ఇతర వేదవాక్యములందును స్మృతులలోను 'హృత్' (మనసు) అనుపద స్థానమున భక్తి పదమునే ప్రయోగించియున్నారు.

నసంద్రుశే తిష్ఠతీత్యుపక్రమ్య, భక్త్యాచ ధృత్యాచ
సమాహితాత్మా జ్ఞానస్వరూపం పరిపశ్యతీ త్యాహ ॥

(భార. మో. ప.)

['నసంద్రుశేతిష్ఠతి' అని యారంభించి భక్తిచేతను ధారణచేతను పరిపక్వమయిన మనసుతో గూడినవాడు జ్ఞానస్వరూపుండగు భగవంతుని చక్కగ చూచుచున్నాడని తాత్పర్యము.]

పురుష స్సపరః పార్థ! భక్త్యా లభ్యస్త్వనన్యయా ॥

(గీ. 8. 22.)

[అర్జునా! సర్వస్మాత్ పరుడయిన ఆ పురుషుడు అనన్య సాధారణమయిన భక్తిచేతనే పొందదగినవాడు]

భక్త్యా త్వనన్యయా శక్యః (గీ. 11. 54.)

[ఇతర విషయంబున మాఱని స్థిరమయిన భక్తిచేతనే పొందదగినవాడు]

భక్త్యా మా మభిజానాతి ॥ (గీ. 18. 55.)

[భక్తిచేనన్నుచక్కగ నెఱుంగును.]

భక్త్యా అవిచ్ఛిన్నయా ముక్తిః (అంగీరసస్మృతి.)

[భక్తి ఎడతెగకయుండినచో ముక్తి గల్గును]

పరమాత్మని గోవిందే భక్తిరవ్యభిచారిణీ।
ప్రయచ్ఛతి నృణాం ముక్తిం మాతేభూదత్ర సంశయః॥

(వైష్ణవధర్మము.)

[పరమాత్ముఁడయిన గోవిందునిమీఁద స్థిరమయిన భక్తియుండినచో అది మోక్షము నిచ్చును. ఈవిషయమున సందేహము వలదు.]

యే త్వాం దేవం ధ్రువంభక్తాః పురాణం పురుషోత్తమమ్।
ప్రాప్నువన్తి సదా కామా౯ ఇహలోకే పరత్రచ॥
అమోఘాస్తే భవిష్యన్తి భక్తిమన్తశ్చయే నరాః॥

(శ్రీరా. యు, ౧౨౦. ౩౨.)

[పురాణపురుషుఁడయిన నిన్ను ఎవరు భక్తిచే గొలుచుచున్నారో; వారలు ఈ లోకమునను పరలోకమునను సర్వాభీష్టములను పొందుచున్నారు. భక్తిమంతులు అమోఘులై ప్రకాశింతురు.]

యేషాం విష్ణుఃప్రియో నిత్యం యే విష్ణోః సతతం ప్రియాః।
నతే పునః సంభవన్తి తద్భక్తాస్తత్పరాయణాః॥

(శ్రీవామనము.)

[విష్ణువు ఎవరికి ప్రియుఁడో; విష్ణువునకు నెవరు ప్రియులో; వానికి భక్తులై వాఁడేగతిగానుండు వారలు మఱుజన్మము నెత్తరు.]

ఇత్యాదులందు చెప్పఁబడియున్నది. విధిగూడ 'ఉపాస్వ' (ఉపాసనచేయుము) 'భజస్వ' (భక్తిచేయుము) అని గలదు. ఉపాసనయు భజనయు సేవాపర్యాయములే. కనుకనే 'సేవా భక్తిః ఉపాస్తిః' అను నీ మాటిని నిఘంటుకారులు సమానార్థముగా వాడిరి. లైఙ్గ పురాణమునను మార్కండేయ పురాణమునను,

భజ ఇత్యేష ధాతుర్వై సేవాయాం పరికీర్తితః।
తస్మాత్సేవా బుధైః ప్రోక్తా భక్తిశబ్దేనభూయసీ॥

(లైఙ్గము. 2-వ భాగము. అ. 9. శ్లో. 19.)

[భజ అను ధాతువు సేవార్థకముగాన పండితులు సేవను భక్తిశబ్దముచే అనేక స్థలములలో వ్యవహరించిరి.] అని ఉపాస్యుఁడగు ఈ భగవంతుఁడు నిర్దుష్ట మహాగుణ పరిపూర్ణుఁడగుటచే నీయుపాసన మహాప్రీతిరూపముగాను, నిర్వ్యాజముగా

(కారణము లేక) స్వతః సర్వస్వామియగుటచే కైంకర్యమునను రుచిగలదిగాను ఉండునని వివేచించి భక్తిపదముచే వ్యవహరించిరి. ఇట్లు ప్రియుడుగా నుండుట నాశ్ర యించిరేు ఉపాసన విధిలో నీక్రింది వాక్యములు ప్రవర్తించినవి.

ప్రియోహి జ్ఞానినో౽త్యర్థమ్ ॥ (గీ. 7. 17.)

[నేను జ్ఞానికి అత్యంతము ప్రియుడనుగదా!]

భజతాం ప్రీతిపూర్వకమ్ ॥ (గీ. 10. 10.)

[ప్రీతితో భజించువారలకు,]

తుష్యన్తిచ రమన్తి చ ॥ (గీ. 10. 9.)

[సంతసింతురు. రమింతురు.]

నాథ! యోనిసహస్రేషు ॥ (వి. పు. 1. 20. 18.)

[ఓనాథా! సహస్రజన్మము లెత్తినను ఆజన్మములలో నీమీది భక్తియే స్థిరముగా నుండవలయును.]

యా ప్రీతి రవివేకినామ్ ॥ (వి. పు. 1. 20. 19.)

[అవివేకులకు శబ్దాది విషయములలో గలుగు ప్రీతి నీమీద గలుగవలయును.]

తత్సన్మృత్యాహ్లాదసంస్థితః ॥ (శ్రీ విష్ణు తత్వము.)

[భగవద్ధ్యానంబుచే గల్గిన సంతోషము నిండినవారై ప్రహ్లాదులు పాములకాటును గూడ లక్ష్యము చేయలేదు.]

తన్నామ స్మరణోద్భూతపులకో దితిపుంగవః ॥

(శ్రీ విష్ణు తత్వము.)

[రాక్షసరాజు వాని నామస్మరణముచే గగుర్పాటు నొందెను]

సేవా భక్తిస్సమాఖ్యాతా జ్ఞానవాసనయా కృతా ।
ఉత్పన్నాయాం తత స్తస్యామ్ స్నేహభావః స్వయంభవేత్ ॥

(శ్రీ విష్ణు తత్వము.)

[జ్ఞానవాసనతో చేయబడిన సేవ భక్తి యనబడును. అది గల్గినచో స్నేహ భావము స్వయముగా గల్గును.]

పరమాత్మని యోరక్తః విరక్తః అపరమాత్మని।
సర్వేషణావినిర్ముక్తః స భైక్షంభోక్తు మర్హతి॥

(బార్హస్పత్యస్మృతి.)

[పరమాత్మయందు రక్తుడు, తదితరములయందు విరక్తుడై పుత్రేషణము (పుత్రులమీద నిచ్ఛ) దారేషణము (పత్నిమీదనిచ్ఛ) విత్తేషణము (ధనమునందాశ) అను మూడు విధములయిన ఇచ్ఛలును తొలిగినవాడై ఉంఛ (భిక్షము) వృత్తిచే జీవింపగలడు.]

స నో దేవః శుభయా స్మృత్యా సంయునక్తు॥

(తై. నా. 6. 10. 19.)

[ఆదేవుడు మంచి స్మృతితో మనలను దరిచేర్పగలడు.] ఇత్యాది వచనము లనేకములు.

ఈ యుపాసనము కైంకర్యమునే రుచిగలదిగానుండుననియు అనేక వచనములు :

మామను స్మర॥ (గీ. 8. 13.)

[నన్ను చింతించుచు]

పార్థానుచిన్తయన్॥ (గీ. 8. 8.)

[అర్జునా! నన్ను చింతించుచు]

కృష్ణానుస్మరణం పరమ్॥

[శ్రీ కృష్ణుని స్మరించుట ఉత్తమము] ఇత్యాద్యనేక వాక్యములలోని అను స్మరణం అనుచిన్తనం అనుపదములందు 'అను' అనునది నిహీనార్థకము. స్వాభావిక మయిన దాస్యమునే యానిహీనత చెప్పును. అదాస్యమును అనుసంధించుచు ఉపా సించుటయే అనుస్మరణము. భక్తికి నామసంకీర్తనాదులు శరీరస్థానములనియు ప్రమాణములు గలవు.

సతతం కీర్తయన్తః॥ (గీ 9. 14.)

[సదా కీర్తించువారలు.]

మన్మనా భవ ॥ (గీ. 9. 34.)

[నాయందే మనసునుంచియుండు] ఇత్యాదులు.

ఈ భక్తియే సకల శాస్త్ర సారమగుటచే ఇది పరమ రహస్యమని చెప్పబడియె.

ఇదన్తు తే గుహ్యతమమ్ ॥ (గీ 9. 1.)

[పరమ రహస్యమయిన దీనిని]

యత్ జ్ఞాత్వా నేహ భూయోఽన్యత్ ॥ (గీ. 7. 2.)

[దేనినెఱింగినచో ఎఱుగవలసినది మఱొకటిలేదో;]

సర్వ గుహ్యతమం భూయః ॥ (గీ. 18. 64.)

[పరమ రహస్యమగు దీనిని] ఇత్యాదులు.

---

## ఉపాయశూన్యులకు.

### ధ్యానాది లఘూపాయంబులను ప్రకటించుట.

(అవతారిక.)

బహూనాం జన్మనామన్తే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే ।
వాసుదేవ స్సర్వమితి సమహాత్మా సుదుర్లభః ॥ (గీ. 7. 19.)

[అనేకజన్మములనెత్తి పిమ్మట జ్ఞానవంతుడై నన్ను పొందును. నాకు సమస్తము వాసుదేవుడే అనియుండు మహనీయుడు దుర్లభుడు.]

జన్మాన్తర సహస్రేషు...... తపోధ్యాన సమాధిభిః ।
నరాణాంక్షీణపాపానాం కృష్ణే భక్తిః ప్రజాయతే ॥ (వి. ధ.)

[అనేక జన్మములయందు, తపస్సు ధ్యానము మున్నగువానిచే పాపము తొలగిననరులకు కృష్ణునిమీద భక్తిగల్గును.] అన్నట్లు అనేక జన్మములందు సంపాదించిన పుణ్య విశేషముచే పాపము తొలగినవారలకును, భగవంతుని సదా సేవించు వారలకును మాత్రమే ఈ భక్తి దృఢముగానుండును. శాస్త్రమున చెప్పిన ఎట్టి యుపాయమును అనుష్ఠింపకుండు వారలకేమిగతి ? అని భయపడువారలకు

మూ॰ అనాదినిధనం విష్ణుం సర్వలోక మహేశ్వరమ్ ।
లోకాధ్యక్షం స్తువన్ నిత్యం సర్వదుఃఖాతిగో భవేత్ ॥ (౬)
బ్రహ్మణ్యం సర్వధర్మజ్ఞం లోకానాం కీర్తివర్ధనమ్ ।
లోకనాథం మహద్భూతం సర్వభూతభవోద్భవమ్ ॥ (౭)

(అర్థము.) అనాది నిధనమ్=ఆద్యంతశూన్యుడై, విష్ణుమ్=సర్వత్ర వ్యాపించి యుండువాడై, సర్వలోకమహేశ్వరమ్ = సమస్తలోకములకు ఈశుడై, లోకాధ్యక్షమ్ = లోకస్వామియై, బ్రహ్మణ్యమ్=వేదప్రతిపాద్యుడై, సర్వధర్మజ్ఞమ్ = సకల ధర్మముల నెఱింగినవాడై, లోకానామ్ = జనులకందఱకు, కీర్తివర్ధనమ్ = కీర్తిని వృద్ధిచేయువాడై, లోకనాథమ్ = లోకస్వామియై, మహద్భూతమ్ = మహాతత్వమై, సర్వభూత భవోద్భవమ్ = సమస్తప్రాణులసత్తకు కారణమైయుండు, తమ్ ఏవ=అతనినే, నిత్యమ్ = ఎల్లప్పుడు, స్తువన్ = స్తోత్రముచేసినచో, సర్వదుఃఖాతిగః = సకలదుఃఖములనుండి వీడబడినవాడై, భవేత్ = అగును.

---

లఘూపాయమును ప్రదర్శింపదలచి మూడవ ప్రశ్నకు బదులు చెప్పుచున్నారు. "తమేవ" మొదలు "సర్వభూతభవోద్భవమ్" అనువఱకు.

సర్వప్రకారముగను పురుషోత్తముడే స్తోత్రార్హుఁడు అను నభిప్రాయంబుచే దేవతాంతరములకన్న వీనికింగల భేదమును పది విశేషణములచే నిరూపించుచున్నారు.

1. (అనాదినిధనమ్) ఆద్యన్తములేనివాడగుటచే కాలోపాధిరహితుడై, (2. విష్ణుమ్) సర్వత్ర వ్యాపించియుండుటచే దేశోపాధిరహితుండై, (3. సర్వలోక మహేశ్వరమ్) సమస్తలోకములకును మహేశ్వరుడగుటచే స్తోత్రము చేయువానిమనోరథంబును పూర్తిగావించు మహైశ్వర్యముగలవాడై, (4 లోకాధ్యక్షమ్) లోకంబును ప్రత్యక్షముగా చూచువాడగుటచే స్తోతకు (స్తోత్రముచేయువానికి) ఉచితమియ్యాది యనుటను తానుగా చింతించువాడై, (5. బ్రహ్మణ్యమ్) ఆయాశాఖలతోగూడిన వేదంబులచే ప్రతిపాదింపబడువాడగుటచే స్తోత్రమునకు గావలసిన విషయములనుగలవాడై, (6. సర్వధర్మజ్ఞమ్) సమస్త ధర్మముల నెఱింగిన వాడగుటచే తన్ను స్తుతించుట పరమ ధర్మమని యెఱింగినవాడై, (7. లోకానాం కీర్తివర్ధనమ్ * యంస్తువన్ స్తవ్యతామేతి * (వి. ధ. 75) [ఎవనిని మతించినచో నుతించు వాడుగూడ స్తోత్రమునకు దగినవాడగునో] అన్నట్లు ఏప్రాణియయినను తన్ను స్తోత్రముచేసినచో ఆ ప్రాణిని తనవలె వేదములలోను

మూ. ఏష మే సర్వధర్మాణాం ధర్మోఽధికతమో మతః ।
యద్భక్త్యా పుండరీకాక్షం స్తవైరర్చే న్నరస్సదా ॥ (౮)

అర్థము. ఏషః-ఇది, మే-నాకు, సర్వధర్మాణామ్-సమస్తధర్మములలోను, అధికతమః-అత్యుత్కృష్టమైన, ధర్మః-ధర్మముగా, మతః-తలంపబడినది. యత్-ఏల ననగా, భక్త్యా-భక్తితో, పుణ్డరీకాక్షమ్-పుణ్డరీకాక్షుని, నరః-మనుష్యుడు, స్తవైః-స్తోత్రములచే, సదా-ఎల్లప్పుడు, అర్చేత్-పూజింపగలడు.

---

లోకములలోను పొగడదగినట్లు ఆ్రపాణికి కీర్తిని గల్గించువాడై, (8. లోకనాథమ్) సర్వ లోకనాథుడగుటచే స్తోత్రము మున్నగు పరిచరణకుదగినవాడై, (9. మహద్భూతమ్).

అన్యత్పూర్ణాదపాంకుమ్భాత్ అన్యత్పాదావనేజనాత్ ।
అన్యత్కుశలసంప్రశ్నాత్ నచేచ్ఛతి జనార్దనః ॥

(భా. ఉ. ప. 89.)

[ఒక పూర్ణకుంభము, ఒక పాద్యము, ఒక కుశలప్రశ్నము అనగా మంచిమాట ‡ పేనినిదప్ప ఇతరములను జనార్దనుడపేక్షింపడు.] అన్నట్లు సాటిలేని మహత్త్వముగల మహనీయుడగుటచే నెట్టి కష్టమును లేకయే కేవలము స్తోత్రమాత్రము చేతనే సంతసించువానిని, (10. సర్వభూత భవోద్భవమ్) అచేతనమువలె నుండక తమకేర్పడిన జ్ఞానమునకు ప్రయోజనముగా తన్ను (భగవంతుని) చింతించు సమస్తచేతనులకును సత్తను గల్గించువాడగుటచే అట్టివారిని అవశ్యము అనుగ్రహించువాడై యుండు పరమపురుషుని (స్తువన్) పరిపూర్ణభక్తి లేనివాడయ్యు ఏరీతిగానయ్యు గుణకీర్తనము గావించువాడు. తాపత్రయమను దవాగ్నిని (అడవి చిచ్చును) దాటి నిరతిశయానందశీతలమగు ప్రహ్రదమువలెనుండు భగవంతుని పొందగలడు.

ఇచట "స్తువన్" అను పదమునకు 'ఏరీతిగానయినను గుణకీర్తనము కావించువాడు' అని వ్యాఖ్యానము చేయుటయే యుక్తము. పూర్వమే "ధ్యాయన్ స్తువన్ నమస్యంశ్చ" అని ధ్యానాదులతో సహపఠితమైయున్నది గాన దానిని పెద్దస్తోత్రముగాను దీనిని చిన్నస్తోత్రముగాను చెప్పవలయును. లేనిచో పునరుక్తదోష మేర్పడును. అదిగాక "స్తువన్తః కమ్" అని ప్రత్యేక ప్రశ్నయుండుట వలనను శాస్త్రాన్తరము ననుసరించియు ఇట్లు అర్థముచేయుటయే న్యాయము.

---

‡ కుశల సంప్రశ్నమనగా "పల్లాణ్డు పల్లాణ్డు" అని మంగళాశాసనము చేయుట అని సంప్రదాయార్థము.

## అయిదవప్రశ్నకు

## సమాధానము.

ఏషమే సర్వధర్మాణాం ఇత్యాది. దీనినే అన్నిధర్మములలోను ముఖ్యముగా నేను నిశ్చయించుకొని యున్నాడను. ధర్మములు నాలుగు విధములు (1) ఐహికములగు (ఈ లోకసంబంధములగు) పశుపుత్రాదులను సాధించునవి. (2) ఆముష్మికములగు స్వర్గాదులను సాధించునవి. (3) ఎట్టి ఫలమునుగోరక భగవదారాధనరూపమను తలంపుతో ననుష్ఠింపబడు ఇష్టాపూర్తాదికర్మములచే పరిష్కరింపబడిన తత్వజ్ఞాన సమాధిరూపమై మోక్షమును సాధించునవి. (4) భక్తితో భగవంతుని ధ్యానించుట వాని గుణములను కీర్తించుట ప్రణామముచేయుట మున్నగువానిచే అసాధారణమయిన పూజనుచేయుట అని. వీనిలో నాలుగవదాని కుత్కర్షము "అధికతమః" అను పదమునగల తమప్ప్రత్యయముచే చెప్పబడిరెు.

దానినే వివరించుచున్నారు:—నరుడు భక్తితో పుండరీకాక్షుని ఎల్లప్పుడు పూజింపగలడు. భక్త్యాదిగుణములు గలవగుటచే నియ్యదియే సర్వధర్మశ్రేష్ఠము. భక్తి అనుష్ఠానకాలమున ప్రీతిని గర్భమున (లోపల) గలదగుటచే, * సుసుఖం కర్తుమ్ * (గీ. ౯-౨.) [చేయుటకు మిక్కిలి సులభమయినది] అన్నట్లు సుఖమయినది. లోకమున గూడ తనకు ప్రియుడగు నాయకుని స్మరించుట నాయకికి ప్రియముగానుండును గదా? దీనిచే, తనకు స్వామిగాలేని దేవతాంతరములను సేవించుట, కషాయపానము వలె విరసమయ్యు హితబుద్ధితో ననుష్ఠింపవలయునను కష్ట మినుమంతయు దీనికి లేదని తేలినది.

"పుణ్డరీకాక్షమ్":— కెందామరలవంటి సుందరములయిన నేత్రములుగలవాడగుటచే ఈతనిని సేవించుట భయంకరనేత్రములుగల దేవతాంతర సేవవలె నుండునది గాదు అని దానికన్న వైలక్షణ్యము తెలుపబడిరెు.

"స్తవైః" (స్తోత్రములచే):— విశ్వజిత్ (ఒకానొక యాగము) చాంద్రాయణము (ఒకానొక వ్రతము) మున్నగువానివలె అధిక కష్టమును ద్రవ్యవ్యయమును లేకుండ కేవల వాక్కుమాత్రముచేతనే ఈతనిని పూజింపవచ్చునుగాన మిక్కిలి సులభము. వ్యాసాదులుగూడ నిటులే వక్కాణించియున్నారు చూడుడు:—

ఆర్తాః విషణ్ణాః శిథిలాశ్చ భీతాః ఘోరేషు చ వ్యాధిషు వర్తమానాః। సంకీర్త్య నారాయణశబ్దమాత్రమ్ విముక్త దుఃఖాః సుఖినో భవన్తి ॥

[ఆర్తులును మనోవ్యాధినొందినవారును దుఃఖమునొందినవారును భయపడిన వారును ఘోరమైనవ్యాధిచే పీడింపబడినవారును భక్తితో 'నారాయణ' అను నామమును కీర్తించినంతనే సమస్త దుఃఖములును వీడి సుఖింతురు.]

అవశేనాపి యన్నామ్ని ॥ (వి. పు.)

[అవశముగా నాతని పేరును చెప్పినను పాపములు తొలంగును.]

అజ్ఞానతో జ్ఞానతోవా వాసుదేవస్య కీర్తనాత్ ।
తత్సర్వం విలయం యాతి తోయస్థం లవణం యథా ॥
(వి. ధ.)

[ఎఱింగియో ఎఱుంగకయో, వాసుదేవుని కీర్తించినచో వాని పాపమంతయు ఏటిలోపడిన ఉప్పువలె నశించును.]

శమాయాలం జలం వహ్నేః తమసో భాస్కరోదయః ।
శాంతిః కలేరఘౌఘస్య నామసంకీర్తనం హరేః ॥
(వి. ధ. 66_70.)

[నిప్పునార్ప నీరును, చీకటిని తొలగింప సూర్యోదయమును జాలును. అట్టులే కలిదోషముచే నేర్పడిన పాపములను తొలగింప హరినామస్మరణమే చాలును.]

యన్నామ సంకీర్తనతో విముచ్యతే ॥ (వి. ధ. 43)
యన్నామ సంకీర్తనతో మహాభయాత్ విమోక్షమాప్నోతి ॥
(వి. ధ. 43_25.)

[ఎవని నామస్మరణముచేసినంతమాత్రాన మహాభయమునుండి వీడబడునో;]

సకృదుచ్చారితం యేన హరిరిత్యక్షరద్వయమ్ ।
బద్ధః పరికరస్తేన మోక్షాయ గమనంప్రతి ॥ (వి. ధ. 70.)

[హరియను రెండక్షరముల నెవ్వడు ఒకమారు తలంచునో; వాడు మోక్షమున కేగదగినవాడగును.]

యస్య నామ్ని స్మృతే మర్త్యః సముత్క్రాంతేరనంతరమ్ ।
ప్రాప్నోతి వైష్ణవంస్థానం పునరావృత్తి వర్జితమ్ ॥ (వి. ధ.)

[ఎవ్వని నామమును స్మరించినంతనే మనుష్యుడు ప్రాణోత్క్రమణానంతరము పునరావృత్తి లేని వైష్ణవస్థానమునొందునో ;]

అచ్యుతానంత గోవింద నామోచ్చారణ భేషజాత్ ।
నశ్యంతి సకలా రోగాః సత్యంసత్యం వదామ్యహమ్ ॥

(వి. ధ. 29)

[అచ్యుత అనంత గోవింద అను నామంబుల నుచ్చరించుటయను మహౌషధంబుచే సమస్త రోగములును నశించును. ఇది సత్యము. సత్యము. నేనే చెప్పెదను.]

సంకీర్తయేజ్జగన్నాథం వేదంవాపి సమీరయేత్ ॥

[జగన్నాథునయినను కీర్తింపవలయును. వేదమునయినను చెప్పవలయును.]

ఆస్యజానన్తో నామచిద్వివక్తన ।
ధ్రువాసో అస్య కీరయోజనాసః ॥ (వైష్ణవ సూక్తము.)

[ఈతని నామములలో నేదయిన నొకటిని ఎఱింగినంతనే పునరావృత్తి లేని మోక్షము నొందుదురు.] ఇత్యాదులు అనేకములు గలవు.

"అర్చేత్" (అర్చింపవలయును) అనుటచే ఈధర్మము ప్రత్యక్షమున నొక పురుష విశేషమును ఆరాధించుభావనగానుండుటచే తపస్సు మున్నగువానివలె కేవలపరోక్షమై శ్రమసాధ్యమై యుండునదిగాదని తేటపడినది. దీనినే గీతలో * ప్రత్యక్షావగమమ్ * (గీ. 9-2.) [ప్రత్యక్షముగా చూడదగినది] అని యనిరి.

---

## అర్చనాదులు

## సర్వవర్ణాధికారములు.

'నరః' (మనుష్యుడు) అని సామాన్యముగా చెప్పియుండుటచే సకల చేతనులకును వారివారియోగ్యతకుదగినట్లు అర్చనయందు అధికారముగలదు అని యేర్పడినది.

'నరః' అని యేకవచనముగా చెప్పియుండుటచే యాగాదులువలె పలువురుగూడి చేయవలసినదిగాదు. ఒకడే ఇతరుల సహాయము నపేక్షింపక చేయవచ్చును.

జన్మము వృత్తి గుణము ఇవి లేనివానికిగూడ భక్తియను అభిరుచి మాత్రముండి నచో భగవంతుని నిర్భయముగా సేవింపవచ్చును. అట్లు సేవించుటచే వెంటనే గంగా ప్రవాహముచే సమస్త దోషములును తొలగునట్లు విషయప్రావణ్యముపోయి పరమ ధార్మికుడగునని గీతలో చెప్పిరి. చూడుడు :—

గుణ విషయమున :—

సమోఽహం సర్వభూతేషు ॥ (గీ. 9-29.)

[నేను సర్వభూతములందును సముడను.]

వృత్తి విషయమున (జరిగిన నడవడిని గురించి) :—

అపిచేత్సుదురాచారః ॥ (గీ. 9-30.)

[ఎంత చెడునడవడిక గలవాడయ్యు నన్ను పొందినంతనే పరగతి నొందును.]

జన్మవిషయమున :—

మాంహి పార్థ! వ్యపాశ్రిత్య యేపి స్యుః పాపయోనయః ॥

(గీ. 9-32.)

[అర్జునా! (నన్ను పొంది) ఎట్టి పాపజన్మము గలవారయ్యు నన్నాశ్రయించుటచే పరగతి నొందుదురు.] అని ఇత్యాదులచే నుడువఁబడినది.

ఇట్లనుటచే దురాచారములుగూడ ధర్మములగునని తలంపగూడదు. అవి భగవంతునకనిష్టంబులగుటచే నధర్మములని శాస్త్రములు చెప్పుచున్నవి గాన అవి అధర్మములే.

నావిరతో దుశ్చరితాత్ నాశాంతో నాసమాహితః ॥

(క. ఉ. 2-24.)

[చెడునడతనుండి విరమింపనివాడును ఇంద్రియజయములేనివాడును స్థిరమయిన సమాధి లేనివాడును ఈతని పొందజాలడు.]

అప్రాప్యః కేశవో రాజన్! ఇంద్రియై రజితైః నృణామ్ ॥

[ఇంద్రియ జయము లేనివాడు భగవంతుని పొందజాలడు.] ఇత్యాదులు.

అవి యధర్మములు గనుకనే గీతలో నీ విషయము చెప్పినంతనే

క్షిప్రం భవతి ధర్మాత్మా ॥ (గీ. 9-31)

[తనమీద భక్తి నొందియున్నవాడు ఎంత దురాచారపరుడయ్యు శీఘ్రముననే ధార్మికుడగును] అని చెప్పె.

శమదమాద్యుపేతః స్యాత్ ॥　　　　(బ్ర. సూ. 3-4-27.)

[శమదమాదులతో గూడియుండవలయును.]

అన్తరాచాపితు తద్దృష్టేః ॥　　　　(బ్ర. సూ. 3-4-36.)

ఇత్యాదులచే భక్తి కధికారులు ఇట్టివారని నిర్ణయించిరి. మనుష్యదేహములోనుండి ననుసరే; పరమవత్సలుడై సమస్తవిధమయిన బంధువై పరమమిత్రుడై యుండు ఆ భగవంతుని తల్లినివలె పేరుచెప్పి పిలుచుట యుక్తముగదా ?

ఈ విషయమును గజేంద్రులు జటాయువు కాకాసురుడు విభీషణులు కోసల దేశపు ప్రజలు గోపికలు మాలాకారులు మున్నగువారియందు ప్రత్యక్షముగా కనుగొనియున్నవారము.

అట్లయిన ఉత్తరమీమాంసలో అపశూద్రాధికరణంబున బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులు అను త్రైవర్ణికులకు తప్ప ¶ నితరుల కధికారము లేదని నిషేధించియుండ, ఇచట సర్వ వర్ణములకు నధికారమనుట బ్రహ్మసూత్రవిరుద్ధమగునే యని శంకింపవలదు. ఉపనిషదుక్తమయిన బ్రహ్మవిద్యలోనే వారల కధికారము లేదని సిద్ధాంతము చేయబడినదిగాని భగవత్సమాశ్రయణంబును నిషేధించలేదు. ఇంక ఈ విషయంబును వివరింతను.

త్రైవర్ణికేతరులకు ఉపనిషదుక్త సంస్కారములందధికారములేమిచే వేదాంతంబులచే నెఱుంగదగిన పరవిద్యను సంపాదించియు కార్యకరముగాదుగాన బ్రహ్మవిద్యలో వారల కధికారము లేదని సిద్ధాంతము చేయబడియె. భగవత్సమాశ్రయణంబును నిషేధింపలేదు. అంతేకాక చండాళాదులకుగూడ భగవద్భజనంబునందు అధికారము ఇతిహాస పురాణాదులలో చెప్పబడియున్నది.

నమ ఇత్యేవ యో బ్రూయాత్ మద్భక్తః శ్రద్ధయాన్వితః ।
తస్యాక్షయో భవేల్లోకః శ్వపాకస్యాపి నారద ॥　(వి. ధ. అ. 70.)

[నారదా ! నాయందు భక్తిగలవాడై 'నమః' అని యెవ్వడు చెప్పునో; వాడు చండాలుడేయయినను అక్షయమైన లోకమునొందును.] ఇత్యాదులు అనేకములుగలవు. అట్టివానిని గౌరవింపవలయుననియు, వారికిని మోక్షము గలదనియు శాస్త్రములు. ఇట్లు విషయవ్యవస్థ చేసియుండుటచే శాస్త్రవిరోధము కొంచెమయినను లేదు.

---

¶ త్రైవర్ణికులు :— బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులు.
త్రైవర్ణికేతరులు :— ఈ మూడుజాతులు తప్ప తక్కిన జాతివారు.

## ధ్యానార్చనాదులకు

## దేశకాలాధికారి నియమము లేదు.

[సదా] అనగా ఎల్లప్పుడు అని యర్థము. (ఎల్లప్పుడు పూజింపగలడు). ఇట్లనుటచే ఈ కాలమున సేవింపవలయును, ఈదేశమున సేవింపవలయునని నిర్బంధము లేదు అనబడియె. దీనిచే అయనము ఋతువు మాసము పక్షము నక్షత్రము ముహూర్తము అను కాలవిశేషమును, ఈ స్థలము ఆ స్థలము అను దేశవిశేషంబును అపేక్షించు ఇతర ధర్మములకన్న దీనికి మహత్త్వము చెప్పబడియె. ఈవిషయమున ప్రమాణము లనేకములు గలవు:—

చక్రాయుధస్య నామాని సదాసర్వత్ర కీర్తయేత్ ।
నాశౌచంకీర్తనేతస్య పవిత్రంభగవాన్ హరిః ॥ (వి. ధ.)

[విష్ణునామములను ఎల్లప్పుడును ఎచటనయినను చెప్పవచ్చును. వానిని ఉచ్చరించు విషయమున అపరిశుద్ధి లేదు. ఏలయనగా ఆతడు స్వతశ్శుద్ధుడు గదా?]

ప్రాతర్దేవేతి కృష్ణేతి గోవిన్దేతిచ జల్పతామ్ ।
మధ్యాహ్నేచాపరాహ్ణేచ యోవసాదస్సఉచ్యతామ్ ॥

(వి. ధ. 89. శ్లో. 77.)

[ప్రాతఃకాలమున దేవా! అనియు కృష్ణా! అనియు గోవిందా! అనియు చెప్పువారలకు మధ్యాహ్నమునను అపరాహ్ణమునను గల్గు కష్టమెదియో చెప్పుము] ఇత్యాదులు.

ఆచారహీనుడై భజించుటచే వీనిసంపర్కంబుచే భగవంతునకు ఎట్టిలోపముగాని, వీనికి శుద్ధి మున్నగు సహాయములు తగ్గియుండుటచే భగవంతున కనుగ్రహించుటయందు అసామర్థ్యముగాని కలుగనేరదు. ఇంకయు, తన సంబంధమున కయోగ్యుడుగా నుండు వానింగూడ పరిశుద్ధునిగావించి తనకుదగిన వానింజేసి స్వీకరించువాడాభగవంతుడు. కనుకనే * నాశౌచం కీర్తనే తస్య * (వి. ధ.) [వానిని కీర్తించు విషయంబున అశుద్ధిలేదు.] అని చెప్పబడియె.

అట్లయినచో. శాస్త్రములలో సత్తు (సత్పురుషుడు) అసత్తు అని యధికారి విషయంబున తారతమ్య మేర్పడియుండుటకుం గారణంబేమనగా; ఉచ్చ నీచాధికారులకు పరస్పరసాంకర్య మేర్పడి అందుచే ధర్మనాశము గల్గునుగాన దానిని గాపాడుటకే అట్లు వక్కాణింపబడియె.

ఈ సంకీర్తనాదులు అతిస్వల్పములయినను అధికఫలముల నిచ్చునవని

స్వల్పమప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్ ॥

(గీ. 2-40.)

[ఈధర్మము అతిస్వల్పమయ్యు మహాభయంబునుండి కాపాడునది] అని వచింపబడిెను.

ఇతరధర్మములవలె దీనినారంభించి మధ్యలో విడిచినను దోష మిసుమంతయు లేదని వచనములు గలవు.

నేహాభిక్రమనాశోఽస్తి ॥ (గీ. 2-40.)

[ఈ ధర్మమును ఆరంభించి మానుటవలన దోషములేదు.]

కౌన్తేయ ప్రతిజానీహి నమే భక్తః ప్రణశ్యతి ॥ (గీ. 9-31.)

[అర్జునా! నా భక్తున కెన్నడు నాశంబుగలుగ నేరదని ప్రతినగా దలంచుము.]

యం ప్రణమ్య న సీదతి ॥ (వి. ధ. 97.)

[ఎవని మొక్కి దుఃఖము నొందడో;]

న వాసుదేవం ప్రణిపత్య సీదతి ॥ (వి. ధ. 70.)

[వాసుదేవుని సేవించి దుఃఖమునొందడు]

జనార్దనం ప్రణిపతితో న సీదతి ॥

[జనార్దనుని సేవించినవాడు దుఃఖము నొందజాలడు.]

క్రమముగా ననుష్ఠించునపుడు ఏదయిన తప్పుగల్గినను, ప్రబల విరోధము గల్గినను ఏప్రత్యవాయమును (పాపమును) లేదు అని * ప్రత్యవాయో నవిద్యతే * (గీ. 2-40.) [ప్రత్యవాయ మిసుమంతయు లేదు] తెలుపంబడిెను.

అతివాదము గావు గాన, ఇవియన్నియు § నర్థవాదము గా నుండునను శంకకు ప్రసక్తియే లేదు.

---

§ అర్థవాదమనగా: లేనివిషయములను అతిగా పొగడి చెప్పుట. అతివాదము కూడ నిదియే.

యస్మిన్ న్యస్తమతిర్న యాతి నరకం, స్వర్గోపి యచ్చింతనే విఘ్నః, యత్ర నివేశితాత్మమనసో బ్రాహ్మోపి లోకోల్పకః। ముక్తిం చేతసి యః స్థితోమలధియాం పుంసాం దదాత్యవ్యయః, కించిత్రం యదఘం ప్రయాతి విలయం తత్రాచ్యుతేకీర్తితే ॥

[ఎవనియందు బుద్ధిని నిల్పినవాడు నరకంబును పొందడో; ఎవని ధ్యానంబునకు స్వర్గలోకముగూడ విరోధముగా నుండునో; ఎవనిమీద మనసును నిల్పినవానికి బ్రహ్మలోకము అత్యల్పముగా తోచునో; ఎవని ధ్యానించి మనసు పరిశుద్ధమయినవానికి మోక్షము గల్గునో; అట్టి యా విష్ణువును కీర్తించినయెడల పాపములు తొలగుననుచో నేమి యబ్బురము ?] ఇత్యాదు లనేకములు గలవు.

మఱియు అర్థవాదపదములకుంగూడ ప్రబలప్రమాణంబులతో విరోధము లేనప్పుడు స్వతఃప్రమాణములయిన ఆ వాక్యములకు అర్థములేదనుట అతి సాహసము అన్యాయము.

---

## తపసు మున్నగువానిచే సాధింపదగిన తత్త్వజ్ఞానమును వాఙ్మాత్రంబుచే సులభముగ సాధింపదగు ననుట.

అట్లయినచో అతి కష్టసాధ్యమయిన తపసు సమాధి మున్నగువానిచే సాధింపదగిన తత్త్వజ్ఞానంబును కేవల వాఙ్మాత్రంబుచే సులభముగా సాధింపవచ్చుననుట అతివాదముగను, అందుచే గొప్పసాధనంబుల నుపదేశించు శాస్త్రములు నిష్ప్రయోజనములుగను అగునుగాన ప్రమాణాంతర విరుద్ధంబగునే అను సంశయము గలుగవచ్చును. ఇయ్యది భగవత్ప్రభావంబు నెఱుంగని ఛాందసుల పిచ్చిమాటలయగును. అత్యల్పమేయయ్యు భగవత్సంకీర్తనము మహాభారంబులనుగూడ మోయగలదు. అట్లయినచో శాస్త్రవిరోధముగలుగదా ? అని శంకింపపలదు. లోకంబున అధికారులు అనేకవిధంబుగా నుందురు. కొందఱు శక్తులు, మఱికొందఱు అశక్తులు ఆ శాస్త్రములు శక్తాదికారులకే యేర్పడినవిగాన విరోధంబులేదు. ఇదిగాక శక్తియుండినను లేకపోయినను భగవంతునిమీద అసాధారణ ప్రేమగల్గిన భాగ్యవంతులు అనుష్ఠించునది వేఱ్వేఱు !

గురుతరోపాయంబులకుగూడ భగవదనుగ్రహమే ఫలంబు నిచ్చునదిగానుండ లఘూపాయంబునకది తగదని ఆజ్ఞాపించుచున్నారా యేమి? గురూపాయంబులయందు ప్రయోగములు (క్రియాసమూహములు) అధికముగా నుండునని భగవంతుడు ప్రేమించునన్నచో; ఇచ్చటగూడ హృదయశుద్ధి గలదని ప్రేమించును. దీనినే భగవద్వాక్యాదులు స్థాపించుచున్నవి చూడుడు.

యే భజన్తితు మాంభక్త్యా...సాధురేవ సమన్తవ్యః
సమ్యగ్వ్యవసితోహి సః ॥ (గీ. 9. 24_30)

[నన్ను భక్తితో భజించువాఁడు దృఢాధ్యవసాయము గలవాఁడు గాన సాధువుగానే యగును.]

పత్రం పుష్పం ఫలం తోయం యోమే భక్త్యా ప్రయచ్ఛతి।
తదహం భక్త్యుపహృతం అశ్నామి ప్రయతాత్మనః ॥

(గీ. 9_26.)

[పత్రమో పుష్పమో ఫలమో తీర్థమో ఏదయిననుసరే భక్తితో నిచ్చినచో ఆ భక్తుని యుపహారమును నేను ప్రీతితో భుజింతును.]

యో న విత్తైః న విభవైః నవాసోభిః న భూషణైః।
తోష్యతే హృదయేనైవ కస్తమీశం న పూజయేత్ ॥

(వి. ధ. 89. 70.)

[ఎవడు ధనముచేతనో విభవంబుచేతనో వస్త్ర భూషణంబులచేతనో సంతసింపక కేవల హృదయంబు (భక్తి) చేతనే సంతసించునో; అట్టి భగవంతుని ఎవడు పూజింపకుండును.]

దద్యాత్పురుషసూక్తేన యః పుష్పాణ్యపఏవవా।
అర్చితంస్యాజ్జగదిదం తేన సర్వం చరాచరమ్॥ (వ్యాస స్మృతి.)

[ఎవఁడు పురుషసూక్తంబుచే పుష్పములనో; తీర్థమునో సమర్పించునో; వానిచే చరాచరాత్మకంబగు నీ ప్రపంచమంతయు పూజింపబడినదగును.

పృథివీం రత్నసంపూర్ణాం యః కృష్ణాయ ప్రయచ్ఛతి।
తస్యాప్యన్యమనస్కస్య సులభో న జనార్దనః॥ (వి. ధ. 74.)

[రత్నములునిండిన యీ భూమండలంబునంతయు భక్తిలేక కృష్ణునకు సమర్పించినను, భక్తిలేదుగాన జనార్ధనుడు వానికి సులభుడు కాజాలడు.] ఇత్యాదులు చూడనగును.

ధర్మాధర్మములకు అభిప్రాయభేదమే కారణమగునుగాని క్రియావిశేషములు కారణములుకాజాలవు. చూడుడు.

భావశుద్ధిః మనుష్యాణాం ప్రమాణం సర్వవస్తుషు।
అన్యథాలింగ్యతేకాంతా స్నేహేన దుహితాన్యథా॥ (వి. త.)

[మనుష్యులకు సమస్తవిషయంబునను భావశుద్ధియే ప్రమాణముగాని క్రియలు గావు. ఏలయనగా లోకమున ప్రియనాయికను ఒకవిధమగు స్నేహముతోను పుత్రికను మఱొకవిధమగు స్నేహముతోను కౌగలించుచున్నాము గదా?]

తపోనకల్కోఽధ్యయనం నకల్కః
సాభావికో వేదవిధిర్న కల్కః।
ప్రసహ్య చిత్తాహరణం నకల్కః
తాన్యేవ భావోపహతాని కల్కః॥ (భా. ఆ. 1-279.)

[తపోదోషము దోషముకాదు. అధ్యయనదోషము దోషముగాదు. స్వాభావికమయిన వేదవిధి దోషముగాదు. బలాత్కారముగా మనసు నీడ్చుటయు దోషము గాదు. అభిప్రాయంబుచే నేర్పడిన దోషమే దోసమగును.]

గఙ్గాదితీర్థేషు వసన్తి మత్స్యాః
దేవాలయే పక్షిసంఘాశ్చ నిత్యమ్।
భావోజ్ఝితా స్తేన ఫలం లభన్తే
తీర్థాని పుణ్యాయతనాశ్చ ముఖ్యాః॥

[గంగాది పుణ్యతీర్థంబులందు మత్స్యములు వసించుచున్నవి. దేవాలయంబులందు పక్షులు వసించుచున్నవి. అయినను వానికి మోక్షము గలుగనేరదు. కారణమేమనగా వాని కాతీర్థాదులందు అభిసంధిలేదు. కనుక తీర్థములును క్షేత్రములును ముఖ్యములు గావు.

సర్వజ్ఞుడై అవాప్తసమస్తకాముడై ఇతరానపేక్షుడైయుండు ఆ భగవంతుడు హృదయశుద్ధి మాత్రముచే తృప్తుండగుచున్నాడుగాని ధనరాసులనర్పించుటవలనగాదు అనుట న్యాయమేగదా? దేశకాలాది సహకారములు తక్కువగా నుండినను భగవంతుడు స్వల్పమనుగూడ విశేషముగా గ్రహించియనుగ్రహించును. చూడుడు:—

ధ్యాయన్ కృతే, యజన్ యజ్ఞైః త్రేతాయాం, ద్వాపరేర్చయన్।
యదాప్నోతి తదాప్నోతి కలౌ సంకీర్త్య కేశవమ్॥ (వి. పు. 6-2-17.)

[కృతయుగంబున ధ్యానించియు త్రేతాయుగంబున యాగంబుచేసియు ద్వాపరయుగంబున పూజించియు లభించువానిని, ఈ కలియుగంబున కేవల నామ సంకీర్తనమాత్రంబుచేతనే పొందుచున్నాడు.] మఱియు, సుస్వభావుండగునొక రాజు అత్యాపత్కాలంబునగూడ న్యాయముగానడచు నొకనినిచూచినచో వానిని అనుగ్రహించుచున్నాడను విషయంబును ప్రత్యక్షముగా గ్రహించియున్నాముగదా?

## ఇంతవరకు చెప్పిన విషయసారము.

అతిప్రియమయిన విషయమగుటచే సుఖముగా ననుష్ఠింపదగినదిగాను, ధనవ్యయమును ఆయాసంబును లేకుండుటచే సుఖముగా చేయదగినదిగాను, తన స్వామిని ప్రత్యక్షముగా చూచి ఆతనికి ప్రీతినొనరించు భావనలో నుండుటచే ఆకర్షకముగాను, అత్యంతము లఘువుగా నుండునదయ్యు మహాసంసారభయంబును పోగొట్టుటయను మహాఫలంబు నిచ్చునదియు, ప్రత్యవాయలేశములేనిదై అందఱు నధికారులుగాన సకలలోకహితమై, దేశము కాలము దశ మున్నగువానినపేక్షింతకుండుటచే కారణంబు నపేక్షింపకుండునదిగాను, విషయ ప్రభావంబుచే నిర్విఘ్నముగానుండుననునీకారణంబులచేతనే భీష్మలు దీనిని శ్రేష్ఠమయిన ధర్మముగా సమ్మతించిరి. ఇయ్యదియే ఇతర మహర్షులకును సమ్మతము.

సర్వేషామపిధర్మాణా ముత్తమో వైష్ణవో విధిః॥
[సమస్త ధర్మములలోను వైష్ణవ విధి యుత్తమము.]

రక్షతే భగవాన్ విష్ణుః భక్తానాత్మశరీరవత్॥
[శ్రీ విష్ణువు భక్తులను తన శరీరమువలె కాపాడును.]

సూ. పరమం యో మహత్తేజః, పరమం యో మహత్తపః ।
పరమం యో మహద్బ్రహ్మ, పరమంయః పరాయణమ్॥ (౯)
పవిత్రాణాం పవిత్రం యః, మంగళానాంచ మంగళమ్ ।

అర్థము. యః = ఎవడు, పరమం = సమాధికరహితమైన, మహత్ = గొప్ప, తేజః = తేజమో; యః = ఎవడు, పరమం, మహత్, తపః = ఈశుడో; యః, పరమమ్, మహత్, బ్రహ్మ = మహనీయుడో; యః, పరమం, పరాయణమ్ = ప్రాప్యమో (పురుషార్థమో); యః, పవిత్రాణామ్ = పరిశుద్ధికరములకును, పవిత్రమ్ = పరిశుద్ధికరమో; మంగళానాఞ్చ = మంగళములకును, మంగళమ్ = మంగళమో;

---

గోవింద భక్త్యభ్యధికం శ్రేయశ్చాన్యన్న విద్యతే॥ (వి. ధ.)
[గోవింద భక్తికన్న నుత్తమమయిన వేఱు శ్రేయస్సులేదు.] ఇత్యాది ఋషి వాక్యములు చూడనగును.

---

(అవతారిక.) ఇక నాలుగు శ్లోకంబులచే ఉపేయవిషయకప్రశ్నకు బదులు చెప్పుచు, శ్రీమన్నారాయణనామసహస్రంబును వినుటకై ధర్మరాజు నాజ్ఞాపించుచున్నారు. మొదటి యొకటిన్నర శ్లోకముచే రెండవ ప్రశ్నకుత్తరము చెప్పుచున్నారు.

భగవంతుడు సూర్యాది
తేజోరూపముగలవాడు.

"పరమం యో మహత్తేజః" ఇచట చెప్పబడు "పరమం యోమహత్తేజః" మున్నగు విశేషణములాఱును, భగవత్స్వరూపము కోరదగినది గాన అదియే పరమపురుషార్థంబగునని తెలుపును. * పరంజ్యోతిరుపసంపద్య * (ఛా. ఉ. 8-12.) [పరంజ్యోతిని బొంది] * తస్యాదిత్యో భాముపయుజ్య భాతి * [సూర్యుడు వాని కాంతిని బొంది ప్రకాశించుచున్నాడు] అను శ్రుత్యుక్తరీత్యా స్వతః ప్రకాశముగా నుండగనే సూర్యాది తేజస్సులకును తేజంబు నిచ్చునదై, "పరమం యో మహత్తపః" [మహత్] అపరిచ్ఛిన్నమై, [పరమం] సమము అధికము లేనిదై, [తపః] * యోదేవేభ్యః ఆతపతి * (అర. 3-12.) [ఎవడు

దేవతలను నలుప్రక్కలందును తపించునో;] * తమీశ్వరాణాం పరమం మహేశ్వరమ్ * (శ్వే. ఉ. 6) [ఈశ్వరులకందఱకును పరమమహేశ్వరుడయినవానిని.] * ఏష సర్వేశ్వరః * (బృ. ఉ. 6. 4_22.) [ఈతడు సర్వేశ్వరుడు.] ఇత్యాది ప్రమాణోక్తరీత్యా తపోరూపమై ప్రకాశించువాడెవ్వడో; (అనగా సకలంబును పాలించువాడెవ్వడో) [బ్రహ్మ] అనన్తకల్యాణగుణగణాత్మకుండగుటచే స్వయము వర్ధిల్లి. అనన్త శక్తిమంతుడగుటచే సకలంబును వర్ధిల్లజేయువాడెవ్వడో; [పవిత్రాణాం పవిత్రం యః] రజస్తమోగుణాత్మకమై వికారమునొందు అచేతనముయొక్క దోషములు, ఆయాయచేతనసంబంధంబుచేగల్గు అజ్ఞానము భగవదపరాధను రాగద్వేషములు మున్నగు చేతనదోషములు అను వీనిని ప్రుత్యుక్తరీత్యా సమూలముగ తొలగించు పరమపావనుండెవ్వడో; ఆ ప్రుత్యాదులంజూడుడు.

ఏతం హ వా నతపతి ॥ (తై. న. 9.)

[ఈతని నొకండును తపింపజేయుటలేదు.]

తద్యథా పుష్కరపలాశే ఆపః నశిష్యన్తే ॥ (ఛా. ఉ. 4. 14_3)

[అది యెట్లనగా; తామరాకులో నీరు అంటకుండునట్లు...]

తద్యథా, ఇషీకతూలమగ్నౌ ప్రోతం ప్రదూయేత

(ఛా. ఉ. 5. 24_3.)

తత్సుకృత దుష్కృతే ధూనుతే ॥ కాషీ. 1_4.)

[అది యెట్లనగా; నిప్పులో వేసిన దూదివగిది పుణ్యపాపములు మాడును.]

తదా విద్వాన్ పుణ్యపాపే విధూయ నిరంజనః పరమం సామ్యముపైతి ॥ (ము. ఉ. 3. 1_3)

[విద్వాంసుడప్పుడు పుణ్యపాపములను రెంటిని తొలగించుకొని నిర్దోషియై పరమసామ్యంబు నొందును.]

క్షేత్రజ్ఞస్యేశ్వరజ్ఞానాత్ విశుద్ధిః పరమా మతా ॥

(యా. స్మృ. ప్రా. కాండ శ్లో. 34)

[క్షేత్రజ్ఞుండగు జీవునకు ఈశ్వరజ్ఞానంబుచే పరమశుద్ధి గల్గునట్లు చెప్పబడు చున్నది.]

ధ్యాయేన్నారాయణం దేవం స్నానాదిషుచకర్మసు ।
ప్రాయశ్చిత్తిర్హి సర్వస్య దుష్కృతస్యేతివై శ్రుతిః ॥

[స్నానాదిసమస్తకర్మములయందును దేవుడయిన శ్రీమన్నారాయణుని ధ్యానింపవలయును. సమస్తపాపంబులకును అదియే ప్రాయశ్చిత్తమగునని శ్రుతి.]

యోమామజం అనాదించ వేత్తి...సర్వపాపైః ప్రముచ్యతే ॥

(గీ. 10-3)

[ఎవ్వడు అనాదియగు నన్నెఱుంగునో; వాఁడు సమస్త పాపంబులనుండి వీడబడును.]

పావనః సర్వలోకానాం త్వమేవ రఘునందన ॥

(శ్రీరా. ఉ. 82.)

[ఓ రాఘవా! సమస్తలోకంబులకును మీరే పరిశుద్ధులు.]

ప్రాయశ్చిత్తాన్యశేషాణి తపః కర్మాత్మకానివై ।
యానితేషా మశేషాణాం కృష్ణానుస్మరణం పరమ్ ॥

(వి. పు. 2-6-39.)

[ప్రాయశ్చిత్తాది సమస్తకర్మంబునకన్న శ్రీకృష్ణనామస్మరణము శ్రేష్ఠము.]

యథాగ్నిరుద్ధతశిఖః కక్షం దహతి సానిలః ।
తథా చిత్తస్థితోవిష్ణుః యోగినాం సర్వకిల్బిషమ్ ॥

(వి. పు. 6-7-74)

[జ్వాలతోఁగూడిన అగ్ని, గాలితోఁ గూడి గడ్డివామిని దహించునట్లు యోగుల హృదయంబుననుండు విష్ణువు సమస్త పాపంబును తొలగించును.] ఇత్యాదులు చూడనగును.

## భగవత్సంబంధముచేతనే తీర్థాదులకును శుద్ధి.

మూలమున "పరమం మహత్ పవిత్రం" అని చెప్పియుండుటచే తీర్థాది పరిశుద్ధవస్తువులకును ఆతనిసంబంధముచేతనే పరిశుద్ధి గల్గునట్లు ఏర్పడుచున్నది. ఈతండు దప్ప ఇతర చేతనములును, వాయ్వాది అచేతనములును ఇతర పదార్థములను పరిశుద్ధి చేయుచున్నవనుట యుక్తియుక్తము కాజాలదు. కనుకనే పరాశర శౌనకాదులు శుభాశ్రయమును విచారించు ఘట్టమున

> అశుద్ధాస్తే సమస్తాస్తు దేవాద్యాః కర్మయోనయః ॥
>
> (వి. పు. 6-7-77.)

[కర్మాధీనముగ జనించు దేవాదులు అశుద్ధులు.]

> ఆబ్రహ్మ స్తంబ పర్యన్తాః జగదన్తర్వ్యవస్థితాః ।
> ప్రాణినః కర్మజనిత సంసారవశవర్తినః ॥ (వి. ధ. 75)

[ప్రపంచంబునగల బ్రహ్మదేవుడు మొదలు తృణమువఱకునుండు సమస్తవస్తువులును కర్మముచేత నేర్పడు సంసారమునకు వశ్యములై యుండును.]

అని యితర చేతనములను ఎత్తి త్రోసివేసిరి.

అట్లయిన, శాస్త్రములు దేవతలను కొందఱను శుద్ధికరులుగ చెప్పియున్నవే యన్న; అదికూడ పరమపురుషుని ఉపాసించియు, ఆతని శ్రీపాదతీర్థంబును శిరంబున ధరించియు నిట్లు అనేకవిధములుగా ఆతని సేవించి లభించిన మాహాత్మ్యమే యని పురాణ ప్రసిద్ధము.

> విష్ణువామ పదాంగుష్ఠ వినిస్సృతస్య జలస్యైత న్మాహాత్మ్యమ్॥
>
> (వి. పు. 4-4-30.)

[విష్ణువుయొక్క ఎడమకాలినుండి ప్రవహించిన ఆజలమునకు (గంగకు) ఇంతటి మాహాత్మ్యము.]

విష్ణోరాయతనం హ్యాపః సహ్యాపాం పతిరుచ్యతే ॥

[జలము విష్ణువుయొక్క స్థానము. కనుకనే అతనిని అపాంపతి (జలమునకుపతి) యందురు.

అట్లు గంగాదులకును సాధారణజలంబునకును పుణ్యక్షేత్రములకును విష్ణుధర్మోక్తరీత్యా తదీయసంబంధంబుచేగల్గిన మహిమదప్ప ఇతరము లేదు.

ఇటులే కాలముగూడ, శ్రవణము ద్వాదశి శ్రీజయంతి మున్నగు దినములలో నవతరించెననియు, శయనించె శయనంబునుండి లేచెననియు, ఆతడభిమానించిన తిథి నక్షత్రమనియు నిట్లు ఆతని సంబంధముచేతనే పరిశుద్ధికరముగా చెప్పబడియె.

యజ్ఞము దానము తపస్సు మున్నగుక్రియలు ఆతనియారాధనరూపమగుటచే పరిశుద్ధికరములగును. బ్రాహ్మణాది జాతులు ఆతనిని ప్రతిపాదించు వేదాధ్యయనాదులకు ప్రధానాధికారులుగానుండుటచే పరిశుద్ధికరములగును.

విష్ణుం క్రాన్తం వాసుదేవం విజానన్ విప్రో విప్రత్వమాప్నుయాత్ తత్త్వదర్శీ ॥

[సర్వత్ర వ్యాపించిన వాసుదేవుని యథార్థంబుగా నెఱింగిన విప్రుడే తత్త్వము నెఱింగినవాడు. వాడే విప్రత్వమునొందినవాడగును] అను శ్రుతివాక్యముచే స్థిరమగుచున్నది. శ్రుతిస్మృత్యాదులుకూడ

నారాయణపరాః వేదాః ॥ (భాగ. 2-5-15.)

[వేదములు నారాయణపరములు.]

శ్రుతిస్మృతీ మమైవాజ్ఞా ॥ (వి. ధ.)

[శ్రుతి స్మృతులు నా యాజ్ఞారూపములు.] అను ప్రమాణరీత్యా ఆతని విషయమై యాతనియాజ్ఞారూపము గానుండుటచే పరిశుద్ధికరములు. మహాభారతంబున ఆరణ్యపర్వంబున తీర్థయాత్రా ప్రకరణమున :—

పుణ్యాద్ద్వారవతీ (అని యారంభించి)

సూ. దైవతం దేవతానాంచ భూతానాం యోఽవ్యయః పితా॥ (౧౦)
యతః సర్వాణి భూతాని భవన్త్యాదియుగాగమే।

(అర్థము.) యః = ఎవడు, దేవతానాంచ = దేవతల కండఱకును, దైవతమ్ = దైవమో; యః = ఎవడు, భూతానాం = ప్రాణులకు, అవ్యయః = నాశములేని, పితా = తండ్రియో, యతః = ఎవని (వలన) నుండి, సర్వాణి భూతాని = సమస్తభూతములు (ప్రాణులు), ఆదియుగాగమే = ప్రథమసృష్టికాలమున, భవన్తి = కలుగుచున్నవో;

---

ఆస్తే హరిరచిన్త్యాత్మా తత్రైవ మధుసూదనః।
తత్పుణ్యం తత్పరం బ్రహ్మ తత్తీర్థం తత్తపోవనమ్॥

(భా. అర. 88-24.)

[ద్వారక పుణ్యమయినదియని యారంభించి అవాఙ్మనసగోచరుడగు విష్ణువు అచటనే యున్నాడు. కనుక అదియే పుణ్యము, అదియే పరమప్రాప్యము, అదియే తీర్థము, అదియె తపోవనము.] అని వానిసంబంధముచేతనే దేశము పరమపావనముగా చెప్పబడియె.

పవిత్రాణాంహి గోవిందః పవిత్రం పరముచ్యతే।
పుణ్యానామపి పుణ్యోఽసౌ॥ (భా. అర. 88-26.)

[పరిశుద్ధవస్తువులన్నిటిలోను శ్రీగోవిందుడే పరమ పవిత్రముగా చెప్పబడుచున్నాడు. పుణ్యములన్నిటిలోను ఇతండే పుణ్యము.] అని ఆతనినే పరమ పుణ్యముగా జెప్పి ముగించె.]

## ఆతడే పరమ మంగళము.

[మంగళానాంచ మంగళమ్] మంచివాసనగల పుష్పము చందనము దేవతాస్త్రీ అమృతధార సంసార సంబంధము తొలంగి అతినిర్మలుడై అపరిమితానంద రూపుడైయుండు జీవాత్మ అను వీనికన్న పరమాత్మయే కోరదగినవాడుగాన ఆతడే మంగళములన్నిటికంటె పరమ మంగళమగును.



(అవతారిక.) "కిమేకం దైవతంలోకే" అను మొదటి ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నారు.

## బ్రహ్మాదులకు నిమిత్తకారణము ఆతడే.

[దేవతానామ్] బ్రహ్మరుద్రఇంద్రాదిదేవతలందఱకు నాతడే మహాదేవత. ఏలయనగా; సమస్తప్రాణులకును ఆతడేగదా పిత! అంమను

యస్మింశ్చ ప్రళయం యాన్తి పునరేవ యుగక్షయే ॥ (౧౧)

పునరేవ = మరలయు, యుగక్షయే = ప్రళయకాలమున, యస్మిన్ = ఎవని యందు, ప్రళయం యాన్తి = లయమునొందుచునున్నవో

---

ఆపత్కాలమున తిరస్కరించు ఔపాధిక పితవలెగాక సదా రక్షించుచు నాశము లేక ప్రకాశించు తండ్రి యాతడు. ఆ పితృత్వమును ఉపపాదించుచున్నారు:— [యతః ఇత్యాది] బ్రహ్మదేవుడు మొదలు స్తంబము (తృణము) వఱకుగల సమస్త భూతములును ఎవనినుండి ఆదిసృష్టిలో గలుగుచున్నవో; [ఆదియుగాగమే] ఆదిసృష్టిలో; అనగా బ్రహ్మదేవుని సృష్టించినమీద వానిమూలముగా ప్రపంచమును సృష్టించుటచే సకల స్రష్టయగు బ్రహ్మదేవునిగూడ తానే సృజించుచున్నాడని తెలుపుటకై ఆదిసృష్టిలో అనిరి. దీనిచే ప్రపంచంబునకు భగవంతుడు నిమిత్త కారణమని తేలినది.

## ఉపాదానకారణముకూడ ఆతడే.

[యస్మింశ్చ ఇత్యాది] మరల యుగాంతమున ఎవనియందు సమస్త భూతములును లయించుచున్నవో; ఉపాదానకారణమునందే కార్యములన్నియు లయించును. అందుచే (అనగా ఈతనియందే లయించుటచే) ఈతడే యుపాదాన కారణమగును.

[చ.] మూలమందలిచకారము సహకారికారణముకూడ ఆతడేయని తెలుపుచున్నది. ఇట్టి లక్షణములుగలదానినే పరతత్త్వముగా శ్రుత్యాదులు చెప్పి యున్నవి.

యతో వా ఇమాని భూతాని జాయన్తే। యేన జాతాని
జీవన్తి। యత్ప్రయన్తి అభిసంవిశన్తి। తద్విజిజ్ఞాసస్వ॥
తద్బ్రహ్మేతి॥ (తై. ఆ. భృ. ౧)

[దేనినుండి యీ సమస్తప్రాణులును గల్గుచున్నవో, పుట్టినవి ఎవనివలన జీవించుచున్నవో, ఎవనియందు లయము నొందుచున్నవో; ఆతడే పరబ్రహ్మమని యెఱుంగుము.]

జన్మాద్యస్య యతః (బ్ర. సూ. ౧-౧-౨)

[దీనికి జన్మాదులు ఎవనివలన గల్గుచున్నవో ఆతడే బ్రహ్మము.]

బ్రహ్మమే § ఉపాదాన నిమిత్త సహకారి కారణములుగా నుండునట్లు సూత్రములలో విచారించి నిష్కర్షించిరి.

బ్రహ్మవనం బ్రహ్మ సవృక్ష ఆసీత్ (అష్ట. ౨. ప్ర. 8. అను. 7.)

[బ్రహ్మమే వనము. బ్రహ్మమే వృక్షముగా నగుచు.]

ప్రకృతిశ్చ ప్రతిజ్ఞాదృష్టాన్తానురోధాత్ (బ్ర. సూ. 1-4-23.)

[ప్రతిజ్ఞాదృష్టాంతములకు పొసగునట్లు ఆతడే యుపాదానము.] అను నధికరణమున నీ విషయమును విమర్శించి నిర్ణయించియుండుటను జూడుడు.

దీనిచే, * ఉపాదానస్తు భగవాన్ నిమిత్తంతు మహేశ్వరః * అని భగవంతుడు ఉపాదానకారణంబనియు, శివుడు నిమిత్తకారణంబనియు చెప్పు మతము అవైదికముగాన అనాదరణీయంబని తేలినది.

భగవంతుని ఉపాదానకారణముగా చెప్పినచో వానికి వికారాదిదోషములు గలుగ నేరవా యన్న ; ఆతనికి శరీరముగా నుండు ప్రకృత్యాదులకు గల్గు వికారము ననుసరించి ఆతనిని ఉపాదానముగా చెప్పి యుండుటచే ఆదోషమునకు ప్రసక్తియే లేదు. ఈ విషయమును * యథోర్ణనాభిః * అని యారంభించి శ్రుతియే పరిహరించె.

సకలశాస్త్రములలోను ఆతడే పరుడని ప్రసిద్ధముగా నుండుటచే "సః దైవతమ్" అనక "యః దైవతమ్" అని చెప్పబడియె. ఇక దీనిని వివరింతము. పరతత్త్వముయొక్క లక్షణంబును తత్త్వస్థితిని ఉపాసనమును తత్ప్రాప్తిని ప్రతిపాదింప నేర్పడిన ఉపనిషత్తులలోను ఇతరశాస్త్రములలోను సత్ అసత్ అక్షరము మున్నగు పదములను ప్రత్యేకముగాను పరము మున్నగు పదములతో చేర్చియు సామాన్యముగా పరతత్త్వమును చెప్పి, అట్టి పరతత్త్వము బ్రహ్మదేవుడా? విష్ణువా? మహేశ్వరుడా? ఇతర దేవతలా? అని ప్రశ్నచేసి నిర్ధారణచేయు ఘట్టమున :—

నారాయణ పరం బ్రహ్మ తత్త్వం నారాయణః పరః (తై. నా. 11.)

[నారాయణుడే పరబ్రహ్మము, నారాయణుడే పరతత్త్వము.]

ఇత్యాదివాక్యములచే వీనినే పరదేవతగా కంఠతః చెప్పియుండుట, పరదేవతను యథార్థంబుగా నెఱింగిన పరాశరులు వ్యాసులు వాల్మీకి మున్నగు పరమమహర్షులును దీనినే వేదసిద్ధాంతముగా వీనినే పరతత్త్వముగా నిశ్చయించియుండుట

---

§ కారణమనగా కార్యమునకు ముందు నిశ్చయముగా నుండునది. అది మువ్విధము. (1) నిమిత్తకారణము. (2) ఉపాదానకారణము (3) సహకారి కారణము అని. ఘటముచేయుటకు కుమ్మరి మన్ను దండచక్రాదులు ఇవి కావలయును. మన్ను ఉపాదానకారణముగాను, దండచక్రాదులు సహకారి కారణములుగాను, కుమ్మరి నిమిత్తకారణముగాను అగునని శాస్త్రకారులు.

మున్నగు కారణంబులచే నారాయణునినిరంకుశైశ్వర్యమును ఇతరులయపకర్షమును బుద్ధిమంతులు స్పష్టముగా తెలుసుకొనగలరు. ఇవ్విషయంబును ఉత్తరమీమాంసలో దహరాధికరణము వైశ్వానరాధికరణము మున్నగువానిలోను, సమన్వయాధికరణమున మనయాచార్యులును స్పష్టముగానుపపాదించిరిగాన ఆ విషయమును మనము అధికముగా వివరించుట యనవసరము. దీనినే ఆళవందారులును కూరత్తాళ్వానులును సంగ్రహముగా వ్రాయుచియున్నారు.

త్వాం శీలరూపచరితైః పరమప్రకృష్టసత్త్వేన సాత్త్వికతయా ప్రబలైశ్చ శాస్త్రైః। ప్రఖ్యాతదైవపరమార్థవిదాం మతైశ్చ నైవాసురప్రకృతయః ప్రభవన్తి బోద్ధుమ్॥ (స్తో. ర. 15.)

[శీలము రూపము చరితము అప్రాకృతశుద్ధసత్త్వము సాత్త్వికపురాణములు వ్యాసపరాశరాదులవచనంబులు అనుమీనిచే నిన్ను పరమపురుషునిగాగొని అనుభవింప వలసియుండుటను ఆ యసురప్రకృతులు ఎఱుగకున్నారు.]

తత్త్వార్థతత్పరపరశ్శతవేదవాక్యైః సామర్థ్యతః స్మృతిభిర ప్యథ తాదృశీభిః। త్వామేవ తత్త్వపరసాత్త్వికసత్పురాణైః దైవజ్ఞధీభిరపి నిశ్చినుమః పరేశమ్॥ (వై. స్త. 15.)

[తత్త్వార్థంబును ప్రతిపాదించు అనేకవేదవాక్యములచేతను అట్టి స్మృతులచేతను తత్త్వపరమైన సాత్త్విక పురాణములచేతను పూర్వులసిద్ధాంతాభిప్రాయములచేతను నిన్నే పరమేశ్వరునిగా నిశ్చయింతిము]

రూపశ్రియా పరమయా పరమేణ ధామ్నా చిత్రైశ్చ కైశ్చిదుచితైః భవతశ్చరిత్రైః। చిహ్నైరనిహ్నవపదైః అపరైశ్చ కైశ్చిత్ నిశ్చిన్వతే త్వయి విపశ్చిత ఈశితృత్వమ్॥ (వై. స్త. 26.)

[శ్రేష్ఠమైన దివ్యమంగళవిగ్రహశోభచేతను, పరమపదము గలిగియుండుట చేతను, విచిత్రమైన కొన్ని దివ్యచరిత్రములచేతను, దాచిపెట్టజాలని కొన్ని చిహ్నములచేతను, ఇతరము లగు మఱికొన్ని కారణములచేతను మహనీయులు నీయందే ఈశ్వరత్వమును నిర్ణయించుచున్నారు.]

(అవతారిక.) ఇట్లు సమస్తచేతనులకును తత్త్వము ఇయ్యది హితమియ్యది అని నిర్ణయించి, ఇక అందఱికిని హితమైన మఱొక హితవిశేషమును నిర్ణయించి చెప్ప దలంచి భీష్ములు యుధిష్ఠిరుని విన నియమించుచున్నారు:—

తస్యలోక ప్రధానస్యేత్యాది. క్రిందజెప్పిన రీతిగా మహామహిమ శాలియై, సమస్తలోకప్రధానుఁడగుటచే సర్వశేషియై, జగన్నాథుఁడగుటచే సర్వనియంతయైయుండు విష్ణువుయొక్క నామధేయములు సకలవిధపాపములను

తస్య లోకప్రధానస్య జగన్నాథస్య భూపతే।
విష్ణోర్నామసహస్రం మే శ్రుణు పాపభయాపహమ్॥ (౧౨)
యాని నామాని గౌణాని విఖ్యాతాని మహాత్మనః।
ఋషిభిః పరిగీతాని తాని వక్ష్యామి భూతయే॥ (౧౩)

భూపతే! ఓ రేడా! తస్య = అట్టి వైభవయుక్తుడై, లోకప్రధానస్య = లోకములకన్నిటికిని ప్రధానుడై, జగన్నాథస్య=లోకనాథుడైయుండు, విష్ణోః=విష్ణువు యొక్క, పాపభయాపహమ్ = పాపమును భయమును పోగొట్టు, నామసహస్రమ్ = సహస్రనామములను, మే=నాసమీపమునుండి, శ్రుణు=వినుము.

మహాత్మనః=మహామహిమశాలియైయుండు భగవంతునియొక్క, యానినామాని= ఏనామధేయములు, గౌణాని = గుణనిమిత్తముగా ఏర్పడినదో; విఖ్యాతాని = ప్రసిద్ధములుగా నుండునవో; ఋషిభిః=మహర్షులచే, పరిగీతాని=అంతట అనుసంధింప బడునవో; తాని=వానిని, భూతయే=సత్తగల్గుటకొఱకు, వక్ష్యామి=చెప్పెదను.

---

వానిచే గల్గు భయమును తొలగించునవి గాన వానినామసహస్రమును చెప్పెద వినుము.

వినఁనభినివేశముతో తానుగావచ్చి ప్రశ్న చేసిన ధర్మపుత్రునిజూచి భీష్ములు "భూపతే శృణు" అని పిలిచి వినుమని నియమించుటచే, భగవద్విషయమును వినువారును చెప్పువారును దుర్లభులని తేలినది.

ఇక చెప్పనారంభించుచున్నారు. "యానినామాని" ఇత్యాది భగవంతునియొక్క కల్యాణగుణములమూలముగాను దివ్యచేష్టితములమూలముగాను ఏర్పడినవియై [విఖ్యాతాని] లోకమునను వేదమునను అధికముగా ప్రయోగింపబడి ప్రసిద్ధములై [ఋషిభిః] వేదార్థంబును యథార్థముగా గనుంగొనిన సనకసనత్కుమార నారదాదులచే [పరిగీతాని] ఈనామము ఈకారణముచే ఏర్పడినది. ఈయర్థమును చెప్పునది అని అత్యాదరముతో అంతట సంకీర్తనముగావింప, తుమ్మెదలు ఒక్కొక్క పుష్పమునుండి తేనెను సేకరించి ఒకచోట మొత్తముగా పెట్టునట్లు వేదవ్యాసులచే వానినుండి యొక్కొక్కనామముగా నేకరించి స్తోత్రరూపముగా చేర్చబడి, అనన్తరము సత్సంప్రదాయపరంపరగా మనవఱకు వచ్చిన యాభగవన్నామ ములను [భూతయే] అనాదికాలముగా సంసారంబునబడి రూపుసెడియుండు జీవరాసులు సత్తనొందియుజ్జీవించుటకై మీకు చెప్పెద. ఇట్టిపరమపురుషుని ఎఱుగుటచే సద్భావమును, ఎఱుగకుండుటచే అసద్భావమును ఆత్మకు గల్గుట్లు శ్రుతిప్రసిద్ధము.

భగవన్నామములు అనన్తములుగాన వాని నన్నిటిని జెప్పుట కష్టము. కనుక చెప్పినంతవఱకు విన్నవారికి ఆత్మలాభము గల్గునని [మహాత్మనః] అను పదముచే తెలియుచున్నది.

## సగుణ నిర్గుణ వాక్య విచారము.

“సగుణబ్రహ్మవిద్య నిర్గుణబ్రహ్మవిద్య అని రెండు విద్యలుగలవు. గుణవిశిష్టమైన బ్రహ్మమును సేవించునట్లు చెప్పబడువిద్య సగుణబ్రహ్మవిద్య. గుణములేని బ్రహ్మమును సేవించునట్లు చెప్పబడువిద్య నిర్గుణబ్రహ్మవిద్య. వీనిలో మోక్షమును సాధించునది నిర్గుణబ్రహ్మవిద్య. ఇతరఫలములను సాధించునది సగుణబ్రహ్మవిద్య” అని కొందఱందురు. వారు ఈసహస్రనామోపోద్ఘాత ప్రకరణమునగల * ముచ్యతే జన్తుః జన్మసంసారబన్ధనాత్, యాతి బ్రహ్మ సనాతనమ్ * అను వాక్యములచే మోక్షోపాయత్వము స్పష్టముగా చెప్పబడియుండియు అద్దానిని వినకయుండు చెవిటివారే యగుదురు. అంతియే కాక, సగుణబ్రహ్మము నిర్గుణబ్రహ్మము అని రెండుబ్రహ్మము లేర్పడి నీయద్వైతమతంబునకే హానిగల్గించును. “పరమోమతః, అధికతమోమతః” అని దీనియందు చెప్పబడి యుండుటచే సకలశాస్త్రములలోను అత్యధికసారతమమైన యర్థంబును ప్రతిపాదింప నేర్పడినయిద్దానిని సామాన్యఫలవిషయకమన్నచో; ఇక సగుణబ్రహ్మవిద్యకును నిర్గుణబ్రహ్మవిద్యకును ఏర్పడిన దీనికన్న గొప్పదియగు ఫల మెచ్చటగలదో తెల్పుము. సగుణము నిర్గుణము అనునీరెండును పరస్పరము విరుద్ధముగా నుండుటచే ఒకటి ఉపాయముగాను, మఱొకటి ఫలముగాను కాజాలదుగాన సగుణబ్రహ్మవిద్య నిర్గుణబ్రహ్మము పొందుటకై యేర్పడినది అని చెప్పుటయు తగదు

బ్రహ్మమునకు గుణములుగనబడుచుండ, గుణములు లేవనుటకు నేమి కారణము? అది యవిద్యయన్నచో; జననమరణమోహాది సంసారదోషములచే మూర్ఛిల్లి మరణింపబోవువానికి పరమౌషధమైన బ్రహ్మమే, అవిద్య భ్రమము మున్నగు సమస్త దోషములకును ఉనికిపట్టుగా నుండుననియు గుణలేశముకూడ లేదనియు చెప్పుట అత్యాశ్చర్యమైన వేదరహస్యముగా నున్నది. అదిగాదు. ఆబ్రహ్మకేర్పడిన దోషముమిథ్య (అసత్యము) అన్నచో; అట్లయినచో నీమతరీత్యా ఆబ్రహ్మమునకు గుణము లేదనుటకూడ మిథ్యయేయగును గదా? అప్పుడు దోషము మిథ్యగాన దోషము లేదనియు, గుణములేదనుట మిథ్యగాన గుణములు గలవనియు ఒప్పుకొన్నట్లు తేలినదే. దీనికొప్పలేదే. ఇంకొకవేడుక చూడుడు. బ్రహ్మమున కేర్పడిన యీయవిద్యను పోగొట్టువారెవరు? అద్వైతవిద్యానిష్ఠుడన్నచో; ఇది పూర్వోక్తమునకన్న నత్యాశ్చర్యమైనది. పరబ్రహ్మము సంసారమున పడియుండును. దాసుని సంసారియు తరింపజేయును. ఆహా! అత్యాశ్చర్యము. సగుణవేదవాక్యము నిరర్థకమగుటకు నేమికారణము? నిర్గుణవాక్యము బాధించుచున్నదే యన్న; అట్లయినచో, సగుణవాక్యము నిర్గుణవాక్యము నేల బాధింపగూడదు? ప్రామాణ్యంబును పరస్పరవిరోధంబును రెంటికిని సమమేగదా? ఇంకవారు, సగుణశ్రుతులు మిథ్యావిషయప్రతిపాదకములనియు, నిర్గుణశ్రుతులు సత్యవిషయప్రతిపాదకములనియు నొకవ్యవస్థనేర్పఱచి వేదవాక్యములను రక్షించునట్లు అభినయించుటయంతయు కల్ల. ఏల అనగా; ప్రమాణ విషయంబునుచూచి ఇది మిథ్యావిషయమన్నచో దానికి భంగమేర్పడునుగదా? కనుక వేదవచనములను రక్షించు నెపముతో విచ్చలవిడిగ జెప్పినచో దానిని పాడు

చేసినట్లే యగుసు. మఱియు, గుణములు నిషేధించుననిన ఆనిషేధమును మిథ్యా విషయకమే గదా? అప్పుడా నిషేధము కార్యకరమగునో; ఇట్లు వారల పక్షమున ననేకదోషము లగుపడుచుండుటచే నావిచారము నిక చాలింతము.

## స్వమతము.

ఈవిషయమున తత్త్వదర్శులు చేసియుండు వ్యవస్థనిక వివరింతము. జ్ఞానశక్త్యాదులనుపపాదించుశ్రుతి కల్యాణగుణవిషయకము, నిర్గుణశ్రుతి రాగద్వేష విషయకము. ఏలయనగా; * సత్యకామః సత్యసంకల్పః * (ఛా. ఉ. 8. 1. 5.) ఇత్యాది శ్రుతివాక్యములు మంగళవిషయముగాగద ప్రవర్తించినవి? నిర్గుణంబని సామాన్యముగా నిషేధించియుండునది ఆ కల్యాణగుణవిషయములుదప్ప నితరములను, ఇట్లీవిషయమున వ్యవస్థచేయవచ్చునుగదా! ఇట్లే లోకమున (†) బ్రాహ్మణ పరివ్రాజకన్యాయము మున్నగు అనేకన్యాయములు ప్రసిద్ధములు.

ఇదిగాక నిర్గుణవాదుల మెడనుబట్టినట్లు ఛాందోగ్యోపనిషత్తులో అపహతపాప్మా' అని యారంభించి * సత్యకామః సత్యసంకల్పః * (8. 1. 5.) అన్నంతవఱకును, * యత్తదద్రేశ్యమ్......నిత్యం విభుమ్ సర్వగతమ్ సుసూక్ష్మమ్ తదవ్యయమ్ యద్భూతయోనిమ్ పరిపశ్యన్తి ధీరాః * (ముండకోపనిషత్తు 1. 1. 6.) అనియు దోష నిషేధమును గుణవిధియు నొకవాక్యముననే గనబడుచున్నవే.

ఈ విషయమున 'స్తంభము గలదు. కుంభము లేదు' అన్నట్లు కొన్ని న్యాయములను విచారించుట యనవసరము. ఏలయనగా; పరమాత్మను అదృశ్యునిగా జెప్పినది వానికల్యాణగుణ విషయకమని * అదృశ్యత్వాది గుణకోధర్మోక్తేః * (బ్ర. సూ. 1. 2. 22.) [ధర్మమున్నట్లు చెప్పుటచే అదృశ్యత్వాది గుణములు గలవాడు పరమాత్మయే] అని సూత్రకారులు వివరించిరి. ఈ విషయమును

సత్త్వాదయో న సన్తీశే యత్రచ ప్రాకృతా గుణాః

(వి. పు. 1. 9. 44)

[ఈశ్వరునియందు ప్రాకృతములగు సత్త్వాది గుణములులేవు.]

సమస్తకల్యాణ గుణాత్మకోఽసౌ　　(వి. పు. 6. 5. 54)

[ఈతడు సమస్త కల్యాణగుణస్వరూపుడు.] అని స్పష్టముగా పరాశరులు చెప్పిరి.

---

(†) 'బ్రాహ్మణ పరివ్రాజకాన్యాయ' అని న్యాయాకారము. బ్రాహ్మణులను పరివ్రాజకులను (సన్యాసులను) పిలుచుకొని రమ్మనియె నొకడు. పరివ్రాజకులుకూడ బ్రాహ్మణులేగాన వారును బ్రాహ్మణపదంబుననే చేరియుండ ప్రత్యేకముగా వారిని జెప్పియుండుటచే బ్రాహ్మణపదమునకు పరివ్రాజకులుదప్ప నితరబ్రాహ్మణులనియర్థము. ఇట్లే ప్రకృతమునగూడ చూడగలరు.

ఇంతవఱకు, వికారాది హేయగుణములులేక సమస్తకల్యాణగుణములు పరిపూర్ణముగా నుండునది బ్రహ్మము అని తేలినది. ఇట్లే శాస్త్రములు :—

ఏతంహి సర్వాణి కామాన్యభిసంవిశన్తి ॥
సర్వస్య వశీ సర్వస్యేశానః ॥ (బృ. ఉ. 6 4. 22.)

[మనోహరములన్నియు వీనిని పొందును. సమస్తమును వశము కావించుకొనును. సమస్తమునకు నీశుడు.]

సత్యకామః సత్యసంకల్పః (ఛా. ఉ. 8. 1. 5.)

[సత్యమైన పురుషార్థములు గలవాఁడు, సత్యమగు సంకల్పము గలవాడు.]

యస్సర్వజ్ఞః సర్వవిత్ (ము. ఉ. 1. 1. 10.)

[ఎవడు సర్వజ్ఞుడో ; ఎవడు సమస్తమును ఎఱుగునో ;]

పరాస్య శక్తిః వివిధైవ శ్రూయతే
స్వాభావికీ జ్ఞాన బలక్రియాచ ॥ (శ్వే. ఉ. 6.)

[వీనియొక్క గొప్పశక్తి అనేకవిధములుగా వినబడుచున్నది. వీనిజ్ఞానబల క్రియలు స్వభావ సిద్ధములు.]

మాతాపితా భ్రాతా నివాసః శరణం సుహృద్గతిర్నారాయణః॥
(సు. ఉ. 6.)

[తల్లి తండ్రి సోదరుడు రక్షకుఁడు స్నేహితుడు గతి సమస్తమును నారాయణుడే.]

సర్వకర్మా సర్వగంధః సర్వరసః (ఛా. ఉ. 3. 14.)

[సమస్తవ్యాపారములను చేయువాడు సమస్తగంధస్వరూపుఁడు సర్వరస స్వరూపుడు.] ఇత్యాదులు.

ఆనందవల్లిలో, భగవంతునియొక్క జ్ఞానము బలము యౌవనము మున్నగు కల్యాణగుణములు అపరిమితముగా నుండుటచే ఆనందమను నాతని గుణవిశేషమును మాత్రము అనుభవింపదొడఁగి అదియు నమితముగా నుండుటచే * యతో వాచో నివర్తన్తే । అప్రాప్య మనసా సహ * అని వాక్కును మనసును మఱలినట్లు చెప్పబడి యున్నది. శ్రీ విష్ణుపురాణమున భగవచ్ఛబ్ద నిర్వచన ప్రకరణమున * శుద్ధే మహావిభూత్యాఖ్యే * (వి. పు. 6-5-72) అని యారంభించి ఈ విషయము విస్తారముగా చెప్పబడియున్నది.

సభాపర్వమున భీష్ములు

జ్ఞానవృద్ధాః మయా రాజన్ బహవః పర్యుపాసితాః ।
తేషాం గుణవతాం శౌరేః అహం గుణవతో గుణాన్ ॥
సమాగతానామశ్రౌషం బహూన్ బహుమతాన్ సతామ్ ।
గుణై రన్యానతిక్రమ్య హరిరర్చ్యతమో మతః ॥ (భా.సభా.37.12.)

[ఓ రేడా! జ్ఞానముచే వృద్ధులగు అనేకులను నేను ఉపాసించితిని. గుణవంతులగు వారలసన్నిధిలో గుణవంతుడగు నారాయణుని గుణములను వింటిని. లోకమున బహుమానింపదగినవారిలో గుణములచే నతిశయింపబడినవాడు అతడే. కనుక అతడే పూజింపదగినవాడు.]

వర్షాయుతైర్యస్య గుణా నశక్యాః వక్తుమ్ సమేతైరపి సర్వలోకైః ।
మహాత్మనః శఙ్ఖచక్రాసిపాణేః విష్ణోర్జిష్ణోర్వాసుదేవాత్మజస్య ॥
(భా. కర్ణ. 80. 58.)

[సమస్త ప్రాణులును పదివేల సంవత్సరములు గూడియుండి వర్ణించినను, శంఖచక్రాది దివ్యాయుధములుగలవాడై సర్వలోకవ్యాపియై సర్వోత్కృష్టుడైయుండు ఆ వాసుదేవుని గుణములు వచింపజాలనివి.]

చతుర్ముఖాయుర్యది కోటివక్త్రః భవేన్నరః క్వాపి విశుద్ధచేతాః ।
స తే గుణానామయుతైకమంశం వదేన్నవా, దేవవర ప్రసీద ॥
(వా పు)

[ఒక పురుషుడు, బ్రహ్మదేవునివయస్సును కోటిముఖములును నిర్మల జ్ఞానమును గలవాడైనచో, వాడు నీగుణములలో అయుతంబున (10000) నొక యంశంబును చెప్పజాలునో జాలడో; సందేహముగాన దేవా! నీవే దయచేయవలయును.]

యథా రత్నాని జలధేః అసంఖ్యేయాని పుత్రక ।
తథా గుణాహ్యనంతస్య అసంఖ్యేయా మహాత్మనః ॥ (మా. పు.)

[పుత్రా! సముద్రమునగల రత్నము లెట్లు లెక్కింపజాలనివో; అటులే ఆమహాత్ముని గుణములుగూడ అసంఖ్యేయములు]

నహి తస్య గుణాస్సర్వే సర్వైర్మునిగణైరపి ।
వక్తుం శక్యా వియుక్తస్య సత్త్వాద్యైరఖిలైర్గుణైః ॥ (సై. ధ.)

[సత్త్వాది ప్రాకృత గుణములులేని పరమపురుషునికల్యాణగుణములను సమస్త మునిగణంబులు ఒకచో జేరినను చెప్పజాలవు.]

శ్రీరామాయణ మహాభారతములలోను ఈ విషయము స్పష్టము.

ఉపాధివశంబుచే బ్రహ్మము సంసరించును (సంసారమొందును. సంసారమనగా-ప్రకృతిబంధము) అనియు, స్వభావముగానే బ్రహ్మము వికారము నొందును అనియు చెప్పువారలు బ్రహ్మమునందు సమస్తదోషములు నుండునట్లు ఒప్పుకొనుటచే వారలకు " పవిత్రం మంగళం పరమ్ " ఇత్యాది వాక్యములు విరోధించును.

* యతో వాచో నివర్తన్తే * (తై. ఆ. 4.) అను శ్రుతివాక్యమునకు బ్రహ్మము ప్రమాణవిషయము కాజాలదు అని అర్థముగాదు. అట్లు చెప్పినచో బ్రహ్మము శశవిషాణమువలె తుచ్ఛమగును. (కుందేటి కొమ్మువలెలేనిదగును). అదిగాక * యతో వాచః నివర్తన్తే, అప్రాప్య మనసాసహ। ఆనందం బ్రహ్మణో విద్వాన్ * ఇత్యాది శ్రుతులు, బ్రహ్మము ప్రమాణవిషయము గాకుండునేని ఆబ్రహ్మంబునుండి వాక్కును మనసును మఱలినట్లు చెప్పుటచే (అవి) విరోధించును. బ్రహ్మప్రతిపాదక శాస్త్రంబులును వ్యర్థములగును. * అథాఽతో బ్రహ్మజిజ్ఞాసా * అని సూత్రకారులు బ్రహ్మవిచారముచేయ నారంభించినదియు వ్యర్థమగును. * వచసాం వాచ్యముత్తమమ్ * నావేద విన్మనుతే తం బృహన్తమ్ * (కాఠక 3_9.) * శాస్త్రయోనిత్వాత్ * (బ్ర. సూ. 1. 1. 3.) ఇత్యాది వాక్యములు కోపించును. * సైషాఽఽనందస్య మీమాగ్ంసా భవతి * అని యారంభించి * తే యే శతం మానుషా ఆనందాః। స ఏకో బ్రహ్మణ ఆనందః * (తై. ఆనం. 8. 1.) ఇత్యాది వాక్యములచే వాని యానందగుణమును చతుర్ముఖుని యానందసమంబుగా చెప్పజూచినదియు విరోధించును. కనుక, * ప్రకృతైతావత్వంహి * (బ్ర. సూ. 3. 2. 21.) అను సూత్ర న్యాయరీతిగా ఆనంద గుణమునకు మితమేలేదు అనియే చెప్పనగును. దీనినే కూరత్తాళ్వానుకూడ సాధించిరి :—

> శ్రుతిస్తవానందముఖాన్ హరే ర్గుణాన్ ఇయత్తయా
> మాతుమివోద్యతాసతీ। ఉవాచ వాచా మనసా సహోచితాన్
> నివృత్తిమేవత్వవధేరసంభవాత్ ॥

[ఓ పరమపురుషా ! శ్రుతి, నీయుక్క ఆనందాదికల్యాణగుణములను ! పరిచ్ఛేదింపదలంచి అందు ఆనంద విషయంబును అంత బట్టనెంచి మనస్సుతోగూడి ప్రవర్తించినదై ఆ యానందగుణమునకు మితము లేకుండుటచే ఇక మనకు వీలుగాదు. మఱలుటయే యుచితంబని పలికెను]

దీనిచే * న యత్ర నాథ విద్యన్తే నామజాత్యాదికల్పనాః * ]నాథా ! నీయందు నామజాత్యాదులకల్పన లేదు.] అను శ్లోకంబుకూడ వ్యాఖ్యాతంబయ్యె. లౌకికనామజాత్యాదులేలేవు. విలక్షణనామజాత్యాదులు గలవని తేలినదిగదా ? లేనిచో

నామములేదనిచెప్పి 'నాథ!' (స్వామీ) అని సంబోధించుట అసంగతంబగునే! కనుక నామజాత్యాదులు లేవు అను వాక్యంబునకు విలక్షణంబులగు స్వానురూపంబులగు నామరూపాదులు గలవాడగుటచే సాధారణంబులగు లౌకికంబులగు పరిమితంబులగు నామంబులచే వచింపదగినవాడవు గావు అని భావము. ఈ విషయమే,

> నామకర్మ స్వరూపాణి న పరిచ్ఛేదగోచరే।
> యస్యాఖిలప్రమాణాని స విష్ణుర్గర్భగ_స్తవ ॥ (వి. పు. 5. 2. 19.)

[ఎవనినామంబులును దివ్యచేష్టితంబులును దివ్యస్వరూపంబును అపరిమితంబులో, సమస్తప్రమాణంబులును ఎవనిని ప్రతిపాదించుచున్నవో; ఆ విష్ణువే నీగర్భంబునగలడు.] అని స్పష్టముగా జెప్పబడియున్నది చూడుడు.

ఇవిగాక, మఱికొందఱు 'ఈనామంబులచే ప్రతిపాదింపబడు అర్థములకు ప్రవృత్తినిమిత్తము లేదనియు, అట్లుండినను ఆయంశంబున తాత్పర్యము లేకుండుటచే అది యప్రమాణంబనియు నందురు. ఇదియు నసంగతము. ఈనామంబులను విన్నంతనే అర్థము స్ఫురించుచునుండగా, స్వతఃప్రమాణంబగు దీనిని అపలపింపనగునా? అపవాదవాక్యములేవయిన గలవా?

కాకయు, * యాని నామాని గౌణాని * ఆస్యాజానన్తో నామచిద్వివక్తన * (విష్ణు. సూ.) ఇత్యాదులచే భగవద్గుణంబుల నెఱింగింపవలయునని తాత్పర్యమున్నట్లు తెలియుచున్నదిగదా? 'మంత్రములవలె ఇది శాస్త్రాంతరోక్తగుణంబులను స్మరింపజేయుచున్నది' అని కొందఱందురు. ఆ మతమునను గుణము లేదని యేర్పడలేదు. అంతియేకాక గుణవిషయంబున నిది దృఢప్రమాణముగానే యగును. కనుకనే ఆద్యంతములయందు గుణాదులకుత్కర్షముచెప్పి దృఢపఱచి, మధ్యలో స్మరణమునకై ఆనామములు విధింపబడియె.

ఈ నామంబులలో నేదే నొక నామము సకల ఫలప్రదముగా నుండును. భగవచ్ఛాస్త్రాదులందు ద్వాదశాక్షర అష్టాక్షర షడక్షరాదులలో మూలరూపముగానో, వ్యాఖ్యారూపముగానో ఏదే నొకనామము పరిణమించి స్వతంత్రములై సకలార్థంబులయందును వినియోగించుటగలదుగదా? కనుకనే "నామచిద్వివక్తన" అను శ్రుతివాక్యంబున ఏకవచనమును సమంజసంబగును.

ఉచ్చారణమాత్రంబుననే ఉపకరించునవియయ్యు, వానియర్థంబు నెఱింగియుండినచో అతిశీఘ్రముగా మనసు పరిపక్వమై పావనంబగునని నామనిర్వచనాధ్యాయంబున స్పష్టము.

మూ. విష్ణోర్నామ సహస్రస్య వేదవ్యాసో మహానృషిః ।
ఛన్దోఽనుష్టుప్తథాదేవః భగవాన్ దేవకీసుతః ॥ (౧౪)
అమృతాంశూద్భవోబీజం శక్తిర్దేవకినన్దనః ।
త్రిసామా హృదయం తస్య శాన్త్యర్థే వినియుజ్యతే ॥ (౧౫)

ఉపోద్ఘాతప్రకరణం సంపూర్ణమ్.

---

అస్తౌషీన్నామభిః వ్యాసః సశిష్యో మధుసూదనమ్ ।
యేషాం నిరుక్తం పరమం భగవన్ వక్తుమర్హసి ॥
శుశ్రూషోః శ్రద్దధానస్య ప్రజాపతిపతేర్హరేః ।
శ్రుత్వా భవేయం యత్పూతః శరచ్చంద్ర ఇవాఽమలః ॥

(భా. శా. 342. 1.)

[వ్యాసులు శిష్యులతోగూడ స్తోత్రముచేసిన యానామముల నిర్వచనంబును (ఆనామములేర్పడిన కారణంబును) నాకుజెప్పవలయును. సర్వలోక జనకుండగు ఆ భగవంతునినామంబులను విన్నచో శరత్కాలచంద్రునివలె సమస్తపాపంబులును తొలంగి నిర్మలుండగుదును.]

ధృతరాష్ట్రః ॥ భూయో మే పుణ్డరీకాక్షమ్ సంజయాఽఽచక్ష్వ
పృచ్ఛతే। నామకర్మార్థ విత్తాత ప్రాప్నుయాం పురుషోత్తమమ్ ॥

(భా. ఉ. 59. 1.)

[ధృతరాష్ట్రుడు అడుగుచున్నాడు :— సంజయా ! పుణ్డరీకాక్షునిమహిమంబును వినగోరి ప్రశ్నించిన నాకు ఇంకొకమాటు చెప్పవలయును. వాని నామకర్మార్థంబులను ఎటింగినచో ఆపురుషోత్తమునే చెందినవాడగుదును.]

వీనిని వినియోగించుప్రకారము ఉద్యోగపర్వము మోక్షధర్మము వైష్ణవధర్మము నిర్వచనాధ్యాయము అను వీనిలోను, ఆయామంత్రకల్పములందుగల వచనంబులలోను స్పష్టముగాన అచ్చట చూడనగును.

శ్రీ పెరుంబూదూరు
కిడాంబి రామానుజాచార్యులు తెనిగించిన
శ్రీ విష్ణు సహస్రనామ వ్యాఖ్యానమున
ఉపోద్ఘాత ప్రకరణము ముగిసెను.

సహస్రనామాధ్యాయమున చేరకుండినను శిష్టసంప్రదాయమున అందఱును పారాయణమున అనుసంధించుటచే వ్యాఖ్యానము చేయబడును.

(భట్టరు వ్యాఖ్యానము గాదు.)

మూ॰ విష్ణుం జిష్ణుం మహావిష్ణుం ప్రభవిష్ణుం మహేశ్వరమ్ ॥
అనేకరూపదైత్యాన్తం నమామి పురుషోత్తమమ్ ॥
అస్య శ్రీ విష్ణోః దివ్యసహస్రనామస్తోత్రమహామన్త్రస్య, శ్రీవేదవ్యాసో భగవాన్ ఋషిః। అనుష్టుప్ఛన్దః। శ్రీమహావిష్ణుః పరమాత్మా శ్రీమన్నారాయణోదేవతా। అమృతాంశూద్భవోభానురితి బీజమ్। దేవకీనన్దనః స్రష్టేతి శక్తిః। ఉద్భవః క్షోభణోదేవఇతి పరమోమన్త్రః। శఙ్ఖభృన్నన్దకీ చక్రీతి కీలకమ్। శార్ఙ్గధన్వాగదాధర ఇత్యస్త్రమ్ ॥ రథాఙ్గపాణిరక్షోభ్యఇతి నేత్రమ్। త్రిసామాసామగః సామేతి కవచమ్। ఆనన్దమ్పరబ్రహ్మేతి యోనిః। ఋతుస్సుదర్శనః కాలఇతి దిగ్బన్ధః। శ్రీవిశ్వరూపఇతి ధ్యానమ్। శ్రీ మహావిష్ణుకైఙ్కర్యరూపే సహస్రనామజపే విని యోగః ॥

ఉపదేశ గమ్యమగు రహస్యమగుటచే దీనికి వ్యాఖ్యానము వ్రాయబడలేదు.

శ్లో॥ ధ్యానమ్॥ క్షీరోదన్వత్ప్రదేశే శుచిమణి విలసత్సైకతే మౌక్తికానామ్, మాలాక్లృప్తాసనస్థః స్ఫటికమణినిభైః మౌక్తికైర్మణ్డితాఙ్గః। శుభ్రైరభ్రైరదభ్రైరుపరి విరచితైః ముక్తపీయూష వర్షైః, ఆనన్దీ నః పునీయాదరినళినగదాశఙ్ఖపాణిర్ముకున్దః॥ (౧)

(తా.) నిర్మలములగు వజ్రమణులచే ప్రకాశించు ఇసుకదిబ్బలుగల క్షీరసముద్ర తీరమున ముత్యముల మాలలచే నలంకరింపబడిన దివ్యాసనమునసుండువాడై, స్ఫటిక మణివలె ప్రకాశించు ముక్తాహారములచే భూషింపబడిన దివ్యదేహముగలవాడై, ఉపరి భాగమున అనేక మేఘములు అమృతవర్షమును వర్షింప దానిచే మహానందము నొందినవాడై, శంఖము చక్రము గద నళినము వీని ధరించినవాడునై యుండు శ్రీమన్నారాయణుడు మనలను పరిశుద్ధులం గావించుగాక.

శ్లో॥ భూః పాదౌ యస్య నాభిః వియదసుః అనిలః చన్ద్రసూర్యౌ చ నేత్రే, కర్ణావాశాశ్శిరోద్యౌర్ముఖమపి దహనో యస్యవాస్తేయ మబ్ధిః । అన్తస్థన్ యస్య విశ్వం సురనరఖగగోభోగిగన్ధర్వ దైత్యైః, చిత్రం రంరమ్యతే తం త్రిభువనవపుషం విష్ణుమీశం నమామి ॥ (౨)

(తా.) ఎవనికి భూమి పాదములో, ఆకాశము నాభియో, వాయువు ప్రాణమో, చంద్రసూర్యులు నేత్రములో, దిక్కులు కర్ణములో, స్వర్గము శిరమో, అగ్ని ముఖమో, సముద్రము వస్త్రమో, దేవతలు మనుష్యులు పక్షులు గోవులు సర్పములు గంధర్వులు అసురులు ఇత్యాద్యనేకవిధముగానుండు నీ ప్రపంచము ఎవనిగర్భమునుండి విచిత్రముగా రమించునో, అంతట వ్యాపించి సర్వనియామకుడైయుండు ఆ భగవంతుని నమస్కరించెదను.

శ్లో॥ శాన్తాకారం భుజగశయనం పద్మనాభం సురేశమ్
విశ్వాకారం గగనసదృశం మేఘవర్ణం శుభాఙ్గమ్ ।
లక్ష్మీకాన్తం కమలనయనం యోగిహృద్ధ్యానగమ్యమ్
వన్దే విష్ణుం భవభయహరం సర్వలోకైకనాథమ్ ॥ (3)

(తా.) శాంతమగు నాకారముతో ఆదిశేషునిమీద శయనించినవాడై, తామరను బోలిన నాభినిగలవాడై, దేవతలకు నీశుడై, ప్రపంచాకారుడై, ఆకాశమువలె అంతట వ్యాపించియుండువాడై, నీలమేఘశ్యాములుడై, పుండరీకాక్షుడై, యోగులచే ధ్యానింపబడువాడై, సంసారభయంబును తొలగించువాడై, సకలలోకనాథుడై యుండు విష్ణువును మ్రొక్కెదను.

శ్లో॥ మేఘశ్యామం పీతకౌశేయవాసమ్
శ్రీవత్సాంకమ్ కౌస్తుభోద్భాసితాఙ్గమ్ ।
పుణ్యోపేతం పుణ్డరీకాయతాక్షమ్
విష్ణుం వన్దే సర్వలోకైకనాథమ్ ॥ (౪)

(తా.) కాలమేఘమువలె నీలవర్ణుడై, పీతాంబరధారియై, శ్రీవత్సంబును ధరించినవాడై, కౌస్తుభంబను రత్నముచే ప్రకాశించు వక్షమునుగలవాడై, పుణ్యపురుషులచే సేవింపబడినవాడై, తామరవలె దీర్ఘమగు నేత్రములుగలవాడై, సర్వలోకైకనాథుడై యుండు విష్ణువును నమస్కరించెదను.



శ్రీమతే రామానుజాయ నమః.

# శ్రీ విష్ణుసహస్రనామ భాష్యము

## [ప్రథమ శతకము.]

### 1. విశ్వమ్.

(అర్థము) విశ్వమ్ = సర్వత్ర పూర్ణుడు.

---

ప్రకరణానుసారంబుగను వ్యాకరణనిరుక్తాదులననుసరించియు పునరుక్త్యాది దోషంబులులేక శ్రుతిస్మృత్యాదిసంవాదప్రమాణంబులనుదహరించి ప్రతినామంబునకును అర్థము చెప్పబడును.

మొట్టమొదట భగవంతునిసర్వతోముఖపూర్ణత్వము చెప్పబడుచున్నది :—

### 1. విశ్వమ్.

"విశతి అవయవానితి విశ్వమ్" ప్రతిఅవయవములందును ప్రవేశించును.

మోక్షధర్మంబున సంయమునికి పంచశిఖులు :— * విశనాద్విశ్వమిత్యాహుః లోకానాం కాశిసత్తమ। లోకాంశ్చ విశ్వమేవేతి ప్రవదన్తి నరాధిప॥ * (మో. ధ.) [రాజా! సర్వేశ్వరుండు సమస్త ప్రాణులయందును బ్రవేశించుటచే ఆతనిని 'విశ్వము' అనియందురు. అట్టి యా విశ్వరూపి అంతట వ్యాపించియుండుటచే లోకముగూడ విశ్వమనబడును].

స్వాభావికంబులును అనవధికాతిశయంబులును మంగళస్థానంబులునగు స్వరూపము రూపము గుణము విభూతి అను వీనిచే పరిపూర్ణుడు అనిభావము. విశ్వశబ్దము సపస్తంబును చెప్పునదియయ్యు మొట్టమొదట భగవంతునిపూర్తిని జెప్పుటయే యుచితంబుగాన ఆదిలో నీయర్థము చేయబడియె.

కార్యభూతులగు బ్రహ్మాదులనామంబులచే జగత్కారణభూతుడగు విష్ణువు స్తోత్రము చేయబడును అనియొకరు అనిరి. సమస్తనామంబులును యోగరూఢిచే భగవంతునియందు స్వశబ్దంబుచేతనే వాడబడుటచే నిట్లు అప్రాధాన్యార్థకల్పన మసంగతము. ఈ ప్రపంచము (విశ్వము) బ్రహ్మముకన్న నితరముగాకుండుటచే బ్రహ్మప్రపంచంబులకు అభేదంబుననియొనొకడు. విశ్వశబ్దము అభేదార్థకము గాకుండుటచే ఇదియు నసంగతము.

ఈ నామంబున చెప్పబడిన పూర్తినే ఇతరనామములు వివరించుచున్నవి. (1.)

(అవతారిక.) భగవంతునియొక్క విభవంబగు ప్రపంచంబునందు అనుప్రవేశంబు చెప్పబడుచున్నది.

2. విష్ణుః 3. వషట్కారః. 4. భూతభవ్యభవత్ప్రభుః.

విష్ణుః = అంతట వ్యాపించియుండువాడు. వషట్కారః = వశముగావించుకొనువాడు. భూతభవ్యభవత్ప్రభుః=ముక్కాలంబునకును స్వామి.

---

## 2. విష్ణుః (259.663.)

"విశతీతి విష్ణుః" చిదచిదాత్మకంబగు తనవిభూతినంత ప్రవేశించువాడు.

* వివేశ భూతాని చరాచరాణి * (తై. నా. 6. 1. 4.) [చరాచరాత్మకంబగు భూతంబులలో ప్రవేశించె] * తదేవానుప్రావిశత్ * (తై. ఆ. 2. 6. 2.) [దాని యందు తానే అనుప్రవేశము కావించె] * వ్యాప్య సర్వానిమాన్ లోకాన్ స్థితః సర్వత్ర కేశవః । తతశ్చ విష్ణునామాసి విశేర్ధాతోః ప్రవేశనాత్ * (హ. వం.) [కేశవా! నీవు ఈ సమస్తలోకంబునందును వ్యాపించియుందువు గాన విశప్రవేశనే అను ధాతువునుండి యేర్పడిన విష్ణునామంబును ధరించియున్నావు.]

విశ్వమ్, విష్ణుః, అను నీ రెండు నామంబులును వ్యాప్తినే దెల్పుచునుండియు విశ్వశబ్దము పూర్తిని, విష్ణు శబ్దము వ్యాప్తిని చెప్పుటచే పునరుక్తి (చెప్పినదానినే మరల చెప్పుట) అను దోషము లేదు. (2.)

(అవతారిక.) ఈవ్యాప్తి ఆకాశాదులవ్యాప్తివలెగాక విలక్షణ ప్రయోజనముగలది అని నుడువబడును.

## 3. వషట్కారః.

"వషట్ కరోతీతి వషట్కారః" సమస్తంబును తనవశము గావించుకొనువాడు.

* సర్వస్య వశీ సర్వస్యేశానః * (బృ. ఉ. 6. 4. 22.) [సమస్తంబును తన వశము గావించుకొన్నవాడు. సమస్తంబును నియమించువాడు.] * జగద్వశే వర్తతేదమ్ * (భా. ఆ. 149, 137) [ఈ జగత్తు వాని వశంబున నుండును.] (3.)

## 4. భూత భవ్య భవత్ప్రభుః.

"భూత-భవ్య-భవతామ్ ప్రభుః" ఇట్లు సమస్తంబును వశీకరించుటచే భూత-భవిష్య-ద్వర్తమానంబులు అనునీమూడుకాలంబులందునుండు సమస్తపదార్థంబులకును స్వామి. అనగా శేషి.

* పతిమ్ విశ్వస్య * (తై. నా. 6. 11.) [లోకంబునకు స్వామి.] * పతిమ్ పతీనామ్ * (శ్వే-ఉ. 6-7.) [పతులకందఱకును పతిని] * భూతస్య జాతః పతిరేక ఆసీత్ * (4. కా. 1. 8.) [భూతంబులకు పతి ఒకడే అయ్యెను.] * తత్పురుషస్య విశ్వమ్ * (తై. బ్రహ్మ.) [ప్రపంచము ఆ పురుషునిది] * యస్యేమాః ప్రదిశః......* (4. కా. 1. 8.) [ఈ దిశలలోనుండునవియన్నియు ఎవనివో...]

## 5. భూతకృత్। 6. భూతభృత్. 7. భావః.

భూతకృత్ = భూతములను సృజించువాడు. భూతభృత్ = భూతములను భరించువాడు. భావః = విశిష్టాకారుడు.

---

*కృష్ణస్య హి కృతే భూతమిదం విశ్వం చరాచరమ్ * (భా. స. 38. 23.) [చరాచరాత్మకంబగు నీ ప్రపంచము కృష్ణునికొఱకేగదా?] * భూత భవ్య భవన్నాథః కేశవః కేశిసూదనః * (భా. స. 31.11) [కేశిని సంహరించిన కేశవుడు త్రికాలంబునగల పదార్థంబులకు స్వామి] * జగన్నాథస్య భూపతే * (భా. అను. 149.12.) [రాజా! జగన్నాథుడగు కృష్ణునియొక్క...] ఇత్యాదిప్రమాణముల నేకములు. (4.)

(అవతారిక.) ఇక ఐదునామములు ఆతడు శేషిగా నుండుటను వివరించుచున్నవి :—

### 5. భూతకృత్.

"భూతాని కరోతీతి భూతకృత్" సమస్తభూతములను స్వతంత్రుడై సృజించువాడు.

* సర్వం హ్యేదం బ్రహ్మణా హైవ సృష్టమ్ * [ఈసర్వంబును బ్రహ్మము చేతనే సృజింపబడియె.] * యతో వా ఇమాని భూతాని జాయన్తే * (తై. భృ. 1.) [ఈ భూతములు ఎవనినుండి వెలువడునో.] (5.)

### 6. భూతభృత్.

"భూతాని బిభర్తీతి భూతభృత్" భూతములను భరించువాడు.

* విశ్వం బిభర్తి భువనస్య నాభిః * (తై. నా. 1.2.) [లోకములకంతయు నాభిస్థానమైయుండి సమస్తంబును భరించును.] * తద్యథా రథస్యారేషు నేమి రర్పితా, నాభావరాః అర్పితాః, ఏవమేవ ఏతా భూతమాత్రాః ప్రజ్ఞామాత్రాస్వర్పితాః, ప్రజ్ఞామాత్రాః ప్రాణేష్వర్పితాః * (కౌ. 3. 9.) [అది యెట్లనగా; బండిచక్రములో, అరమున (బండికంటియాకున) నేమి (బండికంటి కడకమ్మి) గ్రుచ్చబడి, అది బండి కంటినడిమితూమున ఎట్లు గ్రుచ్చబడియుండునో; అటులే ఈ భూతములన్నియు ప్రజ్ఞామాత్రమగు ఆత్మకోటిలో గ్రుచ్చబడి, అది ప్రాణస్వరూపియగు పరమాత్మ యందు గ్రుచ్చబడియుండును.] * సదాధార పృథివీమ్ * (4.కా.1.8.) [సత్తును ఆధారముగాగల పృథివిని] * బిభర్త్యవ్యయ ఈశ్వరః * (గీ. 15.17.) [ముల్లోకంబులను నిర్వికారుడై యీశ్వరుడు భరించును.]

### 7. భావః.

"భవతీతి భావః" క్రిందచెప్పియుండునవియు మీదచెప్పబోవునవియునగు సకలవిభూతులతోగూడి నెమలిపురితోగూడి నెమిలి ప్రకాశించునట్లు ప్రకాశించువాడు.

## 8. భూతాత్మా. 9. భూతభావనః.

భూతాత్మా = భూతములకు ఆత్మ. భూతభావనః = భూతములను వృద్ధి గావించువాడు.

---

సమస్తభూతములును భగవంతునియందు ప్రకారతయా అంతర్భవించి యుండుటచే సమస్తంబును వానివిభూతిగా చెప్పబడును. (7.)

(అవతారిక.) ఇట్లు సమస్త భూతములును వాని విభూతిగానుండుననగా వానికి శరీరముగా నుండుటయే అని అనబడును :—

## 8. భూతాత్మా.

"భూతానామ్ ఆత్మా భూతాత్మా" తనకు శరీరముగానుండు సమస్తభూతంబులకును ఆత్మ. ఆత్మయనగా, శరీరంబున వ్యాపించి ఆ శరీరంబును ప్రవర్తింపజేయునదియు నివర్తింపజేయునదియునగును. అటులే పరమాత్మగూడ, సమస్తంబును ప్రవర్తింపజేయుచు నివర్తింపజేయుచునుండుటచే వాడు ఆత్మ అనబడును. గృహము క్షేత్రము భార్య బిడ్డలు మున్నగువారికన్న శరీరము ఆత్మకు అత్యంతము పరతంత్రముగా నుండుటచే శరీరము ఆత్మకు అత్యంతము అంతరంగవిభూతియగును. అటులే సమస్తభూతములును భగవంతునకు శరీరమువలె అత్యంతము పరతంత్రమై అంతరంగమై యుండును.

* యః పృథివ్యాం తిష్ఠన్ * (బృ. ఉ. 5.7.3.) [ఎవడు పృథివిలోనుండునో ;] * య ఆత్మని తిష్ఠన్ * (మా-శా.) [ఎవడు ఆత్మలోనుండునో ;] * యస్య పృథివీ శరీరమ్ * (బృ. ఉ. 5.7.3.) [ఎవనికి పృథివి శరీరమో ;] * యస్యాఽఽత్మా శరీరమ్ * (మా. శా.) [ఎవనికి ఆత్మ శరీరమో ;] * ఏష సర్వభూతాంతరాత్మా * (సు. ఉ. 7.) [ఈతడు సమస్తభూతంబులకు నంతరాత్మ.] * జగత్సర్వం శరీరం తే * (శ్రీ.రా.యుద్ధ. 126-26) [లోకమంతయు నీకు శరీరంబగును.] * తాని సర్వాణి తద్వపుః * (వి. పు. 1. 22. 85.) [అవి యన్నియు వానిశరీరము.] * తత్సర్వం వై హరేస్తనుః * (వి. పు. 1. 22. 38.) [అవియన్నియు హరియొక్క శరీరము.] ఇత్యాది ప్రమాణంబులనేకములుగలవు. (8.)

## 9. భూతభావనః.

"భూతాని భావయతీతి భూత భావనః" ఇట్లు తనకు శరీరముగానుండు భూతములకు ధారకపోషకభోగ్యములనిచ్చి వృద్ధికావించును.

* భూతభావన భూతేశ * (గీ. 10. 15.) [భూతములను పాలించువాడా! భూతంబులకీశుడా!] * ఏష భూతపాలః * (బృ. ఉ. 6. 4. 22.) [భూతంబులను పాలించువాడు వీడు.]

ఇట్లు స్వరూపము స్థితి ప్రవృత్తి పాలనము అనువీనిచే భగవంతుని శేషిత్వము ఉపపాదింపబడియె. ఉత్పాదన (సృజించుట) రక్షణాదులకేది విషయమగునో ; దాని

## 10. పూతాత్మా.

పూతాత్మా=శుద్ధ స్వభావుడు.

---

కుద్దేశ్యభూతుడెవ్వడో; వాడే దానికి శేషి (స్వామి) యగును. భగవంతుడు సమస్తభూతంబులకును ఉద్దేశ్యుండగుటచే ఆతడు భూతములకు శేషిగానగును. దీనినే * శేషః పరార్థత్వాత్ * (పూ. మీ. 3. 1. 1.) [పరునకుగానే యుండుటచే వీడు శేషభూతుడగును] అని వచించె. (9.)

(అవతారిక) ఈతడిట్లు ఆత్మగానుండుటచే సంసారియగు జీవాత్మకువలె ఈతనికిని, శరీరములుగానుండు చేతనాచేతనములదోషములు సంబంధించునా? అనగ:—

## 10. పూతాత్మా.

"పూతః ఆత్మా యస్యసః పూతాత్మా" వీడు పరిశుద్ధస్వభావుడుగాన ఆదోషములు సంబంధింపవు.

జీవాత్మపరమాత్మలకు శరీరసంబంధము తుల్యముగానుండియు జీవాత్మయే కర్మఫలంబులను భుజించి దుఃఖించును. పరమాత్మయో వీనిని భుజింపజేయుచు స్వతంత్రుడై ప్రకాశించును. ఎట్లనగా; లోకంబున ఎవనినయిన ఒకడు కొరడాతో గొట్టునపుడు ఆ కొరడాతోడి సంబంధము శిక్షించువానికిని శిక్షింపబడు వానికిని సమముగానుండియు, ఆదుఃఖమును (నొప్పిని) శిక్షింపబడువాడు మాత్రమే పొందునుగాని శిక్షించువాడు పొందడు. అటులే చూడుడు.

* జహాత్యేనాం భుక్తభోగామజోఽన్యః * (తై. నా. 6. 10. 5.) [భోగంబును భుజించు దీనిని పుట్టుకలేని వేఱొకడు విడిపించుచున్నాడు] * ద్వా సుపర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం పరిషస్వజాతే। తయోరన్యః పిప్పలం స్వాద్వత్తి అనశ్నన్నన్యో అభిచాకశీతి * (ము. ఉ. 3. 1. 1.) [ఒక చెట్టును (శరీరంబును) రెండు పక్షులు (జీవాత్మ పరమాత్మలు) పొందియుండును. వానిలో నొకటి (జీవాత్మ) ఆ చెట్టుయొక్క ఫలములను (సుఖదుఃఖములను) అనుభవించును. మఱొకటి (పరమాత్మ) అనుభవింపక అంతట ప్రకాశించును.] * ఏష సర్వ భూతాంతరాత్మా అపహతపాప్మా * (సు. ఉ. 7.) [వీడు సమస్తభూతంబులకును అంతరాత్మ. పాపములు తొలగినవాడు.] * న మాం కర్మాణి లిమ్పన్తి * (గీ. 4. 14.) [నన్ను కర్మంబులుచేరవు.] * పశ్య దేవస్య మహాత్మ్యం మహిమానంచ నారద। శుభాశుభైః కర్మభిర్యః న లిప్యతి కదాచన * (భా. శాంతి. 340. 26.) [నారదా! దేవునిమాహాత్మ్యంబును వైభవంబును చూడుము. ఆతడు శుభాశుభ కర్మంబులచే నొకప్పుడును సంబంధింపబడడు.] * సంభోగ ప్రాప్తిరితిచేన్న, వైశేష్యాత్ * (బ్ర. సూ. 1. 2. 8.) [విశేషవిధియుండుటచే పరమాత్మకు భోగంబున సంబంధములేదు.] (10.)

## 11. పరమాత్మా. (చ) 12. ముక్తానాం పరమాగతిః.

పరమాత్మా = తనకు పైగా నొక యాత్మలేనివాడు. ముక్తానాం పరమాగతిః = ముక్తులకు పరమగతిగానుండువాడు.

---

(అవతారిక) ఈతడు సమస్తభూతంబులకును ఆత్మయగునట్లు, ఈతనికి గూడనొక యాత్మగలదా ? అనఁగ ;

### 11. పరమాత్మా.

"పరః మా అస్యేతి పరమః, పరమశ్చాసౌ ఆత్మాచ పరమాత్మా" తనకు నొకయాత్మ లేనివాడు.

* ఆత్మేశ్వరమ్ * (తై. నా. 6. 11.) [తనకు తానే యీశ్వరుని] * తస్మాద్ధాన్యన్నపరః కించనాస * (అష్టక. 2. 8. 9.) [వానికిపైగా పరుడు మఱొకడులేడు.] * న తత్సమశ్చాభ్యధికశ్చ దృశ్యతే * (శ్వే. 6. 8.) [వానికి సముడో అధికుడో కనబడడు] * యస్మాత్పరం నాపరమస్తి కిఞ్చిత్ * (శ్వే. ఉ. 3. 9.) [ఎవనికన్న పరమైన మఱొకటిలేదో ;] * న పరం పుణ్డరీకాక్షాత్ దృశ్యతే భరతర్షభ। పరంహి పుణ్డరీకాక్షాత్ న భూతం న భవిష్యతి * [భరతశ్రేష్ఠా! పుండరీకాక్షునికన్న పరమైన వేఱొకవస్తువులేదు. పుండరీకాక్షునికన్న పరమైన మఱొకవస్తువు ఇంతవఱకును లెదు. ఇకను గలుగదు.] * న దైవం కేశవాత్ పరమ్ * (భా. ఆశ్వ. శేష. 2. 21.) [కేశవునికి పరమైన దైవములేదు.] * యస్మాత్పరస్మాత్పురుషాదనన్తాత్ అనాదిమధ్యాదధికం న కిఞ్చిత్ * [ఆదిమధ్యాంతరహితుండగు పరమపురుషుని మించిన వస్తువులేదు.] * మత్తః పరతరం నాన్యత్ కించిదస్తి * (గీ. 7. 7.) [నన్ను మించిన పరవస్తువు మఱొకటిలేదు.] * పరంహ్యామృతమేతస్మాద్విశ్వరూపాన్నవిద్యతే * [విశ్వరూపుండగువీనికన్న నిత్యమయిన పరవస్తువు మఱొకటిలేదు.] * పరః పరాణామ్ పరమః పరమాత్మా * (వి. పు. 1-2-10) [పరమగు ఆత్మకోటుల కన్నిటికిని పరుడగు తనవలె మఱొకడు తనకులేక ప్రకాశించువాడు పరమాత్మ.] (11.)

### 12. ముక్తానామ్ పరమాగతిః.

ప్రకృతిబంధంబగు అవిద్య కర్మవాసన రుచి విపాకము అను నావరణంబులను పరిత్యజించినవారు ముక్తులు. వారలకు పరమగతియగు ఆ భగవంతుడే పొందదగినవాడు.

ముక్తులు అవిద్యాదులను పరిత్యజించిన వారలని యనేకప్రమాణంబులు ఘోషించుచున్నవి. * తత్సుకృత దుష్కృతే విధూనతే (కౌ. ఉ. 1. 4.) [అది (ఆత్మ) పుణ్యాపాపంబులను త్రోసివేయుచున్నది.] * అశ్వ ఇవ రోమాణి విధూయ పాపమ్ * ఛా. ఉ. 8. 13.) [గుఱ్ఱము రోమములను విదిలించునట్లు పాపమును విదిలించి]

* నామరూపే విహాయ * (ము. ఉ. 3. 28.) [నామరూపంబులను విడిచి.] * తదా విద్వాన్ పుణ్యపాపాద్విముక్తః జ్ఞాత్వాదేవం ముచ్యతే సర్వపాశైః * (శ్వే. ఉ. 4. 16.) [విద్వాంసుడప్పుడు పుణ్యపాపంబులనుండి విడబడినవాడై దీని నెఱింగి సమస్త పాశంబులనుండి వీడబడును.] * భిద్యతే హృదయగ్రన్థిః * (ము. ఉ. 2. 2. 9.) * మాయామేతాం తరన్తి తే * (గీ. 7. 14.) [వారీమాయను దాటుచున్నారు] * యే హీనాః సప్తదశభిః గుణైః కర్మభిరేవచ। కలాః పంచదశ త్యక్త్వా తే ముక్తా ఇతి నిశ్చయః * (భా. శాన్తి. 335. 40) [ఎవరు పదునేడు గుణములచేతను కర్మములచేతను వీడబడినవారై పదునైదు కలలను విడిచెదరో; వారలే ముక్తులని నిశ్చయము] ఇత్యాదులనేకములు.

ఇట్లు సంసారంబను బంధము తొలగిన వారలకు (ముక్తులకు) అనంతజ్ఞానానంద ఘనస్వరూపంబును అపహతపాప్మత్వము మొదలు సత్యసంకల్పత్వము వఱకుంగల ఎనిమిది గుణములును భోగంబును పరమాత్మకు సమముగా గల్గుననియు శుద్ధసత్వమయంబగు శరీరము గల్గుననియు సిద్ధాంతము చేయబడియున్నది.

* దివ్యేన చక్షుషా మనసా ఏతాన్ కామాన్ పశ్యన్ రమతే * (ఛా. ఉ. 8. 12. 5.) [దివ్యనేత్రమగు మనసుచే ఈ పురుషార్థంబులను జూచి యనుభవించును.] * నిరఞ్జనః పరమం సామ్యముపైతి * (ము. ఉ. 3. 1. 3.) [హేయసంబంధములేక పరమసామ్యంబు నొందును.] * మమ సాధర్మ్యమాగతాః * (గీ. 14. 2.) [నాతో (పరమాత్మతో) సాధర్మ్యము నొందినవారు.] * ఏవమప్యుపన్యాసాత్పూర్వభావాదవిరోధం బాదరాయణః * (బ్ర. సూ. 4. 4. 7) [ఇట్లు కూడ చెప్పియుండుటచే పూర్వమువలె శరీరముండుటలో సందేహము లేదని వ్యాసులందురు.] * జక్షత్క్రీడన్ రమమాణః * (ఛా. ఉ. 8. 12. 3.) [భుజించుచు క్రీడించుచు రమించుచు నుండును.] * కామాన్నీ కామరూప్యనుసంచరన్ * (తై. భృ. 10. 5.) [ఇష్టమగు అనేకరూపముల ధరించి పరమాత్మననుసరించి కామములను అనుభవించును.] * తం బ్రహ్మగన్ధః ప్రవిశతి * (కౌ. ఉ. 1. 5.) [బ్రహ్మగంధము వానియందు ప్రవేశించును.] * తం బ్రహ్మాలంకారేణ అలంకుర్వన్తి * (కౌ. ఉ. 1. 4.) [వానిని బ్రహ్మాలంకారంబులచే నలంకరింతురు] * ద్వాదశాహవదుభయవిధం బాదరాయణః * (బ్ర. సూ. 4. 4. 12.) [ద్వాదశాహమువలె రెండు విధంబులును తగునని వ్యాసులందురు.]

“ముక్తానామ్” అను బహువచనంబుచే ముక్తులనేకులనియు వారలలో నొకరికొకరికి భేదంబులు గలవనియు స్పష్టముగా తెలియుచున్నది. * పరామృతాత్ పరిముచ్యన్తి సర్వే * (ము. ఉ. 3. 2. 6.) [సమస్తులకును పరుడై నిత్యుడైయుండు భగవంతునిచే నందఱు ముక్తులగుదురు.] ఇత్యాదులు.

భగవంతుని “సాక్షి” అని పైన (నామము. 15, 517) చెప్పియుండుటను, ఇచట ముక్తులకు గతి అని చెప్పియుండుటను జూడ “పరమాత్మకన్న జీవులు భిన్నులు” అని తెలిసెడిని. * జుష్టం యదా పశ్యత్యన్యమీశమస్య మహిమానమితి

వీతశోకః * (ము. ఉ 3. 1. 2.) [సమస్తగుణసంపన్నుడై స్వేతర సమస్తవస్తువిలక్షణుడై తనకు శేషియైయుండు భగవంతునిజూచి శోకమంతయు దొలగి వానిమహిమంబు నెఱుంగును.] * పృథగాత్మానం ప్రేరితారంచ మత్వా * (శ్వే. ఉ. 1. 6.) [ప్రకృతివిదూరుడగు ఆత్మను, వానిని నియమించు పరమాత్మను ఎఱింగి] * పురుషముపైతి దివ్యమ్ * (ము. ఉ. 3.2.8.) [దివ్యంబను పరమాకాశంబున ప్రకాశించి తన యనుభవంబును ఇచ్చు భగవంతునొందును.] * సహబ్రహ్మణా విపశ్చితా* (తై.ఆ. 2. 1. 2.) [అనేకవిధంబుగా చూడదగు జ్ఞానశాలియగు పరమాత్మతోగూడ.] * పరఞ్జ్యోతిరుపసంపద్య * (ఛా. ఉ.) [పరంజ్యోతినిబొంది.] * ముక్తోపసృప్య వ్యపదేశాచ్చ * (బ్ర. సూ. 1.3.2.) [ముక్తులు పొందదగిన పరమాత్మస్వరూపంబును శోధించుటవలనను] ఇత్యాదులు.

వెయ్యేల ? జీవాత్మ పరమాత్మలకు భేదము మోక్షధర్మమున స్పష్టముగా చెప్పబడియున్నది చూడుడు :— * సహి నారాయణో జ్ఞేయః సర్వాత్మా పురుషోహి సః। న లిప్యతే మలైశ్చాపి పద్మపత్రమివాంభసా॥ కర్మాత్మా త్వపరో యోఽసౌ మోక్షబంధైస్సయుజ్యతే। స సప్తదశకేనాపి రాశినా యుజ్యతేతు సః। * (భా. శాన్తి. 352. 14.) [సకలాంతర్యామియై సర్వవ్యాపియైయుండువాడు నారాయణుండగును. వాడు పద్మపత్రములోని నీరువలె కర్మంబులచే నంటబడడు. వానికన్న నిహీనుడై కర్మవశుడైయుండు జీవాత్మయే మోక్షబంధంబులను రెంటిని బొందును. వీడే పదియేడు రాసులతోను చేరును.]

దీనిచే, “సత్యమయిన లేక మిథ్యాభూతమైన ఉపాధిచే బ్రహ్మము ఆవరింపబడి, కుండలోనుండు దీపమువలె భేదవ్యవహారవిషయమైయుండి సంసరించును. ముక్తిలో జీవాత్మ పరమాత్మలకు భేదమేలేదు” అనుమతము శాస్త్రములచేతనే తిరస్కరింపబడినదని తేలినది.

ఇట్లు * పరమం సామ్యముపైతి * [పరమ సామ్యంబును బొందును] అని పరమాత్మతో నత్యంతసామ్యము చెప్పియుండుటచే జీవులనేకులుగా నుండియు * బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి * (ము. ఉ. 3. 2. 9.) [బ్రహ్మము నెఱింగినవాడు బ్రహ్మమే యగును] అని అభేదముగా చెప్పుటయు తగును. జీవుడును పరమాత్మయు శరీర శరీరిభావంబు నొందియుండుటచే భేదములేక ఒకే వస్తువుగాను వ్యవహరింపవచ్చును. అసలే భేదములేదని చెప్పినచో ఆపక్షమున ముక్తిదశలో భేదమును సామ్యంబును వచించువాక్యములు విరోధించును.

భేదము ఉపాధివశంబుచే నేర్పడినది అని చెప్పువారలు ముక్తస్వరూపంబునకే భంగమునొప్పుకొనవలయునుగాన వారలకు ముక్తి పురుషార్థము కాజాలదు. ముక్తిదశలో చెప్పిన భేదవాదమును విరోధించును.

ఈ సామ్యమే ముక్తిలో అభేదముగా * తద్భావ భావమాపన్నః తథాసౌ పరమాత్మనా। భవత్యభేదీ * (వి. పు. 6.7.95.) అని వ్యాఖ్యానము చేయబడియె. తత్=ఆ పరమాత్మయొక్క, భావ=జ్ఞానశక్త్యాది స్వభావములయొక్క, భావమ్=ఆవిర్భావంబును

ఆపన్నః=పొందినవాఁడై, పరమాత్మతో నభేదంబు నొందునని యర్థము. దీనిచే పరమాత్మగుణ సదృశములగు గుణంబులు జీవాత్మకు ఆవిర్భవించునని తేలినది. భేదమే లేదు అను పక్షమున రెండవభావశబ్దము వ్యర్థమగును. మఱియు, ముక్తిలో భేదము లెదనుటకు భావమేమనగా దేవుడు మనుష్యుడు ఇత్యాది భేదములు ఆత్మయందు లేదనుటయే. ఈ విషయము. ✤ దేవాదిభేదేఽపధ్వస్తే నాస్త్యేవావరణో హి సః ✤ (వి. పు. 2. 14. 33.) [దేవాదిభేదములు తొలగినచో ఆత్మలకు తారతమ్యమే లేదు.] అని స్పష్టముగా చెప్పబడెను. ఏలయనగా; ఆభేదములు శరీరము నాశ్రయించి ఆత్మకు ఆవరణముగా నుండును.

"ముక్తానాం పరమాగతిః" అనుచోట గతిశబ్దమునకు ఆశించి పొందదగినది అని యర్థము. దీనిచే పరమాత్మకును జీవునకును శేషశేషిభావము స్పష్టముగా నెఱింగింపబడియె. చూడుడు :— ✤ ఏతమానన్దమయమాత్మానము పసఙ్క్రమ్య ✤ (తై. ఆ. 2.8.6.) [ఆనందమయుండగు నీయాత్మను పొంది.] ✤ యేనయేన ధాతా గచ్ఛతి. తేన తేన సహ గచ్ఛతి। తద్యథా తరుణవత్సా వత్సమ్, వత్సో వా మాతరమ్ ✤ [శేషియెట్లెట్లు ఏగునో; అట్లట్లు వానితోగూడ వీడు నేగును. అది యెట్లనగా; ఆవు తనదూడను, దూడ ఆయావునువలె.] ✤ ఛాయా వా సత్త్వమనుగచ్ఛేత్ ✤ [నీడవలె శుద్ధసత్త్వుని వెంబడించును.] ✤ తథా ప్రకారమ్ ✤ [ఆతడెట్టులో వీడునట్టులే.]

జీవాత్మయొక్క స్వాభావికమగు ఈశేషత్వము జ్ఞానాదిగుణంబులువలె మోక్షదశలోకూడ నశింపదు. దానికావరణముగానుండిన అవిద్యాదులు నశించుటచే అధికముగా ప్రకాశించును. ✤ స్వేన రూపేణాభినిష్పద్యతే. ✤ (ఛా. ఉ. 8. 12. 2.) [తన రూపముతో ప్రకాశించును.] ✤ యథా న క్రియతే జ్యోత్స్నా మలప్రక్షాళనాన్మణేః। తథా హేయగుణధ్వంసాత్ అవబోధాదయో గుణాః। ప్రకాశ్యన్తే న జన్యన్తే నిత్యా ఏవాత్మనో హి తే। జ్ఞానం వైరాగ్య మైశ్వర్యమ్ ధర్మశ్చ మనుజేశ్వర। ఆత్మనో బ్రహ్మభూతస్య నిత్యమేతచ్చతుష్టయమ్ ✤ (వి. ధ.) [పులుకడగినరత్నము ప్రకాశించునట్లు ఆత్మమీదనుండు ప్రకృతియొక్క హేయగుణంబులు నశింపగా జ్ఞానాది గుణంబులు ప్రకాశించునుగాని అవి క్రొత్తగా పుట్టునవిగావు. ఏలయనగా; అవియన్నియునాత్మకు నిత్యముగానుండునవి. జ్ఞానము వైరాగ్యము ఐశ్వర్యము ధర్మము అను నీనాలుగును పరమాత్మసామ్యంబు నొందిన ఆత్మకు నిత్యములైనవి.] ✤ సంపద్యావిర్భావః స్వేన శబ్దాత్ ✤ (బ్ర. సూ. 4. 4. 1.) [పరమాత్మ ధర్మంబులు గల్గునని శ్రుతిచెప్పియుండుటచే పరమాత్మతో వీడు చేరునపుడు వీనిగుణంబులావిర్భవించును.]

అట్లయినచో, ✤ ఆప్నోతి స్వారాజ్యమ్ ✤ (తై. శీ. 6. 2.) [స్వారాజ్యంబు నొందును.] ✤ సస్వరాట్ భవతి ✤ (ఛా. ఉ. 7. 25. 2.) [వాడు స్వరాట్టగును.] అను శ్రుతుల నుదాహరించి సూత్రకారులు ✤ అత ఏవ చానన్యాధిపతిః ✤ (బ్ర. సూ. 4.4.9.) అని స్వతంత్రుడుగా నిర్ణయించియుండ, పరతంత్రుడనుట యెట్లుతగును. అంతియేకాక పరతంత్రుడన్నచో అయ్యది పురుషార్థంబగునా? అని శంకింపవలదు. ఏలయనగా;

అనన్యాధిపతి అనిన భగవంతునిదప్ప ఇతరములగు క్లేశకర్మాదులను అధిపతులుగా నొందినవాడు అని యర్థముగాని నాథుడే లేడు అని యర్థము లేదు. అట్లయినచో ‹ అనధిపతిః › [అధిపతియే లేనివాడు] అనియే చెప్పియుందురు. 'అనన్యాధిపతిః' అని చెప్పియుండరు. అంతేకాక, ప్రియతముడగు తనపతికి పరతంత్రముగా నుండుటను పురుషార్థముగాదని చెప్పుటయు తగదు. రాజునకు వానిపత్నులు పరతంత్రలై యుండియు దానిని (రాజపత్నిగానుండుటను) పురుషార్థముగా ప్రార్థించుచున్నారు గదా ?

ఇంక, గుణంబులచే నీశ్వరసామ్యంబును ప్రతిపాదించి వీనికి ప్రాధాన్యము చెప్పిన స్థలములలో శేషశేషిభావంబుదప్ప ఇతరభోగములు మాత్రము సమముగా నుండునని చెప్పబడియుండుటను చూడుడు :—

* జగద్వ్యాపారవర్జమ్, భోగమాత్ర సామ్యలిఙ్గాచ్చ * (బ్ర. సూ. 4.4.17,21.) [జగద్వ్యాపారమునదప్ప భోగమాత్రముచే వీనికిని వానికిని సామ్యము.] * పారతంత్ర్యం పరేపుంసి ప్రాప్య నిర్గతబంధనః । స్వాతంత్ర్యమతులం లబ్ధ్వా తేనైవసహ మోదతే * (వి. త.) [బంధంబునుండి వీడబడినవాడు పరమపురుషునియందు పారతంత్ర్యంబు నొంది పూర్వమువలె ప్రకృతివశుడు గాక శ్రేష్ఠమైన స్వాతంత్ర్యము లభించి వానితో రమించును.] * స్వత్వమాత్మని సఞ్జాతం స్వామిత్వం బ్రహ్మణిస్థితమ్ । ఉభయోరేష సంబంధః న పరోఽభిమతో మమ. * (వి. త.) [చేతనునియందు స్వత్వము (సొత్తుగా నుండుట) గలదు. పరబ్రహ్మంబునందు స్వామిత్వముగలదు. వీరలకుంగల ఈస్వస్వామి భావసంబంధముతప్ప వేఱు సంబంధము నాకభిమతంబుగాదు.]

మఱియు, నారాయణీయాదులయందు శ్వేతద్వీపవాసులు దివ్యరూపంబునరించి భగవద్దాస్యంబును గోరునట్లుదెల్పి, ముక్తులకుంగూడనిదియే లక్షణంబని నిరూపించిరి.

ముక్తానాం పరమా గతిః " పరమా గతిః " అని గతికి పరమా అను విశేషము చెప్పియుండుటచే ముక్తినొందువారలకు వీనికన్న సామాన్యమయిన గతి యొకటి గలదని తెలియును. అదియే కైవల్యమనబడును. ఇది జరామరణాదులు తొలగి కేవలము ఆత్మానుభవమే పురుషార్థముగా గోరువారలకేర్పడును. పరమ పదంబునకును సంసారము (ప్రకృతిమండలము) నకును మధ్యనుండునదీ లోకము.

భగవత్ప్రాప్తినే పరమగతిగా శాస్త్రములు ఘోషించుచున్నవి. * సోఽధ్వనః పారమాప్నోతి * (క. ఉ. 3. 9.) * ఆత్మలాభాన్న పరం విద్యతేఽన్యత్ * [ఆత్మ లాభంబునకన్న పరమైన పురుషార్థము మఱొకటి లేదు.] * సాకాష్ఠా సా పరాగతిః * (క. ఉ. 3. 11.) [అదియే మేర ; అదియే పరమగతి.] ఇత్యాదులు. (12.)

(అవతారిక.) దీనినే ఆయిదునామంబులచే నుపపాదించుచున్నారు :—

## 13. అవ్యయః. 14. పురుషః.

అవ్యయః = మఱలింపనివాడు. పురుషః = అధికముగా నిచ్చువాడు,

---

## 13. అవ్యయః.

"న వీయతే న వ్యపగమ్యతే అస్మాదితి అవ్యయః" దీనిని పొందినవాదు సంసారంబునకు మఱలడు.

సంసారసాగరంబునుదాటి కష్టపడి తనచరణారవిందంబును బొందినవానిని భగవంతుడు సంసారంబునకు మఱల పంపడు. కనుకనే శాస్త్రములిట్లు ఘోషించుచున్నవి.

* ఏతేన ప్రతిపద్యమానా ఇమం మానవ మావర్తన్నావర్తన్తే * [దీనిచే పొందువారలు ఈ మానవలోకంబునకు మఱలిరారు.] * నచపునరావర్తతే, నచ పునరావర్తతే * (ఛా. ఉ. 8. 15. 1.) [మఱలరాడు, మఱలరాడు.] * అనావృత్తిః శబ్దాత్, అనావృత్తిః శబ్దాత్ * (బ్ర. సూ. 4. 4. 22.) [శాస్త్రము మఱలడని చెప్పియుండుటచే పరమపదంబు నొందినవాడు తిరిగిరాడు.] * సత్త్వం వహతి సూక్ష్మత్వా పరం నారాయణం ప్రభుమ్। పరమాత్మానమాసాద్య పరం వైకుంఠ మీశ్వరమ్। అమృతత్వాయ కల్పేత న నివర్తేత వై పునః * (యా. స్మృ.) [సూక్ష్ముండగుటచే ప్రకృతికిపరుడై అంతట వ్యాపించినవాడై సర్వులకు గతియై సర్వస్వామియై పరమైన వైకుంఠంబును స్థానముగాగలవాడైయుండు పరమాత్మనుపొంది సత్త్వనిష్ఠుడగును. వాడు మఱలిరాడు.] * ప్రాప్నోతి పరమంస్థానం యత్ప్రాప్య న నివర్తతే * (హా.) [మఱలిరాని ఆపరమ స్థానంబును వాడు పొందును. (13.)

## 14. పురుషః. (407)

"పురు బహు, సనోతీతి పురుషః" ముక్తులకు అవాఙ్మనసగోచరంబగు తన గుణానుభవంబును అధికముగా ఇచ్చువాడు.

* ఏష హ్యేవానందయాతి * (తై. ఆ. 7. 1.) [వీడేగదా ఆనందింపజేయును.] * సోఽశ్నుతే సర్వాన్ కామాన్ సహ బ్రహ్మణా విపశ్చితా * (తై. ఆ. 1.2.) [సర్వజ్ఞుండగు పరబ్రహ్మతోగూడ వాడు సమస్తకామంబులను అనుభవించును.] * దివ్యేన చక్షుషా మనసా ఏతాన్ కామాన్ పశ్యన్ రమతే * (ఛా. ఉ. 8.12.5.) [దివ్యనేత్రంబను మనసుచే ఈ పురుషార్థంబులనంతచూచుచు రమించును.] * జక్షత్ క్రీడన్ రమమాణః * (ఛా. ఉ. 8. 12. 3.) [భుజించును క్రీడించును రమించును.] * కామాన్నీ కామరూపీ * (తై. భృ. 10. 5.) [అనేకరూపంబులను ధరించి కామమనబడు భగవద్గుణంబుల ననుభవించును.] (14.)

## 15. సాక్షీ. 16. క్షేత్రజ్ఞః.

సాక్షీ = చూచువాడు. క్షేత్రజ్ఞః = శరీరంబు నిచ్చువాడు.

---

## 15. సాక్షీ. (517)

"స్వయం సాక్షాత్కరోతీతి సాక్షీ" ఇట్లు వారలను ఆనందింపజేయుచు తానుగూడ ప్రీతుడై వారలను కటాక్షించుచు నుండును.

* బ్రాహ్మణా విపశ్చితా * (తై. ఆ. 1. 1. 2.) [అనేకవిధంబుగా చూడదగు జ్ఞానశాలియగు పరమాత్మతోగూడ సమస్త కామంబులను అనుభవించును. (15.)

## 16. క్షేత్రజ్ఞః.

(1) "క్షేత్రం జానాతీతి క్షేత్రజ్ఞః" ముక్తులకు తన యనుభవంబు నిచ్చుటకై దానికి దగిన శరీర మిట్టిదియని యెఱింగినవాడు.

(2) లేక, తన భోగసమృద్ధిగలుగులంబగుటచే పరమాకాశము క్షేత్రమనబడును. దానిని శరీరముగాగలవాడు అనియు జెప్పవచ్చును. * ఆకాశశరీరం బ్రహ్మ * (తై. శి. 6. 2.) [ఆకాశంబును శరీరముగాగలది బ్రహ్మము.]

శ్రీ నారాయణీయంబున * ముక్తానాన్తు గతిఃబ్రహ్మన్ క్షేత్రజ్ఞ ఇతి కల్ప్యతే * అని ముక్తప్రాప్యుడగు పరమపురుషుని క్షేత్రజ్ఞనామముచేతనే నిర్దేశింపబడి యుండుటం జూడుడు.

ముక్తులు భగవదనుభవము చేయుటకనియే యేర్పడిన స్థానమాకాశమగును. * పరమేవ్యోమన్ సోఽశ్నుతే * (తై. ఆ. 21.) [పరమాకాశంబున నాతడనుభవించును.] * స మోదేత త్రివిష్టపే * [ఆతడు మూడవలోకంబున సంతసించును.] * అపునర్భవభూపో రాశిర్మస్త్రిః * [మఱలజననంబును గోరకుండువారలకు అభీష్టంబును పెరుగజేసి రక్షించునది,] * యత్పురాణమాకాశం తత్ర మే స్థానం కుర్వన్ న పునర్భవాయ * [పురాతనమయిన ఆకాశంబుననుండు ఉత్కృష్టంబగు నా స్థానంబు నొందువాడు మఱల జనింపడు. * యద్గత్వా న నివర్తన్తే తద్ధామ పరమం మమ * (గీ. 8. 21.) [దేనినొంది మఱలడో; పరమమయిన ఆయియే నా స్థానము.] * శ్రుతి ప్రమాణాగమమఙ్గళైస్తు యుక్తే జరా మృత్యుభయాదతీతః। తతో నిమిత్తే చ ఫలే వినష్టే అలిఙ్గమాకాశ మలిఙ్గమిషః * (భా. మో.) [వేదాదులందు చెప్పినట్లు మోక్షాధికారి తనకుపలసిన అమానిత్వాది కల్యాణ గుణసంపన్నుడై భగవదుపాసనంబునుచేసి దానిచే జరామరణాది భయంబులందాటి పిమ్మట బంధహేతువయిన అవిద్యాదులును వానిఫలమగు బంధమును తొలగగా దేవమనుష్యాది లక్షణంబులుపోయి ప్రకృతిసంబంధములేని పరమాకాశంబును పొంది నిత్యముగా వసించును.] * ఏకాన్తినః సదా బ్రహ్మ ధ్యాయస్తే యోగినోహి యే। తేషాం తత్పరమంస్థానం యద్వై పశ్యన్తి సూరయః * (వి. పు. 1. 6. 39.) [ఏ యోగులు

17. అక్షరః (ప్రవచ). 18. యోగః.

అక్షరః = తగ్గనివాడు. యోగః = ఉపాయమైనవాడు.

పరబ్రహ్మము నే యాశ్రయించి సదా దానినే చింతించుచుందురో; వారలకు నిత్యసూరులు సదా అనుభవించు స్థానమగు పరమపదము లభించును.] * తన్మోక్షస్తత్పరం తేజః విష్ణోరితి వినిశ్చయః * (బ్రా.) [అదియే మోక్షము. అదియే విష్ణువుయొక్క పరంజ్యోతిస్వరూపమగు స్థానవిశేషము. అని వేదాంతనిశ్చయము.] * కార్యాణాం కారణం పూర్వం వచసాం వాచ్య ముత్తమమ్। యోగానామ్ పరమాం సిద్ధిమ్ పరమం తే పదం విదుః * (భా.) [కార్యములకంతయు కారణమై వాక్కులకంతకు ఉత్తమమయిన అర్థమై యోగులకు నుత్తమసిద్ధియైయుండు ఈ స్థానంబును పరమపదమందురు.] ఇత్యాది ప్రమాణములు అనేకములు గలవు.

ఆ పరమపదంబున 'అపరాజిత' అను నొక పట్టణము గలదు. ఆపట్టణంబున సహస్రస్తంభములుగల రత్నమంటపమునందు పర్యంకంబున లక్ష్మితోనుండు శ్రీమన్నారాయణుడు నిత్యముక్తులచే అనుభవింపబడునని ఛాందోగ్యము, తైత్తిరీయము, కాషీతకి మున్నగువానిలో ప్రసిద్ధము. (16.)

17. అక్షరః.

"న క్షరతీతి అక్షరః" ముక్తులచే నిట్లు అనవరతము ఎడతెగక అనుభవింప బడుచునుండియు గుణములు పైపైగా అభివృద్ధియగుచుండునే గాని తగ్గవు. (అనగా తగ్గని గుణములు గలవాడు.)

* నిరవద్యః పరప్రాప్తేః నిరధిష్ఠోఽక్షరక్రమః * (వి. ధ. 5. 1. 49) [పరుని పొందుటచే అవద్యంబులంతయుతొలగి ప్రకృతిలో అధిష్ఠానములేనివాడై నిర్వికారుడై ప్రకాశించును.]

ఈ క్రమముగానే శారీరకశాస్త్రమున నాలుగవ అధ్యాయంబున మోక్షస్వరూపము నిర్ణయింపబడియున్నది. ఈ నాల్గవ అధ్యాయంబున చెప్పినఫలము మోక్షము గాదనియు, ఇది సామాన్యఫల విషయమనియు కొందఱుచెప్పిరి. అట్లయినచో, క్రింది మూడధ్యాయంబులందు చెప్పిన సాధనములును ఉదహరించిన శ్రుత్యాదులును సామాన్యఫల విషయకంబులనియే తెలిసిపిమ్మట నవతరించిన యీ నాలుగవ యధ్యాయంబునకుం గూడ సామాన్యఫలమే విషయమన్నచో ఈ శారీరక శాస్త్రంబున మోక్షమే చెప్ప బడలేదు అని యేర్పడును గాన ఈ వాదము యుక్తియుక్తము గాజాలదు. (17.)

18. యోగః.

"యుజ్యతే ప్రాప్యతే అనేనేతి యోగః." దీనిచే మోక్షము పొందబడును గాన 'యోగః' అనగా ఉపాయము. ఇట్లు ముక్తులకు పరమప్రాప్యుడెవడో; వాడే ముక్తికింగూడ నిరుపాధికంబగు నుపాయము (సాధనము) అగును.

## 19. యోగవిదాం నేతా. 20. ప్రధానపురుషేశ్వరః.

యోగవిదాం నేతా = యోగవిత్తులను నిర్వహించువాడు. ప్రధానపురుషే శ్వరః = ప్రకృతికిని జీవకోటికిని నియామకుడు.

---

* ఏష హ్యేవానన్దయాతి * (తై. ఆ. 2. 6. 1.) [ఈతడేగదా ఆనందింప జేయును.] * తద్ధేతువ్యపదేశాచ్చ * (బ్ర. సూ. 1. 1. 15.) [వాడే కారణంబని చెప్పుట చేతను.] * అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః * (గీ. 18. 66.) [నేను నిన్ను సమస్తపాపంబులనుండి విడిపించెదను.] (18.)

## 19. యోగవిదాం నేతా.

'యోగవిదామ్' ఇట్లు తన్ను ఉపాయముగా స్వీకరింపక కర్మజ్ఞానాదులను ఉపాయముగా గొనినవారలకును, 'నేతా' ఫలపర్యన్తముగా అగునట్లు నిర్వాహకుడు.

* తేషామేవానుకమ్పార్థమ్ * (గీ. 10. 11) [వారలను అనుగ్రహించుటకు గానే.] * తేషామహం సముద్ధర్తా * (గీ. 12. 7.) [వారలను నేను ఉద్ధరించెదను.] (19.)

(అవతారిక.) దీనినే ఉపపాదించుచున్నారు.

## 20. ప్రధానపురుషేశ్వరః.

"ప్రధానస్య పురుషాణాఞ్చ ఈశ్వరః" బంధకారణంబగు ప్రకృతికిని, దానిచే బంధింపబడు జీవకోటికిని ఈశ్వరుడు నియామకుడు.

* సంయుక్తమేతత్ క్షరమక్షరంచ వ్యక్తావ్యక్తమ్ భరతే విశ్వమీశః । అనీశశ్చాత్మా బధ్యతే భోక్తృభావాత్ జ్ఞాత్వా దేవమ్ ముచ్యతే సర్వపాశైః * (శ్వే. ఉ. 1. 8.) [ఒకటిగాచేరి వ్యక్తముగాను అవ్యక్తముగాను (ఇంద్రియములకు కనబడునదిగాను కనబడకుండునదిగాను) ప్రకాశించు చేతనాచేతనరూపమగు సమస్త ప్రపంచంబును సర్వనియంతయగు భగవంతుడు భరించును. అందు జీవాత్మ కర్మవశుడై దానిఫలము ననుభవించువాడై పరవశుడైయుండుటచే బంధంబునకు లోబడును. పిమ్మట దేవుని ఎఱింగినచో సకలపాశంబులనుండి విడబడును.] * ప్రధానక్షేత్రజ్ఞ పతిర్గుణేశః * (శ్వే. ఉ. 6. 16.) [ప్రధానమనబడు అచేతనంబునకును, క్షేత్రజ్ఞుండనబడు చేతనునకును, పతి-గుణంబులకీశుడు.] * క్షరాత్మానావీశతే దేవఏకః * (శ్వే. ఉ. 1. 20.) [క్షరమనబడు అచేతనంబును ఆత్మను స్వయంప్రకాశుండగు భగవంతుడు పాలించును.]

ఇటులే భగవంతుడు తనమాయచే అపరాధమొనర్చినవారలను సంసారబంధంబున బంధించియు, తన్నాశ్రయించినవారలను సంసారబంబంధంబునుండి విడిపించియు క్రీడించును. * సంసారమోక్షస్థితి బంధహేతుః * [సంసారబంధమునుండి విడబడుటకును సంసారంబున కట్టుపడుటకును కారణభూతుడు.] (20.)

21. నారసింహవపుః. 22. శ్రీమాన్.
23. కేశవః. 24. పురుషోత్తమః.

నారసింహవపుః = నరసింహ రూపముగలవాడు. శ్రీమాన్ = సుందరుడు. కేశవః = కేశములు గలవాడు. పురుషోత్తమః = పురుషులకన్న నుత్తముడు.

---

(అవతారిక.) తనభక్తులకుగల్గు విఘ్నములను తొలగించువాడనుచున్నారు :—

## 21. నారసింహవపుః.

"నారసింహస్య వపుః యస్యసః నారసింహ వపుః" భక్తుడగు ప్రహ్లాదుని భయంబును తొలగించుటకై యాతడపేక్షించిన క్షణంబుననే దివ్యమగు నరసింహ రూపంబును ధరించినవాడు. (21.)

## 22. శ్రీమాన్ (180-222)

పరస్పరవిరుద్ధములగు మనుష్యరూపమును సింహరూపమును చేరియుండు రూపమును పరిగ్రహించినను సౌందర్యలావణ్యాదులచే అతిమనోహరముగా ప్రకాశించువాడు. నరరూప సింహరూపములుచేరిన యీ సౌందర్యంబును జూచినవారు శుద్ధ (కేవల) నరునో శుద్ధసింహమునో చూచినచో "ఇది యేమి వికారరూపము" అని ఏవగించునట్లు సుందరమయిన రూపముగలవాడు. అట్టి సుందరరూపంబును పరిగ్రహించి లోకములను గాపాడెను.

* దంష్ట్రాకరాలం సురభీతినాశనం కృత్వావపుర్దివ్య నృసింహరూపిణా। త్రాతం జగద్యేన * [కోరలచే భయంకరంబగు, దేవతలభయంబును తొలగించెడి నృసింహరూపంబును పరిగ్రహించి రెవనిచే ముల్లోకములు కాపాడపడినవో; వానిని నమస్కరింతము.] (22.)

(అవతారిక.) ఇట్టి సౌందర్యాదులకుం దగిన లక్షణంబేమనగా ;

## 23. కేశవః (654)

"ప్రశస్తాః కేశాః అస్యసన్తీతి కేశవః" ఆశ్చర్యములగు గుటిలంబులగు నీల కేశములం గలవాడు. (23.)

## 24. పురుషోత్తమః.

"పురుషేభ్యః ఉత్తమః పురుషోత్తమః" లోకసాధారణంబులగు లక్షణంబులు భగవంతునకున్నట్లు చెప్పుటచే ఆతడు సాధారణుడేమో అని శంకింపవలదు ; వాడు పురుషోత్తముడు. పురుషులకన్న ఉత్కృష్టుడు.

25. సర్వః. 26. శర్వః.

సర్వః = అంతట వ్యాపించియుండువాడు శర్వః = హింసించువాడు.

---

ఇచట, పురుషశబ్దముచే జ్ఞానవత్త్వము చెప్పబడుటచే జ్ఞానహీనంబగు అచేతనంబునకన్న ఉత్కర్షము చెప్పబడియె. 'ఉత్' పదంబుచే జ్ఞానవంతులగు చేతనులకన్న ఉత్కర్షము చెప్పబడియె. తమప్ ప్రత్యయముయొక్క సామర్థ్యంబువలన నేర్పడిన "తరప్" ప్రత్యయంబుచే నిత్యులకన్న నుత్కర్షము చెప్పబడియె. ఇట్లు ఆతడు సర్వోత్కృష్టుడని తేలినది.

ఈ యర్థము పరమగుహ్యంబని * ద్వావిమౌ పురుషౌ లోకే * (గీ. 15. 16.) అను ప్రకరణంబున గీతలో సాయించిరి. ఈ పురుషోత్తమ శబ్దంబుచే, భోక్తయగు చేతనుడు భోగ్యమగు ప్రకృతి, ప్రేరితయగు (ప్రేరకుడు) ఈశ్వరుడు అను ఈ మూడు తత్త్వములు ప్రత్యేకము భిన్నములుగా ఉండునట్లు ఏర్పడునుగాన బ్రహ్మమే వికారంబు నొందునను పక్షము నిరసింపబడియె.

బ్రహ్మ (పరబ్రహ్మ) మే వికారంబు నొందును అనియు, బ్రహ్మమే జననమరణాది సంసారంబు నొందుననియు శ్రీమన్నారాయణునికన్న నతిరిక్తమగుబ్రహ్మమొకటి గలదనియు, అవ్యక్తమును దానినుండి విడబడిన ముక్తులును ఈశ్వరుడును బ్రహ్మమున లయించి దానినుండి యుత్పత్తి నొందుచున్నారు అనియు ఇత్యాది పక్షములు పురుషోత్తమపదంబుతోను సమస్తవేదాంత సిద్ధాంతంబులతోను విరోధించును.

## 25. సర్వః.

"సరతి గచ్ఛతీతి సర్వః" ఇట్లు దేనిని అపేక్షింపక లోకవిలక్షణంబగు తనస్థితికి దగినట్లు ఉపేక్షింపక సకలంబును శరీరమువలె అభిమానించి అంతట వ్యాపించి యుండువాడు. ఈ వ్యాప్తివలననే భగవంతుడు సర్వస్వరూపిగా జెప్పబడియె.

* అసతశ్చ సతశ్చైవ సర్వస్య ప్రభవాప్యయః। సర్వస్యచ సదాజ్ఞానాత్ సర్వమేనం ప్రచక్షతే * (భా. ఉ. 70. 13.) [అసత్తును సత్తును అగు సమస్తంబునకును పుట్టుస్థలముగాను నెలవుగానునయి సమస్తంబును ఎల్లప్పుడును ఎఱుంగుటచే నీతడు సర్వుడనబడును.] * యేన సర్వమిదం ప్రోతమ్ * అని యారంభించి * సవై సర్వమిదమ్ * (తై. నా. 6. 50.) అనునంతవఱకు వేదములోను స్పష్టము. * సర్వం సమాప్నోషి తతోసి సర్వః * [సమస్తంబును వ్యాపించియుండుటంజేసి నీవు సర్వపదవాచ్యుడగుదువు.] ఇత్యాదులు. (25.)

## 26. శర్వః.

"అశుభం శృణాతి హింసతీతి శర్వః" తనకు శరీరభూతులగు ప్రాణులయనిష్టంబులను నశింపజేయువాడు. (26.)

**27. శివః** **28. స్థాణుః.**

శివః = మంగళకరుడు. స్థాణుః = దృఢముగా నుండువాడు.

---

## 27. శివః (607)

" శేరతే తే అస్మిన్ ఇతి శివః " వారలకు శుభంబును ఇచ్చువాడు.

* శాశ్వతమ్ శివమ్ అచ్యుతమ్ * (తై.నా. 6.11.) [స్థిరమైనదియు మంగళమైనదియు తొలగనదియు] * స్మృతే సకలకల్యాణభాజనమ్ * (వి. ధ.) [వానిని తలంచినంతనే సకల కల్యాణంబులకును పాత్రుడగును.] * మంగళమ్ భగవాన్ విష్ణుః * [షాడ్గుణ్య పరిపూర్ణుండగు భగవంతుడు మంగళరూపి.] * మంగళాయతనం హరిః * [మంగళంబునకు స్థానము హరి.] * మంగళానాఞ్చ మంగళమ్ * (భా. అను. 149. 10.) [మంగళముల కంతకు మంగళము.] * మఙ్గల్యమ్ మఙ్గలమ్ విష్ణుమ్ * [మంగళకరుండును మంగళంబు నగు విష్ణువును.] ఇత్యాదులు. (27.)

## 28. స్థాణుః.

"తిష్ఠతీతి స్థాణుః" అనుగ్రహ విషయంబున దృఢముగా నిలుచువాడు.

భగవత్సంబంధము. ప్రాయశ్చిత్తాదిసామాన్యధర్మమువలెనో. కారీరి-చిత్ర-దర్శపూర్ణమాసాదులవలెనో అపేక్షితంబునుమాత్రమొసగి తన ఋణము (అప్పు) తీర్చినట్లు విరమించునదిగాదు. ప్రబల విఘ్నంబులచే నడ్డుపడునదిగాదు. నశించునదిగాదు. అపహరింపబడునదిగాదు. సమస్తాశుభంబులను తొలగించి సకలాభీష్టంబులను ఒసంగిన పిమ్మట గూడ విశ్రమింపక శాశ్వతముగా ప్రకాశించును.

* ఏకో బహూనామ్ యో విదధాతి కామాన్ * (శ్వే.ఉ. 6. 13.) [ఒకడై పలువురకు నెవడు సమస్తాభీష్టంబులనిచ్చునో.] * ఏతద్ధ్యేవాక్షరం జ్ఞాత్వా యో యదిచ్ఛతి తస్య తత్ * [అక్షరస్వరూపుండగు వీనినే యెఱింగినచో, ఎవడు దేనిని గోరునో; వానికది చేకూరును.] * సకల ఫలప్రదోహి విష్ణుః * [సకల ఫలంబులను నొసంగువాడువిష్ణువే గదా ?] * రత్నపర్వత మారుహ్య యథా రత్నమ్ నరో మునే। సత్త్వానురూపమాదత్తే తథా కృష్ణాత్ మనోరథాన్ (వి. ధ. 7.3.) [రత్నపర్వతంబునెక్కి యెట్లురత్నములను శక్తియున్నకొలది కైకొనునో; అటులే కృష్ణునుండి మనస్సులోతలంచినవానినంతయు గైకొనును.] * భౌమం మనోరథమ్ స్వర్గమ్ స్వర్గివన్ద్యం చ యత్పదమ్। ప్రాప్నోత్యారాధితే విష్ణౌ ముక్తిమప్యతిదుర్లభామ్ * (వి. పు. 3.8.6.) [విష్ణువునారాధించినచో భూమిలోని కోరికలను స్వర్గంబును స్వర్గవాసులు గొనియాడదగిన పదంబును అతిదుర్లభంబగు ముక్తిని పొందును.] * యద్దుర్లభమ్, యదప్రాప్యం మనసోయదగోచరమ్। తదస్య ప్రార్థితం ధ్యాతః దదాతి మధుసూదనః * [ఏది దుర్లభమో, ఏది అప్రాప్యమో, మనసునకును ఏది అగోచరమో, దానింగూడ ప్రార్థింపకయే ధ్యానమాత్రంబుననే భగవంతుడిచ్చును.] (28.)

## 29. భూతాదిః. 30. నిధిరవ్యయః.
## 31. సంభవః. 32. భావనః.

భూతాదిః = ప్రాణులచే గ్రహింపబడువాడు. నిధిరవ్యయః = నాశములేని నిధిగా నుండువాడు. సంభవః = అంతట అవతరించువాడు. భావనః = ఉజ్జీవింప జేయువాడు.

---

### 29. భూతాదిః.

“భూతైః ఆదీయతే ఉపాదీయతే ఇతి భూతాదిః” ఇట్లు స్పృహణీయుడుగా (కోరదగినవాడుగా) నుండుటచే సమస్తప్రాణులచేతను గ్రహింపబడుచున్నాడు.

* కిమ్ ప్రజయా కరిష్యామో యేషామ్నోఽయమాత్మా * (బృ. ఉ. 6. 4. 22.) [ఈ పరమాత్మ లేనంతవఱకు ప్రజలతోనే కార్యము చేయగలము.] * ఏతేవయం సర్వ సమృద్ధకామాః ఏషామయంనో భవితా ప్రశాస్తా * [మాకు వీడు స్వామికాగలడు గాన మేము సమస్త సమృద్ధులను సకలాభీష్టంబులను పొందినవారైతిమి.] (29.)

### 30. నిధిరవ్యయః.

“అవ్యయః = నాశములేని, నిధిః = నిధి.” కన్నుకనే జపంబులచే మహాధనమువలె రక్షింపబడును. సర్వదా సకలవిధంబుగా అనుభవించినను కొంచమైనను తగ్గని నిధివలె ప్రకాశించువాడు.

* తద్యథా హిరణ్య నిధిమ్ నిహితమ్ * (ఛా. ఉ. 8.3.2.) [సువర్ణమయమయిన నిధిని గుహలో పెట్టియుండునట్లుండును.]

### 31. సంభవః.

“సమంతాత్ భవః యస్యసః” నిధివలె జాగరూకతతో పెట్టబడియుండియు తన్నుగోరిన వారలను సంశ్లేషింపగోరి రామకృష్ణాద్యనేకరూపంబులనెత్తి పలుసారులు అంతట ఆవిర్భవించువాడు.

“బహుధా విజాయతే” (పు. సూ. 21.) [పలువిధములుగా పుట్టుచున్నాడు.] * బహూని మే వ్యతీతాని జన్మాని * (గీ. 4. 5.) [నాకు అనేకజన్మములు గడచినవి.] * యదాయదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత। అభ్యుత్థానమధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్ * (గీ. 4. 7.) [ఎప్పుడెప్పుడు ధర్మమునకు హానిగల్గునో; అధర్మము వృద్ధియగునో; అప్పుడప్పుడు నేను పుట్టుదును.] (31.)

### 32. భావనః.

“భావయతి ఉజ్జీవయతీతి భావనః” ఇట్లవతరించి అనిష్ట నివారణాదులచే సాధువులను ఉజ్జీవింపజేయువాడు.

## 33. భర్తా.   34. ప్రభవః   35. ప్రభుః.

భర్తా=పోషించువాడు. ప్రభవః=ఉత్కృష్టమగు జన్మముగలవాడు.
ప్రభుః=సమర్థుడు.

---

* పరిత్రాణాయ సాధూనామ్ * (గీ. 4. 8.) [సాధువులను రక్షింప చేసు పుట్టెదను.] (32.)

## 33. భర్తా.

"బిభర్తి పుష్ణాతీతి భర్తా" వారలకు తన్నే ఇచ్చి పోషించువాడు. (33.)

## 34. ప్రభవః.

"ప్రకృష్టః భవః జన్మ యస్యసః" ఇట్లు ఆతడవతరించుట ఆతనికి ఉత్కర్షంబుగాన ఉత్కృష్టమగు జన్మము గలవాడు. జన్మమునకుత్కర్షమనగా దోషగంధము లేకుండుటయు దీని నెఱింగినంతనే సకలజన్మంబులును నిర్మూలనంబగుటయు.

* అజాయమానః బహుధా విజాయతే, తస్య ధీరాః పరిజానన్తి యోనిమ్ * (పు. సూ. 21.) [పుట్టుకలేనివాడు పలువిధంబుగా పుట్టును. బుద్ధిమంతులలో శ్రేష్ఠులు (ధీరాః=ధీమతామగ్రేసరాః) ఆజన్మహేతువు నెఱుంగుదురు. * నైష గర్భత్వమాపేదే నయోన్యామవసత్ప్రభుః। ఆత్మనస్తేజసాకృష్ణః సర్వేషాం కురుతే గతిమ్ * (భా. స. 62. 35.) [ఈతడు గర్భరూపంబు దాల్చలేదు. యోనివాసము చేయలేదు. తన తేజసుచేతనే సర్వులకును గతిని గల్గించును.] * అప్రమేయ మనాద్యన్తమ్ కామాజ్జాతమజమ్ నృప। ప్రాణవస్త్వర్కయామాస కర్మభిః దేవసమ్మతైః * (భా.) [అపరిచ్ఛిన్నుడై ఆద్యంతరహితుడై యుండియు తన యిచ్ఛచే మనుష్యుడుగా పుట్టియున్నాడని అర్జునుడు కృష్ణుని దైవికచేష్టలచే నెఱింగెను.] * జన్మకర్మచ మే దివ్యమ్ ఏవం యో వేత్తి తత్త్వతః। త్యక్త్వా దేహం పునర్జన్మనైతి మామేతి సోఽర్జున * (గీ. 4. 9.) [అర్జునా! నాజన్మములును నాకర్మములును నాకే ఆశ్చర్యముగానుండును. దీని నెఱింగినవాడు మఱల జన్మంబు నొందడు. నన్నే పొందగలడు.] (34.)

## 35. ప్రభుః (300)

"ప్రభవతీతి ప్రభుః" ఇట్లు పారతంత్ర్యము నిండియుండు మనుష్యాది జన్మంబులం దవతరించినను ప్రతిజన్మంబునను బ్రహ్మేంద్రాదులకుంగూడ దుర్లభములగు భోగ-మోక్షాదిఫలంబుల నిచ్చుటలో సమర్థుడు. ఈ వృత్తాంతము చింతయన్తి శిశుపాలాదులకు సాయుజ్యంబు నిచ్చుటచే స్పష్టము. (35.)

36. ఈశ్వరః. 37. స్వయమ్భూః.

ఈశ్వరః=ఐశ్వర్యము గలవాడు. స్వయమ్భూః=స్వేచ్ఛచే అవతరించువాడు.

---

## 36. ఈశ్వరః. (75)

"ఈష్టే ఇతి ఈశ్వరః." పరమపదంబున పరమేష్ఠిగానుండుటకన్న అవతారంబున తనయైశ్వర్యము అధికముగాను పయోగపడుటచే అవతారంబులందు ఐశ్వర్యముగలవాడు.

* మానుషీమ్ తనుమాశ్రితమ్। పరంభావమజానన్తః * (గీ. 9. 11.) [మనుష్య శరీరంబు నొందియుండు నాయొక్క మహత్త్వంబు నెఱుంగక మూఢులు నన్ను అవమానించుచున్నారు.] * భూతానామీశ్వరోఽపి సన్ * (గీ. 4. 6.) [భూతములకు నీశ్వరుడుగానుండియు నామాయచే (సంకల్పముముచే) పుట్టెదను,] ఇత్యాదులు. (36.)

## 37. స్వయంభూః.

"స్వయమేవ భవతీతి స్వయంభూః" ఇట్లింత వైభవంబు వచ్చుటకు గారణంబేమనగా ; లీలాది తనప్రయోజనంబులకై, తన యిచ్ఛచే తనకే యసాధారణంబగు పరమసత్త్వమయంబగు ప్రకృతిని దేవతిర్యఙ్మనుష్యాది సజాతీయముగావించుకొని స్వయముగా అవతరించుటచే బ్రహ్మాదులువలె ఇతరులకు పరతంత్రముగాకుండుటచేతనే (ఇంత మహిమంబు గల్గినది.)

* స్వయంభూః బ్రహ్మ పరమం కవీనామ్ * [తనకుతానే బుట్టినబ్రహ్మము కవులగు నిత్యసూరులకన్న నుత్కృష్టమైనది] * ప్రకృతిమ్ స్వామ్ అధిష్ఠాయ సంభవామ్యాత్మమాయయా * (గీ. 4. 6.) [నా ప్రకృతితోనే నా సంకల్పముచే నేనే పుట్టెదను.] * బ్రహ్మ తేజోమయం దివ్యమాశ్చర్యం దృష్టవానసి। అహమ్ స భరతశ్రేష్ఠ! మత్తేజస్తత్సనాతనమ్। ప్రకృతిస్సా మమ పరా వ్యక్తావ్యక్తాచ భారత। తాం ప్రవిశ్య భవన్తీహముక్తా భరతసత్తమ * (హ. వం.) [వైదికపుత్రానయనఘట్టమున లీలోపకరణంబులగు రెండు ప్రకృతులను వివరించినపిమ్మట బ్రహ్మతేజోరూపమై ఆశ్చర్యమై దివ్యమైయుండు దేనిని చూచితివో? ఓ భరతశ్రేష్ఠా! నేనే అది, అది సనాతనమైన నా తేజమే. ఉత్కృష్టమైన నా ప్రకృతి వ్యక్తముగాను అవ్యక్తముగాను ఉండును. వానిని బ్రవేశించియే ముక్తులందఱు సత్తనొందుదురు.] * సర్వలోకేశ్వరః సాక్షాత్ లోకానాం హితకామ్యయా * (శ్రీ. రా.) [లోకంబుల ననుగ్రహింప సాక్షాత్ సర్వేశ్వరుండు అవతరించె.] * సహి దేవైరుదీర్ణస్య రావణస్య వధార్థిభిః। అర్థితో మానుషే లోకే జజ్ఞే విష్ణుః సనాతనః * (శ్రీ. రా. అ. 1. 7.) ] రావణవధముం గోరిన దేవతల ప్రార్థనంబుమీద శ్రీమన్నారాయణుండు ఈలోకంబున అవతరించె.] (37.)

38. శంభుః. 39. ఆదిత్యః. 40. పుష్కరాక్షః.

శంభుః = సుఖమును గల్గించువాడు. ఆదిత్యః = సూర్యమండలవాసి.
పుష్కరాక్షః = పుండరీకాక్షుడు.

---

## 38. శంభుః.

'శం = సుఖం, భావయతీతి శంభుః' ఇట్లవతరించి తనసౌందర్యసౌశీల్యాది గుణంబులను ప్రకటించుటచే జనులకు సుఖమును గల్గించువాడు.

* విశ్వాక్షమ్ విశ్వశంభువమ్ * (తై. నా. 6-11) [సమస్తంబును చూడదగిన నేత్రములు గలవాడై సమస్త మంగళంబులకును జన్మస్థానమైయుండు వానిని.] * రూపౌదార్యగుణైః పుంసామ్ దృష్టిచిత్తాపహారిణమ్ * (శ్రీ. రా. అ. 3.29) [రూపము ఔదార్యము గుణము వీనిచే పురుషుల మనస్సును దృష్టిని ఆకర్షించువానిని] * చన్ద్రకాన్తాననం రామమతీవ ప్రియదర్శనమ్ * (శ్రీ. రా. అ. 3. 28) [చంద్రునికన్న మనోహరమయిన ముఖముగల అతి ప్రియముతో చూడదగిన శ్రీరామచంద్రునిజూచి తృప్తినొందలేదు.] (38.)

(అవతారిక.) ఇక నీయవతారంబులకు నుదాహరణముగా సూర్యమండలంబున వసించు పురుషుని జెప్పుచున్నారు.

## 39. ఆదిత్యః. (568)

"ఆదిత్యః నివాసః అస్యేతి ఆదిత్యః" భగవంతుడు సూర్యమండలంబున వసించునట్లు బ్రహ్మమీమాంసాదులలోగలదు.

* అన్తస్తద్ధర్మోపదేశాత్ * (బ్ర. సూ. 1-1-21) [ఆతని ధర్మంబులు చెప్పబడియుండుటచే ఆసూర్యమండలంబున నాతండు గలడు.] * ఏషోఽన్తరాదిత్యే హిరణ్మయః పురుషోదృశ్యతే (ఛా. ఉ. 1-6-6) [సూర్యమండలమధ్యంబున సువర్ణరూపియగు పురుషుడిదిగో కనబడుచున్నాడు.] * స యశ్చాయంపురుషే। యశ్చాసావాదిత్యే * (తై. అ. 2. 8. 5.) [సూర్యమండలంబుననుండువాడే వాడు.] * ధ్యేయస్సదా సవితృమండల మధ్యవర్తీ నారాయణః సరసిజాసనసన్నివిష్టః। కేయూరవాన్ మకరకుండలవాన్ కిరీటీ హారీ హిరణ్మయవపుః ధృతశంఖచక్రః * (బృ. ప) [సూర్యమండల మధ్యంబుననుండు పద్మాసనంబున నుపవిష్టుడై కేయూరములు (బాహుపురి) మకరకుండలంబులు కిరీటము హారములుగల సువర్ణశరీరముగల్గిన శ్రీమన్నారాయణుడు ధ్యానింపదగినవాడు.] (39.)

## 40. పుష్కరాక్షః. (561)

'పుష్కరవత్ పుణ్డరీకవత్ అక్షిణీ యస్యసః' సర్వైశ్వర్యత్వ చిహ్నమగు * తామరను బోలిన కన్నులుగలవాడు.

## 41. మహాస్వనః. 42. అనాదినిధనః.

మహాస్వనః = పూజ్యమగు శబ్దముగలవాడు. అనాదినిధనః = ఆద్యన్తము లేనివాడు.

---

* తస్య యథా కప్యాసం పుణ్డరీకమేవమక్షిణీ * (ఛా. ఉ. 1-6-7) [సూర్యునిచే వికసింపబడిన తామరలవలెనుండు నేత్రములు గలవాడు. (40.)

(అవతారిక.) వానికే వేదైకలక్షణము చెప్పుచున్నారు.

## 41. మహాస్వనః.

"మహాన్ స్వనః యస్యసః మహాస్వనః"

ఈ పదంబునకు మూడువిధములుగా అర్థము నుడువుచున్నారు.

(1) * తస్య ఉదితినామ * (ఛా. ఉ. 1-6-7.) [వానికి ఉత్ అని పేరు.] అనినట్లు 'ఉత్' అను నామముగలవాడు.

(2) * సైషా త్రయ్యేవ విద్యా తపతి య ఏషో౽న్తరాదిత్యే హిరణ్మయః పురుషః * (తై. నా 6-13) [సూర్యమండలమధ్యంబున స్వర్ణమయపురుషుడై ప్రకాశించునది సాక్షాద్వేదస్వరూపమయిన బ్రహ్మవిద్య.] అనినట్లు సూర్యమండలవర్తియగు భగవంతుని నామరూపంబులు వేదంబున జెప్పబడియుండుటచే వేదంబను పూజ్యమగు శబ్దముగలవాడు.

(3) * విద్యాసహాయవన్తం మామ్ ఆదిత్యస్థం సనాతనమ్ * (భా. మో.) [సావిత్రీవిద్యా ప్రతిపాద్యుడై సూర్యమండల మధ్యంబుననుండు సనాతనుండగు నన్ను] అనినట్లు సావిత్రీవిద్యాప్రతిపాద్యుండగుటచే పూజ్యమయిన శబ్దముగలవాడు.

## 42. అనాదినిధనః.

"న విద్యేతే ఆదినిధనే అస్యేతి అనాదినిధనః" నిత్యయౌవనుండగుటచే ఉత్పత్తి జర (ముసలితనము) మున్నగు దోషములు లేక నిత్యముగా ప్రకాశించు దివ్యమంగళవిగ్రహము (విగ్రహము = శరీరము) గలవాడు.

ఈనామము భగవంతునియాత్మస్వరూపమునకు నిత్యత్వమును చెప్పునది అని కొందఱందురు అది తప్పు. ఆత్మస్వరూపంబునకు ఆద్యంతంబులు లేకుండుట బ్రహ్మాది సకలాత్మ సాధారణంబగుటచే నియ్యది యొక యుత్కర్షము కాజాలదు గాన ఇది దివ్యమంగళవిగ్రహ విషయముగానే యగును.

* భారూపస్సత్యసంకల్పః * (ఛా. ఉ. 3-14-2.) [కాంతిరూపుడై సత్యసంకల్పుడై] * హిరణ్మయః పురుషః * (తై. నా. 6-13) [స్వర్ణమయుండగు పురుషుడు.] * విద్యుతః పురుషాదధి * (తై. నా. 6-1-8.) [మెఱుపువంటి పురుషుని

మీద.] * ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్ * (పు. సూ. 20) [తమస్సుకు అప్రకృ-(అవల) సూర్యవర్ణుడై ప్రకాశించువాడు.] * సర్వకర్మా సర్వగన్ధః సర్వరసః * (ఛా. ఉ. 3_14_2) [సమస్తకర్మస్వరూపుడు. సమస్తగంధస్వరూపుడు. సమస్తరస స్వరూపుడు.] * రుక్మాభం స్వప్నధీగమ్యం విద్యాత్తు పురుషం పరమ్ * (మ. స్మృ.-12_122) [స్వర్ణశరీరుడై స్వప్నబుద్ధి విషయుడైయుండు ఆపరమ పురుషుని ఎఱుంగగలడు) * పురుషః పుణ్డరీకాభః * (వ. పు.) [తామరసుబోలిన కాంతిగలవాడు.] ఇత్యాదిశ్రుతిస్మృత్యాదులచే భగవంతునకభిమతంబులగు సౌందర్యయౌవనాది గుణంబులు నిండియుండుటచే తానే కోరి పరిగ్రహించిన నిత్యమయిన రూపమున్నట్లు తేటపడుచున్నది.

* సదైకరూప రూపాయ * (వి. పు. 1_2_1.) [ఎప్పుడు నొక్కరీతిగానుండు రూపముగలవాడు.] * శ్రీవత్సవక్షాః నిత్యశ్రీః * (శ్రీ-రా. 114_15) [శ్రీవత్సంబను మచ్చను వక్షమున గలవాడును ఎల్లప్పుడు లక్ష్మిని గలవాడును.] * సఏవ భగవాన్ కాలః సర్వమాత్మవశం నయేత్ * (పా.) [కాలస్వరూపియగు ఆభగవంతుడే సర్వంబును తన వశము గావించును.] * నాస్తి విష్ణోః పరంతత్త్వం తస్యకాలాత్పరా తనుః * [విష్ణుని మించిన పరతత్త్వములేదు. వాని శరీరము కాలాతీతము.] అనియు వీనికి శరీరముండునట్లు స్పష్టముగా చెప్పబడియుండుటచేతను, సర్వదా కారణావస్థలోనుండుటచేతను, తమస్సుకుపైగా నుండుటచే జన్మాదిదోషములు లేకుండుటచేతను ఇట్టి దివ్యమంగళ విగ్రహయుక్తుని ఉపాసించువానికి అట్టి విగ్రహము లభించునట్లు తెల్పు తత్క్రతు న్యాయంబుచేతను, ఈ దివ్య శరీరము నిత్యముగా నుండునట్లు నిశ్చయమయ్యెడిని.

శాస్త్రములిట్లు భగవంతునకు శరీరముండునట్లు స్పష్టముగా దెల్పియుండ, భగవంతునకు శరీరము ఆగంతుకము (వచ్చిచేరినది) అనియు, అనిత్యము అనియు చెప్పు యుక్తులకు ప్రసక్తియే లేదు. దీనికి దగినట్లు రూపములేదు అని యుపపాదించు వాక్యములకు హేయరూపము లేదనియే అర్థము చెప్పనగును.

* న భూతసంఘసంస్థానః దేహోఽస్య పరమాత్మనః। న తస్య ప్రాకృతా మూర్తిః మాంసమేదోఽస్థి సంభవా * [ఈ పరమాత్మదేహము పంచభూతంబుల కూడికచే నేర్పడినదిగాదు గాన వానిరూపము మాంసాదులచే నేర్పడిన ప్రాకృత శరీరముకాదు.] అని స్పష్టముగా నీవిషయము చెప్పబడియుండుటంజూడుడు. సూత్రకారులవలె * రూపంవాతీంద్రియమన్తఃకరణప్రత్యక్షనిర్దేశాత్ * [అంతఃకరణంబుచే ప్రత్యక్షీకరింపబడునట్లు చెప్పబడియుండుటచే ఇంద్రియంబులకు అగోచరంబగు శరీరముండుటయు దగును.] అని వాక్యకారులును, * అఞ్జసైవ విశ్వసృజో రూపమ్ * [జగత్కర్తకు రూపముండుట ఉచితమే] అని ద్రమిడ భాష్యకారులును ఆదిత్య మణ్డలాంతర్వర్తియగు పరబ్రహ్మమునకు నిత్యశరీరమున్నట్లు నిరూపించియున్నారు.

కనుకనే అవతారములందుకూడ భగవచ్ఛరీరంబులకు ఆద్యంతంబులు లేవు. లోకమున తెరలోనుండి బయటవచ్చునట్లు పరమపదంబునుండి వచ్చును పోవును. * భుజైశ్చతుర్భిః సహితం మమేదం రూపం విశిష్టం దివి సంస్థితంచ। భూమాగతం

43. ధాతా. 44. విధాతా.

ధాతా = ధరించువాడు. విధాతా = ఆవిర్భవింపజేయువాడు.

---

పూజయత్రాప్రమేయం సదాపి తస్మిన్ నివసామి దేవాః * [చతుర్భుజంబులతోగూడిన నాయీశరీరము, విలక్షణమై దేవలోకంబునందు ఉండి ఇప్పుడు భూమిలో అవాఙ్మనస గోచరమై ప్రకాశించును. ఓ దేవతలారా! అట్టిదానిలో నేనెప్పుడు వసించెద.] * స్వలోకమాగచ్ఛ గతజ్వరః చిరం సురేంద్రగుప్తమ్ గతదోషకిల్బిషమ్ * (శ్రీ.రా. బా. 15_33) [విష్వక్సేనులచే పాలింపబడిన నీలోకంబునకు వచ్చి చేరుము.] * వివేశ వైష్ణవం తేజః సశరీరః సహానుగః * (శ్రీ. రా. ఉ. 110_12) [శరీరంబుతోగూడి తమ్ముడును తానును వైష్ణవతేజంబును ప్రవేశించెను.] అని యీ విషయంబును మహర్షులు పరమ రహస్యముగా జెప్పిరి. (42)

(అవతారిక.) కారణభూతుడగు భగవంతునకు బ్రహ్మాదులకన్న వైలక్షణ్యంబును దెల్పుచున్నారు.

## 43. ధాతా. (951)

"గర్భం దధాతీతి ధాతా" భగవంతుడు కారణంబయ్యు బ్రహ్మాదులకన్న ఈతనికింగల భేదమేమనగా; సకలకారణమై అచిత్సమష్టియయిన ప్రకృతియందు చిత్సమష్టియగు బ్రహ్మయను గర్భంబును ధరించువాడు. (బ్రహ్మదేవునే సృజించువాఁడు అని భావము.)

* మమ యోనిర్మహద్బ్రహ్మ తస్మిన్ గర్భం దధామ్యహమ్ * (గీ. 14_3) [ప్రకృతి, నాజేయు ప్రాణి సృష్టికి గారణమైనది. దానిలో నేను నాచేతనప్రకృతిని గర్భముగా ధరించుచున్నాను.] * ధాతా క్షేత్రే కర్మబీజభూతం గర్భం దధాతి * (మా. సం.) [సర్వస్రష్ట క్షేత్రంబున కర్మంబునకు బీజమయిన గర్భంబును ధరించుచున్నాడు.] * అప ఏవ ససర్జాఽఽదౌ తాసు వీర్యమపాసృజత్ * (మ స్మృ. 1_8) [ఆదిలో జలంబునే సృజించెను. వానిలో వీర్యంబును విడిచెను.] ఇత్యాదులు. (43.)

## 44. విధాతా. (485)

"తం గర్భం విదధాతి ఆవిర్భావయతీతి విధాతా" = ఆ గర్భంబును ఆవిర్భవింపజేయువాడు.

* యో బ్రహ్మాణం విదధాతి పూర్వమ్ * (శ్వే. ఉ. 6_18) [ఎవడు మొట్టమొదట బ్రహ్మదేవుని కలిగించునో.] * అథపునరేవ నారాయణః * [మఱియు బిమ్మట నారాయణుండు] అని యారంభించి, * తత్ర బ్రహ్మా చతుర్ముఖోఽజాయత * [వానినుండి చతుర్ముఖబ్రహ్మ జనించెను.] * తస్మాద్విరాడజాయత * (పు. సూ. 5) [వానినుండి విరాట్టుపుట్టెను] * హిరణ్యగర్భం పశ్యత జాయమానమ్ * [ఇదిగో బ్రహ్మదేవుడు

## 45. ధాతురుత్తమః. 46. అప్రమేయః. 47. హృషీకేశః.

ధాతురుత్తమః = బ్రహ్మదేవునికన్న నుత్కృష్టుడు. అప్రమేయః = అపరిచ్ఛేద్యుడు. హృషీకేశః = ఇంద్రియములకు నీశుడు.

---

పుట్టుచున్నాడు చూడుడు.] * తస్మిఞ్జజ్ఞే స్వయం బ్రహ్మా సర్వలోకపితామహః * (మ. స్మృ. 1-9.) [దానినుండి సర్వలోకపితామహుండగు బ్రహ్మదేవుడు జనించెను.] ఇత్యాదులు.

(అవతారిక.) ఈ సృష్టికర్తృత్వము బ్రహ్మదేవాదులకునుండుటచే నీతడు వారలలో నొకడాయన్న ; కాదు. వారలకన్న విలక్షణు డనుచున్నారు:—

## 45. ధాతురుత్తమః.

ధాతుః = బ్రహ్మదేవునకన్న, ఉత్తమః = ఉత్కృష్టుడు.

బ్రహ్మదేవునకన్న నుత్తముడన్నప్పుడే యాతడు సృజించిన ప్రజాపతులు మున్నగు వారలకును ఉత్కృష్టుడని తనంతటనే యేర్పడుటచే నయ్యది ప్రత్యేకముగా జెప్పవలదు.

* తత్త్వం నారాయణః పరః * (తై. నా. 6-11) [నారాయణుడే పరతత్త్వము,] వరాహపురాణంబున * ఏతేషాంకతమో దేవః పరః కో వాఽథవా పరః * [వీరలలో నుత్కృష్టదేవుడెవ్వడు ?] అని ప్రశ్నచేసి * పరో నారాయణో దేవః తస్మాజ్జాతః చతుర్ముఖః * [నారాయణదేవుడు పరుడు. వానినుండి చతుర్ముఖబ్రహ్మ జనించె] అని యుత్తరము చెప్పిరి. ఇత్యాదులు.

## 46. అప్రమేయః.

" ప్రమాతుం శక్యః ప్రమేయః. న ప్రమేయః అప్రమేయః. "

బ్రహ్మాదుల కరణంబులచే పరిచ్ఛేదింపజాలనివాడు. * యం నాయం భగవాఞ్ బ్రహ్మా జానాతి పురుషోత్తమమ్ * [పురుషోత్తముని ఈ బ్రహ్మదేవుండెఱుంగడు.] * నహ్యాదిమధ్యాన్త మజస్య యస్య విద్మో వయం సర్వమయస్య ధాతః । నచ స్వరూపం న పరప్రభావం నచైవసారం పరమేశ్వరస్య * [ఆ నారాయణునియాది మధ్యాంతంబును ప్రభావంబును బలమునుగూడ నెఱుంగము అని బ్రహ్మదేవుడు తానే చెప్పియున్నాడు.] బ్రహ్మరుద్ర సంవాదంబున * న స శక్యస్త్వయా ద్రష్టుమ్ మయాఽన్యైర్వాపి సత్తమ * [జ్ఞానంబుచే జూడదగిన వీనిని నేనో నీవో ఇతరులో చూడ నశక్తులము.] (46.)

## 47. హృషీకేశః.

" హృషీకాణామ్ ఇంద్రియాణామ్ ఈశః " హృషీకంబులనగా ఇంద్రియములు. వానిని నియమించువాడు. బ్రహ్మాదుల యింద్రియంబులు ఈతని యధీనంబులై యుండునపుడు వారు వీని నెట్లు పరిచ్ఛేదింపగలరు ? అని భావము.

## 48. పద్మనాభః. 49. అమరప్రభుః. 50. విశ్వకర్మా.

పద్మనాభః = పద్మమును నాభిలో గలవాడు. అమరప్రభుః = దేవతలకు నిర్వాహకుడు. విశ్వకర్మా = సమస్తవ్యాపారములం గలవాడు.

---

* హృషీకాణీంద్రియాణ్యాహుః తేషామీశో యతో భవాన్ । హృషీకేశ స్తతో విష్ణుః ఖ్యాతో దేవేషు కేశవః * (హ. వం) [కేశవా! హృషీకములనగా ఇంద్రియములు. ఆ యింద్రియములకు ఈశ్వరుండగుటచే నిన్ను వేదములు హృషీకేశుండని చెప్పుచున్నవి.] (47.)

(అవతారిక.) క్రింది జెప్పిన విషయంబులను వివరించుచున్నారు:—

## 48. పద్మనాభః (198-348)

"పద్మః నాభౌ యస్యసః పద్మనాభః" బ్రహ్మదేవుని యుత్పత్తిస్థానమైన పద్మమును నాభిలో గలవాడు.

* ధాతుర్నాభ్యాం పుష్కరం ప్రాదుర్భవతి * [భగవంతుని నాభిలో పద్మము పుట్టును.] (48.)

## 49. అమరప్రభుః.

"అమరాణామ్ ప్రభుః అమరప్రభుః" ఆ బ్రహ్మాదిదేవులకు సృష్ట్యాది అధికారంబుల నొసంగి నిర్వహించువాడు.

* మహార్ణవే శయానోఽప్సు మాంత్వం పూర్వమజీజనః । ప్రాజాపత్యం త్వయా కర్మ సర్వం మయి నివేశితమ్ * (శ్రీ. రా. ఉ. 104-4) [మహాసముద్రంబున జలంబున శయనించియుండు మీరు మొట్టమొదట నన్ను సృజించితిరి. సమస్తప్రజలకును పతిగా నుండు ఈయధికారంబును నాకు మీరొసంగితిరి.] * ఏతౌ ద్వౌ విబుధశ్రేష్ఠౌ ప్రసాదక్రోధజౌ స్మృతౌ । తదాదర్శిత పన్థానౌ సృష్టిసంహారకారకౌ * (భా. మో. 169-19) [ఈ బ్రహ్మదేవుడును రుద్రుడును ప్రసాదము కోపము వీనిచే పుట్టినవారలు. వాడు నియమించిన విధముగా సృష్టిసంహారంబుల నొనరించుచున్నారు]. ఇత్యాదులు. (49.)

## 50. విశ్వకర్మా.

"విశ్వం కర్మ జగద్వ్యాపారః యస్యసః విశ్వకర్మా" క్రిందజెప్పినట్లు బ్రహ్మసృష్టికి ముందును వెనుకను గల జగద్వ్యాపారంబులను జేయువాడు.

* విశ్వకర్మణః సమవర్తతాధి * (పు. సూ. 19) [సమస్తవ్యాపారంబులను చేయువానిని అధికరించి గలదు.] * పురుషం విశ్వకర్మాణమాదిదేవమజం విభుమ్ * [సమస్త కర్మంబులను చేయువాడై ఆదిదేవుడై పుట్టుకలేనివాడై విభువై యుండు పురుషుని.] (50.)

## 51. మనుః. 52. త్వష్టా. 53. స్థవిష్ఠః. 54. స్థవిరః.

మనుః = మననము చేయువాడు. త్వష్టా = విభజించువాడు. స్థవిష్ఠః = స్థూలమైనవాడు. స్థవిరః = సకలకాలంబుననుండువాడు.

---

### 51. మనుః.

"మన్యతే ఇతి మనుః" కేవల సంకల్పలేశంబుచేతనే ఇంతటి వ్యాపారంబులను చేయువాడు.

### 52. త్వష్టా.

"త్వక్షతి తనూకరోతీతి త్వష్టా" ఇట్లు నిర్మింపబడిన నామరూపంబులచే దేవుడు మనుష్యుడు తిర్యక్కు స్థావరము ఇత్యాదిరీతిగా విచిత్రముగా విభజించువాడు.

* త్వష్టారం రూపాణి వికుర్వన్తమ్ విపశ్చిమ్ * (ఆర. 3. ప్ర. 11. అను.) [సర్వజ్ఞుడై రూపంబులను వివిధముగా సృజించు జగత్కర్తను.] (52.)

### 53. స్థవిష్ఠః. (437)

"అయమతిశయేన స్థూలః స్థవిష్ఠః" సూక్ష్మావస్థలోనుండువాడు స్థూలావస్థగా. పరిణమించును. అనగా, తన సంకల్ప ప్రకారము విస్తరింప నుద్దేశించి, సూక్ష్మమగు అవ్యక్తాది క్రమంబుచే దేవ-మనుష్య-తిర్యక్-స్థావరంబులనియు వానికి విషయంబులగు శబ్దస్పర్శాది గుణంబులనియు అవి యుండు పదునాలుగులోకంబులు గల బ్రహ్మాండంబనియు ఇత్యాది విధంబుగా విస్తరించునని భావము.

* నాస్త్యన్తో విస్తరస్య మే * (గీ. 10. 19) [నావిస్తారంబునకు అంతంబు లేదు.] * విస్తారః సర్వభూతస్య విష్ణోః సర్వమిదం జగత్ * (వి. పు. 1-17-84) [సమస్తభూతంబులకును అంతరాత్మయగు విష్ణువుయొక్క విస్తారము ఈ జగమంతయు] ఇత్యాదులు. (53.)

### 54. స్థవిరః.

"సర్వకాలం తిష్ఠతీతి స్థవిరః" ఇట్లు సంకల్పమూలముగా సమస్తంబునకును కారణంబగుచుండియు మన్ను మున్నగు కారణంబులకన్న విలక్షణుడు. ఎలయనగా; ఈతడు లీలచే కాలంబు నపేక్షించినను దానికి వశుడు గాకుండును. ప్రత్యుత; ఆకాలమే వీనికి వశమైయుండును. కనుక కాలవిశేషంబు నపేక్షించు పాలు పెరుగు మున్నగువానికన్న విలక్షణుడు అని తేలుచున్నది.

* కాలస్యచహి మృత్యోశ్చ జంగమస్థావరస్యచ। ఈశితా భగవానేకః సత్యమేతద్బ్రవీమితే * [కాలంబునకును మృత్యువునకును జంగమంబునకును స్థావరంబునకును ఆభగవంతు డొకడే స్వామి. ఈ విషయంబును సత్యముగా నీకు జెప్పుచున్నాడను.] (54.)

## 55. ధ్రువః. 56. అగ్రాహ్యః. 57. శాశ్వతః. 58. కృష్ణః. 59. లోహితాక్షః.

ధ్రువః = చలింపనివాడు. అగ్రాహ్యః = గ్రహింపజాలనివాడు. శాశ్వతః = నిత్యుడు. కృష్ణః = ఆనందించువాడు. లోహితాక్షః = కెందామర వంటి కన్నులం గలవాడు.

---

### 55. ధ్రువః. (390)

“ ధ్రువతీతి ధ్రువః ” అనంతముగ పరిణమించినను వికారంబు లేకుండుటచే తిన స్వరూపంబునుండి జాఱక స్థిరముగానిల్చువాడు. * అజయ్యః శాశ్వతః ధ్రువః * [జయింపజాలనివాడు స్థిరుడు.] * అవికారాయ శుద్ధాయ * (వి. పు. 1-2-1.) [వికారములేని శుద్ధుడగు విష్ణువును మ్రొక్కెదము.] (55.)

### 56. అగ్రాహ్యః.

“ గ్రహీతుమ్ శక్యః గ్రాహ్య। న గ్రాహ్యః అగ్రాహ్యః ” నూలు సాలె వానికి వశమగునట్లు, వీడు కారణముగా నుండుటచే నెవరికయిన వశుండగునాయన్న; కాడు. ఎవరివలనను గ్రహింప శక్యముగానివాడు.

* నైన మూర్ధ్వన్నతిర్యఞ్చ న మధ్యే పరిజగ్రభత్ * (తై. నా. 6-1-9) [వీనిని పైనను క్రిందను మధ్యను ఎచ్చటను గ్రహింపజాలము.] (56.)

### 57. శాశ్వతః.

“ శశ్వత్ భవః శాశ్వతః ” ఇటులే ప్రవాహమువలె ఎల్లప్పుడు జగద్వ్యాపారము చేయుచుండుటచే నిత్యుడు.

* అవ్యుచ్ఛిన్నాస్తతస్త్వేతే సర్గస్థిత్యంతసంయమాః * (వి. పు. 1-2-26) [ఈ సృష్టిస్థితి సంహారంబులు ఎడబాటులేక సర్వదా ఉండును.] (57.)

### 58. కృష్ణః. (554)

“ కృషతీతి కృష్ణః ” ఇట్టి లీలారసంబుచే మిక్కిలి యానందించువాడు. దీనికి ఋషుల నిరుక్తమే ప్రమాణము. * కృషిర్భూవాచకః శబ్దః ణశ్చ నిర్వృతివాచకః। కృష్ణః తద్భావయోగాచ్చ * (భా. ఉ. 69-5) [ ‘ కృష్ ’ అనునది భూమికి వాచకము. ‘ ణ ’ ఆనందంబునకు వాచకము. ఆస్వభావముండుటచే కృష్ణుండను పేరు వీనికిగల్గె.]

### 59. లోహితాక్షః.

“ లోహితే అక్షిణీ యస్యసః లోహితాక్షః ” ఇట్టి యానందంబును ప్రకటించు రమ్యమగు ఎఱ్ఱదామరవంటి నేత్రములు గలవాడు. (59.)

## 60. ప్రతర్దనః.　61. ప్రభూతః　62. త్రికకుద్ధామ.

ప్రతర్దనః = సంహరించువాడు.　ప్రభూతః = సమృద్ధుడు.　త్రికకుద్ధామ = త్రిపాద్విభూతిని స్థానముగా గలవాడు.

---

### 60. ప్రతర్దనః.

" ప్రతర్దయతి సంహరతీతి ప్రతర్దనః " ఇట్లు సృజించిన వీడే సమస్తంబును సంహరించువాడు నగును.

* యస్య బ్రహ్మచ క్షత్రంచ ఉభే భవత ఓదనః । మృత్యుర్యస్యోపసేచనం క ఇద్ధా వేద * [బ్రాహ్మణక్షత్రియరూపంబులగు నీరెండును ఎవనికి అన్నమగునో; మృత్యువు ఊరుగాయగా నగునో; వాని నెవ్వ డెఱుంగగలడు.] * అత్తా ... * (బ్ర. సూ. 1-2-9) [అంతను దినువాడు.] (60.)

### 61. ప్రభూతః.

ఇట్లు సర్వసంహారము గావించియు ఎప్పుడును నశింపక అనంతంబగు భోగంబునకు ఉపకరణంబుగాను పరమపదముగలవాడుగాను ఉండుటచే సమృద్ధుడు. (61.)

### 62. (1) త్రికకుద్ధామ,　(2) త్రికకుబ్ధామ,
### (3) (1) త్రికకుత్　(2) ధామ.

ఈ నామంబునకు నిట్లు మూడువిధములుగా వ్యాఖ్యానముగలదు. త్రికకుద్ధామ అనియు త్రికకుబ్ధామ అనియు పాఠాంతరములు. త్రికకుత్ అనియు ధామ అనియు భిన్న నామములు అని.

(1) త్రికకుత్ = త్రిపాద్విభూతిని, ధామ = స్థానముగా గలవాడు.

ఆతడిట్లు సృజించునట్లును, సంహరించునట్లును చెప్పునదంతయు వానివిభూతులలో అణుమాత్రంబు నేగదా! ఇక ఈ విషయంబు నుపపాదించుచున్నారు.

త్రికకుద్ధామ. త్రిపాద్విభూతిని (మూడుభాగములు గల పరమపదంబును) స్థానముగా గలవాడు. * పాదోఽస్య విశ్వా భూతాని, త్రిపాదస్యామృతం దివి * (పు. సూ. 3) [వానివిభూతిలో ఈ ప్రపంచమంతయు పాతికభాగమే. మిగిలిన ముప్పాతికభాగము నిత్యమైనది. పైనుండునది.] * యస్యాయుతాయుతాంశాంశే విశ్వశక్తిరియం స్థితా * (వి. పు. 1-9-53) [ఎవనియొక్క పదివేలలోని యంశంబున ఈ జగచ్ఛక్తి యుండునో;] అనునీ ప్రమాణంబుచే అది పరమ మహాత్పరిమాణంబనియు, ఇది అణుమాత్రంబనియు స్పష్టమగుచున్నది.

(2) " త్రికకుబ్ధామ " జ్ఞానము బలము ఐశ్వర్యము వీర్యము శక్తి తేజస్సు అను నాలుగుణంబులం గలవాడు.

16

## 63. పవిత్రమ్. 64. మంగళం పరమ్.

పవిత్రమ్ = పరిశుద్ధుడు. మంగళమ్ పరమ్ = పరమమంగళమైనవాడు.

---

(1) "త్రికకుత్" * తథైవాసం త్రికకుదః వారాహం రూపమాస్థితః। త్రికకుత్తేన విఖ్యాతః శరీరస్య ప్రమాపణాత్ * (భా. మో. నా. 343_63) [అటులే మూడు మూపురములుగల్గినవిగాన "త్రికకుత్" అని వరహావతారంబునకు పేరుగల్గె.] అనుసీప్రమాణరీతిగా వరాహావతారంబున మూడు మూపురములుగలవాడు.

(2) "ధామ" = ఇది వేఱునామము, తేజస్సు అని యర్థము. (62.)

(అవతారిక.) ఇంతవఱకు గుణవిభవరూపంబులగు నిరూపకధర్మములను చెప్పి ఆమార్గముగా నిరూపింపబడు స్వరూపంబున ప్రవేశించుచున్నారు:—

## 63. పవిత్రమ్.

"పూతో భవతీతి పవిత్రమ్" అఖిలహేయప్రత్యనీకస్వరూపుడగుటచే పరిశుద్ధుడు. (63.)

## 64. మంగళమ్ పరమ్.

ఒకే నామము. స్వయంప్రకాశానందరూపియై కల్యాణరూపుడై యుండువాడు.

స్వభావసిద్ధమై భగవంతునకు నిత్యమై నిరవద్యమై నిస్సీమమైయుండు గుణంబులును విభవంబులును అనుభవ వైభవంబులును అసంఖ్యేయంబులై యుండునవయ్యు, స్వతః సమస్తదోషంబులకును శత్రువై యుండు భగవంతుడు పరావస్థచే దేనిని అపేక్షింపక నిత్యతృప్తుడై ప్రకాశించునని నిరూపించుట ముఖ్యముగదా?

* ఆనందమయోఽభ్యాసాత్ * (బ్ర. సూ. 4_1_43.) [ఆనందవల్లిలో పలుసారులు చెప్పుటచే భగవంతుడానందమయుడు] * ఆనన్దో బ్రహ్మ * (తై. భృ. *) [బ్రహ్మము ఆనంద రూపము.] * అతరజ్గ మనిర్దేశ్యమపదానన్ద లక్షణమ్ * [అలవోలగి ఇటిదని నిరూపింపజాలని అపరిచ్ఛిన్నమైయుండు ఆనంద రూపము......] ఇత్యాదులు.

ఇచట బ్రహ్మస్వరూపము జ్ఞానమాత్రరసంబనియు జ్ఞానాది గుణంబులు లేవనియు కొందఱందురు. ఆ మతము "అఖండ ఖండనం" బను గ్రంథంబున అనేక విధములుగా ఖండింపబడియుండును.

బ్రహ్మము జ్ఞానస్వరూపము ఆనందస్వరూపము అని శ్రుతిలో జెప్పుటకు ఆశయంబేమనగా ; జ్ఞానము ఆనందము ఐశ్వర్యము మున్నగు గుణంబులుగల్గియుండియు, అత్యంత మనుకూలమై స్వతః ప్రకాశించు జ్ఞానరూపమై ఆత్మస్వరూపముండుననియే.

## 65. ఈశానః.

ఈశానః = పాలకుడు.

---

ఎట్లనగా ; రత్నము దీపము సూర్యుడు మున్నగునవి ఇతర పదార్థంబులను ప్రకాశింపజేయును. తాము ను అప్రకాశంబున పేక్షింపకయే ప్రకాశించును. దీనిచే కాంతియనియు కాంతిమత్తు (కాంతిగలది) అనియు రత్నాదులకు ప్రసిద్ధి యేర్పడినది. అటులే పరమాత్మ జ్ఞానంబుచే సమస్తంబును ప్రత్యక్షముగా జూచును. తానుకూడ దానిన పేక్షింపక స్వయముగ ప్రకాశించును. దీనిచేతనే జ్ఞానమనియు, జ్ఞాత (జ్ఞానస్వరూపుడు) యనియు, వ్యవహరింపబడును. లేక, దాని కింగల గుణంబులలో జ్ఞానంబను గుణము సారమగుటచే జ్ఞాన స్వరూపుండని పేరొందె ననియు చెప్పవచ్చును. దీనికి ప్రమాణము * తద్గుణసారత్వాత్ తద్వ్యపదేశః * (బ్ర. సూ. 2-3-29). [ఆ గుణము సారమగుటచే దానింగొనియే అది నిరూపింప బడును] అను బ్రహ్మసూత్రన్యాయమే.

ఇట్లనుటచే * సత్యం జ్ఞానం అనన్తం బ్రహ్మ * (తై. ఆ. 2-1-1.) అను శ్రుతిలో బ్రహ్మమును జ్ఞాన స్వరూపముగాను, * యస్సర్వజ్ఞః సర్వవిత్ * (ము. ఉ. 1-1-10) అను శ్రుతిలో జ్ఞానముగలదిగాను చెప్పుట పరస్పర విరుద్ధంబగునే అను సందేహంబునకు ప్రసక్తియే లేదు.

* యథా జీవః ప్రశాన్తాత్మా । హ్రస్వో వా యదివా మహా౯ । జ్ఞానాత్మానం తథావిద్యాత్ పురుషం సర్వజన్తుషు * (వార్ష్ణే౯యాధ్యాత్మము) [జీవుడెట్లు ప్రకృతి వలె వికారాదులనొందక ఏకరూపముగానుండియు చిన్నవిగాను పెద్దవిగాను ఉండు సమస్తవస్తువులలో హ్రస్వముగాను మహత్తుగాను అయి వ్యాపించి యుండునో ; అటులే భగవంతుడుగూడ జ్ఞానస్వరూపుడై సమస్త ప్రాణులందు పూర్ణుడైయుండును.] అని వార్ష్ణేయాధ్యాత్మంబున జీవప్రసంగము వచ్చినప్పుడు చెప్పబడియుండుటను చూడుడు. (64.)

## 65. ఈశానః.

"ఈష్టే ఇతి ఈశానః" క్రిందజెప్పిన స్వభావములు బద్ధముక్త నిత్యులకు గూడ ఒకప్పుడు ప్రకాశముగా గనబడుచుండును. ఒకప్పుడు దాగియుండును కనుక వారలకన్న పరమాత్మకుంగల భేదమేమనగా ; [ఈశానః] ఈతడు తన్ను ఇతర పదార్థములను సకలావస్థలోను పాలించు స్వభావముగలవాడు.

* తమీశ్వరాణాం పరమం మహేశ్వరమ్ * (శ్వే. ఉ. 6-7). [ఈశ్వరుల కన్న పరమమహేశ్వరుడగువానిని.] * నతస్య కశ్చిత్పతిరస్తి లోకే నచేశితా నైవచ తస్య లింగమ్ । స కారణం కరణాధిపాధిపః నచాస్యకశ్చిజ్జనితా నచాధిపః * (శ్వే. ఉ. 6-9.) [వీనికి వేరొక పతిలేదు, వీనికి మఱొక యజమాని లేడు. లౌకిక లింగములు లేవు. వీనిని సృజించినవాడు డులే. అధిపుడు లేడు.] * సర్వస్యవశీ

## 66. ప్రాణదః. 67. ప్రాణః. 68. జ్యేష్ఠః.

ప్రాణదః = బలమునిచ్చువాడు. ప్రాణః = ప్రాణమైనవాడు. జ్యేష్ఠః = కొనియాడదగినవాడు (లేక) వృద్ధుడు.

---

సర్వస్యేశానః సర్వస్యాధిపతిః స న సాధునా కర్మణా భూయాత్, నో ఏవా సాధునా కనీయాన్, ఏష సర్వేశ్వరః ఏష భూతాధిపతిః ఏష భూతపాలః ఏష సేతు ర్విధరణః ఏషాం లోకానామసంభేదాయ * (బృ. ఉ. 6-4-22.) [సమస్తంబును వశము గావించుకొన్నవాడు. సమస్తంబును పాలించువాడు. సర్వంబునకు నధిపతి. వీడు మనకు శుభంబుల నొనరించుచునుండవలయునేగాని వేఱువిధముగా నుండజనదు. వీడు భూతపాలుడు. ఈలోకములంతయు కలియకుండ విభజించి పెట్టు సేతువు.] ఇత్యాదులు.

భగవంతునకిట్లు పాలనస్వభావము స్వాభావికముగానుండునట్లు ప్రమాణంబులు తెల్పుచుండుటచే భగవంతునకు ఐశ్వర్య సర్వజ్ఞత్వాదిగుణంబులు కాల్పనికంబులనియు పరిణామమనియు చెప్పువారలవాదములకు జలాంజలి విడువబడియె. (౬౫.)

(అవతారిక.) ఈయైశ్వర్యంబునకు ప్రథమ విషయమును జెప్పుచున్నారు.

## 66. ప్రాణదః. (323-409-956.)

"ప్రాణం ఏదాతీతి ప్రాణదః" నిత్యసూరులకు సర్వదా తన్ను సేవించుటయను అనుభవంబునకును కైంకర్యంబునకును కావలసిన బలమును ఇచ్చువాడు.

* య ఆత్మదాః బలదాః * (౪ కాం. 1. ప్ర. అ. 8.) [భగవంతుడు భక్తులకు తన్ను అనుభవింపదగినట్లు ఇచ్చి ఆ యనుభవంబునకు దగిన బలంబునుగూడ ఇచ్చును.] * స దైవః ప్రాణ ఆవిశతి * (బృ. ఉ. 3-5-20) [ఆ దేవుడు ప్రాణంబు నావేశించును.] ఇత్యాదులు. (౬౬.)

## 67. ప్రాణః (322-408.)

"ప్రాణితి అనేన ఇతి ప్రాణః" అటులే వారలకు ఉజ్జీవన హేతువుగా నుండుటచే ప్రాణముగానుండువాడు.

* తలో దేవానాం నిరవర్తతాసురేకః * (కాం. 4. ప్ర. 1. అ. 8.) [పిమ్మట దేవతలకందఱకును. ఒకడే ప్రాణభూతుడై ధరించియుండెను.] ఇత్యాదులనేకములు గలవు. (67.)

## 68. జ్యేష్ఠః.

"అయమతిశయేన ప్రశస్యః, వృద్ధ ఇతివా జ్యేష్ఠః"

(1) తానును నిత్యసూరులును సర్వదా సర్వప్రకారంబుగా అనుభవించినను తగ్గని అపారంబగు మహైశ్వర్యముగలవాడగుటచే అత్యంతము కొనియాడదగిన

69. శ్రేష్ఠః.　　　　70. ప్రజాపతిః.

శ్రేష్ఠః = స్తోత్రము చేయదగినవాడు.　ప్రజాపతిః = నిత్యసూరులకు స్వామి.

---

వాడు. * భగవాన్ వాసుదేవః జ్యాయసీ విభూతిః * [భగవంతుడగు వాసుదేవుడే కొనియాడదగిన విభూతి.] * బ్రహ్మైవ భూతానాం జ్యేష్ఠమ్ * [బ్రహ్మమే భూతములలో గొనియాడదగినది.]

(2) లేక, అందఱకును పూర్వమే యుండుటచే వృద్ధుడు. * ఏష ప్రకృతిరవ్యక్తః కర్తాచైవ సనాతనః। పరశ్చ సర్వభూతేభ్యః తస్మాద్వృద్ధతమోఽచ్యుతః * (భా. సభా. 38-24.) [ఈతడే ప్రకృతి, అవ్యక్తుడు, శాశ్వతుడై కర్తయైయుండుచేతనుడు, సమస్తభూతంబులకన్న పరుడు. కనుకనే అచ్యుతుడే సర్వులకును పెద్దవాడుగా జెప్పబడియె.] (68.)

69. శ్రేష్ఠః.

"అయమతిశయేన ప్రశస్యతమః శ్రేష్ఠః" భగవంతుని అనిత్యసూరులు అనవరతమనుభవించుటచే గల్గిన ప్రీతిచే స్తోత్రము చేయుచుందురు.

* తద్విప్రాసో విపన్యవః జాగృవాంసః సమింధతే, విష్ణోర్యత్పరమంపదమ్ * (సు. ఉ. 8.) [విష్ణువుయొక్క పరమమయిన స్థానంబునొందిన బ్రహ్మవేత్తలగు నిత్యసూరులు సర్వదా స్తోత్రముచేయువారై పరబ్రహ్మమును సాక్షాత్కరించుచు ప్రకాశింతురు. "విపన్యవః" = స్తోత్రముచేయువారు. సకలకైంకర్యంబులకు నిది యుపలక్షణము.] * తస్మై దేవా ఉపాసతే * [తస్మై = వానికి శేషభూతులై, దేవాః తముపాసతే = నిత్యసూరులు వానిని సేవించుచున్నారు.] (69.)

(అవతారిక.) ఇట్లు స్తోత్రము చేయునట్లు వానికిని వీరలకునుగల సంబంధం బేమనగా చెప్పుచున్నారు:—

70. ప్రజాపతిః (199.)

"ప్రజానాం నిత్యసూరీణామ్ పతిః ప్రజాపతిః" ప్రజలనగా నిత్యసూరులు. 'బద్ధముక్తేభ్యః ప్రకర్షేణ జాయన్తే ఇతి ప్రజాః సూరయః, తేషాం పతిః స్వామీ' [బద్ధులును ముక్తులునగు ఆత్మకోటికన్న ఉత్కృష్టులగుటచే నిత్యసూరులు ప్రజలనబడుదురు. వారలచే సర్వదా పరిచర్య చేయబడువాడు.] నిత్యసూరులుత్కృష్టు లనుటకు ప్రమాణములు:—* ఋతస్య పదే కవయో నిపాన్తి * (అర. ప్ర. 3. అ. 11.) [సత్యమగు స్థానంబున స్తుతి శీలురగు నిత్యసూరులు ప్రకాశించుచున్నారు.] * యత్ర పూర్వేసాధ్యాః సన్తి దేవాః * (కా. 3. ప్ర. 5. అ. 11.) [ఎచట పరమసాధ్యము చేకూఱిన పూర్వులగు దేవులు (నిత్యసూరులు) వసింతురో;] * తద్విష్ణోః పరమం పదగ్ం సదా పశ్యన్తి సూరయః (పు. సూ. 14.) [విష్ణువుయొక్క పరమపదంబును నిత్యసూరులు సదా సేవించుచున్నారు.] ఇత్యాదులు. (70.)

(అవతారిక.) ఇట్లనుభవింపదగిన దేశవిశేషంబును చెప్పుచున్నారు.

## 71. హిరణ్యగర్భః 72. భూగర్భః 73. మాధవః.

హిరణ్య గర్భః = పరమపదంబున వసించువాడు. భూగర్భః = భూమిని గర్భంబుననుంచి కాపాడువాడు. మాధవః = శ్రీయఃపతి.

---

### 71. హిరణ్య గర్భః. (412.)

"హిరణ్యస్య గర్భః హిరణ్యగర్భః" స్వర్ణలోకంబగు పరమపదంబున వసించువాడు. నిర్దోషమై నిత్యమై పరమసత్యమయమైయుండుటచే సువర్ణముపలె ప్రకాశించు పరమపదంబున నిత్యవాసము కావించువాడు.

* హిరణ్మయే పరే లోకే విరజం బ్రహ్మ నిష్కలమ్। తచ్ఛుభ్రం జ్యోతిషాం జ్యోతిః తద్యదాత్మవిదోవిదుః। న తత్ర సూర్యో భాతి......* ఇత్యాది. (ము. ఉ. 2_2_10.) [స్వర్ణమయంబగు పరలోకంబున రజోగుణము లేని పరిపూర్ణమగు బ్రహ్మము విరాజిల్లును. జ్యోతులకన్న జ్యోతియగు ఆ బ్రహ్మమునే ఆత్మసాక్షాత్కారము చేకూరినవారెఱుంగుదురు. అచట సూర్యుడు ప్రకాశింపడు...... ఇత్యాది.] (71.)

(అవతారిక.) అతనికింగల దివ్యమహిషులను (శ్రీ-భూ-దేవులను) రెండు నామంబులచే దెల్పుచున్నారు:—

### 72. భూ గ ర్భః.

"భూః గర్భః యస్యసః భూగర్భః" * హ్రీశ్చ తే లక్ష్మీశ్చ పత్న్యౌ * (పు. సూ. 9.) [హ్రీయనగా భూమి. భూమియు లక్ష్మియు నీకు పత్నులు.] అనినట్లు హ్రీయనియు క్షమ యనియు పేరొందిన భూదేవికి సర్వదా తనయందు భవంబునిచ్చి గర్భమువలె కాపాడువాడు. * మహీమ్ దేవీమ్ విష్ణుపత్నీమజూర్యామ్ * (అష్ట. 3. ప్ర. 1. అను. 2.) [విష్ణు పత్నియగు భూదేవిని.] (72.)

### 73. మాధవః. (169_741.)

"మాయాః ధవః మాధవః" మాయనగా లక్ష్మి. ఆ లక్ష్మికి, ధవః = పతి లక్ష్మీపతి. * అస్యేశానా జగతః విష్ణుపత్నీ * (నీలా) * హ్రీశ్చతే లక్ష్మీశ్చపత్న్యౌ * (పు. సూ. 9) [భూమియు లక్ష్మియు నీకు పత్నులు.]

ఈ లక్ష్మికి స్వరూపమువలె, నిత్యనిర్మలరూపము స్వాభావికమగు పరమైశ్వర్యము సకల జగత్తునకును తల్లిగానుండుట భగవంతునితో నిత్యసంబంధము అదియు స్వాభావికముగా నుండుట మున్నగునవి తత్త్వపరశాస్త్రంబులలో స్పష్టము. వేదమున గూడ శ్రీసూక్తము మేధాసూక్తము శ్రద్ధాసూక్తము ఉత్తరనారాయణము కాఠకోపబ్రాహ్మణము ఇత్యాదులందు ఇవి విస్తరింపబడియున్నవి.

## 74. మధుసూదనః. 75. ఈశ్వరః. 76. విక్రమీ.

మధుసూదనః = ఇంద్రియములను శిక్షించువాడు. ఈశ్వరః = స్వచ్ఛందుడు.
విక్రమీ = పరాక్రమము గలవాడు.

---

* నిత్యైవేషా జగన్మాతా విష్ణోః శ్రీరనపాయినీ। యథా సర్వగతో విష్ణుః తథైవేయం ద్విజోత్తమ * (వి. పు. 1_8_17) [నిత్యగానుండు నీలోకమాత విష్ణువునొక క్షణమయినను వీడకయుండును. విష్ణువువలె లక్ష్మియు వానితోగూడి యంతట వ్యాపించియుండును.]. ఇత్యాది ప్రమాణంబు లనేకములు. * సీతాయాశ్చరితమ్ మహత్ * (శ్రీ. రా. బా. 4_7.) [శ్రీరామాయణంబున సీత (లక్ష్మి) యొక్క చరిత్రమే అధికము.] * శ్రద్ధయా దేవః దేవత్వమశ్నుతే * (కాఠ. ప్ర. శి. ఆ. 3.) [లక్ష్మి సంబంధముండుటవలననే భగవంతుడుగూడ దేవుడయ్యె.] (73.)

(అవతారిక.) ఇట్లు సర్వనిర్వాహకుడుగాను అసురనిరసనాదులచే అసమానుడుగాను ఉండువాడనుచున్నారు:—

## 74. మధుసూదనః.

"మధుమ్ సూదయతీతి మధుసూదనః"

(1) మధువను రాక్షసుని జంపినవాడు ,

లేక, (2) నిత్యసూరుల యింద్రియంబును శిక్షించువాడు.

* మధురింద్రియనామా స తతో మధునిషూదనః * [మధువనగా ఇంద్రియములు. వానిని నిరసించుటచే మధుసూదనుండయ్యె.] అను ఋషుల విరుక్తరీత్యా నిత్యసూరుల యింద్రియంబులను తనయందే లయమగునట్లు చేయుచున్నాడు. అనగా నిత్యసూరుల యింద్రియంబులకు విషయమై ఎల్లప్పుడు తన్ను ఒసగి రక్షించువాడు అని భావము. (74)

## 75. ఈశ్వరః. (36.)

"ఈష్టే ఇతి ఈశ్వరః" భోగభూమి ఇట్లు అపాయముగా నుండినను దాని యందు స్వేచ్ఛగా నుండువాడు. * యత్ర కామగమో వశీ * [ఎచట స్వేచ్ఛా విహారము గావించి స్వతంత్రుడై సకలంబును వశము గావించుకొనియుండునో;] (75.)

## 76. విక్రమీ. (909.)

"విక్రమః అస్యాస్తీతి విక్రమీ" తన సంకల్పంబునకు విరోధముగా సంభవించినవానిని నిరసించు పరాక్రమస్వభావుడు.

## 77. ధన్వీ. 78. మేధావీ. 79. విక్రమః. 80. క్రమః.

ధన్వీ = ధనుస్సుగలవాడు. మేధావీ = సర్వజ్ఞుడు. విక్రమః = గరుడ వాహనుడు. క్రమః = బలిసినవాడు.

---

* మనసైవ జగత్సృష్టిం సంహారఞ్చ కరోతి యః। తస్యాఽరిపక్షక్షపణే కియానుద్యమవిస్తరః * (వి. పు. 5-22-15) [జగత్సృష్టిసంహారంబుల నెవడు తనసంకల్పమాత్రంబుచేతనే కావించునో; అట్టివాడు తనశత్రునిరసనంబున యత్నించుట ఏమాత్రము.] (76.)

### 77. ధన్వీ.

"ధనుః అస్యాస్తీతి ధన్వీ" ఇట్లు సాటిలేని పౌరుషంబునకు దగినట్లు శార్ఙ్గంబను ధనుస్సును సర్వదా ధరించువాడు. ధనుస్సును మాత్రము చెప్పినది సమస్త దివ్యాయుధంబులకు నుపలక్షణము.

* శార్ఙ్గధన్వా హృషీకేశః పురుషః పురుషోత్తమః। అజితః ఖడ్గధృగ్విష్ణుః * (శ్రీరా. యుద్ధ. 120-15) [బ్రహ్మస్తుతిసర్గమున:—శార్ఙ్గంబను ధనుస్సును ధరించినవాడు, ఇంద్రియనియామకుడు, సర్వవ్యాపకుడు, పరమపురుషుడు, స్వతంత్రుడు, ఖడ్గమును ధరించినవాడు విష్ణువు.] * శరాః నానావిధాకారాః ధనురాయతవిగ్రహమ్। అనువ్రజన్తికాకుత్స్థం సర్వే పురుషవిగ్రహాః * [ధనుస్సును అనేకవిధంబులగు బాణములును పురుషరూపముతో రాముని వెంబడించుచున్నవి.] (77.)

### 78. మేధావీ.

"మేధా అస్యాస్తీతి మేధావీ" మేధయనగా స్వాభావికంబగు సర్వజ్ఞత. వానిని గలవాడు. స్వభావసిద్ధమైన అమితమైన సర్వజ్ఞతనుగలవాడు. (78.)

### 79. విక్రమః.

"వినా క్రమః యస్యసః విక్రమః" వి అనగా పక్షి (గరుత్మంతుడు) దానిచే, క్రమః = పోవువాడు. అనగా వేదమయుండగు గరుడునిమీద నెక్కి అచ్చటచ్చట స్వేచ్ఛగా విహరించువాడు.

* తత్పురుషాయవిద్మహే సువర్ణపక్షాయధీమహి। తన్నో గరుడః ప్రచోదయాత్ * (తై. నా. 6-1-24) [ఆమహాపురుషునికి శేషభూతుని చింతింతము. సువర్ణపక్షములుగలిగియుండుటచే వానినే ధ్యానింతము. కనుక ఆగరుడుడు మనలను అనుగ్రహించుగాక.] (79.)

### 80. క్రమః.

"క్రమతే ఇతి క్రమః" ఇట్టి మహావిభూతిగల్గియుండుటచే బలిసినవాడు. (80.)

81. అనుత్తమః. 82. దురాధర్షః.

అనుత్తమః = పరమైన వస్తువులేనివాడు. దురాధర్షః = చలింపజాలనివాడు.

## 81. అనుత్తమః.

"అవిద్యమానః ఉత్తమః యస్మాత్సః అనుత్తమః" తన్నుమించిన పరమైన వస్తువు మఱొకటిలేదు. * తస్మాద్ధాన్యన్నపరః కిఞ్చనాస * (అష్ట. 2. ప్ర. 8. అ. 9.) [వానిని మించిన పరమైన వస్తువు మఱొకటిలేనివాడు.] * తేనార్హతి బ్రహ్మణా స్పర్ధితుమ్ కః * (అష్ట. 2. ప్ర. 7) [ఆ పరబ్రహ్మముతో నెదిరింపగల వాడెవ్వడు.] * మత్తః పరతరమ్ నాన్యత్కిఞ్చిదస్తి ధనఞ్జయ * (గీ. 7-7.) [అర్జునా! నన్ను మించిన మఱొకటి లేదు.] * పరంహ్యపరమేతస్మాద్విశ్వరూపాన్నవిద్యతే * [ఈ విశ్వరూపంబునకన్న పరమగు మఱొక వస్తువు లేదు.] ఇత్యాదులు. (81.)

## 82. దురాధర్షః.

"దుఃఖేనాపి ఆధర్షితుమ్ ప్రధర్షితుమ్ అశక్యః దురాధర్షః" గాంభీర్యాతిశయంబుచే సముద్రమువలె ఎవరిచేతను చలింపింపజాలనివాడు. * గమ్భీరః పరమోదేవః * [పరమపురుషుడు గంభీరుడు] * మహోదధిమివాక్షోభ్యమ్ * [సముద్రమువలె కలతబెట్టజాలనివాడు.] * గామ్భీర్యాత్సాగరోపమమ్ * [గాంభీర్యముచే సముద్రమువంటి వానిని.]

ఇంతవఱకు నుపపాదించిన
విషయములు సంగ్రహముగా
దెల్పబడును.

కాలాతీతమై వికారనాశములులేనిదై తమస్సునకు పైగనుండునదై నిత్యమై పునరావృత్తిలేనిదై భగవత్స్వరూపమువలెనుండు పరమపదంబున శ్రీ భూములను దివ్యమహిషులతోఁగూడి కౌషీతకిలో చెప్పఁబడిన పర్యంకవిద్యారీతిగా రత్నమయంబగు దివ్యాస్థానంబున దివ్యపర్యంకంబుననుండి అనంతవైనతేయ (గరుడుడు) విష్వక్సేనాది నిత్యసూరులచే కైంకర్యము చేయబడువాడై యుండు భగవంతునియొక్క సకలవేదరహస్యంబగు సర్వైశ్వర్యము వివరింపబడియె. ఈ విషయము వాయుప్రోక్తంబగు శైవపురాణంబునగూడ స్పష్టము:—

* వైకుణ్ఠేతు పరేలోకే శ్రియాసార్ధం జగత్పతిః। ఆస్తే విష్ణురచిన్త్యాత్మా భక్తైః భాగవతైస్సహ * (శై.) [వైకుంఠంబను పరలోకంబున జగత్పతియగు విష్ణువు లక్ష్మితోను భక్తులతో ను భాగవతులతోనుగూడి వసించుచున్నాడు.] (82.)

17

## 83. కృతజ్ఞః 84. కృతిః 85. ఆత్మవాన్ 86. సురేశః

కృతజ్ఞః = చేసినమేలు దలంచువాడు. కృతిః = చేయువాడు. ఆత్మవాన్ = ఆత్మలనుగలవాడు. సురేశః = దేవతలకు స్వామి.

---

## 83. కృతజ్ఞః. (536)

"కృతం జానాతీతి కృతజ్ఞః" క్రింద జెప్పినట్లు భగవద్దాస్యమే ఆత్మకు స్వరూపంబనియు తనకు స్వాతంత్ర్యము లేదనియు నీవిషయంబును మఱచి, అనాద్యవిద్యా మహిమంబుచే స్వతంత్రులుగా దలంచి జననమరణాది సంసారంబున పడియుండు ఆత్మకోటులు తనవిషయంబున నేదయిన స్వల్పముగా సుకృతంబు నొనరించినను దాని నెఱుంగుచున్నాడు.

* అపిచేత్సుదురాచారః....సమ్యగ్వ్యవసితోహి సః * (గీ. 9_30) [వాడెంత దురాచారపరుడయ్యు నన్నే నమ్మియుండుటచే వాడు సాధువే యగును.]

తాను కావించు నుపకారంబులకు ప్రత్యుపకారంబు నపేక్షింపడు. కనుకనే * గోవిందేతి యదాక్రన్దత్ కృష్ణా మామ్ దూరవాసినమ్ । ఋణం ప్రవృద్ధమివ మే హృదయాన్నాపసర్పతి * (భా. ఉ. 58_22.) [ద్రౌపది దూరమున (ద్వారకలో) వసించు వానిని నన్ను * శంఖచక్రగదాపాణే ద్వారకానిలయాఽచ్యుత । గోవింద * అని పిలిచెనే; అదియే వృద్ధియయిన అప్పువలె నాహృదయంబునుండి కదలక స్థిరముగా నున్నది.] అని నిర్వేదంబునొందియుండెను. (83.)

## 84. కృతిః.

"క్రియతే ఇతి కృతిః" ఇట్లు వారు కావించు సుకృతములు తన యనుగ్రహ మూలముగా అగునట్ల చేయువాడు.

* ఏషఏవ సాధుకర్మ కారయతి, తమ్ యమేభ్యో లోకేభ్య ఉన్నినీషతి * (కా_3_9) [ఎవరిని వీడు సద్గతి నొందింపజూచునో; వారలచే సత్కార్యంబులను చేయించును.] (84.)

## 85. ఆత్మవాన్.

"ఆత్మానః అస్య సన్తీతి ఆత్మవాన్" అట్టిసుకృత విశేషములనుచేయు ఆత్మల స్వరూపాదులును వీని యధీనంబున నుండును. (85.)

## 86. సురేశః.

"సురాణామ్ ఈశః సురేశః" దేవనాథుడు, అనగా; ఆ సంసారులలో అల్పఫలంబుల నపేక్షించు బ్రహ్మాదులకు వారలుగోరిన ఫలంబులనిచ్చి రక్షించువాడు.

## 87. శరణమ్. 88. శర్మ. 89. విశ్వరేతాః.

శరణమ్ = రక్షకుడు. శర్మ = ఆనందస్వరూపి. విశ్వరేతాః = సమస్తంబును కార్యముగాగలవాడు.

---

* యస్య ప్రసాదా దహ మచ్యుతస్య భూతః ప్రజాసర్గకరోఽన్తకారీ। క్రోధాచ్చ రుద్రః స్థితిహేతుభూతః * (వి. పు. 4_1_85) [బ్రహ్మవాక్యము :— ఏ మహావిష్ణువుయొక్క అనుగ్రహంబుచే నేను ప్రాణులను సృజించువాడనయితినో; ఎవనికోపంబుచే రుద్రుడు సర్వనాశకుడయ్యెనో] ఇత్యాదులు. (86.)

## 87. శరణమ్.

“శృణాతి రక్షతీతి శరణమ్” సమస్తప్రాణులకును నిరుపాధికమగు నుపాయమైనవాడు.

* తంహ దేవమాత్మబుద్ధిప్రసాదమ్ ముముక్షుర్వై శరణమహమ్ ప్రపద్యే * (శ్వే. ఉ. 6_18) [చేతనునిబుద్ధి విశ్రమించుస్థలమై యుండునట్టి, నాబుద్ధిని ప్రసన్నముగావించు ఆపరదేవుని మోక్షమునుగోరు నేను శరణంబునొందెదను.] * నివాసః శరణం సుహృత్ గతిః నారాయణః * (సు. ఉ. 6) [నివాసము రక్షకుడు సుహృత్తు గతి అంతయు నారాయణుడే,] * శరణ్యమ్ శరణంచ త్వామ్ ఆహుర్దివ్యాః మహర్షయః * [శరణమొందదగినవాడును నీవే, రక్షకుడును నీవే, అని మహర్షులు చెప్పుదురు.] (87.)

## 88. శర్మ.

“శృణాతి సుఖయతీతి శర్మ” శర్మ = సుఖము పరమ పురుషార్థము. ఆనందస్వరూపియని భావము.

* సర్వగన్ధః సర్వరసః * (ఛా. ఉ. 3_14.) [సర్వగంధస్వరూపి, సర్వరసస్వరూపి.] * ఆనన్దోబ్రహ్మ * (తై. భృ. 6) [బ్రహ్మము ఆనందస్వరూపముగలది. (88.)

(అవతారిక.) ఇక భగవానుడే ఉపాయముగాను ఉపేయముగాను ఉండుటను చెప్పుచున్నారు.

## 89. విశ్వరేతాః.

“విశ్వమ్ రేతః కార్యం యస్యసః విశ్వరేతాః” తన్ను ఎఱింగి తనకు పరిచర్య గావించుటకే ప్రజలకు జ్ఞానేంద్రియ కర్మేంద్రియాది సమస్తంబును చేయువాడు.
* ఏతస్మాజ్జాయతే ప్రాణః మనస్సర్వేంద్రియాణిచ। ఖం వాయుః జ్యోతిరాపః పృథివీ విశ్వస్య ధారిణీ * (ము. ఉ. 2.1. ) [వీనినుండి ప్రాణము మనస్సు సమస్తేంద్రియంబులు ఆకాశము వాయువు తేజస్సు జలము సమస్తంబునకును ఆధారమగు

90. ప్రజాభవః 91. అహః. 92. సంవత్సరః. 93. వ్యాలః.

ప్రజాభవః = ప్రజలెల్లరు తనకేగలవాడు. అహః = హీనులు లేనివాడు.
సంవత్సరః = వసించువాడు. వ్యాలః = తనయధీనము గావించుకొనువాడు.

---

భూమి ఇవి పుట్టును.] * సప్తప్రాణాః ప్రభవన్తి తస్మాత్ * (ము. ఉ. 2.1.8) [ప్రాణసప్తకములు వానినుండి పుట్టును.] * భవన్తి భావాః భూతానామ్ మత్త ఏవ పృథగ్విధాః * (గీ. 10. 5.) [భూతములు పొందు బహుగుణంబులు నా సంకల్పమునసే గల్గుచుండును.] * విచిత్రా దేహసంపత్తిః ఈశ్వరాయ నివేదితుమ్। పూర్వమేవ కృతా బ్రహ్మన్ హస్తపాదాది సంయుతా * (వి. త.) [హస్తపాదాదులతోఁజేరిన విచిత్రమగు ఈదేహసంపత్తి భగవత్కైంకర్యంబునకై పూర్వమే సృజింపబడియె.] (89.)

## 90. ప్రజాభవః.

“ప్రజాః భవన్తి అస్మిన్ ఇతి ప్రజాభవః” సమస్తప్రజలను తానిచ్చిన ఉపకరణంబులచేతనే తనకు అభిముఖులగునట్లు కావించుకొనువాడు. (90.)

## 91. అహః.

(1) * అహః అహీనమ్ (మా. సం.) అను నిరుక్తరీత్యాహీనముగా నొకడును లేనివాడు. * నహి కల్యాణకృత్కశ్చిత్ దుర్గతిమ్ తాత గచ్ఛతి * (గీ. 6-40.) [సత్కర్మంబుల నొనరించినవాడెప్పుడును దుర్గతినొందడు.]

(2) లేక, అహః అనగా పగలు. అనాదియగు అవిద్యయను నిద్రనుండి లేచినవానికి పగలుగా నుండువాడు. (91.)

## 92. సంవత్సరః. (423)

“సంవసతీతి సంవత్సరః” ఇట్లు ఆత్మ అనాద్యవిద్యనుండి లేచినప్పుడు దానికి తనవిషయమగు బుద్ధినిచ్చి రక్షించుటకు ప్రతీక్షించుచు అంతటవసించువాడు. * దదామి బుద్ధియోగమ్ తమ్ యేన మాముపయాన్తి తే * (గీ. 10-10) [వారు దేనిచే నన్ను పొందగలరో, అట్టి బుద్ధియోగంబును నేనొసంగెద.] * తేషామహమ్ సముద్ధర్తా * (గీ. 12. 7) [వారినెల్లరను సంసారసాగరంబునుండి దాటజేయుదును.] * ఆనయైనం హరిశ్రేష్ఠ! దత్తమస్యాభయం మయా * (శ్రీ-రా-యు. 18. 34) [సుగ్రీవా! విభీషణుని పిలుచుకొని యేతెంచుము. విభీషణునకు పూర్వమే అభయము ఇవ్వబడియె.] (92)

## 93. వ్యాలః.

“వ్యాలాతి ఆదత్తే ఇతి వ్యాలః” అభయంబునిచ్చి వారలను తనయధీనము గావించుకొనువాడు. (93.)

**94. ప్రత్యయః. 95. సర్వదర్శనః. 96. అజః. 97. సర్వేశ్వరః.**

ప్రత్యయః = విశ్వసింపజేయువాడు. సర్వదర్శనః = సమస్తంబును చూపువాడు. అజః = నిరసించువాడు. సర్వేశ్వరః = అందఱను వేగముగా పొందువాడు.

---

## 94. ప్రత్యయః.

"ప్రత్యేతీతి ప్రత్యయః" పిమ్మట వారలను తనయందు విశ్వసింపజేయువాడు (విశ్వాసము = నమ్మకము.)

* భూయోభూయోపి తే బ్రహ్మన్ విశ్వాస్యః పురుషోత్తమః * (వి. త.)
[పురుషోత్తముడు నీకు విశ్వసింప (నమ్మియుండ) దగినవాడు.] (94.)

## 95. సర్వదర్శనః.

"సర్వం దర్శయతీతి సర్వదర్శనః" అనంతరము వారలకు తన మహిమంబు నంతయు జూపువాడు.

* తమక్రతుమ్ పశ్యతి వీతశోకః ధాతుః ప్రసాదాత్ మహిమానమీశమ్ * (శ్వే. ఉ. 3-20) [మహామహిమశాలియై సకలనియామకుడై ఎవరి ప్రయత్నముచేతను సాధింపజాలనివాడైయుండు వానిని సకలరక్షకుండగు వానికృపామాత్రంబుచేతనే సమస్తశోకంబును తీరునట్లు చూచును.] * తస్యైష ఆత్మా వివృణుతే తనూగ్ం స్వామ్ * (ము. ఉ. 3. 2. 3) వానికే ఈ పరమాత్మ తన స్వరూపంబును ప్రకాశింపజేయును.] (95.)

## 96. అజః. (206-524)

"అజతి క్షిపతీతి అజః" వారు తన్ను పొందకుండజేయు విరోధులను నిరసించువాడు.

* తేషామేవానుకమ్పార్థం అహమజ్ఞానజమ్ తమః। నాశయామ్యాత్మ భావస్థః జ్ఞానదీపేన భాస్వతా * (గీ. 10. 11) [వారలమీద కరుణచే నేను వారల హృదయ పీఠంబుననుండి స్వయంప్రకాశంబగు జ్ఞానంబను దీపంబుచే అజ్ఞానాంధకారంబును తొలగించెదను.] * అహమ్ త్వా సర్వపాపేభ్యః మోక్షయిష్యామి మాశుచః * (గీ. 18. 66) [నేను నిన్ను సమస్తపాపంబులనుండి తొలగించెదను. దుఃఖింపవలదు.] (96)

## 97. సర్వేశ్వరః.

"సర్వాన్ ఆశు అశ్నుతే వ్యాప్నోతీతి సర్వేశ్వరః" శక్తులును అశక్తులు నగు సమస్తప్రాణులును శరణంబు నొందినంతమాత్రాన వారల యనిష్టంబును పరిహరించుటకై వేగముగా వచ్చి చేరువాడు. * విభీషణానాశు జగామ సంగమమ్ * (శ్రీ. రా. 18. 39) [విభీషణునితో శీఘ్రముగా చేరెను.] (97.)

98. సిద్ధః. 99. సిద్ధిః 100. సర్వాదిః.

సిద్ధ = సిద్ధమైనవాడు. సిద్ధిః = సాధింపదగినవాడు. సర్వాదిః = సమస్త పురుషార్థములకును ఆదిభూతుడు.

---

## 98. సిద్ధః. (825)

అట్లు శరణంబు నొందినవారికి ఏదేనొక సాధన విశేషంబున సాధింపదగినట్లు గాకుండ సిద్ధముగానుండువాడు. * న్యాస ఇత్యాహుర్మనీషిణో బ్రహ్మాణమ్ * (తై. నా. 6. 50.) [బ్రహ్మంబును న్యాసంబనియందురు పండితులు.] (98.)

## 99. సిద్ధిః.

"సేధ్యతే ఇతి సిద్ధిః" ఇతరోపాయంబులచేతను సాధింపదగినవాడు.

* యదిచ్ఛన్తో బ్రహ్మచర్యమ్ చరన్తి * (క. ఉ.) [దేనింగోరి బ్రహ్మచర్యంబు ననుష్ఠింతురో;] (99.)

## 100. సర్వాదిః.

"సర్వేషామ్ పురుషార్థానామ్ ఆదిః మూలమ్ ఇతి సర్వాదిః" వీరలకు సమస్త పురుషార్థంబులను అనుగ్రహింప మూలభూతుడు.

* యే త్వామ్ దేవమ్ ధ్రువమ్ భక్తాః పురాణమ్ పురుషోత్తమమ్ । ప్రాప్నువన్తి సదా కామాన్ ఇహ లోకే పరత్రచ * (శ్రీ. రా. యు. 120-31) [ఎవరు, పురాణుడై పురుషోత్తముడై యుండు నీమీద స్థిరమయిన భక్తినొందియున్నారో; వారిలోకంబునను పరలోకంబునను సదా సమస్తపురుషార్థంబులను పొందుదురు.] * సర్వాన్ కామాన్ వాప్నువన్తే విశాలాన్ త్రైలోక్యేఽస్మిన్ కృష్ణనామాభిధానాత్ * [కృష్ణనామస్మరణంబుగావించినచో; ముల్లోకంబునగల సమస్త కామంబులను పొందుదురు.] (100.)

శ్రీ విష్ణుసహస్రనామ వ్యాఖ్యానమున

ప్రథమ శతకము ముగిసెను.

శ్రీమతే రామానుజాయ నమః.

# ద్వితీయ శతకము.



## 101. అచ్యుతః. 102. వృషాకపిః. 103. అమేయాత్మా.

అచ్యుతః = వీడనివాడు. వృషాకపిః = ధర్మవరాహ స్వరూపి. అమేయాత్మా = పరిచ్ఛేదింపజాలనివాడు.

---

### 101. అచ్యుతః. (320-557)

"న చ్యుతః అచ్యుతః" క్రిందజెప్పినట్లు శరణంబు నొందినవారిని వదలక ఉండువాడు.

* యస్మాన్నచ్యుతపూర్వోహమ్ అచ్యుతః తేన కర్మణా * [నేనెప్పుడును శరణాగతులను వదలకుండుటచే అచ్యుతుండను నామము నాకు గల్గె.] * తస్యాహమ్ న ప్రణశ్యామి * [వారలకు నేను నశింపను.] * న త్యజేయమ్ కథఞ్చన * (శ్రీరా. యు. 18-3) [శరణంబని వచ్చినవారలను విడువను.] (101.)

(అవతారిక.) ఆయచ్యుతునే ధర్మవరాహముగా జెప్పుచున్నారు.

### 102. వృషాకపిః.

"వృషశ్చాసౌ కపిశ్చ వృషాకపిః" ధర్మవరాహ స్వరూపి. ఇట్లు అర్థము చేయుటకు * కపిర్వరాహశ్శ్రేష్ఠశ్చ ధర్మశ్చ వృష ఉచ్యతే। తస్మాద్వృషా కపిం ప్రాహ కాశ్యపో మాం ప్రజాపతిః * (భా. శాన్తి. 343-59) [కపి యనగా వరాహశ్రేష్ఠము. వృష యనగా ధర్మము. ధర్మవరాహంబగుటచే వృషాకపియని కశ్యపప్రజాపతి వచించె] అను ఋషుల నిరుక్తమే ప్రమాణము. (102.)

### 103. అమేయాత్మా. (189)

"అమేయః ఆత్మా యస్యసః అమేయాత్మా" ఆశ్రితుల ననుగ్రహించు విషయంబున ఇంతయని పరిచ్ఛేదింపజాలనివాడు.

* అతో జ్యాయాగ్ంశ్చ పురుషః * (పు. సూ.) [క్రింద జెప్పిన వీనికన్న పెద్దవాడు పరమపురుషుడు.] * భూయాంశ్చాతో జనార్దనః * [దీనికన్న జనార్దనుడు పెద్దవాడు.] (103.)

104. సర్వయోగవినిస్సృతః. 105. వసుః.
106. వసుమనాః. 107. సత్యః.

సర్వయోగ వినిస్సృతః = సమస్తోపాయంబులచేతను పొందదగినవాడు.
వసుః = వసించువాడు. వసుమనాః = నిధియందువలె మనసుగలవాడు.
సమాత్మా = సమమగు మనసుగలవాడు.

---

## 104. సర్వయోగవినిస్సృతః.

"సర్వయోగైరపి వినిస్సృతః ప్రాప్యః సర్వయోగ వినిస్సృతః" శాస్త్రోక్తంబులగు ఉపాయంబులచేతను తమబుద్ధికి దోచిన ఉపాయంబులచేతను సుఖముగా పొందదగినవాడు.

* స్వబుద్ధిమాత్రనిర్ణీతః పరమాత్మా జగత్ప్రభుః। స్వైశ్వర్యానుభవ ప్రీతో జ్ఞాతారమనుసేవతే * [పురుషుడు తన బుద్ధికి తోచినట్లుగా విచారింప నారంభించినను వానికి అమాత్మమననే తాను విషయమై తనయైశ్వర్యంబునంతయు వాడనుభవింపనిచ్చి దానిచే సంతుష్టుడై బ్రహ్మవిదుడగు వానిని అనుసరించుచున్నాడు.] * యస్మాత్ సద్భక్తియుక్తానామ్ ప్రపన్నానాం క్రమంవినా। ప్రసాదమేతి మన్త్రేశస్త్వచిరాద్భావితాత్మనామ్ ॥ కింపునర్వై క్రియాజ్ఞానసంపూర్ణానాంతు పౌష్కర। శ్రద్ధాభక్తిపరాణాఞ్చ బోధితానాఞ్చదేశికైః * (పౌ. సం.) [మంచి భక్తితో క్రమంబును వీడి తమకుదోచినట్ల ఆశ్రయించిన వారలను ఈ మంత్రరాజము అనుగ్రహించుచున్న! కర్మజ్ఞానపూర్ణులై ఆచార్యులచే నుపదేశింపబడినవారై యుండు వారలను అనుగ్రహించునని చెప్పవలయునా యేమి?] (104.)

## 105. వసుః. (271-701)

"వసతీతి వసుః" వారలయందు అతి ప్రీతితో వసించువాడు. (105.)

## 106. వసుమనాః. (792)

"వసునీవ మనః యస్యసః వసుమనాః" నిధియందెంత ప్రీతియుండునో; అంత ప్రీతిని వారలయందు గలవాడు. * స మహాత్మా సుదుర్లభః * (గీ. 7-19) [అ మహాత్ము నాకు దుర్లభుడు.] (106.)

## 107. సత్యః. (213-873)

"సత్సు సాధుః సత్యః" ఆ సాధువులకు దగినవాడు. (107.)

## 108. సమాత్మా. 109. సమ్మితః. 110. సమః. 111. అమోఘః. 112. పుణ్డరీకాక్షః.

సత్యః = సాధువులకుం దగినవాడు. సమ్మితః = పరిచ్ఛేదింపబడినవాడు. సమః = సమమైనవాడు. అమోఘః = వ్యర్థముగానివాడు. పుణ్డరీకాక్షః = వైకుంఠవాసులకు నేత్రమైనవాడు.

---

### 108. సమాత్మా.

"సమః ఆత్మా యస్యసః సమాత్మా" వా॥ గుణాదులచే హెచ్చు తక్కువగా నుండినను విచారింపక అందఱియందును సమమగు మనస్సుతో నుండువాడు. * సమోహం సర్వభూతేషు * (గీ. 9.29) [సమస్తభూతములయందును నేను సమముగా నుందును.] (108.)

### 109. సమ్మితః.

"సమ్యక్ మితః సమ్మితః" చక్కగా పరిచ్ఛేదింపబడినవాడు. తన భక్తులచే తమ కీణగిన వాడని పరిచ్ఛేదింపబడినవాడు.

* ఊనషోడశవర్షో మే రామో రాజీవలోచనః * (శ్రీరా. బాల. 20. 2.) [తామరనుబోలిన నేత్రముగల నారాముడు పదాఱు (సంవత్సరముల) వయస్సు పూర్తిగానివాడు.] * మమాఽయం తనయో నిజః * (వి. పు. 5-5-5) [వీడు నాపుత్రుడు.] అను దశరథ వసుదేవాదులవచనంబులం దిది స్పష్టము. (109.)

### 110. సమః.

పరిచితులు అపరిచితులు అను భేదములేక అందఱియందును సమముగా నుండువాడు. (110)

### 111. అమోఘః. (156)

"న మోఘః అమోఘః" వారలకును తనకునుగల సంబంధము వ్యర్థముగాక ఫలింపజేయువాడు.

* అమోఘమ్ దర్శనం రామ నచాఽమోఘః స్తవః తవ। అమోఘాస్తే భవిష్యన్తి భక్తిమన్తశ్చ యే నరాః * (శ్రీరా. యు. 120-31) [రామా! నీ దర్శనము వ్యర్థముగానిది. అటులే నీ స్తోత్రమును వ్యర్థముగానిది. మనుష్యజన్మంబు నెత్తియుండు ఎవరు నీయందు భక్తి గల్గియుందురో, వారును నిష్ఫలంబు నొందరు.] (111.)

### 112. పుణ్డరీకాక్షః.

"పుణ్డరీకస్య అక్షీవ పుణ్డరీకాక్షః" వైకుంఠవాసులకు నేత్రమువంటివాడు. * పుణ్డరీకం పరంధామ నిత్యమక్షరమవ్యయమ్। తద్భవాన్ పుణ్డరీకాక్షః *

113. వృషకర్మా. 114. వృషాకృతిః.
115. రుద్రః. 116. బహుశిరాః.

వృషకర్మా = ధర్మమగు కార్యముగలవాడు. వృషాకృతిః = ధర్మమగు రూపము గలవాడు. రుద్రః = ఏడ్వజేయువాడు. బహుశిరాః = అనేక శిరసులు గలవాడు.

---

(భా. ఉ. 69-6) [పుండరీకఁ బనగా నిత్యమై నాశములేనిదై నిర్వికారమైయుండు పరమ పదము. దానికి నిర్వాహకుండగుటచే నిన్ను పుండరికాక్షుడందురు.] అను ఆర్ష నిర్వచ నానుసారముగా వైకుంఠవాసులకు నేత్రమువంటివాడు. * దివీవ చక్షురాతతమ్ * (పు. సూ.) [పరమాకాశంబున విస్తారమయిన నేత్రమువంటివాడు.] (112.)

## 113. వృషకర్మా. — 114. వృషాకృతిః.

"వృషమ్ కర్మ యస్యసః వృషకర్మా" "వృషా ఆకృతిః యస్యసః వృషా కృతిః" వీడిట్లు పరమోత్కృష్టుడయ్యు క్రింద జెప్పినట్లు మనలకు మేలుకలిగించుటచే ధర్మమగు కర్మములు గలవాడు. వృషాకృతిః = అటులే దేహమును ధర్మరూపముగా నుండును. అనగా; తాపత్రయంబును పోగొట్టు అమృతప్రవాహమువలె శీతలంబగు కార్యంబును ఆకారంబును గలవాడగుటచే వృషాకర్మా - వృషాకృతిః అనబడియె. (వృష - శీతలము.)

* విశ్వమాప్యాయయన్ కాన్త్యా పూర్ణేన్ద్వయుతతుల్యయా * (పౌ. సం.) [పదివేల పూర్ణచంద్రులకు సమమగు కాంతిచే ప్రపంచంబును పరిల్లంజేయుచు ప్రకాశించును.] (113-114.)

## 115. రుద్రః.

"రోదయతీతి రుద్రః" ఇట్టి రూపంబును చేష్టితంబులను చూపించి చూపఱుల హృదయంబును కరగించి వారలు ఆనంద బాష్పంబుతో ఏడ్చునట్లు చేయువాడు.

* ఆహ్లాదశీతనేత్రామ్బుః పులకీకృతగాత్రవాన్ । సదా పరగుణావిష్టః ద్రష్టవ్యః సర్వదేహిభిః * (వి. త.) [ఆనందాతిశయంబుచే శీతలంబగు కన్నీరు నిండిన నేత్రంబులును. గగుర్పాటునొందిన శరీరంబును గలిగి, సదా పరమాత్మయొక్క కల్యాణగుణంబులందు మైమఱచియుండు మహనీయుడు అందఱచేతను చూడదగినవాడు.] (115.)

## 116. బహుశిరాః.

"బహూని శిరాంసి యస్యసః బహుశిరాః" అనంతరూపముతో అనేకములగు తలలుగలవాడు. (116.)

117. బభ్రుః. 118. విశ్వయోనిః.
119. శుచిశ్రవాః. 120. అమృతః.

బభ్రుః = భరించువాడు. విశ్వయోనిః = అందఱను తనతో చేర్చుకొనువాడు. శుచిశ్రవాః = శుద్ధములగు శ్రోత్రములుగలవాడు. అమృతః = అమృతము వంటివాడు.

---

## 117. బభ్రుః.

"భరతీతి బభ్రుః" అనంతరూపంబుతో భూమినంతయు భరించువాడు. (అనంతుడు = ఆదిశేషుడు.) * యస్య సా సకలా పృథ్వీ ఫణామణిశిలారుణా । బిభర్తి మాలాం లోకానామ్ * [సమస్తమయిన భూమియు ఎవని పడగలోనుండు మాణిక్యముయొక్క కాంతిచే ఎఱ్ఱగా ప్రకాశించునో; ఆతడే మాలవలె వరుసగానుండు ఈలోకంబును భరించును.] (117.)

## 118. విశ్వయోనిః. (151)

"విశ్వేషాం యోనిః విశ్వయోనిః" ఆర్ధ్రమనరాహుడు తన్నాశ్రయించిన వారలనందఱను అనంతునిరూపమువలె సర్వసాధారణంబగు రూపంబుతో తనతో జేర్చుకొనుచున్నాడు. (118.)

## 119. శుచిశ్రవాః.

"శుచీని శృణోతీతి శుచిశ్రవాః" భక్తులు హృదయశుద్ధితో చెప్పు వార్తలను వినువాడు. శుచియనగా పరిశుద్ధము. అనగా భక్తితోగూడినది అని భావము.

* శుచీని శ్రవణీయాని శృణోమీహ ధనఞ్జయ। నచ పాపాని గృహ్ణామి తతోఽహం వై శుచిశ్రవాః * (భా. శా. మో. 344_61) [శుద్ధముగాను మధురముగాను ఉండు విషయములను ఇచ్చట వినుచున్నాడను. అర్జునా! పాప విషయములను నా శ్రోత్రంబున గ్రహింపకుందును. కనుకనే నన్ను "శుచిశ్రవాః" అని యందురు.]

భగవంతుడు, భక్తితో సమర్పించినదానినే శుద్ధముగా చూచును. * విదురాన్నాని బుభుజే శుచీని గుణవన్తిచ * (భా. ఉ. 90_43) [శుద్ధములగు అనగా భక్తితో సమర్పింపబడిన విదురునియన్నములను కృష్ణుడు భుజించెను.] ఇత్యాదులు. (119.)

## 120. అమృతః.

"న మ్రియతే అనేనేతి అమృతః" వారలకు మధురముగాను, జరా (ముసలితనము) మరణాదులను వారించుచును, సర్వదా అనుభవించియు చాలునను తృప్తి కలుగకయు ఉండుటవలన అమృతమువలెనుండువాడు. * అమృతస్యేవ నాతృప్యన్ ప్రేక్షమాణాః జనార్దనమ్ * [జనార్దనుని చూచినవారు అమృతపానము గావించువారివలె తృప్తినొందరైరి.] (120.)

121. శాశ్వతస్థాణుః. 122. వరారోహః.

శాశ్వతస్థాణుః = నిత్యుడై స్థిరుడై యుండువాడు. వరారోహః = శ్రేష్ఠమగు ప్రాప్తినిగలవాడు.

---

(అవతారిక.) ఈ మాధుర్యోక్తియొక్క అల్పాంశముండుటచే సముద్ర సారంబునుగూడ అమృతంబని లోకులు వాడుచున్నారుగాన దానికన్న దీనికింగల విశేషంబును జెప్పుచున్నారు.

## 121. శాశ్వత స్థాణుః.

"శాశ్వతశ్చాఽసౌ స్థాణుశ్చ శాశ్వతస్థాణుః" ఈతడు, ఆయమృతమువలె అనిత్యముగాక పునరావృత్తి (మఱల పుట్టుట) లేక నిత్యభోగ్యుడుగా నుండును. (121.)

(అవతారిక.) కనుకనే

## 122. వరారోహః.

"వరః ఆరోహః యస్యసః వరారోహః" శ్రేష్ఠమగు ఆరోహంబును (అనగా ప్రాప్తిని) గలవాడు అనగా, ఇతర పురుషార్థంబుల నొందుట నికృష్టముగాను వీనిని జెందుట అత్యుత్కృష్టముగాను ఉండును. * ఏతేవై నిరయాస్తాత స్థానస్య పరమాత్మనః * [పరమాత్మస్థానంబునకివి నరకములే.]

పరము వ్యూహము విభవము అని పరబ్రహ్మస్వరూపము మూడు విధములుగా నుండును అని భాగవత సిద్ధాంతము.

(1) పరమనగా, కార్యముగాక కారణమాత్రమై, కార్యముతో సంబంధింపక షాడ్గుణ్యపూర్ణమై, మహార్ణవమువలెనుండి అనంతమై నిత్యమై వెలయు భోగ విభూతిని ఏకచ్ఛత్రంబున నేలుటయు ముక్తులచే సేవింపబడుటయు నిరుపాధికతయు గల స్థితి.

(2) వ్యూహంబనగా: మోక్షకాములను సృజింపగోరి, దానికై సృష్టి స్థితిలయంబులు శాస్త్రంబులు శాస్త్రార్థంబులు శాస్త్రఫలంబులు ధ్యానము ఆరాధనము లీల అనునిట్టి కార్యంబులకు దగినట్లు పరస్వరూపగుణంబులను విభజించుకొని లీలా విభూతిని నిర్వహించి ముక్తికి సాధనమై చతుర్విధమై యుండుస్థితి.

(3) విభవంబనగా: ఆవ్యూహచ్ఛాయతో దేవ-మనుష్య-తిర్యక్-స్థావరంబులను తన విభూతివలె తన యిచ్ఛచే స్వీకరించు అవతారవర్గము. ఇది శ్రీ సాత్వతంబున స్పష్టము. చూడుడు. * షాడ్గుణ్య విగ్రహం దేవం భాస్వజ్జ్వలనతేజసమ్। సర్వతః పాణిపాదం తత్ * ఇత్యుపక్రమ్య * పరమేతత్సమాఖ్యాతం ఏకం సర్వాశ్రయం విభుమ్। ఏతత్పూర్వం త్రయంచాన్యత్ జ్ఞానాద్యైర్భేదితంగుణైః। విద్ధ్యేతత్ వ్యూహ

సంజ్ఞంనై నిశ్శ్రేయసఫలప్రదమ్। ముఖ్యానువృత్తిభేదేన యుక్తం జ్ఞానాదిభిః గుణైః। నానాకృతిచ తద్విద్ధి విభవమ్ భుక్తిముక్తిదమ్ * (సా. సం.) [షడ్గుణంబులును ప్రకాశించు శరీరంబును జ్వలించు అగ్నివలె ప్రకాశించు తేజంబును అంతట కరచరణంబులును గల దేవుని...(అని యారంభించి) ఇదియే సమస్తంబునకు నాశ్రయమై సర్వ వ్యాపకమై ప్రకాశించు పరస్వరూపంబగును. దీనిమూలముగా నితరము లగు మూడు స్వరూపములు గలవు. అది జ్ఞానాదిగుణంబులచే భేదించియుండును. ఇదియే వ్యూహంబని పేరొందినదనియు మోక్షంబను పురుషార్థంబును ఇచ్చునదనియు నెఱుంగుము. జ్ఞానాదిగుణంబులచే ముఖ్యముగా ననువర్తింపబడినదై భోగమోక్షంబులను సాధించునదై నానావిధమై యుండునని విభవంబనబడును. అని యెఱుంగుము.]

ఆ విభవావతారంబులలో (1) కొన్ని మత్స్యకూర్మాదులవలె సాక్షాత్తుగా నుండును, (2) మఱికొన్ని ఋషియని పేరొందియుండు పరశురామవ్యాసాదులందువలె అధిష్ఠించియుండును. (3) ఇంకయు గొన్ని అసురసంహారకాలంబున రుద్రునిబాణంబున తన శక్తిని ఆవేశింప జేసినట్లు ఆయా కార్యకాలంబున తన శక్తిని మాత్రమావేశింపజేయును. (4) మఱికొన్ని అర్చావిగ్రహాదివ్యక్తులందు తానే నేరుగా వచ్చి యవతరించును. ఇట్లు నాలుగు విధంబులగును.

"బ్రహ్మాదులను పరమపురుషునితో అభేదముగా శ్రుతులు చెప్పుటచే వారలనుగూడ వాని యవతారంబనవచ్చునే" అని కొందఱు శంకింతురు. ఇది మూఢులను గల్గు శంకయే. ఏలయనగా; మనలను తృణాదులనుకూడ వానితోనభేదముగా జెప్పియుండుటచే మనమును తృణాదులునుగూడ భగవదవతారముగా చెప్పవలసి వచ్చును. * సర్వం ఖల్విదం బ్రహ్మ * (ఛా.ఉ. 3-14-1.) ఇత్యాదులచే సర్వమును బ్రహ్మముగా శ్రుతి చెప్పియున్నదిగదా? ఇంకను, బ్రహ్మాదులను భగవదవతారములలో చేర్చలేదు. వారలను దేవమనుష్యాదులవలె సృష్టికివిషయముగానే శాస్త్రంబున చెప్పబడియున్నది. కాకయు చతుర్ముఖ బ్రహ్మాదులను భగవదవతారంబునకన్న ప్రత్యేకముగా భగవచ్ఛాస్త్రంబులందు చెప్పబడియుండుటను చూడుడు. * జ్ఞానోపదేష్టా భగవాన్ కపిలాత్మా త్వధోక్షజః। విద్యామూర్తిశ్చతుర్వక్త్రః బ్రహ్మనై లోకపూజితః॥ తదంశభూతో వై యస్య విశ్వవ్యఞ్జనలక్షణః * (పౌ. సం.) [జ్ఞానోపదేశము గావించు కపిలాత్ముడు శ్రీమన్నారాయణ స్వరూపుడు. విద్యామూర్తియై పూజితుండగు బ్రహ్మదేవుడు ప్రపంచరూపముగా ప్రకాశించుటకై వానియంశముగా పుట్టినవాడు] ఇత్యాదులు. ఇవి యన్నియు నచ్చటచ్చట విస్తరింపబడును. (122.)

(అవతారిక.) 'వరారోహః' అనునింతవఱకుంగల నామంబులచే పరత్వము చెప్పబడియె. ధర్మపుత్రుడు ప్రాప్య విషయముగాచేసిన * కిమేకమ్ దైవతం లోకే కింవాప్యేకం పరాయణమ్ * ఇత్యాది ప్రశ్నలకును వాని సమాధాన

123. మహాతపాః. 124. సర్వగః.

మహాతపాః = పూజ్యమగు జ్ఞానముగలవాడు. సర్వగః = సమస్తంబును చేరువాడు.

---

ములకును ప్రాయశః ఇదియే విషయమగును. ఇక * స్తువ స్తః కమ్ * ఇత్యాది ఉపేయ విషయముగా చేసిన ప్రశ్నలకును ఉత్తరములకును విషయముగా వ్యూహము చెప్పబడును.

అందు వాసుదేవుని పరుడుగా క్రింద వ్యాఖ్యానింపబడియె. ఇపుడు సంకర్షణ విషయము చెప్పబడును.

## 123. మహాతపాః.

“ మహత్ పూజ్యమ్ తపః జ్ఞానం యస్యసః మహాతపాః ” పూజ్యమగు జ్ఞానముగలవాడు.

ఇకమీద భగవంతునిషడ్గుణంబులు చెప్పబడగలవు. ఆ గుణంబులలో జ్ఞానబలములు సంకర్షణమూర్తికి నిష్కర్షింపబడియుండునవి. [వీనిలో జ్ఞానము ఈ నామంబునను బలము పై నామంబునను చెప్పబడును.] జ్ఞానమనగా ; ప్రాణులు బహుకాలముగా పడుచుండు సంసారదుఃఖమును తొలగింపవలయునను ఇచ్ఛ. అదియే యిచట జ్ఞానశబ్దముచే చెప్పబడును ఇయ్యదియే తపశ్శబ్దంబునకు అర్థము.

* యస్య జ్ఞానమయం తపః * (ము. ఉ. 1. 1.) [ఎవనికి జ్ఞానమయంబగు తపస్సుగలదో.] (123.)

## 124. సర్వగః.

“సర్వాన్ గచ్ఛతీతి సర్వగః” ధరించు సామర్థ్యంబను బలముతో ఆత్మవలె ధరించుచు, సంహరించిన వానినన్నిటిని ప్రవేశించువాడు. సంకర్షణనామము సంహరించుట వలననే గల్గినట్లు నిర్వచింపబడును. (నామము 556.) (124.)

(అవతారిక.) ఇక సంహరించినవానిని సృజింపబూను ప్రద్యుమ్న మూర్తి చెప్పబడును. ఆ ప్రద్యుమ్నమూర్తికి ఐశ్వర్యము వీర్యము అను రెండు గుణంబులు గలవు. అవి క్రమముగా రెండు నామంబులచే జెప్పబడును :—

125. సర్వవిత్. 126. భానుః.
127. విష్వక్సేనః. 128. జనార్దనః.

సర్వవిత్ = సమస్తంబును పొందువాడు. భానుః = ప్రకాశించువాడు. విష్వక్సేనః = నలుదిక్కులందును రక్ష్యవర్గంబును గలవాడు. జనార్దనః = జనంబులను పీడించువాడు.

---

## 125. సర్వవిత్.

"సర్వమ్ విన్దతీతి సర్వవిత్" సమస్తకార్యవర్గంబును సృజించి లభించువాడు. జగత్సృష్టికార్య రూపమగు ఐశ్వర్యమిచట చెప్పబడియె. (125.)

## 126. భానుః. (285)

"భాతీతి భానుః" సమస్తంబును నిర్మించియు తాను కొంచమయినను వికారమునొందక ప్రకాశించును. దీనిచే అవికారంబను వీర్యము చెప్పబడియె. (126.)

(అవతారిక.) అనంతరము సృజింపబడినవానిని స్థాపించు అనిరుద్ధమూర్తిని జెప్పుచున్నారు. (ఆ యనిరుద్ధమూర్తికి గల శక్తితేజస్సులు అను గుణంబులు క్రమముగా రెండు నామంబులచే చెప్పబడును.)

## 127. విష్వక్సేనః.

"ఇనేన స్వామినా ఈశ్వరేణ సహ వర్తతే ఇతి సేనా। విష్వాచీ సేనా యస్యాసః విష్వక్సేనః" ఇను డనగా స్వామి. వానితోగూడియుండునది సేన. ఈశ్వరునితో గూడియుండునది. దీనిచే రక్షకునకుగల రక్ష్యవర్గము చెప్పబడియె. అట్టిరక్ష్యవర్గంబులను 'విష్వక్' నలుదిక్కులందునుగలవాడు విష్వక్సేనుడు. అనగా నలుదిక్కులందును రక్ష్య వర్గంబును గలవాడని భావము. ఇచట సామర్థ్యశరీరంబగు శక్తి చెప్పబడియె.

## 128. జనార్దనః.

"జనాన్ అర్దయతీతి జనార్దనః" రక్షణ విరోధులను అనగా భక్త విరోధులను నిరపేక్షుడై నిరసించువాడు. *దస్యుత్రాణాజ్జనార్దనః* (భా.ఉ.71-6) [దొంగలనుండి కాపాడియుండుటచే జనార్దనుడనబడును.] ఇచట నిరపేక్షముగా జేయుటయను తేజస్సు చెప్పబడియె.

భగవంతునకు సమస్తగుణంబులును పూర్ణముగా నుండెడివయ్యు ఇచట జెప్పబడిన గుణవ్యవస్థ (అనగా ఆయా మూర్తులందుమాత్రము ఆయాగుణము లుండునట్లు చెప్పుట) ఆయాగుణముల యావిష్కారమును (ప్రాధాన్యమును) ఒట్టి అని యిట్లు మూలసంహితలో స్పష్టముగా చెప్పబడియున్నది. (128.)

## 129. వేదః. 130. వేదవిత్. 131. అవ్యజ్గః. 132. వేదాజ్గః.

వేదః = పొందదగియువాడు. వేదవిత్ = వేదార్థంబు నెఱుంగువాడు. అవ్యజ్గః = వేదాంగములచే ఆహీనుడు. వేదాజ్గః = వేదములను శరీరముగా గలవాడు

---

(అవతారిక.) ఉద్దేశక్రమముగా సంకర్షణునిశాస్త్రప్రదాతృత్వమును చెప్పుచున్నారు.

### 129. వేదః.

"శాస్త్రాణి విన్దన్తి అస్మిన్నితి వేదః" సృష్టిచే కరణంబుల నొందిన సత్వ్వులును భగవంతునినుండి శాస్త్రంబులను లభించుచున్నారు.

* యోవై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై * [ఎవడు వేదములను వాని కిచ్చునో;] కనుకనే ఉపాయము, ఆగమము, మార్గము, నేత, బ్రాహ్మణుడు, ఆచార్యుడు అని సంకర్షణశబ్దంబునకు అర్థము చెప్పుదురు. (129.)

### 130. వేదవిత్. (133)

"వేదం వేదార్థం వేత్తీతి వేదవిత్" సంశయము (సందేహము) ప్రమాదము (పొరబాటు) మున్నగునవి లేక వేదార్థంబునెఱుంగువాడు. ఇచట వేదశబ్దంబునకు వేదార్థంబని యర్థము.

* వేదవిదేవచాఽహమ్ * (గీ.15.15) [వేదంబు నెఱింగినవాడును నేనే.] (130.)

### 131. అవ్యజ్గః.

"విగతాని అజ్గాని యస్యసః వ్యజ్గః। న వ్యజ్గః అవ్యజ్గః" శిక్షా వ్యాకరణాది వేదాంగంబులను తానే కల్పించుటచే వేదాంగంబులచే అహీనుడు. (131.)

### 132. వేదాజ్గః.

"వేదాః అజ్గమ్ యస్యసః వేదాజ్గః"

(1) అనేకశాఖలనుగల వేదంబును శరీరముగా గలవాడు. అనగా వేదంబుల నెఱింగినవానిబుద్ధికి విషయంబగుచున్నాడు అని భావము. * నాఽవేద విన్మనుతే తం బృహన్తమ్ * (కా. 3.55) [వేదంబుల నెఱుంగనివాడు, మహనీయుండగు వానిని (దేవుని) స్మరింపజాలడు.] * విభూను తే వేదమయం శరీరమ్ * [వేదమయంబగు శరీరంబును వదలును.]

(2) లేక * శ్రుతి స్మృతీ మమైవాజ్ఞా శ్రుతిస్మృతులు నాయాజ్ఞారూపములే.[ * దైవం పిత్ర్యంచ కర్తవ్యమ్...ఇతి తస్యాఽనుశాసనమ్ * [దేవ సంబంధములును పితృసంబంధములునగు కార్యములను చేయవలయును...ఇయ్యది వానియాజ్ఞ.] ఇత్యాదులచే వేదంబునుభగవదాజ్ఞగా చెప్పబడియుండుటచే వేదంబును తన యాజ్ఞగా గలవాడు. (132.)

133. వేదవిత్. 134. కవిః. 135. లోకాధ్యక్షః.
136. సురాధ్యక్షః. 137. ధర్మాధ్యక్షః.

వేదవిత్ = వేద ధర్మములను అనుష్ఠింపజేయువాడు. కవిః = చూచువాడు. లోకాధ్యక్షః = లోకస్వామి. సురాధ్యక్షః = దేవస్వామి. ధర్మాధ్యక్షః = ధర్మస్వామి.

---

## 133. వేదవిత్. (130)

"వేదం విన్దతి అనుష్ఠానేన లభతే ఇతి వేదవిత్" వేదార్థంబును అనుష్ఠింపజేసి పొందువాడు. ప్రద్యుమ్నుడు.

ఇది ప్రద్యుమ్నస్వరూపమును చెప్పును. వేదంబనగా వేదార్థము. దానిని అనుష్ఠింపజేసి ఆమూలముగా పొందుటచే ప్రద్యుమ్నుని 'వేదవిత్' అని వచింతురు. కనుక నే ప్రద్యుమ్నుని ధర్మమనియు ప్రకాశింపజేయువాడనియు ప్రవర్తింపజేయువాడనియు నందురు.
(133.)

## 134. కవిః.

"కాతి పశ్యతీతి కవిః" వాడె మధురంబులను చూచువాడు. (134.)

(అవతారిక.) ఈ యర్థంబునే మీది మూడు నామంబులుపపాదించుచున్నవి:—

## 135. లోకాధ్యక్షః,
## 136. సురాధ్యక్షః,
## 137. ధర్మాధ్యక్షః.

(1) "లోకానా మధ్యక్షః లోకాధ్యక్షః." (2) "సురాణామ్ అధ్యక్షః సురాధ్యక్షః" (3) "ధర్మస్య అధ్యక్షః ధర్మాధ్యక్షః" లోకంబనగా ధర్మానుష్ఠాన యోగ్యులు, సురులనగా వారలు ఆరాధించు దేవతలు, ధర్మమనగా వానికి సాధనము. వీనికన్నిటికిని స్వామి; అనగా ‡ అదృష్టస్థానంబుననుండి ఫలంబు నిచ్చువాడు అనిరుద్ధుడు అని భావము.

---

‡ అదృష్టంబనగా; మన మీలోకంబున ఆయా కాలంబున చేయు యాగాది కార్యంబులు తత్క్షణమే నశించును. ఆయాగాదులఫలము కాలాంతరముననే గల్గును. కనుక, మనము చేసిన ధర్మములు నశింపకయో, చేయని ధర్మములు ప్రవేశింపకయో ఒకటి రక్షించుచుండును. దానికే అదృష్టమనిపేరు. అని మీమాంసకులందురు.

138. కృతాకృతః. 139. చతురాత్మా.
140. చతుర్వ్యూహః. 141. చతుర్దంష్ట్రః.

కృతాకృతః = ప్రవృత్తిధర్మ నివృత్తిధర్మస్వరూపి. చతురాత్మా = నాలుగు రూపంబులను గలవాడు. చతుర్వ్యూహః = నాలుగు వ్యూహములు గలవాడు. చతుర్దంష్ట్రః = నాలుగుకోఱలుగలవాడు.

---

## 138. కృతా కృతః.

"కృతశ్చాసౌ అకృతశ్చ కృతాకృతః" కృతమనగా. సంసారంబున ప్రవర్తింపజేసి అనిత్య ఫలంబులను ఇచ్చుటచే ప్రవృత్తిధర్మము. అకృతంబనగా, సంసారంబునుండి నివర్తింపజేసి నిత్యఫలంబునిచ్చుటచే నివృత్తిధర్మము. ఈ రెండు రూపములుగాను అనిరుద్ధుఁడుండును. (138.)

## 139. చతురాత్మా. (775)

"చత్వారః ఆత్మానః యస్యసః చతురాత్మా" క్రింద జెప్పినట్లు వాసుదేవ సంకర్షణ ప్రద్యుమ్న అనిరుద్ధులు అను నాలుగు రూపంబులను గలవాడు. (139.)

(అవతారిక.) ఒకఁడే ఎట్లు నాలుగువిధంబులుగా నుండగలడనగా చెప్పు చున్నారు:—

## 140. చతుర్వ్యూహః. (773)

"చత్వారః వ్యూహాః యస్యసః చతుర్వ్యూహః" క్రింద చెప్పిన ప్రయోజనంబులకుగాను, ధ్యానింపదగినస్వరూపమిట్టిదియని తెలుపుటకుగాను, అఖిలకల్యాణగుణంబులను మొత్తముగాను విభజించియు అంగీకరించి, ఆయాకల్యాణ గుణ ప్రకాశకముగా నేర్పడిన అవయవము వర్ణము ఆయుధము వాహనము ధ్వజము మున్నగువానితోను జాగ్రదాది నాలుగవస్థలతోనుగూడి నాలుగు విధంబులుగా విభజింపబడియుండును. (140.)

## 141. చతుర్దంష్ట్రః.

"చతస్రః దంష్ట్రాః యస్యసః చతుర్దంష్ట్రః" ఇట్టి వ్యూహమూర్తులకు గారణంబగు పరస్వరూపమున నాలుగుకోఱలుగలవాడు. నాలుగుకోఱలుండుట మహాపురుషలక్షణము

* చతుర్దశ సమద్వన్ద్వః చతుర్దంష్ట్రః చతుర్గతిః * (శ్రీ రా. సు. 35. 19)
[పదునాలుగు స్థలములు జంటజంటగా సమముగానుండువాడు, నాలుగు కోఱలు గలవాడు, నాలుగు గతులు గలవాడు శ్రీరామచంద్రుడు.] (141.)

**142. చతుర్భుజః. 143. భ్రాజిష్ణుః. 144. భోజనమ్.**
**145. భోక్తా. 146. సహిష్ణుః.**

చతుర్భుజః = నాలుగుభుజములు గలవాడు. భ్రాజిష్ణుః = ప్రకాశించువాడు. భోజనమ్ = భుజింపబడువాడు. భోక్తా = భుజించువాడు. సహిష్ణుః= సహించువాడు.

---

## 142. చతుర్భుజః.

"చత్వారః భుజాః యస్యసః చతుర్భుజః" అటులే నాలుగు భుజములు గలవాడు. పరస్వరూపమిటులే యుండునని చెప్పబడియుండునని.

* చతుర్భుజముదారాఙ్గమ్ చక్రాద్యాయుధభూషణమ్ * (వి. పు.) [నాలుగు బుజంబులను గంభీరమగు రూపంబును చక్రాది ఆయుధంబులను భూషణముగా ధరించినవానిని.] * భుజైశ్చతుర్భిః సముపేతమ్ * (వి. పు.) [నాలుగు భుజంబులతో గూడియుండువానిని.] ఇత్యాదులు. (142.)

## 143. భ్రాజిష్ణుః.

"భ్రాజతే ఇతి భ్రాజిష్ణుః" వీనినన్నిటితోను లన్ను ఉపాసించువారలకు ప్రకాశించువాడు. (143.)

## 144. భోజనమ్.

"భుజ్యతే ఇతి భోజనమ్" ఉపాసించు వారలచే సుఖముగా భుజింపబడు వాడు. అనగా అనుభవింపబడువాడు. (144.)

## 145. భోక్తా. (502)

"భుఙ్క్తే ఇతి భోక్తా" భక్తులు ప్రీతితో సమర్పించినవానిని అల్పమయినను అమృతమువలె స్వీకరించువాడు.

* పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి। తదహమ్ భక్త్యుపహృతం అశ్నామి ప్రయతాత్మనః * (గీ. 9. 26.) [పత్రమో పుష్పమో ఫలమో తీర్థమో ఏదయిననుసరే; భక్తితో నాకు సమర్పించినచో వానిభక్తిని మాత్రము చూచి భుజింతును.] * భోక్తారం యజ్ఞతపసామ్ * (గీ. 5. 29.) [యజ్ఞము తపస్సు వీనిని భుజించువానిని.] (145.)

## 146. సహిష్ణుః. (570)

"సహతే ఇతి సహిష్ణుః" భక్తులయందుగల అపరముచే, ముందు వెనుక సంపాదించినవియు తెలిసియో తెలియకగాని ఎల్లప్పుడును సర్వప్రకారంబులచే వృద్ధిగావింపబడినవియు విధినిషేధరూపమగు నాయాజ్ఞనుమీరి చేసినవియు తన్ను

147. జగదాదిజః. 148. అనఘః.
149. విజయః. 150. జేతా.

జగదాదిజః = త్రిమూర్తులలో నొకడు. అనఘః = పాపము లేనివాడు.
విజయః = జయమునకు కారణభూతుడు. జేతా = స్థాపించినవాడు,

---

అవమానించుట నిందించుట మున్నగునవియు సమస్తంబును సహించు తనకును సహింప జాలనవియు తనభక్తవిషయంబునకావింపబడినవియునగు అమితములగు అపరాధములను అన్నిటిని సహించువాడు. ఇట్టి ఓర్పు గల్గుటకు కారణంబేమనగా! ఇది వానికి స్వభావమే. దానినే 'సహిష్ణు' పదంబునందు ఇష్ణుచ్ ప్రత్యయము (అనగా 'ష్ణు' అనునది) తెలుపుచున్నది. (146.)

(అవతారిక.) వ్యూహమింతవఱకు చెప్పబడియె. ఇక విభవము చెప్పబడును.

## 147. జగదాదిజః.

"జగతః ఆదిషు జాయతే ఇతి జగదాదిజః" జగదాదిగానుండు బ్రహ్మవిష్ణు శివులలో నొకడుగా అవతరించినవాడు. * యస్య ప్రసాదాదహమచ్యుతస్య భూత ప్రజాసర్గకరోఽన్తకారీ। క్రోధాచ్చ రుద్రః * (వి. పు. 4_1_39) [ఏయచ్యుతుని యను గ్రహంబుచే నేను ప్రాణులను సృజింప గల్గితినో; ఎవనికోపంబుచే రుద్రుడు సంహరించువాడయ్యెనో] * రక్షార్థం సర్వభూతానామ్ విష్ణుత్వముపజగ్మివాన్ * (భా. ఉద్యో. 2_11) [భూతంబులను రక్షింప త్రిమూర్తులలోవిష్ణువయ్యె.] (147.)

## 148. అనఘః. (835)

"న అఘః అనఘః" ఇట్లు సంసారమండలంబున నవతరించినను పాపంబునకు విరోధి. (148.)

## 149. విజయః.

"విజయతే అస్మాదితి విజయః" బ్రహ్మరుద్రులును ఇతరమూర్తులును సృష్టి సంహారరూప వ్యాపారంబులందు జయము నొందుటయు వీనివలననే. కనుక వారల జయమునకును కారణభూతుడు వీడే యగును.

* తదాదర్శితపంథానౌ సృష్టిసంహారకారకౌ * (భా. మో. 169_19) [అవిష్ణువు ప్రదర్శించిన మార్గముననే సృష్టిసంహారంబులంగావించువారు.] (149.)

## 150. జేతా.

"జయతీతి జేతా" ఆ బ్రహ్మరుద్రులను తనయిష్టంబుననుండునట్లు స్థాపించినవాడు.] (150.)

151. విశ్వయోనిః. 152. పునర్వసుః.
153. ఉపేంద్రః. 154. వామనః.

విశ్వయోనిః = జగత్కారణభూతుడు. పునర్వసుః = మఱల వసించువాడు
ఉపేంద్రః = ఇంద్రునితమ్ముడు. వామనః = సుఖమునిచ్చువాడు.

## 151. విశ్వయోనిః. (118)

"విశ్వస్య కార్యప్రపఞ్చస్య యోనిః కారణమ్ విశ్వయోనిః" బ్రహ్మాది మూలముగా కార్యప్రపంచమగు విశ్వంబునకు కారణభూతుడు. (151.)

## 152. పునర్వసుః.

"పునః అంతరాత్మతయా వసతీతి పునర్వసుః" బ్రహ్మాదిదేవతలయందు మఱల అంతరాత్మగా వసించువాడు.

* దేవానామ్ బన్ధునిహితమ్ గుహాసు * [దేవతలహితంబునుగోరి వారలహృదయంబను గుహలో వసించును.] * తవాన్తరాత్మా మమచ యేచాన్యే దేహిసంజ్ఞితాః * (భా. మో. 179 4.) [బ్రహ్మ చెప్పెను. నీకును నాకును సమస్త ప్రాణులకును అంతరాత్మగానుండువాడు.] (152)

(అవతారిక.) అదితిపుత్రులలో కడపటిదియగు అవతారంబును (వామనావతారమును) చెప్పుచున్నారు.

## 153. ఉపేంద్రః.

"ఉపగతః ఇన్ద్రమ్ ఉపేన్ద్రః" ఇంద్రునితమ్ముడుగా సమీపించినవాడు. * జఘన్యజస్స సర్వేషాం ఆదిత్యానాం గుణాధికః। ద్వాదశైవాదితేః పుత్రాః శక్రముఖ్యాః నరాధిపః। తేషామవరజో విష్ణుః యత్ర లోకాః ప్రతిష్ఠితాః * [అదితిపుత్రులలో కడపటివాడుగా పుట్టినవాడు గుణంబులచేనందఱను మించినవాడు. నరశ్రేష్ఠుండా! అదితికి పుత్రులు ఇంద్రాదులు పన్నిరుగురు. వారలలో కడపటివాడు సమస్తలోకంబులు నధిష్ఠించియుండు సాక్షాద్విష్ణువే.] (153.)

## 154. వామనః.

"ద్రష్టౄన్ స్వకాన్త్యా వామాని సుఖాని నయతీతి వామనః" వాడే ఇంద్రరక్షణార్థమై మహాబలియాగంబున తనదివ్యశరీరకాంతిచే చూపఱులకు సుఖంబునిచ్చువాడు. * ద్రష్టౄన్ స్వకాన్త్యా వామాని సుఖాని నయతి * (శ్రుతివాక్యము.) [చూపఱులకు తన కాంతిచే సుఖముగల్గించును.] * స వామనో దివ్యశరీరగృక్ * [దివ్యశరీరంబును ధరించియుండుటచే వాడు వామనుడు] (154.)

## 155. ప్రాంశుః. 156. అమోఘః. 157. శుచిః.

ప్రాంశుః = పొడుగయినవాడు. అమోఘః = వ్యర్థముగాని ప్రభావము గలవాడు. శుచిః = పరిశుద్ధుడు.

---

### 155. ప్రాంశుః.

"ప్రాశ్నుతే సర్వం వ్యాప్నోతీతి ప్రాంశుః" వెంటనే యంతటవ్యాపించి పొడుగయినవాడు.

* తోయేతు పతితే హస్తే వామనోఽభూదవామనః। తస్య విక్రమతో భూమిం చంద్రాదిత్యౌ స్తనాన్తరే। సభః ప్రక్రమమాణస్య నాభ్యాంతౌ సమవస్థితౌ * [మహాబలియొక్క దానజలము కరంబున పడినంతనే వామనుడుగా (పొట్టిగా) నుండినవాడు అవామనుడగయ్యె (పొడుగయ్యె). వాడట్లు భూమిని ఆక్రమించునపుడు చంద్రసూర్యులు వక్షోభాగంబుననుండిరి.] * వామనో రక్షతు సదా భవన్తమ్ యః క్షణాదభూత్ * [ఒకక్షణంబుననే త్రివిక్రమరూపంబునొందిన వామనుడు నిన్ను ఎల్లప్పుడు రక్షించుగాక.] ఈ వృత్తాంతంబునే వేదమిట్లు ఘోషిల్లును :— * ఇదమ్ విష్ణుః విచక్రమే * (పు. సూ,) [విష్ణువు దీనిని ఆక్రమించిరి. * త్రీణి పదా విచక్రమే * (పు. సూ.) [మూడడుగులచే గొలిచిరి.] * విచక్రమే పృథివీ మే.ప. ఏతామ్ * (పు. సూ.) [వీడు భూమిని కొలిచెను.] (155)

### 156. అమోఘః. (111)

"నాస్తి మోఘః యస్యసః అమోఘః" బలిని ఇంద్రుని భేదములేక ఇట్లు కృతార్థముగావించుటచే వ్యర్థముగాని ప్రభావముగలవాడు.

* అనుగ్రహంచాపి బలేరనుత్తమమ్ చకార యశ్చేంద్రపదోపమం క్షణాత్। సురాశ్చ యజ్ఞాంశభుజః * (వి. ధ. 43-35.) [ఎవడు క్షణకాలంబుననే బలిచక్రవర్తికి ఇంద్రపదంబునకు సమంబగు ఉత్తమపదంబునిచ్చి దేవతలను యజ్ఞాంశము భుజించునట్లు కావించెనో;] * యత్రామ్బు విన్యస్య బలిర్మనోజ్ఞానవాప భోగాన్వసుధాతలస్థః। తథామరత్వం త్రిదశాధిపత్యం మన్వన్తరం పూర్ణమపేతశత్రుః * (వి. ధ,) [బలిచక్రవర్తి ఎవనికి నీటినొసగి (దానముచేసి) నిరతిశయ భోగంబులనొందెనో; అటులే యింద్రుడు నిరంకుశముగా దేవతలయాధిపత్యంబునొందెనో;] ఇత్యాదులు. (156.)

### 157. శుచిః. (252)

ఇట్లుపకారంబొనరించియు ప్రత్యుపకారంబును అపేక్షింపకుండుటచే పరిశుద్ధుడు. (157.)

**158. ఊర్జితః. 159. అతీన్ద్రః. 160. సంగ్రహః. 161. సర్గః. 162. ధృతాత్మా. 163. నియమః. 164. యమః.**

ఊర్జితః = బలిష్ఠుడు. అతీన్ద్రః = ఇంద్రునిమీరినవాడు. సంగ్రహః = గ్రహింపబడువాడు. సర్గః = సృజింపబడువాడు. ధృతాత్మా = ఆత్మలను ధరించువాడు. నియమః = అణచువాడు. యమః = ఇచ్చువాడు.

---

## 158. ఊర్జితః.

"ఊర్జా బలం అస్య సఞ్జాతా ఊర్జితః" అకాలంబున పఱతెంచిన నముచి మున్నగు శత్రువులను నిరసించుటయందు దృఢమగు బలముగలవాడు. (158.)

## 159. అతీన్ద్రః.

"ఇన్ద్రమ్ అతిక్రాన్తః అతీన్ద్రః" ఇంద్రునికి తమ్ముడుగా పుట్టినను ఐశ్వర్యము చేష్టితములు వీనిచే ఇంద్రుని మించినవాడు.

* అతివాయ్వింద్రకర్మాణమ్ * [ఇంద్రుడు వాయువు వీరలకార్యంబులను మించినవానిని.] (159.)

## 160. సంగ్రహః.

"సమ్యక్ గృహ్యతే ఇతి సంగ్రహః" ఇట్లుండియు భక్తులచే సుఖముగా సేవింపబడువాడు. (160.)

## 161. సర్గః.

"సృజ్యతే ఇతి సర్గః" త్రివిక్రముడై లోకమంతవ్యాపించిన పాదపద్మంబులను గల ఈతడు భక్తానుగ్రహార్థమై తన్నుతానే తనచేతనే సృజించుకొనినవాడు.

* నిసృష్టాత్మా సుహృత్సుచ * (శ్రీరా. యు. 17-౬8) [భక్తులవిషయమై తన్నుతానే సృజించుకొనును.] (161.)

## 162. ధృతాత్మా.

"ధృతాః ఆత్మానః యేనసః ధృతాత్మా" ఇట్లు తన్నే ఇచ్చి ఆత్మలను ధరించువాడు. ('62.)

## 163. నియమః. (869)

"నియమ్యన్తే అనేనేతి నియమః" ఆయాత్మకోటులకు విరోధులగు బలిచక్రవర్తి మున్నగువారలను అణచినవాడు. (163.)

## 164. యమః. (870)

"యచ్ఛతీతి యమః" ఇట్లు సమస్తంబును విరోధములేక అనుకూలముగా నుండునట్లు చేసియిచ్చువాడు.

165. వేద్యః. 166. వైద్యః.
167. సదాయోగీ. 168. వీరహా.

వేద్యః = ఎఱుంగజాలినవాడు. వైద్యః = విద్యనెఱింగినవాడు. సదాయోగీ = ఎల్లప్పుడును మేలుకొనియుండువాడు. వీరహా = వీరులను జయించువాడు.

---

"యః పృథివీమన్తరో యమయతి" (బృ. ఉ 5-7-3) [ఎవడు భూమిలోపల నుండి ప్రవర్తింపజేయునో.] * యమో వైవస్వతో రాజా యస్తవైష హృది స్థితః। తేనచేదవివాదస్తే మాగఙ్గాం మాకురూన్గమః * (మ. స్మృ. 8-92) [నియామకుడై సర్వకాలంబునను సర్వదేశంబునను ప్రకాశించుచు, సర్వులను ఆనందింపజేయువాడగు నొకడు నీ హృదయంబున గలడు. నీకు వానితో వివాదము లేకున్నచో నీవు గంగకును వెళ్ళవలదు, కురుక్షేత్రంబునకును వెళ్ళవలదు.] (164.)

## 165. వేద్యః.

* వేదితుమ్ శక్యః వేద్యః * ఇట్లు వశీకరించి ఇంద్రియంబులకు విషయము గాకుండువానినిగూడ ప్రకాశింపజేయుటచే అందఱచేతను సుఖముగా ఎఱుంగ జాలిన వాడు. (165.)

## 166. వైద్యః.

"విద్యా మధీతే ఇతి వైద్యః" ఇట్లు తన్నాశ్రయించువారలను బాధించు సంసారంబును తొలగించు ఔషధమగు విద్యను ఎఱింగినవాడు. (166.)

## 167. సదాయోగీ.

"సదా యోగః అస్యాస్తీతి సదాయోగీ" ఇట్లీ విషయంబున సదా మేలుకొనియుండును.

* య ఏషు సుప్తేషు జాగర్తి * [ఎవడు వీరలు నిద్రించునపుడు మేలుకొని యుండునో.] (167.)

## 168. వీరహా. (747-927)

"వీరాన్ హన్తీతి వీరహా" తన్ను ఎఱుంగ ప్రవర్తించినపుడు ఎఱుంగ కుండ విరోధంబుచేయు వీరులను నిరసించువాడు.

* అసత్యమప్రతిష్ఠన్తే జగదాహురనీశ్వరమ్ * (గీ. 16. 8.) అనుప్రసంగించి * తానహం ద్విషతః క్రూరాన్ సంసారేషు నరాధమాన్ । క్షిపామ్యజస్రమశుభాన్ ఆసురీష్వేవ యోనిషు * (గీ. 16-18.) ఇత్యాదులు. [అఖిలజగంబును అనీశ్వరము అప్రతిష్ఠము అనియందురు. ఆసురప్రకృతులు.................. అట్టి క్రూరులను ద్వేషులను నరాధములను సంసారంబుననే ఆసురప్రకృతిజన్మంబుననే ఎల్లప్పుడును త్రోసివేయుదును.] (168.)

169. మాధవః. 170. మధుః.
171. అతీంద్రియః. 172. మహామాయః.

మాధవః = (1) మాయను పరవిద్యకుస్వామి (2) మౌనధ్యానయోగంబులు గలవాడు. మధుః = తేనెవంటివాడు. అతీంద్రియః = ఇంద్రియంబుల నతిక్రమించినవాడు. మహామాయః = గొప్ప మాయగలవాడు.

---

## 169. మాధవః. (73-741)

"మాయాః ధవః మాధవః" (1) అనంతరము, తనవిషయమగు పరబ్రహ్మ విద్యను ప్రవర్తింపజేయుటచే 'మా' యను విద్యకునాథుడు. * మా విద్యాచ హరేః ప్రోక్తా తస్యా ఈశో యతో భవాన్ । తస్మాన్మాధవనామాసి ధవః స్వామీతి శబ్దితః * (హ. వం.) [ఓహరీ ! మాయనగా పరవిద్య, దానికి మీరు స్వామిగానుండుటచే మాధవులగుదురు. ధవ అనగా స్వామి.]

(2) లేక * మౌనాత్ ధ్యానాచ్చ యోగాచ్చ విద్ధి భారత మాధవమ్* (భా. ఉ. 69-4.) [మౌనధ్యానయోగంబులుగలవాడగుటచే వానిని మాధవునిగా నెఱుంగుము] అను ఋషినిరుక్తరీత్యా మౌనధ్యానయోగంబులను గలవాడు. (169.)

## 170. మధుః.

"మన్యతే ఇతి మధుః" ఆపరవిద్యను లభించినవారలకు తేనెవలె నింపుగా నుండువాడు. * మధ్వ ఉత్సః * (పు. సూ.) [మధుప్రవాహము.]

* ప్రియోహి జ్ఞానినోఽత్యర్థమ్ * (గీ. 7-17) [జ్ఞానికి నేను అత్యంతము ప్రియుడను గదా!] (170.)

(అవతారిక.) అనంతరము మధురమధు (తేనె) సముద్రమువంటి స్వరూపముగలవాడగు గుణవిశిష్టుండగు భగవంతునియందు, క్రిందజెప్పిన పరవ్యూహ విభవంబుల హృదయంబులైన షాడ్గుణ్యంబును చెప్పదలంచి మొట్టమొదట స్వరూపం బును శోధించుచున్నారు.

## 171. అతీన్ద్రియః.

"ఇంద్రియాణి అతిక్రాన్తః అతీన్ద్రియః" జ్ఞానోపకరణంబులగు ఇన్ద్రియంబులను అతిక్రమించినవాడు.

(అవతారిక.) అది యెట్లనగా;

## 172. మహామాయః.

"మహతీ మాయా యస్యసః మహామాయః" తన్నాశ్రయించిన వారలుదప్ప ఇతరులందఱు తెరవంటి మాయచే కప్పబడి యుండుటవలన ఇతరులచే చూడబడని వాడు.

173. మహోత్సాహః. 174. మహాబలః.

మహోత్సాహః = అధికమగు ఉత్సాహమునుగలవాడు. మహాబలః = గొప్ప బలముగలవాడు.

---

* గుణమాయాసమావృతః * (జి. 1-3.) [గుణమయంబగు మాయచే ఆవరింపబడినవాడు.]

ఇచ్చట మాయయనగా మిథ్యగాదని మీద చెప్పబడును. (నైకమాయః నామము. 303.)

(అవతారిక.) సాంఖ్యులు ఆత్మను జ్ఞానరూపుడుగా నొప్పుకొందురు. అయినను వాడు కర్తకాజాలడు. తామర మీదనుండు నీరువలె ప్రకృతితో సంబంధింపక ఉదాసీనుడై అలసుడైయుండును అని యందురు. దానిని ఖండించుచున్నారు ;—

## 173. మహోత్సాహః.

[ఇక షాడ్గుణ్యము చెప్పబడును. ఆయాఉ గుణంబులలో కర్తృత్వరూపమగు నైశ్వర్యము ప్రధానముగాన మొట్టమొదట ఐశ్వర్యరూపగుణంబును అనుభవించుచున్నారు.]

"మహాన్ ఉత్సాహః యస్యసః" కర్తృత్వమను గొప్ప ఐశ్వర్యమునుగలవాడు. ఉత్సాహంబనగా కర్తృత్వంబను ఐశ్వర్యము. దానిని అత్యధికముగాగలవాడు. ఇతరుల ప్రేరణలేకయే తనసంకల్పమాత్రంబుచేతనే సమస్తంబును సృజించుటచే సాంఖ్యులు చెప్పునట్లు అకర్తృత్వములేదు. వీడు కర్తయేయగును. స్వాతంత్ర్యశూన్యమగు కర్తృత్వముండుటచేతనే ఈతడు భగవంతుడయ్యె. ఈశక్తిలేశంబున అణుమాత్రములగు అణిమాది ఐశ్వర్యంబులు బ్రహ్మాదులందు సంబంధించుటచేతనే వారలకు అపరిమితవైభవము గల్గుచున్నది. (175.)

## 174. మహాబలః.

"మహత్ బలం యస్యసః మహాబలః" సహాయాంతరంబునపేక్షింపకయే సృజించు మహాబలముగలవాడు.

ఈబలముండుటచేతనే వీడు ఎంతగొప్ప కార్యంబుచేసినను శ్రమములేక తనమహిమంబుమీదనే నిల్చియుండి ఆధారాంతరంబునపేక్షింపక ఇతరులచే చేయజాలని వ్యాపారంబులను గావించుచు సమస్తంబును శరీరమువలె భరించును. మూలసంహితలోనిదిస్పష్టము. ఈబలంబున అణుమాత్రమే జలము వాయువు పర్వతము భూమి అనువీనిలో నుండును. (174.)

(అవతారిక.) జగత్కారణవస్తువునకు సర్వజ్ఞత్వములేదని కొందఱందురు. ఆమతంబును ఖండించుచున్నారు.

## 175. మహాబుద్ధిః.

మహాబుద్ధిః = గొప్పజ్ఞానము గలవాడు.

---

## 175. మహాబుద్ధిః.

"మహతీ బుద్ధిః యస్యస, మహాబుద్ధిః" సంశయభ్రమాదులులేక సర్వంబు నెఱుంగదగు జ్ఞానముగలవాడు.

ఈ జ్ఞానమే సర్వదేశ సర్వకాల సర్వస్వభావములయందును, సమీపంబునను దూరంబునను ఉండు సమస్తంబును విషయీకరించును. సర్వంబు నెఱుంగుటచే సందేహ భ్రమాదులులేక యథార్థమైయుండును. క్లేశము కర్మవిపాకము మున్నగు వానితో సంబంధింపకయు స్వాభావికముగాను ఉండుటచే నిత్యమైయుండును. చక్షురాది (కన్నుమున్నగు) ఇంద్రియంబులను అపేక్షింపకుండును. ఈశ్వర స్వాతంత్ర్యంబుచే ఆయింద్రియంబులను ఒకప్పుడు అపేక్షించినను అపేక్షించును. కనుకనే "పుణ్డరీకాక్షః, శుచిశ్రవాః" (112-139 వ, నామములు) అని చెప్పబడి యున్నవి. రూపరసాదులను గ్రహించునపుడు ఆ యా యింద్రియంబులుండవలయునను నియమములేదు. సకలఇంద్రియంబులచేతను సమస్త కార్యములును చేయనగును. సాధారణముగా తిర్యగ్జాతులగు సర్పాదులు కంటిచే చూచుచుండును, వినుచునుండును. (కనుకనే సర్పంబును 'చక్షుశ్శ్రవాః' అనగా చెవులే కన్నులుగాగలవి అనియందురు.) అట్లుండ సర్వశక్తుండగు భగవంతునకీయల్పశక్తి దుర్లభమా? ఇదియె జయ సంహితలో * సర్వతః శ్రుతిమాంశ్చాసౌ యథాదృచ్ఛ్రవకోరగః * [నేత్రంబులచే చూచు సర్పమువలె వీడు అంతట శ్రోత్రములుగలవాడు.] అని స్పష్టముగా చెప్పబడియుండును.

మఱియు ఈజ్ఞానము విశదముగానుండుటచే కరతలామలకంబువలె సమస్తంబును నిర్వహించునదియగుటచే అమోఘమైయుండును. * విశ్వతశ్చక్షురుత విశ్వతో ముఖః * (తై. నా. 6. 1. 12.) [అంతట నేత్రములుగలవాడు. అంతట ముఖముగలవాడు.] * పశ్యత్యచక్షుః స శృణోత్యకర్ణః * (శ్వే. ఉ. 3. 19.) [కన్నులేకయె చూచును. శ్రోత్రములులేకయే వినును.] * సర్వతో౽క్షి శిరోముఖమ్ * (తై. ఉ.) [అంతట నేత్రములు శిరములు ముఖములు గలవాడు.] ఇత్యాదులు. శ్రీమన్నాథమునులు గూడ * యో వేత్తి యుగపత్సర్వం ప్రత్యక్షేణ సదాస్వతః * (న్యాయతత్త్వము) [ఎవడు ఒకప్పుడే సమస్తంబును ప్రత్యక్షముగా ఎల్లప్పుడును స్వతః చూచునో] అని సాధించిరి.

ఇట్లుండ కొందఱు, నేత్రంబులచేతనే సమస్తంబును చూచు వాడెట్లు సర్వజ్ఞుడగును? అని సర్వజ్ఞుండగు భగవంతుని నిందింతురు. అయ్యవి బౌద్ధమతము ననుసరించినవి. లేనిచో సకలశాస్త్రంబులను విరోధించును గదా? నేత్రంబులచేతనే విను సర్పాదులందును, కాకి గుడ్లగూబమున్నగువానియందును, మంత్రసిద్ధౌషధ

| 176. మహావీర్యః. | 177. మహాశక్తిః. |
| --- | --- |
| మహావీర్యః = గొప్ప వీర్యముగలవాడు. | మహాశక్తిః = గొప్ప శక్తిని గలవాడు. |

---

తపః ప్రభావాదులు సిద్ధించినవారలందును ఆయాయింద్రియంబులచేతనే ఆయావ్యాపారంబులగునను నియమంబులేక తారతమ్యముండుటను ప్రత్యక్షముగా చూచుచుండు నపుడు శాస్త్రసిద్ధంబగు భగవంతునిసర్వజ్ఞతావిషయమందుమాత్రము హాని చెప్పుట పరిహాసాస్పదముగానుండును. భగవంతుని యితర గుణంబులును ఇటులే విచిత్రముగా నుండును. ఈజ్ఞానముయొక్క అల్పాంశము మాత్రము బద్ధ-ముక్త-నిత్యులందు గలదు. (175.)

## 176. మహావీర్యః.

"మహత్ వీర్యమ్ యస్యసః" వీర్యమనగా వికారంబునకు గారణంబు లుండి నను వికారంబు నొందకుండుట. అట్టివీర్యమును గలవాడు.

పెరుగునకు కారణంబగు పాలు, పెరుగుగా మాఱునపుడు వికారంబు నొందు నట్లు జగత్కారణభూతుండయ్యు కొంచమైనను వికారంబు నొందడు. అగరువు - కస్తూరి - పుష్పాదులవాసనవలె భగవంతుడు తనసన్నిధిమాత్రముచేతనే అపరిమిత కార్యములం జేయును.

* తస్య సన్నిధిమాత్రేణ గన్ధః క్షోభాయ జాయతే। మనసో నోపకర్తృత్వాత్, తథాఽసౌ పరమేశ్వరః * [తాను సంబంధించినంతమాత్రాన గంధము కలత నొందించును. మనోవ్యాపారంబు నొకింతయు నపేక్షింపదు. అటులే పరమేశ్వరుడుగూడ చేయును.] దీనిలోని యణుమాత్రమే యోగీశ్వరాదులందు గలదు. (176.)

## 177. మహాశక్తిః.

"మహతీ శక్తిః యస్యసః మహాశక్తిః" నిమిత్తకారణముగాను ఉపాదాన కారణముగాను ఉండు గొప్ప శక్తిని గలవాడు.

పశుపతిమతంబున పరబ్రహ్మంబును నిమిత్తకారణముమాత్రముగానందురు. అట్లుగాక ఉపాదానకారణముగూడ నాతడే యగును అను శక్తినిగలవాడు. ఈ శక్తి ఎట్టిదనగా; సాధనసమూహంబులను వినియోగించునదై, భగవచ్ఛరీరైకదేశంబగు ప్రకృతిని పరిణమింపజేయునదై, సామగ్రి ఉండినను లేకున్నను సదా సమస్తంబును సంపాదించునదై యుండును.

ఒకేవస్తువే ఉపాదానకారణముగాను నిమిత్తకారణముగాను ఎట్లు కావచ్చునని శంకింపవలదు. లోకమున సాలెపురుగు నూలునకు ఉపాదానకారణముగాను నిమిత్తకారణముగాను ఉండుటను చూచుచున్నాముగదా ? అట్లుండ సర్వశక్తుడైన భగవంతునకు ఇట్టి శక్తి దుర్లభంబగునా ?

178. మహాద్యుతిః. 179. అనిర్దేశ్యవపుః.

మహాద్యుతిః = గొప్ప కాంతిగలవాడు. అనిర్దేశ్యవపుః = నిర్దేశింపజాలని శరీరముగలవాడు.

---

ఈ శక్తిలోని యంశ భాగముమాత్రమే ప్రధానంబనబడు ప్రకృతిలోను, ప్రతిక్షణము పరిణమించు పాలు పెరుగు మున్నగు వస్తువులలోనుగలదు. (177.)

## 178. మహాద్యుతిః.

" మహతీ ద్యుతిః యస్యసః మహాద్యుతిః " సహాయాంతరంబు నపేక్షించు కారణాంతరమువలెగాక ఇతరాపేక్షలేక మహాతేజంబుతో గూడియుండువాడు. ఇదియే బాహ్యాంధకార - ఆంతరాంధకారంబులను తొలగించు సూర్యాదులకు అనుకూలమై తద్విరుద్ధంబులకు భయంకరమై యుండును. దీనిబిందుమాత్రమే సూర్యచంద్రమాణిక్యాదులందు ప్రకాశించును.

క్రిందజెప్పిన ఆఱు [173-178] నామములలోను గల మహత్త్వ విశేషణంబుచే ఈగుణంబులు కలామాత్రంబుచేతనే ఉచ్చనీచంబులగు సమస్తకార్యంబులను ప్రవర్తింపజేసి సమస్తమునకును విషయము లభింపక సముద్రంబున మహాప్రవాహములువలె భగవంతునియందు నిండియుండును అని తెలియుచున్నది. * పరాఽస్య శక్తిర్వివిధైవ శ్రూయతే, స్వాభావికీ జ్ఞానబలక్రియాచ * (శ్వే. ఉ. 6-8) [వీని పరశక్తి పలువిధంబుగా చెప్పబడును. జ్ఞానబలక్రియాదులు స్వాభావికములు.] * తేజోబలైశ్వర్య మహావబోధసువీర్యశక్త్యాదిగుణైకరాశిః * (వి. పు. 6-5-8) [తేజము బలము ఐశ్వర్యము మహాజ్ఞానము వీర్యము శక్తి మున్నగు గుణంబు లొకరాశిగా నుండువాడు.] ఇత్యాదులు. భగవచ్ఛాస్త్రంబు లన్నింటికిని ఇదియే విషయము. ఈ యాఱు గుణంబులలోనే సౌశీల్య వాత్సల్యాది గుణంబులు ఏదే నొక ప్రయోజనంబునకై అంతర్భవించును. (178.)

## 179. అనిర్దేశ్యవపుః (662)

" అనిర్దేశ్యమ్ వపుః యస్యసః అనిర్దేశ్యవపుః " ఇట్లు షాడ్గుణ్య (ఆఱు గుణంబులచే) పూర్ణుండగుటచే సమానములేని శరీరము గలవాడు. అనగా ఇట్టిదని నిర్దేశింపజాలని శరీరము గలవాడు.

* షాడ్గుణ్య విగ్రహమ్ దేవమ్ భాస్వజ్జ్వలనతేజసమ్ * [ఆఱు గుణంబులను ప్రకాశించు దివ్య శరీరముగలవాడును అగ్నివంటి తేజంబుగలవాడునగు దేవుని] * బుద్ధిమనోఽఙ్గ ప్రత్యఙ్గవత్తామ్ భగవతి లక్షయామహే * (నా. స.) [బుద్ధి మనసు అఙ్గము ప్రత్యఙ్గము ఇవి యన్నియుభగవంతునియందున్నట్లు నిశ్చయింతము.]

ఇవ్విషయంబున నిరుక్తియు నిట్లు చెప్పబడియుండును. " ఎవరు, బుద్ధి మనసు అవయవములు వీనింగలవారలో ; వారల విభవము అస్థిరమైయుండును. కనుక భగవంతునకు శరీరముండునట్లు చెప్పినచో అది యేరూపముగా నుండును ? అని విచారించి

## 180. శ్రీమాన్. 181. అమేయాత్మా. 182. మహాద్రిధృత్.

శ్రీమాన్ = ఆభరణ సంపదిగలవాడు. అమేయాత్మా = గంభీర స్వభావుడు.
మహాద్రిధృత్ = మంధరపర్వతంబునెత్తినవాడు.

---

భగవచ్ఛరీరము పంచభూతముల సంబంధముగా నుండునా ? అని శంకించి "భగవచ్ఛరీరము భగవద్రూపముగానే యుండును. భగవంతుడేరూపమో ; ఆ రూపమే భగవంతుని శరీరంబును. ఆ భగవంతునిరూప మెట్టిదనగా ; జ్ఞానస్వరూపము శక్తిస్వరూపము ఐశ్వర్య స్వరూపము. అది యెట్లనగా ; చందనాది కాష్ఠములు జ్వలించునపుడు ఎట్లు మొత్తము అగ్నిమయముగానే యుండునో, మధుమయంబగు పాత్రంబును పానంబుచేసినచో అది యెట్లు మొత్తము మధురముగానే యుండునో ; సువర్ణ పిండంబును ఒరసినచో అది మొత్తము నెట్లు సువర్ణముగానే యుండునో ; ప్రాసాదము (మిద్దె) ను చూడచూడ అది యెట్లు అందముగానుండునో ; అటులే భగవంతుడు మొత్తమును జ్ఞానముగాను ఐశ్వర్యముగాను శక్తిగాను మనము దేనిం గోరిన నది గల్గునట్లుగానుండును." అని. ఇవియే పంచోపనిషన్మయంబయిన శరీరంబని పైగా చెప్పబడును. ఈ శరీరము శుద్ధసత్త్వమయంబగుటచే, బంగారులోపొదిగిన రత్నమువలె భగవంతునిషడ్గుణంబులును ప్రకాశింపజేయుచుండును. త్రిగుణమయంబగు మన శరీరమువలె ఆ గుణంబులను దాగజేయునదిగాదు అని తత్వము " అని.

* రూపవర్ణాది నిర్దేశ విశేషణ వివర్జితః * (వి. పు.) [రూపము వర్ణము మున్నగునవి యుండునట్లు నిర్దేశించు విశేషణములు లేనివాడు.] (నిర్దేశ విశేషణంబనగా ఉపమాన విశేషణము. అదిలేనివాడు సాటిలేనివాడని భావము.) (179.)

### 180. శ్రీమాన్. (22-222)

"శ్రీః అస్యాస్తీతి శ్రీమాన్" అదివ్యశరీరంబునకుదగిన దివ్యాభరణసంపద గలవాడు. (180.)

### 181. అమేయాత్మా. (103)

"అమేయః ఆత్మా యస్యసః అమేయాత్మా" ఈ గుణంబులకును దివ్య దేహంబునకును దగినట్లు అతి గంభీరమగు స్వభావము గలవాడు. (181.)

### 182. మహాద్రిధృత్.

"మహాన్తం అద్రిం ధరతీతి మహాద్రిధృత్" మందరంబను మహాపర్వతంబును క్షీరసముద్ర మథనకాలంబున ధరించినవాడుగాన ఆగాంభీర్యాదులకుందగిన చేష్టితంబులం గలవాడు. (182.)

183. మహేష్వాసః. 184. మహీభర్తా. 185. శ్రీనివాసః.
186. సతాంగతిః. 187. అనిరుద్ధః. 188. సురానన్దః.

మహేష్వాసః = మహాశరం (బాణం) బులను విడుచువాడు. మహీభర్తా = భూమిని ధరించువాడు. శ్రీనివాసః = లక్ష్మిని గలవాడు. సతాంగతిః = ఆశ్రితులకు గతియైనవాడు. అనిరుద్ధః = అడ్డగింప సాధ్యముగాని వాడు. సురానన్దః = దేవతలను ఆనందింపజేయువాడు.

---

## 183. మహేష్వాసః.

" ఇషూణామ్ ఆసః ఇష్వాసః, మహాన్ ఇష్వాసః యస్యసః మహేష్వాసః " సేతుబంధన రావణవధాదికాలంబున అతిమనోహరంబుగా బాణంబులను ప్రయోగించువాడు. (183.)

## 184. మహీభర్తా.

"మహీమ్ బిభర్తీతి మహీభర్తా " లీలగా భూమిని ధరించువాడు. (184.)

## 185. శ్రీనివాసః. (614)

" శ్రియః నివాసః శ్రీనివాసః " క్షీర సముద్రంబును మథించి లభించిన లక్ష్మి విలాసముగా వక్షంబు నారోహించునట్లు కావించుకొన్నవాడు. (185.)

## 186. సతాం గతిః. (451)

ఇట్లు యథేచ్ఛగా విహరించుచునుండియు ఆశ్రితులకు ప్రియము కావించు వాడగుటచే వారలకు ప్రాప్యుడు. (186.)

## 187. అనిరుద్ధః. (644.)

"న నిరుద్ధః అనిరుద్ధః" ఇట్లు సకలవిరోధులను నిరసించి సమస్త జీవ లోకంబునకును రక్షణంబగు దివ్యచేష్టితంబులుగలవాడగుటచే ఎవరివలనను అడ్డగింప సాధ్యముగానివాడు.

* అపరిమితచేష్టో భగవాన్ అనిరుద్ధః * (మా. స.) [భగవంతుడగు అనిరుద్ధుడు అపరిమిత దివ్యచేష్టితంబులుగలవాడు.] (187.)

(అవతారిక.) అనంతరము అవతారంబులకెల్ల మూలకందంబగు అనిరుద్ధుడు కావించియుండు హంసావతారమును చెప్పుచున్నారు.

## 188. సురానన్దః.

" సురాః ఆనన్దన్తి అస్మాదితి సురానన్దః " ఆపద్బంధువుగానుండుటచే దేవతలనానందింపజేయువాడు. (188.)

189. గోవిన్దః. 190. గోవిదాం పతిః. 191. మరీచిః.
192. దమనః. 193. హంసః.

గోవిందః = నుతింపబడినవాడు. గోవిదాం పతిః = వేదవాక్కు నెఱింగిన వారలను రక్షించువాడు. మరీచిః = కిరణమువంటివాడు. దమనః = శమింపజేయువాడు. హంసః = హంసస్వరూపి.

---

## 189. గోవిన్దః. (543.)

" గాః వాచః విన్దతీతి గోవిన్దః " దేవతలస్తోత్రరూపములగు వాక్కులను పొందినవాడు. (189.)

## 190. గోవిదామ్ పతిః.

' గో ' అనగా వేదవాక్కులు. ఆవాక్కుల నెఱింగినవారలు గోవిదులు. వారలను రక్షించువాడు. అనగా, వేదవిత్తులగు జ్ఞానులచే జ్ఞానయజ్ఞంబుచే ఆరాధింపబడి వారలను రక్షించువాడు.

* హంసమూర్తి మథాత్మానం జ్ఞానయజ్ఞభుజం స్మరేత్ * [హంసమూర్తి యగు పరమాత్మను జ్ఞానయజ్ఞంబును భుజించువాడుగా స్మరింపగలడు.] (190)

## 191. మరీచిః.

హంసావతారంబుచే పుట్టుగ్రుడ్డులగు జంతువులకును నిర్మలమగు తన రూపంబుతో కిరణమువలె ప్రకాశించువాడు.

* కున్దేన్దు స్నిగ్ధ కాన్తిశ్చ * [మొల్లపూవలెను చంద్రునివలెను మనోహరంబగు కాంతినిగలవాడు.] అని హంసుని ధ్యానశ్లోకము. (191)

## 192. దమనః.

" దామ్యతీతి దమనః " కాంతియను గంగా ప్రవాహంబుచే సంసార తాపంబును శమింపజేయువాడు. (192.)

(అవతారిక.) ఇట్టివాడెవ్వడనగా ;

## 193. హంసః.

(1) " హన్తి మనోహరం గచ్ఛతీతి హంసః " మనోహరముగా నేగువాడు.

(2) * హన్తా సఙ్గానామ్ * అను మూల సంహితా రీతిగా ఆశ్రితుల సంగంబును నిరసించువాడు. * సత్త్వ శుభాశ్రయ పరమహంసాయ * [శ్రేష్ఠమగు సత్త్వ గుణంబులకు స్థానంబగు పరమహంసునికొఱకు.] అని వీరి ధ్యానమున గలదు. (193.)

194. సుపర్ణః.　　195. భుజగోత్తమః.
196. హిరణ్యనాభః.　　197. సుతపాః.

సుపర్ణః = (1) సుందరములగు ఱెక్కలు గలవాడు. (2) సంసారమునుండి దరిచేర్చువాడు. భుజగోత్తమః = ఆదిశేషునకు నాథుడు. హిరణ్యనాభః = స్వర్ణమయమగు నాభిని గలవాడు. సుతపాః = మంచి జ్ఞానము గలవాడు.

---

## 194. సుపర్ణః. (859.)

(1) "శోభనే పర్ణే పక్షౌ యస్యసః సుపర్ణః" సుందరంబులగు ఱెక్కలంగల వాడు.

(2) "సుష్ఠు పారం నయతీతి సుపర్ణః" నిరుక్తరీతిగా సంసారంబునుండి దరిజేర్చువాడు. (194)

(అవతారిక.) "పద్మనాభో ఽ మరప్రభుః" (నామము 48_49.) అని వ్యూహంబున కడపటివాఁడగు అనిరుద్ధుడు పద్మనాభుడుగా చెప్పబడిరి. ఇక ఇచట అవతారంబులందు ప్రథముండగు పద్మనాభుని చెప్పుచున్నారు.

## 195. భుజగోత్తమః.

"భుజగస్య ఉత్తమః శేషీ భుజగోత్తమః" ఆదిశేషుండను శయనంబున శయనించుటచే ఆదిశేషునకునాథుఁడు.

* సుష్వాప భగవాన్ విష్ణురప్సుయ్యా మేక ఏవహి । నాగస్య భోగే మహతి శేషస్యామితతేజసః * (భా. అ.) [విష్ణువు తానొకడే ఒంటరిగా జలంబున శయనంబున శేషశయనంబున శయనించిరి.] * భోగిశయ్యాగతః శేతే త్రైలోక్య గ్రాసబృంహితః * (వి. పు.) [త్రైలోక్యంబును ఆరగించిన సంతసంబుచే శేషశయనంబున పరుండె.] (195.)

## 196. హిరణ్యనాభః.

"హిరణ్యమ్ నాభౌ యస్యసః హిరణ్యనాభః" అతడే స్వర్ణమయంబగు నాభినిగలవాడు. (చూ. నామము 198.) (196.)

## 197. సుతపాః.

"శోభనం తపః జ్ఞానం యస్యసః సుతపాః" తపస్సు అనగా జ్ఞానము. మంచి జ్ఞానమును శరీరముగాగలవాడును అతడే.

198. పద్మనాభః. 199. ప్రజాపతిః.

200. అమృత్యుః.

పద్మనాభః = తామరను నాభిలో గలవాడు. ప్రజాపతిః = ప్రజలకు నాథుడు.
అమృత్యుః = మృత్యువునకు విరోధి.

---

* దివ్యబోధ తనుర్విభుః * [దివ్య జ్ఞానంబును శరీరముగాగలవిభువు.] అని వారిధ్యానశ్లోకము. (197.)

## 198. పద్మనాభః. (48_348)

"పద్మమ్ నాభౌ యస్యసః పద్మనాభః" తామరను నాభిలోగలవాడు. పద్మనాభ హిరణ్యనాభ నామంబుల (168_196.) యర్థము బ్రహ్మాండ పురాణంబున స్పష్టము.

* కదాచి త్తస్య సు ప్తస్య నాభ్యామ్ కామాదజాయత। దివ్యమష్ట దలం భూరి పఙ్కజం పార్థివమ్ మహత్। యస్య హేమమయీ దివ్యా కర్ణికా మేరురుచ్యతే * [సంకల్పంబుచే నిద్రించు వానినాభినుండి పృథివీసంబంధమై అష్టదళంబులతోగూడిన పెద్దతామర ఒకటి గలిగె. దానికి సువర్ణమయంబగు మేరుపర్వతమే తామరదుద్దు గానయ్యె.] (198.)

## 199. ప్రజాపతిః. (70.)

"ప్రజానామ్ పతిః ప్రజాపతిః" కనుకనే బ్రహ్మాదిసమ స్తప్రజలకునుస్వామి. ఇది నైమిత్తికసృష్టి ప్రళయ విషయము. (199.)

(అవతారిక.) అనంతరము నృసింహావతారము చెప్పబడును.

## 200. అమృత్యుః.

మృత్యువునకును మృత్యువుగాన మృత్యు విరోధి. (200.)

శ్రీ విష్ణు సహస్రనామ వ్యాఖ్యానమున
ద్వితీయ శతకము సంపూర్ణము.

శ్రీమతే రామానుజాయ నమః.

# తృతీయ శతకము.



201. సర్వదృక్. 202. సింహః. 203. సంధాతా.
204. సంధిమాన్. 205. స్థిరః. 206. అజః.

సర్వదృక్ = అందఱను చూచువాడు. సింహః = సింహస్వరూపి. సంధాతా = చేరదీయువాడు. సంధిమాన్ = చేరియుండువాడు. స్థిరః = చలింపకుండువాడు. అజః = జన్మము లేనివాడు.

---

## 201. సర్వదృక్. (577.)

"సర్వాన్ పశ్యతీతి సర్వదృక్" ఆనృసింహుడు, అనుకూల - ప్రతికూల - తటస్థులు అనునందఱను వారవారలకు దగినట్లు నియమింపచూచువాడు. వాడు సర్వతోముఖుడుగాన నిదిసంభవించును. (201.)

(అవతారిక.) ఆతడెవ్వడనగా:—

## 202. సింహః. (489.)

"సించతీతి సింహః" శత్రువులు అను మదపుటేనుగులను తుదముట్టించు భయంకరంబగు మహానృసింహమూర్తి. (202.)

## 203. సంధాతా.

"సందధాతీతి సంధాతా" ఆతడట్లు శత్రువులు అను మదపుటేనుగులను సంహరించు భయంకరుండయ్యు ఆశ్రితులగు ప్రహ్లాదాదులను చేరదీయువాడు. (203.)

## 204. సంధిమాన్.

"సంధిః అస్యాస్తీతి సంధిమాన్" వారలతో నిత్యము చేరియుండువాడు.

## 205. స్థిరః.

"తిష్ఠతీతి స్థిరః" చేరునపుడు వారలయపచారంబులంజూచి వెనుదీయక స్థిరముగానిలుచువాడు. (205.)

## 206. అజః. (96-524.)

"న జాయతే ఇతి అజః" స్తంభంబునుండి సంభవించియుండుటచే ఇతరులవలె పుట్టనివాడు.

207. దుర్మర్షణః. 208. శాస్తా.
209. విశ్రుతాత్మా. 210. సురారిహా.

దుర్మర్షణః = సహింపజాలనివాడు. శాస్తా = శిక్షించువాడు. విశ్రుతాత్మా = సుప్రసిద్ధ వృత్తాంతములు గలవాడు సురారిహా = హిరణ్యకశిపును సంహరించినవాడు.

---

* న జాయతే జనిత్ర్యామ్ యదజ స్తస్మాదజనేకజిత్ * [జన్మంబునిచ్చు ప్రకృతిలో పుట్టడుగాన స్వయం జ్యోతియగు భగవంతుని అజుడందురు.] (206.)

## 207. దుర్మర్షణః.

“దుఃఖేనాపి మర్షితుమ్ అశక్యః దుర్మర్షణః” విరోధులచే సహింపజాలనివాడు.

* రథాఙ్గశఙ్ఖధాతారమ్ బ్రహ్మమూర్తిమ్ సుభీషణమ్ * [శంఖచక్రంబులనుధరించి భయంకరుడై ప్రకాశించు బ్రహ్మమూర్తిని] అని వారిధ్యానంబున స్పష్టము. (207.)

## 208. శాస్తా.

“శాస్తీతి శాస్తా” సమస్త దుర్జనులను ఈదేహంబుతో శిక్షించువాడు.

* నినాదవిత్రాసిత దానవః * (వి. పు.) [తనధ్వనిచే దానవులను భయపఱచినవాడు.] * ద్రవన్తి దైత్యాః * (వి. పు.) [దైత్యులు పాఱిపోవుదురు.] (208.)

## 209. విశ్రుతాత్మా.

“విశ్రుతః ఆత్మా యస్యసః విశ్రుతాత్మా” అతడే ఎప్పుడును ఎచ్చటను అందఱును ఆశ్చర్యమొందునట్లు సుప్రసిద్ధంబగు సింహావతారవృత్తాంతంబునుగలవాడు.
* అశేషదేవేశ! నరేశ్వరేశ్వరైః * [సమస్తదేవులకును నాథుడా! మనుష్యుల నాథులకును నాథులచే......... ] ఇత్యాది. (209.)

## 210. సురారిహా.

“సురారీం హన్తీతి సురారిహా” దేవతలకు శత్రువగు హిరణ్యకశిపును వక్షంబును చీల్చి చంపినవాడు.

* సత్త్వసత్వకరజశ్రేణీదీప్తేనోభయపాణినా। సంయచ్ఛతే యథా సమ్యక్ భయానాం సోఽభయం పరమ్ * [శుద్దసత్త్వమయంబగు నఖములచే వెలసిల్లు రెండుహస్తంబులచేతను భయంబును తొలగించినవాడగుటచే వాడే శ్రేష్ఠమగు అభయస్థానము.] అని ధ్యానశ్లోకము. (210.)

(అవతారిక.) అనంతరము మత్స్యావతారము వర్ణింపబడును.

211. గురుః గురుతమః. 212. ధామ. 213. సత్యః.
214. సత్యపరాక్రమః 215. నిమిషః.
216. అనిమిషః. 217. స్రగ్వీ.

గురుతమః గురుః = గురువులకును గురువు. ధామ = ఆధారమైనవాడు. సత్యః = సత్పురుషులకుం దగినవాడు. సత్యపరాక్రమః = సత్యమగు వ్యాపారము గలవాడు. నిమిషః = చూడకుండువాడు. అనిమిషః = చూచువాడు. స్రగ్వీ = మాలను ధరించినవాడు.

---

## 211. గురుర్గురుతమః.

"గురుతమః గురుః" సమస్తవిద్యలకును పరమాచార్యుడు. * స పూర్వేషామపి గురుః) * (హై. శా.) [పూర్వులకుంగూడ గురువు వాడే.] * పూజ్యశ్చ గురుర్గరీయాన్ * (గీ. 11-43) [పూజ్యుడును పరమగురువును నీవే] (211.)

## 212. ధామ. (62)

సంహారకాలంబున నశించు చరాచరంబులకు ఆధారమైనవాడు. (212.)

## 213. సత్యః. (107-873)

"సత్సు సాధుః సత్యః" అక్కాలంబున నాశ్రయించిన మన్వాదిసత్పురుషులకు సాధువుగా (తగినవాడుగా) నుండినవాడు. (213.)

## 214. సత్యపరాక్రమః.

"సత్యః పరాక్రమః వ్యాపారః యస్యసః సత్యపరాక్రమః" వారలయందు సత్యమగు అనగా కపటములేని వ్యాపారములం గలవాడు. (214)

## 215. నిమిషః.

"నిమిషతీతి నిమిషః" వారల (ఆశ్రితుల) విరోధులను కన్నుతెఱచిచూడకుండువాడు. (215.)

## 216. అనిమిషః.

"న నిమిషతీతి అనిమిషః" సత్పురుషులను జాగ్రతతో కన్నుతెఱచి చూచుచుండు దివ్యమగు మత్స్యరూపంబు గలవాడు. (216.)

## 217. స్రగ్వీ.

"స్రక్ అస్యాస్తీతి స్రగ్వీ" ఇట్లు తిర్యక్కుగానుండియు పరత్వసూచకంబగు వైజయంతియనుమాలను ధరించినవాడు. (217.)

218. వాచస్పతిః. 219. ఉదారధీః. 220. అగ్రణీః.
221. గ్రామణీః. 222. శ్రీమాన్.
223. న్యాయః. 224. నేతా.

వాచస్పతిః = వాగీశుడు ఉదారధీః = గంభీరహృదయుడు. అగ్రణీః = పైకి గొనిపోవువాడు. గ్రామణీః = సమూహమును చేర్చువాడు. శ్రీమాన్ = ఐశ్వర్యముగలవాడు. న్యాయః = న్యాయము చేయువాడు. నేతా = నిర్వాహకుడు.

---

## 218. వాచస్పతిః. (579)

"వాచః పతిః వాచస్పతిః" (అలుక్సమాసము వాడే వేదోపబృంహణంబగు మాత్స్యపురాణంబును రచించియుండుటచే వాక్కునకు పతి. (218.)

## 219. ఉదారధీః.

"ఉదారా ధీః యస్యసః ఉదారధీః" ఇట్లందఱును ఉజ్జీవించునట్లు సంకల్పించుటచే గంభీరమగు బుద్ధిగలవాడు. (219.)

## 220. అగ్రణీః.

"అగ్రం నయతీతి అగ్రణీః" అటులే భక్తులను ఉత్తమస్థానంబునకు గొని పోవువాడు. (220)

## 221. గ్రామణీః.

"గ్రామం సమాజమ్ నయతీతి గ్రామణీః" నిత్యసూరులు సమూహంబును చేర్చువాడు. (221.)

## 222. శ్రీమాన్. (22.180)

"శ్రీః అస్యాస్తీతి శ్రీమాన్" మత్స్యావతారంబయ్యు * మత్స్యః కమల లోచనః * అను ప్రమాణరీతిగా కమలనేత్రుం డగుటచే పరత్వసూచకంబగు నైశ్వర్యముచే ప్రకాశింపబడువాడు. (222.)

## 223. న్యాయః.

భక్తుల విషయంబున న్యాయంబులను చేయువాడు (223.)

## 224. నేతా.

"నయతి నిర్వహతీతి నేతా" భక్తులు నియమించు కార్యంబులను చేయుటచే నిర్వాహకుడు. సంసారంబున తానుకూడ మునిగి మహనీయులను దరిజేర్చువాడగుటచే ఆతని నిట్లుచెప్పుట న్యాయమే యగును. (224.)

225. సమీరణః. 226. సహస్రమూర్ధా.

సమీరణః = ఇష్టముల నొనరించువాడు. సహస్ర మూర్ధా = అనేకశిరములం గలవాడు.

---

## 225. సమీరణః.

"సమీర్తే ఇష్టచేష్టోభవతీతి సమీరణః" భక్తులయిష్టంబుల నొనరంచువాడు.

(1) * కృత్వామీనవపుః సద్యః ప్రవివేశ రసాతలమ్। వేదమూర్తిస్తతో వేదాన్ ఆనిన్యే బ్రహ్మణోఽన్తికమ్॥ జ్ఞానాదిగుణబృన్దేన పక్షభూతేన భూషితమ్। స్వోత్కర్ష బ్రహ్మమదం శృఙ్గనిస్సృతేన విరాజితమ్॥ కల్పావసాన సమయే వహన్తమ్ చైవ చిన్తయేత్। నారూపామ్ వితతాం క్షోణీమ్ ప్రజాపతిగుణాన్వితామ్॥ ముక్తాఫలనిభేనైవ వపుషా నిర్మలేనచ। అనిమీలితనేత్రశ్చ మీనాత్మా యతవాక్ తథా * [మత్స్యరూపంబు ధరించి వెంటనే పాతాళంబున బ్రవేశించె. పిమ్మట వేదమూర్తియగు ఆ భగవంతుడు వేదంబులను చతుర్ముఖునిసమీపంబునకు దెచ్చె. జ్ఞానాదిగుణంబులు ఱెక్కలుగా వెలయ, తన పరత్వముతోచు కొమ్ములచే ప్రకాశింప ప్రళయాంతంబున సమస్తంబును వహించువానిని చింతింపగలడు. సమస్త ప్రజలకును పతియగు భగవంతునిగుణంబులతో సంబంధించి అంతట వ్యాపించిన నావవలెనుండు భూమిని ముత్యమువంటి అతినిర్మలంబగు శరీరంబుచే ధరించి మత్స్యరూపంబునెత్తినవాడు మానముగా ప్రకాశించుచున్నాడు.] అని వారి ధ్యానంబున ఈ విషయము లన్నియు స్పష్టము (225.)

(అవతారిక.) అనంతరము విద్యాప్రవచనంబునకనియే యవతరించిన ఈ యవతారంబును ప్రకటించు పురుషసూక్తాది పరవిద్యలలోగల * సహస్రశీర్షా పురుషః * ఇత్యాది ప్రకారంబులు చెప్పబడుచున్నవి.

## 226. సహస్రమూర్ధా.

"సహస్రమ్ మూర్ధానః యస్యసః సహస్రమూర్ధా" సహస్రంబనగా అనేకము లని యర్థము. † అనేక శిరసులను గలవాడు. (226.)

---

† దీనికి గారణంబేమనగా; 'సహస్రమూర్ధా' వెయ్యితలలు గలవాడు. 'సహస్రాక్షః' వెయ్యి కన్నులు గలవాడు అని యర్థము చెప్పినచో అసంగతంబగును. వెయ్యితలలుగలవానికి రెండువేలు నేత్రములుండవలయునుగదా? కనుక ఇచట సహస్రపదంబు అనేకార్థకంబే అని.

## 227. సహస్రాక్షః. 228. సహస్రపాత్.
## 229. విశ్వాత్మా.

సహస్రాక్షః = అనేకనేత్రములంగలవాడు. సహస్రపాత్ = అనేకపాదములం గలవాడు. విశ్వాత్మా = ప్రపంచంబునకు నంతరాత్మ.

---

### § 227. సహస్రాక్షః.
### 228. సహస్రపాత్.

"సహస్రమ్ అక్షీణి యస్యసః సహస్రాక్షః, సహస్రం పాదాః యస్యసః సహస్రపాత్" ఇచటను సహస్ర శబ్దము అనంత్యార్థకంబే. అనేక నేత్ర - పాదంబులం గలవాడు.

* విశ్వతశ్చక్షురుత విశ్వతోముఖః * (తై. నా. 6-1-12) [అంతట నేత్రములను ముఖములను గలవాడు.] * సర్వతః పాణిపాదం తత్ * (గీ. 13-14) [అంతట కర చరణంబులం గలవాడు.]

ఇచట శిరసు నేత్రము పాదములు అను వీనినిమాత్రము చెప్పియున్నను ఇవి ఇతరకరణంబులకును ఉపలక్షణము. ఆయాకరణంబులకార్యములు చెప్పబడియె అని పూర్వాచార్యులందురు. ఇదియే యుచితమును అనేక శాస్త్రసంగతంబును అగును. (227-228.)

### 229. విశ్వాత్మా.

"విశ్వస్య ఆత్మా విశ్వాత్మా" ఈజ్ఞానశక్తులచే సమస్తంబును వ్యాపించి యుండుటచే సమస్తంబునకును నంతరాత్మ.

* స భూమిం విశ్వతో వృత్వా * (పు. సూ.) వాడు భూమినంతయు వ్యాపించి...] * అహమాత్మా గుడాకేశ! సర్వభూతాశయస్థితః * (గీ. 10-20) [అర్జునా! సమస్త భూతముల హృదయంబులందు వసించి వాని కాధారముగ నుండువాడు నేనే.] ఇత్యాదులు. (229.)

---

§ "సహస్రమూర్ధా విశ్వాత్మా సహస్రాక్షః సహస్రపాత్" అని యుండియు 'పాఠక్రమాదర్థక్రమోబలీయాన్' అను న్యాయానుసారము * సహస్రశీర్షా పురుషః। సహస్రాక్షః సహస్రపాత్। స భూమిం విశ్వతోవృత్వా * అను పురుషసూక్తానుసారము "సహస్రమూర్ధా, సహస్రాక్షః, సహస్రపాత్, విశ్వాత్మా" అనుక్రమమున వ్యాఖ్యానింపబడెను.

230. ఆవర్తనః. 231. నివృత్తాత్మా. 232. సంవృతః.
233. సంప్రమర్దనః. 234. అహస్సంవర్తకః.

ఆవర్తనః=త్రిప్పించువాడు. నివృత్తాత్మా=(శ్రేష్ఠమగు స్వరూపముం గలవాడు.
సంవృతః = దాగియుండువాడు. సంప్రమర్దనః = నశింపజేయువాడు.
అహస్సంవర్తక = కాలమును తిరుగునట్లుచేయువాడు.

---

## 230. ఆవర్తనః.

" ఆవర్తయతీతి ఆవర్తనః " సంసారంబను యంత్రంబును త్రిప్పించువాడు.

* తేనేదం భ్రామ్యతే బ్రహ్మచక్రమ్ * (భార.) [వానిచే నీ బ్రహ్మచక్రము త్రిప్పింపబడును.] * భ్రామయన్ సర్వభూతాని * (గీ. 18-61) [సమస్తభూతములను త్రిప్పించును.] * కాలచక్రం జగచ్చక్రం యుగచక్రంచ కేశవః। ఆత్మయోగేన భగవాన్ పరివర్తయతేఽనిశమ్. (భా. ఉ. 67-12) [కాలచక్రము జగచ్చక్రము యుగచక్రము వీని నన్నింటిని తనసంకల్పంబుచే కేశవుడు సదా తిరుగజేయును. (230.)

## 231. నివృత్తాత్మా. (453. 604-780.)

" నివృత్తః ఉద్గతః ఆత్మా స్వరూపం యస్యసః నివృత్తాత్మా " సంసార విభూతికన్న నుత్కృష్టంబగు నిత్య విభూతియను స్వరూపంబునుగలవాడు. (231.)

## 232. సంవృతః.

తమోగుణంబుచే మూఢులకు దాగియుండు (కనఁబడని) వాడు. (232.)

## 233. సంప్రమర్దనః.

" సంప్రమర్దయతీతి సంప్రమర్దనః " సంవరణంబగు తమస్సును, తన్నెఱుంగుటచే నశింపజేయువాడు.

* తమేవం విద్వానమృత ఇహ భవతి * (పు. సూ. 20.) [వానిని తెలిసికొనిన వాడు ఇచట నమృతుడగును. * య ఏవం విదురమృతాస్తే భవన్తి। అథేతరే దుఃఖమేవాపియన్తి * (బృ. ఉ. 6-4-14.) [వీనినెవరు ఎఱుంగుదురో; వారు అమృతుడగుదురు. వీని నెఱుంగనివారు దుఃఖంబునే పొందుచున్నారు.] (233.)

## 234. అహస్సంవర్తకః.

" అహః సంవర్తయతీతి అహస్సంవర్తకః " అహశ్శబ్దము కాలమునకు ఉపలక్షణము. పగలు మున్నగు కాలంబును తిరుగునట్లుచేయువాడు.

* సర్వే నిమేషాః జజ్ఞిరే విద్యుతః పురుషాదధి * (తై. నా. 6-1-8.) [సకలనిమిషంబులును విద్యుత్పురుషుండగు భగవంతునుండి జనించినవి.]

235. వహ్నిః. 236. అనిలః. 237. ధరణీధరః.

వహ్నిః = వహించువాడు. అనిలః = ఉజ్జీవింపజేయువాడు. ధరణీధరః = భూమిని ధరించువాడు.

---

కాలంబనగా, భూతభవిష్యద్వర్తమాన రూపమై పెద్దది చిన్నది అను జ్ఞానంబును పుట్టించునదై నిత్యము భగవంతునకు క్రీడోపకరణంబై యుండునది. దానిని పరమపురుషుడు ఆఱువిధంబులగు వికారంబులంగల్గించునట్లును. ప్రకృతిని పురుషుని జేర్చుటకును విడదీయుటకును హేతువుగానుండునట్లును నియమించును. దానిని కొందఱు క్రిందచెప్పిన ప్రకృతియొక్క పరిణామపరంపరగానందురు. మఱికొందఱు దానిని స్వతంత్రముగా నందురు. ఈ విషయములు శ్రీపౌష్కరసంహితలో స్పష్టముగా చెప్పబడియున్నది. (234.)

## 235. వహ్నిః.

"వహతీతి వహ్నిః" దేశరూపంబుచే విశ్వంబును వహించువాడు. వానిలో ప్రథమదేశము పరమపదము. ఇతరములు కోరినపుడు అంగీకరింపబడు ఆకాశము దిక్కు వానికోణములు మున్నగునవి.

* అస్యామృతన్దివి * (పు. సూ. 3.) [దీనియొక్క అమృతంబగునంశము ఆకాశము.] * స్వే మహిమ్ని స్థితమ్ * [తనమహిమంబున తానే నిల్చియుండువాడు.]

దేశంబనగా ; 'ఇచట, ఇది' ఇత్యాది జ్ఞానంబునకు కారణంబగునది. అది బద్ధముక్త నిత్యులు అను త్రివిధచేతనులకునువాడు ఇచ్చినదేయగును. (235.)

## 236. అనిలః. (818.)

"అనితి ఉజ్జీవయతీతి అనిలః" ఇట్లు అందఱను ఉజ్జీవింపజేయువాడు. వీనికలామాత్రమే వాయువగును.

* ప్రాణాద్వాయురజాయత * (పు. సూ. 14.) [ప్రాణంబునుండి వాయువు పుట్టెను.] (236.)

## 237. ధరణీధరః.

"ధరణీమ్ ధరతీతి ధరణీధరః" భూమిని ధరించువాడు. ఇదియుపలక్షణము. ఆధారముగానుండు సమస్తంబును ధరించువాడు.

* సదాధారపృథివీం ద్యాముతేమామ్ * (కా. 4. ప్ర. 1. అ. 8.) [సత్పదవాచ్యుండగు పరమపురుషుడు భూమిని ఆకాశంబునుధరించును.] (237.)

238. సుప్రసాదః. 239. ప్రసన్నాత్మా.
240. విశ్వసృక్. 241. విశ్వభుగ్విభుః.

సుప్రసాదః = మంచికృపగలవాడు. ప్రసన్నాత్మా = నిర్మలంబగు చింతగలవాడు. విశ్వసృక్ = లోకమును సృజించువాడు. విశ్వభుగ్విభుః = లోకమును పాలించుప్రభువు.

---

## 238. సుప్రసాదః.

"శోభనః ప్రసాదః యస్యసః సుప్రసాదః" ఇట్లు కావించి తనకభిముఖులయిన వారలను కటాక్షించువాడు.

* తమక్రతుమ్ పశ్యతి వీతశోకః ధాతుః ప్రసాదాత్ * (శ్వే. ఉ. 3_20) [ఏయత్నంబుచేతను సాధింపజాలని వానిని సర్వరక్షకుండగు వానియనుగ్రహంబుచేతనే ఎట్టి శోకంబును లేక చూచును.] (238.)

(అవతారిక.) దీనికి గారణంబేమనగా ;

## 239. ప్రసన్నాత్మా.

"ప్రసన్నః ఆత్మా యస్యసః ప్రసన్నాత్మా" స్వతః సకలాభీష్టంబులును సిద్ధింపబడినవాడగుటచే రాగాదులులేని మనసుగలవాడు.

అపూర్ణుడును కృపణుడును గదా దుర్లభుడుగానుండును. అది లేకుండుటచే సుఖముగా నారాధింపదగియుండును.

* అవిజిఘత్సః అపిపాసః సత్యకామః సత్యసంకల్ప * (ఛా. ఉ. 8. 1. 5) [నాశమొందినవాడు. దాహములేనివాడు. సత్యములగు కోరికలు గలవాడు. సత్యమగు ప్రతిజ్ఞగలవాడు.] * శాన్తిసమృద్ధమమృతమ్ * (తై. శి. 6_2) [శాన్తి నిండిన అమృతంబును.] (239.)

## 240. విశ్వసృక్.

"విశ్వమ్ సృజతీతి విశ్వసృక్" గుణదోషంబులనపేక్షింపక కేవలదాక్షిణ్యంబుచేతనే విశ్వంబును సృజించువాడు. (240.)

## 241. విశ్వభుగ్విభుః.

అటులె యంతట వ్యాపించి సమస్తంబును పాలించువాడు.

* సర్వాణి రూపాణి విచిత్య ధీరః। నామాని కృత్వాఽభివదన్యదాస్తే * (పు. సూ. 16.) [సమస్తరూపంబులను తనసంకల్పంబుచే సృజించియు నిర్వికారుడై నామంబులంజేసితాను దానిలో సంబంధింపక వేఱు విధముగా నుండును.] (241.)

242. సత్కర్తా. 243. సత్కృతః.
244. సాధుః. 245. జహ్నుః.

సత్కర్తా = సత్కరించువాడు. సత్కృతః = సత్కరింపబడినవాడు. సాధుః = సాధించువాడు. జహ్నుః = దాగజేయువాడు.

---

## 242. సత్కర్తా.

"సజ్జనాన్ సత్కరోతీతి సత్కర్తా" ఇట్టి సుశీలుండగుటచే సత్తులను పూజించువాడు.

* సజ్జన ప్రతిపూజకః * [సత్పురుషులను ఎదురుగాపోయిపూజించువాడు.](242.)

## 243. సత్కృతః.

వారలచే తానుగూడ సత్కరింపబడినవాడు. వారు శ్రద్ధతో సమర్పించునది అత్యల్పమయ్యు తన మహిమకు దగినట్లు దానిని లభించి మిక్కిలి సంతసించుచున్నాడు.

* అహోహ్యాకాన్తినస్సర్వాన్ ప్రీణాతి భగవాన్ హరిః। విధిప్రయుక్తాం పూజాఞ్చ గృహ్ణాతి శిరసా స్వయమ్ * [తన్నే యాశ్రయించియుండువారలను అందఱను జూచి భగవంతుడు ప్రీతి నొందుచున్నాడు. వారు చేయు పూజను తలచే తానే గ్రహించుచున్నాడు.] * శబర్యా పూజితః సమ్యక్ * (రా. బా. 1-58) [రాముడు శబరిచే చక్కగా పూజింపబడెను.] * మాలాకారేణ పూజితః * (వి. పు. 5-19-29) [కృష్ణుడు మాలాకారునిచే పూజింపబడెను.] (243.)

## 244. సాధుః.

"సాధ్నోతీతి సాధుః" భక్తులపేక్షించిన దూత్యసారథ్యాదులను గావించువాడు. (244.)

## 245. జహ్నుః.

"అపహ్నుతే ఇతి జహ్నుః" అభక్తులకు తనమహిమంబును ప్రదర్శింపక దాగునట్లు చేయువాడు.

* చక్రన్తద్వాసుదేవస్య మాయయా వర్తతే విభోః। సాపహ్నవంకారవేషు * (భా. ఉ. 6-7-2.) [ఆ వాసుదేవుని చక్రము మాయచే తిరుగును. కౌరవులు అభక్తులుగాన వారలకు గనబడకుండును.] (245.)

(అవతారిక.) ఇట్లు సమస్తవిశేషణంబులచే విశేషించి చెప్పి, ఉపనిషత్తులలో ప్రతిశాఖలలోను (ఇది క్రింద వివరింపబడును.) చెప్పబడు పరవస్తువు యొక్క అసాధారణనామంబును చెప్పుచున్నారు. ఆయుపనిషత్తులు

246. నారాయణః  247. నరః.
248. అసంఖ్యేయః.  249. అప్రమేయాత్మా.

నారాయణః = అంతట వ్యాపించియుండువాడు. నరః = విభూతిని గలవాడు. అసంఖ్యేయః = సంఖ్యనుమించిన నరసమూహములను గలవాడు. అప్రమేయాత్మా = అమిత స్వరూపుడు.

---

* నారాయణాయ విద్మహే * (తై. నా.) [నారాయణునికొఱకు చింతింతము.] * నారాయణ పరం బ్రహ్మ * (తై. నా.) [నారాయణుడే పరబ్రహ్మము.] * ఏకోహవై నారాయణ ఆసీత్ * (మ. ఉ.) [నారాయణుండొక్కడే యుండెను.] * అథ పునరేవ నారాయణః * [అనంతరము మరల నారాయణుండు.] * చక్షుశ్చ ద్రష్టవ్యంచ నారాయణః * (సు. ఉ. 6.) [నేత్రంబును నారాయణుండే చూడదగినదియు నారాయణుండే.] * దివ్యో దేవ ఏకో నారాయణః * (సు. ఉ. 6.) [దివ్యుడగు దేవుండు నారాయణుండొక్కడే.] ఇత్యాదులు. :—

## 246. నారాయణః.

"నరాణామ్ సమూహాః నారాః, నారాః అయనమ్ యస్యసః నారాయణః" నారములనగా నిత్యవస్తువులసమూహము, వానిని ఆశ్రయముగాగలవాడు. ఇచట చెప్పవలసినవిశేషార్థములు పరమరహస్యంబగుటచే చెప్పబడనివయ్యె. సదాచార్య సన్నిధిలో ఆయర్థవిశేషంబులను వినగలరు. (246.)

(అవతారిక.) ఈరహస్యార్థమును గూఢముగా వ్యాఖ్యానించుచున్నారు.

## 247. నరః.

"నరః అస్యాస్తీతి నరః" నాశములేని చేతనాచేతనంబులు అను విభూతిని గలవాడు. (247.)

## 248. అసంఖ్యేయః.

"అసంఖ్యేయాః అస్య సన్తీతి అసంఖ్యేయః" సంఖ్యనుమించిన ఆ నరసమూహంబులనుగలవాడు. (248.)

## 249. అప్రమేయాత్మా.

"అప్రమేయానామ్ ఆత్మా అప్రమేయాత్మా" ఇట్లు సంఖ్యనుమించిన చేతనాచేతనంబును ప్రతియొకటిని అమితముగా వ్యాపించియుండుటచే అమితంబగు (కొలదియిడజాలని) స్వరూపముగలవాడు. (249.)

**250. విశిష్టః. 251. శిష్టకృత్. 252. శుచిః. 253. సిద్ధార్థః.**
**254. సిద్ధసంకల్పః. 255. సిద్ధదః. 256. సిద్ధిసాధనః.**

విశిష్టః = విలక్షణుడు. శిష్టకృచ్ఛుచిః = తన కనుకూలురను శుభులు గావించు కాంతిగలవాడు. సిద్ధార్థః = సకలార్థంబులును సిద్ధించినవాడు. సిద్ధసంకల్పః = సిద్ధించిన సంకల్పంబును గలవాడు. సిద్ధిదః = సిద్ధుల నిచ్చువాడు. సిద్ధి సాధనః = సిద్ధిరూపమగు సాధనమును గలవాడు.

---

## 250. విశిష్టః.

“ విశిష్యతే ఇతి విశిష్టః ” వారల నపేక్షింపక స్వయముగా విలక్షణంబగువాడు. అనగా అధికుడైయుండువాడు. (250.)

## 251. శిష్టకృత్. 252. శుచిః. (157)

తనసంబంధంబుచే వారలను తనకు అనుగుణంబగునట్లు కావించు కాంతి విశేషంబునుగలవాడు. (251_252.)

## 253. సిద్ధార్థః.

“ సిద్ధః అర్థః యస్యసః సిద్ధార్థః ” స్వతః అవాప్తసమస్తకాముండగుటచే సకలంబును సిద్ధించినవాడు. (253.)

## 254. సిద్ధ సంకల్పః.

“ సిద్ధః సంకల్పః యస్యసః సిద్ధసంకల్పః ” * సత్యకామః సత్యసంకల్పః * (ఛా. ఉ. 8. 15.) అనుశ్రుతిరీతిగా సంకల్పించినవి (తలంచినవి) అన్నియు సిద్ధించియుండువాడు. (254.)

## 255. సిద్ధిదః.

“ సిద్ధీః దదాతీతి సిద్ధిదః ” అణిమ గరిమ మున్నగు సిద్ధులను సాధకులకు నిచ్చువాడు. (255.)

## 256. సిద్ధిసాధనః.

“ సిద్ధిః సాధనం యస్యసః ” సిద్ధిరూపంబగు సాధనమునుగలవాడు. అనగా; * యేతు ధర్మ్యామృతమిదమ్ * (గీ. 12_20.) [ఎవరు ధర్మరూపంబగు అమృతముగానుండు దీనిని ఉపాసింతురో] అనినట్లు వానిని షాండకోరి సాధనంబును అనుష్ఠించునపుడు.కూడ ప్రియముగానుండువాడు. (256.)

257. వృషాహీ. 258. వృషభః. 259. విష్ణుః.
260. వృషపర్వా. 261. వృషోదరః.

వృషాహీ = ధర్మరూపమగు దినమును గలవాడు. వృషభః = వర్షించువాడు. విష్ణుః = అంతట వ్యాపించియుండువాడు. వృషపర్వా = ధర్మంబులను మెట్లుగాగలవాడు. వృషోదరః = ధార్మికమగు నుదరము గలవాడు.

---

## 257. వృషాహీ.

"వృషంచ తత్ అహశ్చ వృషాహః। వృషాహః అస్యాస్తీతి వృషాహీ" వీనినిపొందు ప్రథమదినము సమస్తమంగళంబునకును అంకురార్పణము కావించుదినమువలె ధర్మరూపముగానుండుటచే ధర్మ రూపంబగు దినంబునుగలవాడు.

* అద్య మే సఫలం జన్మ సుప్రభాతాచ మే నిశా। యదున్నిద్రాబ్జపత్రాక్షం విష్ణోః ద్రక్ష్యామ్యహం ముఖమ్ * (వి. పు. 5_17 3.) [నాజన్మమిప్పుడే సఫలంబయ్యె. రాత్రియు సుప్రభాతమునిచ్చె. ఏల అనగా; పుండరీకాక్షుండగు విష్ణువుయొక్క ముఖమునిపుడు చూడగలనుగదా ?.] ఇత్యాదులు. (257.)

## 258. వృషభః.

"వర్షతీతి వృషభః" ఇట్లు తన్నాశ్రయించు భక్తులకు సంసారతాపము తీరునట్లు అమృత వర్షమును వర్షించువాడు. (258.)

## 259. విష్ణుః. (2_663)

"వేవేష్టీతి విష్ణుః" ప్రాణులకేయేకాలంబున ఏవియేవి కావలయునో ఆయావానిని ఆయాక్షణంబున తానే యిచ్చుచు, వారలను వదలకుండుటచే అంతటను వ్యాపించియుండువాడు.

* న తదస్తి వినా యత్స్యాత్ మయా భూతఞ్చరాచరమ్ * (గీ. 10_39) [ప్రపంచములోని చరాచరంబులందు నేను లేనట్టి భూతమే లేదు.] (259.)

## 260. వృషపర్వా.

"వృషాః పర్వాణి యస్యసః వృషపర్వా" వర్ణాశ్రమ ధర్మంబులను తన్ను పొందుమార్గంబునకు అనుకూలంబగు మెట్టుగాగలవాడు. (260.)

## 261. వృషోదరః.

"వృషః ఉదరం యస్యసః వృషోదరః" భక్తులు సమర్పించినదానిని పూర్ణముగా స్వీకరించుటచేతను ఆర్తులు ఆశ్రయించు స్థలంబగుటచేతను ధార్మికంబగు నుదరము గలవాడు. (261.

262. వర్ధనః 263. వర్ధమానః. 264. వివిక్తః.
265. శ్రుతిసాగరః. 266. సుభుజః. 267. దుర్ధరః.

వర్ధనః = వర్ధిల్లజేయువాడు. వర్ధమానః = వృద్ధినొందువాడు. వివిక్తః = ఏకాంతమైనవాడు. శ్రుతిసాగరః = వేదంబులకు సముద్రమువంటివాడు. సుభుజః = సుందరబాహువు. దుర్ధరః = ధరింపజాలనివాడు.

---

## 262. వర్ధనః.

"వర్ధయతీతి వర్ధనః" తల్లివలె వారలను ఉదరంబుననిడి వర్ధిల్లజేయువాడు. (262.)

## 263. వర్ధమానః.

"వర్ధతే ఇతి వర్ధమానః" (1) వారలను వర్ధిల్లజేసి, తానుకూడ వృద్ధినొందువాడు.

(2) లేక, ఇట్టి యపరిమితంబగు సమృద్ధిగలవాడు. (263.)

## 264. వివిక్తః.

"వివిచ్యతే ఇతి వివిక్తః" ఇట్లు లోకోత్తరంబగు వృత్తాంతము గలవాడగుటచే ఏకాంతమయినవాడు. (264.)

## 265. శ్రుతిసాగరః.

"శ్రుతీనాం సాగర ఇవ శ్రుతిసాగరః" ఇట్టి గుణంబులను ప్రతిపాదించు శ్రుతులకన్నింటికిని నదులకు సముద్రమువలె ముగింపుస్థలంబుగానుండువాడు.

* నారాయణపరాః వేదాః * (భాగ. 2-5-15.) [వేదంబులన్నియు నారాయణపరంబులు.] * వేదైశ్చ సర్వైరహమేవ వేద్యః * (గీ. 15-15.) [సమస్త వేదంబులచేతను నేనే యెఱుంగదగినవాడను.] (265.)

## 266. సుభుజః.

"శోభనాః భుజాః యస్యసః సుభుజః" ఆశ్రితులభారంబు నోర్వదగిన అందంబులగు బాహువులుగలవాడు. (266.)

## 267. దుర్ధరః (720).

"ధర్తుమ్ అశక్యః దుర్ధరః" అట్టిభుజంబుచే, ప్రళయకాలసముద్రవేగంబును బాలురు ఇసుకచే కట్టిన వంతెన ధరింపకుండునట్లు ఇతరులచే నోర్వజాలని వేగముగలవాడు. (267.)

268. వాగ్మీ. 269. మహేంద్రః.
270. వసుదః. 271. వసుః.

వాగ్మీ = వాక్కుగలవాడు. మహేంద్రః = పూజింపదగిన ఐశ్వర్యముగలవాడు.
వసుదః = ధనమునిచ్చువాడు. వసుః = ధనముగా నుండువాడు.

---

## 268. వాగ్మీ.

"వాక్ అస్యాస్తీతి వాగ్మీ" వాని వాక్కు వేదరూపముగాను జయశీలముగాను మధురముగాను గంభీరముగాను ప్రియముగాను హితముగాను ఉండుటచే కొనియాడదగిన వాక్కును గలవాడు.

* వాగ్వివృతాశ్చ వేదాః * [వానివాక్కునుండి వెలువడినవియన్నియు వేదములే.] * ఉత్తరోత్తరయుక్తాచ వక్తా వాచస్పతిర్యథా। భూయః కథయ తృప్తిర్హి శృణ్వతో నాస్తిమేఽమృతమ్ * [ఉత్తరోత్తరము యుక్తులను చెప్పు విషయంబున బృహస్పతివంటి వాచాలకుడు. మళ్లి చెప్పవలయును. వినుచునే యుండియు అమృతపానము చేయుటవలె నాకు తృప్తిగలుగలేదు.] ఇత్యాదులు.

## 269. మహేన్ద్రః.

"మహాంశ్చాసౌ ఇన్ద్రశ్చ మహేన్ద్రః" ఇట్లంతట ప్రసరించుటచే గొనియాడదగిని పరమైశ్వర్యముతో ప్రకాశించువాడు. (269.)

## 270. వసుదః.

"వసు దదాతీతి వసుదః" ఇట్టి మహామహిమంబును గలవాడయ్యు ధనము మున్నగు అల్పపురుషార్థంబుల నపేక్షించు అల్పులకు వాని నిచ్చువాడు.

* దేవేన్ద్రి స్త్రిభువన మర్థమేక పిఙ్గః * (వి. ధ. 43-47.) [దేవేంద్రుడు త్రైలోక్య రాజ్యంబును అపేక్షించె. కుబేరుడు ధనమును అపేక్షించె. ఇట్లపేక్షించిన వారలకు వాని నిచ్చెను.] (270.)

## 271. వసుః. (105-701)

* వాసుదేవస్సర్వమితి స మహాత్మా సుదుర్లభః * (గీ. 7. 19) [సమస్తమును వాసుదేవుడేయనియుండు మహాత్ముండు దుర్లభుండు] అని తానే చెప్పినట్లుండు మహనీయులకు తానే ధనముగా నుండువాడు. (271.)

(అవతారిక.) క్రిందజెప్పిన మహిమంబులకు దగియుండు విశ్వరూపంబును చెప్పుచున్నారు.

272. నైకరూపః. 273. బృహద్రూపః.
274. శిపివిష్టః. 275. ప్రకాశనః.

నైకరూపః = అనేకరూపములను ధరించినవాడు. బృహద్రూపః = పెద్ద రూపమును గలవాడు. శిపివిష్టః = కిరణంబులచే వ్యాపించినవాడు. ప్రకాశనః = ప్రకాశింపజేయువాడు.

---

## 272. నైకరూపః.

"నైకాని రూపాణి యస్యసః నైకరూపః" వారివారితలంపునకు దగినట్లు పలువిధంబులగు రూపంబులను ధరించినవాడు.

* పశ్యామి త్వా సర్వతోఽనన్తరూపమ్ * (గీ. 11-16) [అంతట అపరిచ్ఛిన్నముగా ప్రకాశించు దివ్యరూపంబు గల మిమ్ములను సేవించుచున్నాడను.] (272.)

## 273. బృహద్రూపః.

"బృహత్ రూపమ్ యస్యసః బృహద్రూపః" ఆరూపంబు లోకొక్కటియు దిక్కులందును ఆకాశంబునను వ్యాపించినట్లు పెద్దదిగానుండువాడు.

"ద్యావాపృథివ్యోరిదమన్తరంహి వ్యాప్తం త్వయైకేన దిశశ్చ సర్వాః * (గీ. 11-20) [భూమికిని ఆకాశంబునకును మధ్యగల దిశలకెల్లను మీరొకరే వ్యాప్తి నొందిరి.] (273.)

## 274. శిపివిష్టః.

"శిపిభిః ఆవిష్టః శిపివిష్టః" * శిపయో రశ్మయ ఉచ్యన్తే తైరావిష్టః * [శిపియనగా కిరణంబులు. వానిచే వ్యాపించినవాడు] అను యాస్కనిరుక్తరీతిగా శిపి అనగా కిరణములు. ఆ కిరణంబులచే వ్యాపించినవాడు.

* శిపివిష్టేతి యచ్చాస్య పీతం రోమచయద్భవేత్ । తేనాపి విష్టం యత్కించిత్ శిపివిష్టం హి తత్స్మృతమ్ * (భా. శా. 343-41) [స్వర్ణవర్ణమగు వీనిరోమంబునకు శిపివిష్టంబనిపేరు, కనుక, దానిచే వ్యాపింపబడిన ప్రతివస్తువును శిపివిష్టమనియందురు.] * తేజోభిరాపూర్య జగత్సమగ్రం... * [సమస్తలోకంబులును నీతేజంబులచే వ్యాపింపబడియున్నవి.] (274.)

## 275. ప్రకాశనః.

"ప్రకాశయతీతి ప్రకాశనః" ఆదివ్యరూపంబును సేవింపగోరు అర్జునాదులకు తనరూపంబును ప్రకాశింపజేయువాడు.

## 276. ఓజస్తేజోద్యుతిధరః.   277. ప్రకాశాత్మా.

## 278. ప్రతాపనః.

ఓజస్తేజోద్యుతిధరః = బలము పరాక్రమము కాంతి అను వీనిని ధరించువాడు. ప్రకాశాత్మా = ప్రకాశించు స్వభావము గలవాడు. ప్రతాపనః = తపింపజేయువాడు.

---

* దివ్యన్దదామి తే చక్షుః పశ్య మే యోగమైశ్వరమ్ * (గీ. 11. 8) [దివ్య నేత్రంబును నీకిత్తును. ఆనేత్రంబుచే నాపరమైశ్వర్యంబును చూడుము.] * సుదుర్దర్శమిదం రూపం దృష్టవానసి యన్మమ * (గీ. 11-52) [అర్జునా! ఇతరులు చూడజాలని నా యీ విశ్వరూపంబును సేవించితివి.] (275.)

## 276. ఓజస్తేజోద్యుతిధరః.

“ఓజస్తేజోద్యుతీని ధరతీతి ఓజస్తేజోద్యుతిధరః” ఓజస్సు అనగా బలము, తేజస్సు అనగా శత్రువులను జయించు శక్తి లేక కీర్తి, ద్యుతియనగా కాంతి, వీనిని ధరించువాడు.

* యథా ప్రదీప్తజ్వలనం పతఙ్గాః విశన్తి నాశాయ సమృద్ధవేగాః * (గీ. 4. 29.) [జ్వలించు నగ్నిలో మిడుతలుపడి నశించునట్లు.] * స్థానే హృషీకేశ తవ ప్రకీర్త్యా జగత్ప్రహృష్యతి * (గీ. 11. 36.) [ఓహృషీకేశా! నీకీర్తినిగని జగము సంతసించుచున్నది.] * దివి సూర్యసహస్రస్య భవేద్యుగపదుత్థితా। యది భాస్సదృశీ సా స్యాత్ భాసస్తస్య మహాత్మనః * (గీ. 11-12.) [ఆకసంబున సూర్య సహస్రము ఏకకాలంబున నుదయించి ప్రకాశింపగలిగెనేని ఆమహాత్ముని కాంతికి ఒక రీతిగ సాటికావచ్చును.] (276.)

## 277. ప్రకాశాత్మా.

“ప్రకాశః ఆత్మా యస్యసః ప్రకాశాత్మా” మూర్ఖులుగూడ ఒప్పుకొనునట్లు ప్రకాశమగు ఉత్కృష్ట ప్రభావముగలవాడు.

* త్వమేవ పుణ్డరీకాక్ష! సర్వస్య జగతః ప్రభుః। తస్మాన్మే యాదవ శ్రేష్ఠ ప్రసాదం కర్తుమర్హసి * (భా. ఉ.) [పుండరీకాక్షా! సమస్తలోకంబునకును మీరే ప్రభువుగాన ఓ యాదవశ్రేష్ఠా! నన్ను అనుగ్రహింపవలయును.] అని ధృతరాష్ట్రుడే ఒప్పుకొనెను. (277.)

## 278. ప్రతాపనః.

“ప్రతాపయతీతి ప్రతాపనః” * భాసస్తవోగ్రాః ప్రతపన్తి * అనినట్లు ఉగ్రమగు కాంతిచే లోకంబులను తపింపజేయువాడు. (278.)

279. బుద్ధః. 280. స్పష్టాక్షరః. 281. మన్త్రిః.

బుద్ధః = సమృద్ధుడు. స్పష్టాక్షరః = సుస్పష్టముగా చేయబడిన వేదాక్షరములను గలవాడు మన్త్రిః = చింతించువారలను రక్షించువాడు.

---

## 279. బుద్ధః. (३२३.)

సర్వకాలంబున వర్ధిల్లు సముద్రమువలె సమృద్ధుడు.

* తతస్స పురుషవ్యాఘ్రః సజ్ఞాగాద పునస్స్వయమ్। తాన్దివ్యామద్భుతా ఇచ్ఛిత్రామృద్ధిమత్తా మరిన్దమ * (భా. ఉ.) [అనంతరము, దివ్యమై అత్యాశ్చర్యకరమై విచిత్రమై సమృద్ధమైయుండు వచనంబులను ఆపురుషోత్తముడు తానే చెప్పెను.] (279.)

## 280. స్పష్టాక్షరః.

"స్పష్టమ్ అక్షరం యస్యసః స్పష్టాక్షరః" ఈసమృద్ధిచే వేదవాక్యములను అర్థంబునుగల్గించుటచే స్పష్టముగాచేయబడిన వేదాక్షరంబులనుగలవాడు. (280.)

## 281. మన్త్రిః.

"మన్తారం త్రాయతే ఇతి మన్త్రిః" * మన్తారం త్రాయతే మన్త్రిః * అను నిరుక్తరీతిగా, క్రింద జెప్పినవానిని చింతించువారలను రక్షించువాడు.

* ప్రాణప్రయాణే కః స్మర్తుమ్ శక్యః స్యాన్మధుసూదన * [మధుసూదనా! ప్రాణముపోవునపుడు నిన్నెవడు స్మరింపగలడు?] అని ప్రశ్నించిన నారదుంజూచి భగవంతుడనెను. * తృష్ణాతోయసమాకీర్ణాత్ ఘోరాత్ సంసారసాగరాత్। అపారాత్ పారమాప్నోతి యోమాం స్మరతి నిత్యశః * (బ్రాహ్మ) [ఎవడు నిత్యము నన్ను స్మరించుచుండునో; వాడు ఆశ అనునీరునిండి భయంకరమై అపారమైయుండు సంసారసాగరంబునుండి దరిజేరును.] * స్థితే మనసి సుస్వస్థే శరీరే సతి యోనరః। ధాతుసామ్యే స్థితే స్మర్తా విశ్వరూపఞ్చ మామజమ్। తతస్తం మ్రియమాణన్తు కాష్ఠపాషాణసన్నిభమ్। అహంస్మరామి మద్భక్తమ్ నయామి పరమాఙ్గతిమ్ * (వ. పు.) [మనసు స్థిరమై శరీరము స్వస్థమై ధాతువులన్నియు సమమైయుండునపుడు ఏనరుడు జగద్రూపుడై జన్మములేనివాడైయుండు నన్ను చింతించునో; పిమ్మట శరీరము విడుచునపుడు కేవలము కాష్ఠపాషాణాదులకు సమమైయుండు నాభక్తుడగు వానిని నేనే స్మరించి సద్గతిని పొందజేయుదును.] (281.)

282. చన్ద్రాంశుః. 283. భాస్కరద్యుతిః.
284. అమృతాంశూద్భవః. 285. భానుః.

చన్ద్రాంశుః = ఆహ్లాదకరమగు కాంతినిగలవాడు. భాస్కరద్యుతిః = సూర్యుని వంటి తేజముగలవాడు. అమృతాంశూద్భవః = చంద్రునకు జన్మస్థలమైన వాడు. భానుః = ప్రకాశించువాడు.

---

## 282. చన్ద్రాంశుః.

"చన్ద్రస్యేవ అంశవః యస్యసః చన్ద్రాంశుః" ఇట్లు మననము చేయు వారలకు గల్గు శ్రమంబును తొలగించి ఆహ్లాదంబును (సంతోషమును) గలుగజేయు కాంతిని గలవాడు.

* తే తం సోమమివోద్య న్తమ్ దృష్ట్వా * [వారలు ఉదయించు చంద్రునివలె నుండు వానింజూచి] ఇత్యాదులు. (282.)

## 283. భాస్కరద్యుతిః.

"భాస్కరస్యేవ ద్యుతిః యస్యసః భాస్కరద్యుతిః" శత్రువులను పరిభవింప జేయు ప్రభావముగలవాడగుటచే సూర్యునివంటి తేజము (వెలుగు) గలవాడు.

* రక్షాంసి భీతాని దిశోద్రవన్తి * (గీ. 11-36) [భయము జనించి రాక్షసులు పరుగులిడిరి.] * శరజాలాంశుమాన్ శూరః కపే! రామ దివాకరః। శత్రురక్షోమయం తోయముపశోషం నయిష్యతి * (రా. సు. 37-16.) [హనుమంతుడా! బాణ సమూహంబులు అను కిరణంబులుగల రాముడను సూర్యుడు శత్రువులగు రాక్షసులు అను జలంబును ఇంకింపగలడు.] * ఏవమేషోఽసురాణాఞ్చ సురాణాఞ్చైవ సర్వశః। భయాభయకరః కృష్ణః సర్వలోకేశ్వరః ప్రభుః * (భా. స. 62-26) [ఇట్లీ కృష్ణుడు, తనభక్తులగు దేవతలకు అభయంబును శత్రువులగు అసురులకు భయంబును చేయుచుండును.] (283.)

## 284. అమృతాంశూద్భవః.

"అమృతాంశుః ఉద్భవతి అస్మాదితి అమృతాంశూద్భవః" సమస్త తాపంబులను హరించు మృతసంజీవనమగు అమృతకిరణంబులుగల చంద్రుడుగూడ, వీని హృదయంబునుండి పుట్టియుండుటచే ఆ హృదయంబుననుండు శైత్యసంబంధముచేతనే శీతకిరణుడయ్యె.]

* చన్ద్రమాః మనసోజాతః * (పు. సూ.) [చంద్రుడు పరమపురుషునిహృదయంబునుండి పుట్టెను.] (284.)

## 285. భానుః. (126)

"భాతీతి భానుః" అధికప్రకాశముగల సూర్యుడుగూడ వీని తేజనుచేతనే జీవించునట్లు ప్రకాశించువాడు.

286. శశబిందుః. 287. సురేశ్వరః.
288. ఔషధమ్. 289. జగతస్సేతుః.

శశబిందుః = అన్యాయమార్గమున నేగువారలను నశింపజేయువాడు. సురేశ్వరః = సన్మార్గంబున నేగువారలకు నిర్వాహకుడు. ఔషధమ్ = ఔషధము. జగతస్సేతుః = లోకమునకు సేతువువలె నుండువాడు.

---

* యస్యాదిత్యో భాముపయుజ్య భాతి * [ఎవనికాంతిని ఉపయోగించి సూర్యుడు ప్రకాశించునో;] (285.)

## 286. శశబిన్దుః.

"శశానాం కుటిలగతీనామ్ బిన్దుః అపలపితా ఇతి శశబిన్దుః" శశ అనగా వక్రమార్గము. వక్రమార్గంబున నేగువారలను నివర్తింపజేయువాడు (అనగా అన్యాయమార్గమున నేగువారలను నశింపజేయువాడు అని భావము) (286.)

## 287. సురేశ్వరః.

"సురాణామ్ ఋజుగతీనాం దేవానామ్ ఈశ్వరః నిర్వాహకః సురేశ్వరః". సన్మార్గంబున నేగు దేవతలనిర్వాహకుండు.

* సర్వం జిహ్మం మృత్యుపదమ్ ఆర్జవం బ్రహ్మణః పదమ్ * [సంసారమార్గము సర్వవిధంబులచేతను వక్రముగానుండునది. బ్రహ్మమార్గము ఋజువుగానుండునది.]

## 288. ఔషధమ్.

సంసారంబను తీవ్రవిషంబును తొలగించు ప్రభావము గలవాడగుటచే ఔషధముగానుండువాడు.

* దేవాః దేవర్షయశ్చైవ యం విదుః దుఃఖభేషజమ్ * [దేవతలును దేవర్షులును ఎవనిని దుఃఖంబును తొలగించు మందుగా నిశ్చయింతురో;] * ఏకాగ్రతా మూల్యబలేన లభ్యమ్ భవౌషధ స్త్వం భగవన్! కిలైకః * [నిన్నే ధ్యానించుటయను వెలచే పొందదగిన సంసారంబునకు మందు నీవొకడే.] (288.)

## 289. జగతస్సేతుః.

పుణ్యపాపములు కలసిపోకుండ నిరోధించుటచే లోకంబునకు సేతువువలెనుండువాడు. (అనగా, పుణ్యపాపఫలములను మాఱక ఇచ్చువాడు.)

* ఏష సేతుర్విధరణ ఏషాం లోకానామసమ్భేదాయ * (బృ-ఉ. 6-4-22.) [వీడు ఈ లోకమర్యాదను చెడక పాలించు సేతువువంటివాడు.]

కనుకనే (అనగా వీడట్లు రక్షించుచుండుటచేతనే) ప్రాణులకు తామొనర్చిన కార్యంబులకు ఫలంబు గల్గుచుండును. చేయనికార్యంబులకును ఫలము గలుగకుండును.

290. సత్యధర్మపరాక్రమః. 291. భూతభవ్య భవన్నాథః.
292. పవనః. 293. పావనః.

సత్యధర్మపరాక్రమః = సత్యమగు కల్యాణగుణములును చేష్టితములును గలవాడు. భూతభవ్య భవన్నాథః = ముక్కాలంబునకును స్వామి. పవనః = సంచరించువాడు. పావనః = పరిశుద్ధికరుడు.

---

* యథా ధేనుసహస్రేషు వత్సో విన్దతి మాతరమ్। తథా పూర్వకృతం కర్మ కర్తారమనుగచ్ఛతి * [ఎట్లు గోసహస్రంబున (ఆవులమందలో) దూడ తన తల్లి నెఱుంగునో; అటులే పూర్వకృతంబగు కర్మము చేసిన వానిని ఎఱుంగును.] * శుభకృచ్ఛుభమాప్నోతి పాపకృత్ పాపమశ్నుతే * (రా. యు. 114_27) [శుభము నొనర్చినవాడు శుభము నొందును. పాపంబు నొనర్చినవాడు పాపంబునొందును.]

## 290. సత్యధర్మ పరాక్రమః.

"సత్యాః ధర్మాః పరాక్రమాః యస్యసః సత్యధర్మపరాక్రమః" ధర్మములనగా కల్యాణగుణంబులు, పరాక్రమములనగా చేష్టితములు, ఇవి సత్యముగానుండువాడు.

కనుకనే అర్జునుడు వానిగుణచేష్టితంబులనుపక్రమించి యిట్లనియె. * సర్వమేతదృతం మన్యే యన్మాం వదసి కేశవ * (గీ. 10_14) [కేశవా! నన్నుజూచి నీవు చెప్పునవి యన్నియు సత్యమే యగును.] అని. (290.)

## 291. భూతభవ్య భవన్నాథః.

"భూతభవ్యభవతాం నాథః భూతభవ్య భవన్నాథః" ఇట్టి యైశ్వర్యమును త్రికాలంబునను గలిగియుండువాడు.

* భూతభవ్యభవన్నాథః కేశవః కేశిసూదనః * (భా. సభా. 38_23.) [కేశిని నిరసించిన కేశవుండు భూతభవిష్యద్వర్తమానకాలములందుగల వస్తువులకు స్వామి.] (291.)

## 292. పవనః.

"పునాతి గచ్ఛతీతి పవనః" ఇట్లు అంతట సదా స్వేచ్ఛః సంచరించువాడు. వీనిగంధలేశంబుచేతనే వాయువునకుగూడ సదాసంచరించుస్వభావము గలిగెను.

## 293. పావనః. (817.)

"పావయతీతి పావనః" అటులే తనసంబంధంబునొందిన గంగాదులను జగత్తులకు పరిశుద్ధికరంబులుగా చేయువాడు.

294. అనలః. 295. కామహా. 296. కామకృత్.
297. కాన్తః. 298. కామః. 299. కామప్రదః.

అనలః = తృప్తిజెందనివాడు. కామహా = ఆశను తొలగించువాడు. కామకృత్ = ఆశను గల్గించువాడు. కాన్తః = సుందరుడు. కామః = మనోహరుడు. కామప్రదః = కోరినవాని నిచ్చువాడు.

---

* పావన స్సర్వలోకానాం త్వమేవరఘునన్దన * (రా. ఉ. 82. 4.) [రామా! సమస్త లోకంబులకును మీ రొకరే పరిశుద్ధికరులు. అనియగస్త్యులనిరి.]

## 294. అనలః. (716.)

"న అలః అనలః" ఇట్లనేక విధంబుగానుపకరించియు చాలునని తృప్తి జెందని కృపగలవాడు. ఇట్టిశక్తిలేశసంబంధము చేతనే అగ్నికిగూడ అనలుండను పేరుగల్గెను. (294.)

## 295. కామహా.

"కామం హన్తీతి కామహా" ఇట్టితనగుణాతిశయంబులంజూచినవారలకు శబ్దాదివిషయంబున ఆశను తొలగించువాడు.

* న కామకలుషం చిత్తం మమ తే పాదయోః స్థితమ్ * [కామంబుచే కలతజెందిన.నామనస్సు నీపాదంబులయందు నిలిచియుండలేదు.] ఇత్యాదులు. (295.)

## 296. కామకృత్.

"కామం కరోతీతి కామకృత్" భోగమోక్షాదులనుగూడ గోరునట్లు తానే చేయువాడు. (296.)

## 297. కాన్తః. (660.)

"మనోహరుడు" సౌందర్య సౌకుమార్యాది శరీరగుణంబులచే అతి మనోహరముగానుండువాడు. (297.)

## 298. కామః.

"సుందరమైనవాడు" శీలము ఔదార్యము మున్నగు ఆత్మగుణంబులచే మనోహరముగానుండువాఁడు. ఈ గుణబిందు మాత్రంబుచేతనే మన్మథుడు లోకంబులను మోహింపఁజేయుచున్నాఁడు. (298.)

## 299. కామప్రదః.

"కామం ప్రదదాతీతి కామప్రదః" తన్ను గోరువారలకును ఇతర పురుషార్థములను గోరువారలకును వారివారికి దగునట్లు అభీష్టంబుల నిచ్చువాఁడు.

## 300. ప్రభుః.

ప్రభుః = సమర్థుడు.

---

* ఏకో బహూనాం యో విదధాతి కామాన్ * (క. ఉ. 2-5) [ఒక(డై అనేకులకు ఇష్టంబుల నెవ(డు ఇచ్చునో ;] (299.)

## 300. ప్రభుః. (35.)

"ప్రభవతీతి ప్రభుః" ఈమనోజ్ఞాతిశయంబుచే సమస్తప్రాణులహృదయంబును అపహరించుటయందు సమర్థు(డు.

* రామః కమలపత్త్రాక్షః సర్వసత్త్వమనోహరః * (శా. సు. 35-8.) [పద్మపత్రమువంటి నేత్రములుగల రాముడు సమస్తప్రాణులకును మనోహరుడుగానుండును.] (300.)

శ్రీ విష్ణు సహస్రనామ వ్యాఖ్యానమున

తృతీయ శతకము ముగిసెను.

శ్రీమతే రామానుజాయ నమః.

# చతుర్థ శతకము.



**301. యుగాదికృత్. 302. యుగావర్తః. 303. నైకమాయః.**

యుగాదికృత్ = యుగాదిని కావించువాడు. యుగావర్తః = యుగములను మఱలింపజేయువాడు. నైకమాయః = అనేకవిధములగు ఆశ్చర్యములను చేయువాడు.

---

(అవతారిక.) అనంతరము వీనియపరిమితాశ్చర్యరూపంబును చెప్ప నారంభించి మొట్టమొదట వటపత్రశాయిని ఉదాహరణముగా చెప్పుచున్నారు:—

## 301. యుగాదికృత్.

"యుగాదిమ్ కరోతీతి యుగాదికృత్" ప్రళయకాలంబున జగత్తుమునగకుండ ప్రవర్తించుటచే యుగాంతకాలమున యుగాదిని కావించువాఁడు. (301.)

## 302. యుగావర్తః.

"యుగాని ఆవర్తయతీతి యుగావర్తః" తాను కావించు ధర్మవ్యవస్థచే కృతాదియుగంబులను మళ్ళి మళ్ళి మఱలింపజేయువాఁడు. (302.)

## 303. నైకమాయః.

"నైకాః మాయాః యస్యసః నైకమాయః" చిన్నబాలకుఁడైయుండుట, అపరిమితంబులైన లోకములను మ్రింగుట, ఆధారములేక ఒకేజలమయముగానుండు నపుడు వటపత్రంబున శయనించుట మున్నగు ఇట్టిదని యూహింపజాలని అనేకాశ్చర్యములను గలఁవాడు.

ఇచట, మాయాపదము మిథ్యావిషయంబును దెల్పునదిగాదు. సత్యవిషయంబునగూడ మాయాపదంబునకు ప్రయోగములు అనేకములుగలవు. * మాయాన్తు ప్రకృతిమ్ విద్యాత్ * (శ్వే. ఉ. 4-9.) అని అనేకార్థంబులను అనేకకార్యములను కావించు సత్యమగు ప్రకృతి విషయంబునను, * మాయాతు వయునం జ్ఞానమ్ * సఙ్ఖ్యాతా దేవ మాయయా * విశ్వాని దేవ! వయునాని విద్వాన్ * అని జ్ఞానవిషయంబునను, * తేన మాయాసహస్రన్తత్ శమ్బరస్యాశుగామినా । బాలస్య రక్షతా దేహమేకైకశ్యేనసూదితమ్ * (వ. పు.) అని జ్ఞానంబుచే నాశముచేయజాలనిదై అస్త్రంబులచేతనే నశింపజేయవలసినదైయుండు విషయంబునను, * మేఘోదయః సాగరసన్ని

## 304. మహాశనః. 305. అదృశ్యః. 306. వ్యక్తరూపః.

మహాశనః = తిండిపోతు. అదృశ్యః = ఊహింపజాలనివాడు. వ్యక్తరూపః = స్పష్టమగు రూపముగలవాడు.

---

వృత్తిః ఇన్ద్రోర్విభాగః స్ఫురితాని వాయోః । విద్యుద్విభఙ్గోగతముష్ణరశ్మేః విష్ణోర్విచిత్రాః ప్రభవన్తి మాయాః * అని మహాశ్చర్యవిషయంబునను ఈ మాయాపదము ప్రయోగింపబడియున్నది. * తతో మే పృథివీపాల విస్మయస్సుమహానభూత్ । లోకం దృష్ట్వా సమస్తఞ్చ ॥ ఇత్యుక్త్వాఽన్తర్హితస్తాత సదేవః పరమాద్భుతః । ఆశ్చర్యం భరతశ్రేష్ఠ * (భా. ఆ. 188_94) అని యిట్లు అనేకప్రయోగములు గలవు. (303.)

### 304. మహాశనః.

“మహత్ అశనం యస్యసః మహాశనః” సమస్తజగత్తును మ్రింగుటచే పెద్ద ఆహారంబును భుజించువాడు.

* యచ్చకిఞ్చిన్మయా లోకే దృష్టం స్థావరజఙ్గమమ్ । తదపశ్యమహమ్ సర్వం తస్య కుక్షౌ మహాత్మనః * (భా. ఆ. 188_122) [లోకంబున చరాచరములుగా గనబడు సమస్తంబును ఆమహనీయునికడుపున చూడఁగల్గితిని.] (304.)

### 305. అదృశ్యః.

“ద్రష్టుం శక్యః దృశ్యః, న దృశ్యః అదృశ్యః” ఇట్టిదని యూహింపజాలని వృత్తాంతము గలవాడు.

* కథంన్వయం శిశుః శేతే లోకే నాశముపాగతే । తపసా చిన్తయంశ్చాపి తం శిశుం నోపలక్షయే * (భా. ఆ. 188_94) [లోకమంతయు నశించినపుడు ఈ చిన్న శిశువుమాత్రము ఎట్లు పరుండి నిద్రింపగలడు? అని జ్ఞానదృష్టితో ఎంతచింతించియు ఇట్టిదని యెఱుంగలేకున్నాను.]

### 306. వ్యక్తరూపః.

“వ్యక్తమ్ రూపమ్ యస్యసః వ్యక్తరూపః” అట్లుండియు ఆశ్రితులగు మార్కండేయాదులకు సుఖముగా కనబడు రూపము గలవాడు.

* అతసిపుష్పసఙ్కాశః శ్రీవత్సకృతలక్షణః । సాక్షాల్లక్ష్మ్యా ఇవావాసః స సదా ప్రతిభాతి మే * (భా. ఆ. 188. 96) [నల్లయగిసె పూవంటి వర్ణముగలవాడును లక్ష్మీనివాసస్థానంబునగువాడును నాకెప్పుడును కనబడుచున్నాడు.] * తస్య తామ్రతలౌ తాత! చరణౌ సుప్రతిష్ఠితౌ । సుజాతమృదురక్తాభిః అఙ్గుళీభిరలఙ్కృతౌ । ప్రణతేన మయా మూర్ధ్నా గృహీత్వాహ్యభివన్దితౌ । (భా. ఆ. 188_133) [మృదువులగు ఎఱ్ఱని వ్రేళ్ళచే నలంకరింపబడిన పాదంబులను నమస్కరించి నాశిరంబుచేపొందగల్గితిని. (306.)

307. సహస్రజిత్. 308. అనన్తజిత్. 309. ఇష్టః.
310. అవిశిష్టః. 311. శిష్టేష్టః.

సహస్రజిత్ = కల్పకాలమును జయించినవాడు. అనన్తజిత్ = మితములేక ప్రకాశించువాడు. ఇష్టః = కోరబడినవాడు. అవిశిష్టః = విలక్షణుడు. శిష్టేష్టః = శిష్టులకిష్టుడు.

---

## 307. సహస్రజిత్.

"సహస్రం జయతీతి సహస్రజిత్ * వెయ్యియుగములుగల కల్పకాలమంతయు అట్లు శయనించియే జయించువాడు.

* యావద్యుగానాం విప్రర్షే! సహస్రం పరివర్తతే। తావత్స్వపిమి * (భా. అ. 189_41) [వెయ్యియుగములు పోవునంతవఱకు శయనించియుందును.] (307.)

## 308. అనన్తజిత్.

"అన్తమ్ పరిమితశిశురూపస్య మహిమావధిమ్ జయతి అభిభవతీతి అన్తజిత్। న అన్తజిత్ అనన్తజిత్" ఇట్లు చిన్నబాలకుడై యుండియు తనమహిమాతిశయంబును ఎవరిచేతను ఒకప్పుడును ఏవిధంబుగనయినను ఎఱుంగజాలనియట్లు ప్రకాశించువాడు.

* అన్తశ్శరీరే తస్యాహమ్ వర్షాణామధికంశతమ్। నహి పశ్యామి తస్యాహమ్ అన్తమ్ దేవస్య కర్హిచిత్ ॥ ఆసాదయామి నైవాన్తం తస్య రాజన్మహాత్మనః * (భా. అ. 124_125) [వానిశరీరంబున నూఱుసంవత్సరములకన్న నధికముగా నుండియు ఆదేవునియంతంబును ఏవిధంబునను చూడలేదు. ఓహో! వానియంతంబును పొందలేదు.] (308.)

## 309. ఇష్టః. 310. అవిశిష్టః.

ఇట్లు తనయుదరంబున ధరింపబడిన ప్రాణులను తారతమ్యములేక తనకృపామాత్రంబుచేతనే తల్లివలె ఇష్టముగా రక్షించువాడు. (309_310.)

## 311. శిష్టేష్టః.

"శిష్టానామ్ పరమపురుషార్థత్వేన ఇష్టః శిష్టేష్టః" పండితాగ్రేసరులగు మార్కండేయాదులచే ఉత్కృష్ట పురుషార్థముగా గోరబడినవాడు.

* సత్త్వస్థాః నిరహఙ్కారాః నిత్యమధ్యాత్మకోవిదాః। మామేవ సతతం విప్రాః చిన్తయన్త ఉపాసతే * (భా. అ. 189_167.) [సత్త్వగుణప్రధానులై

312. శిఖణ్డీ. 313. నహుషః.
314. వృషః. 315. క్రోధహా.

శిఖణ్డి = శిఖరమునుగలవాడు. నహుషః = బంధించువాడు. వృషః = వర్షించువాడు. క్రోధహా = కోపమును జయించినవాడు.

---

అహంకారరహితులై సదా ఆత్మధ్యానపరులైయుండు బ్రహ్మవిత్తులు నన్నే చింతించుచునుపాసింతురు.] * ఆసీనన్తమ్ నరవ్యాఘ్రమ్ పశ్యామ్యమిత తేజసమ్ * (భా. ఆ. 188_129) [మహాతేజస్వియగు ఆనరశ్రేష్ఠుని చూచుచున్నాడను.] (311.)

## 312. శిఖణ్డీ.

"శిఖణ్డః అస్యాస్తీతి శిఖణ్డీ" అపరిమితమై ఎవరివలనను తిరస్కరింపజాలని ఐశ్వర్యమగు పరమతేజంబనుశిఖరంబునుగలవాడు. (312.)

## 313. నహుషః.

"నహ్యతి బధ్నాతీతి నహుషః" తనమాయచే జీవులను కట్టువాడు. * తస్మింశ్చాన్యో మాయయా సన్నిరుద్ధః * [అచట వేఱొకడు తనమాయచే అడ్డగింపబడియుండును.] (313.)

## 314. వృషః.

"వర్షతీతి వృషః" సముద్రమధ్య ప్రవేశించి శ్రాంతుడైయుండు మార్కండేయాదులతాపము తీరునట్లు అమృతసమానంబగు తనకాంతిచేతను వచనంబుచేతను చల్లగా వర్షించువాడు.

* తతో మామబ్రవీద్బాలః స పద్మనిభలోచనః । శ్రీవత్సధారీ ద్యుతిమాన్ వాక్యం శ్రుతిసుఖావహమ్ । జానామి త్వామ్ పరిశ్రాన్తమ్ తదా విశ్రమకాఙ్క్షిణమ్ * (భా. ఆ. 188_94) [పిమ్మట తామరసుబోలిన నేత్రములుగల అబాలకుడు శ్రీవత్సంబను చిహ్నముగలవాడు మహాకాంతినిగలవాడు విననింపుగానిట్లుపల్కెను. నీవు పరిశ్రాంతుడైనట్టు ఎఱుంగుదును అని] ఇత్యాదులు. (314.)

(అవతారిక.) ఇక పరశురామావతారమును చెప్పుచున్నారు.

## 315. క్రోధహా.

"క్రోధం హన్తీతి క్రోధహా" ఇరువదియొకమాటు క్షత్రియులను నిరసించిన కోపంబును కాశ్యపమహర్షి ప్రార్థనంబుచే పోగొట్టినవాడు. (315.)

316. క్రోధకృత్. 317. కర్తా. 318. విశ్వబాహుః.
319. మహీధరః. 320. అచ్యుతః. 321. ప్రథితః.

క్రోధకృత్ = కోపమును గల్గించినవాడు కర్తా = తెగగొట్టినవాడు. విశ్వబాహుః = వ్యాపించిన బాహువులు గలవాడు. మహీధరః = భూమిని ధరించినవాడు. అచ్యుతః = జాఱనివాడు. ప్రథితః = ప్రసిద్ధుడు.

---

## 316. క్రోధకృత్-

"క్రోధం కరోతీతి క్రోధకృత్" మొట్టమొదట ఆత్మక్షత్రియులకు కోపము గల్గించినవాడు.

## 317. కర్తా. (382)

"కృన్తతీతి కర్తా" ఆ కోపంబునకు మూలకారణంబగు కార్తవీర్యార్జునుని నఱికినవాడు. (317.)

## 318. విశ్వబాహుః.

"విశ్వస్మై బాహవో యస్యసః విశ్వబాహుః" ఇట్లు దుష్టనిరాసార్థమై వ్యాపించిన బాహువులు గలవాడు. (318.)

## 319. మహీధరః. (371)

"మహీమ్ ధరతీతి మహీధరః" ఇట్లు భారంబును తొలగించి భూమిని ధరించినవాడు. (319.)

## 320. అచ్యుతః. (557-101)

"న చ్యుతః అచ్యుతః" బ్రహ్మాదులతో సమానముగా నవతరించినను ఐశ్వర్యము జాఱకుండువాడు.

* చ్యవనోత్పత్తియుక్తేషు బ్రహ్మేన్ద్ర వరుణాదిషు। యస్మాన్న చ్యవసే స్థానాత్తస్మాత్సంకీర్త్యతేఽచ్యుతః * [జఱుగదగిన బ్రహ్మేంద్రవరుణాదులతో సమముగా నవతరించినను నీస్థానంబునుండి జఱుగక స్థిరముగానుండుటచే నీకు అచ్యుతుండను నామముగల్గెను.] (320)

## 321. ప్రథితః.

"ప్రథతే ఇతి ప్రథితః" ఇట్లు ప్రసిద్ధుడైనవాడు. * తస్య నామ మహద్యశః * (తై. 2-1-9.) [వానికీర్తియే గొప్పది.] * యశసశ్చైకభాజనమ్ * (రా.) [కీర్తికి ముఖ్యమగు పాత్రము.] (321.)

322. ప్రాణః. 323. ప్రాణదః. 324. వాసవానుజః.
325. అపాంనిధిః. 326. అధిష్ఠానమ్. 327. అప్రమత్తః.

ప్రాణః = ప్రాణముగా నుండువాడు. ప్రాణదః = బలమునిచ్చువాడు. వాసవానుజః = ఇంద్రునితమ్ముడు. అపాంనిధిః = జలమునకు స్థానమైనవాడు. అధిష్ఠానమ్ = ఆధారమైనవాడు. అప్రమత్తః = జాగ్రత గలవాడు.

---

## 322. ప్రాణః. (67 - 408)

"ప్రాణితీతి ప్రాణః" తన్నాశ్రయించినవారలకు ప్రాణముగానుండువాడు.

+ ప్రాణో ఽ స్మి ప్రజ్ఞాత్మా, తన్మామాయురమృతమిత్యుపాస్వ + (కౌ. బ్రా.) [జ్ఞానాకారుండగు నేను ప్రాణముగానుందును. అట్టినన్ను ఆయుస్సనియు అమృతమనియు ఉపాసించుము.] (322.)

(అవతారిక.) ఇక కూర్మావతారము.

## 323. ప్రాణదః. (66-409-956)

"ప్రాణం బలం దదాతీతి ప్రాణదః" దేవతలకు సముద్రమథనంబునను వలసిన బలంబు నిచ్చినవాడు. (323.)

## 324. వాసవానుజః.

"వాసవమ్ అనుజాయతే ఇతి వాసవానుజః" అమృతంబునుగోరిన ఇంద్రునికై వానికిబిమ్మట బుట్టినవాడు. (324.)

## 325. అపాన్నిధిః.

మథించునపుడు సముద్రంబును ధరించుటచే జలంబులకు నిధి (స్థానము) (325.)

## 326. అధిష్ఠానమ్.

"అధి తిష్ఠత్యస్మిన్నితి అధిష్ఠానమ్" + మందరాద్రేరధిష్ఠానం భ్రమతో ఽ భూన్మహామునే * [మునిసత్తమా! తిరుగుచుండు మందర పర్వతంబునకు ఆధారమయ్యెను.] అనినట్లు మథనకాలంబున మందర పర్వతంబునకు ఆధారమైనవాడు. (326.)

## 327. అప్రమత్తః.

"న ప్రమత్తః అప్రమత్తః" వీనిని రక్షించు విషయంబున మిక్కిలి జాగ్రత గలవాడు. (327.)

328. ప్రతిష్ఠితః: 329. స్కన్దః. 330. స్కన్దధరః.
331. ధుర్యః. 332. వరదః 333. వాయువాహనః.

ప్రతిష్ఠితః = స్థిరముగా నుండువాడు. స్కన్దః = శోషింపజేయువాడు. స్కన్దధరః = సుబ్రహ్మణ్యుని ధరించినవాడు. ధుర్యః = భారమును వహించువాడు. వరదః = వరముల నిచ్చువాడు. వాయువాహనః = వాయువును వీవజేయువాడు.

---

## 328. ప్రతిష్ఠితః.

ఇతరంబు నపేక్షింపక తన మహిమలో తానే స్థిరముగా నుండువాడు.

* స భగవః క్వ ప్రతిష్ఠితః ?... స్వే మహిమ్ని * (ఛా. ఉ. 7_24_1.) [ఆ భగవంతు డెచట స్థిరముగా నుండును ?...తన మహిమంబున స్థిరముగానుండును.] * స్వే మహిమ్ని స్థితమ్ దేవమ్ * (వి. పు.) [తన మహిమంబున నిల్చియుండు దేవుని.] (328.)

## 329. స్కన్దః.

"స్కన్దయతి శోషయతీతి స్కన్దః" అసురాదులను శోషింపజేయువాడు. (329.)

## 330. స్కన్దధరః:

"స్కన్దమ్ ధరతీతి స్కన్దధరః" దేవతల సేనాపతియగు సుబ్రహ్మణ్యుని గూడ తనవిభూతిగా ధరించువాడు.

* సేనానీ నామహం స్కన్దః * (గీ. 10_24) [సేనాపతులలో నేను స్కందుడను.] అని సుబ్రహ్మణ్యుగూడ తన విభూతిగా చెప్పియున్నాడు. (330.)

## 331. ధుర్యః.

"ధురం వహతీతి ధుర్యం:" లోకముల భారంబును వహించువాడు. (331.)

## 332. వరదః.

"వరాన్ దదాతీతి వరదః" లోకకార్యములను నిర్వహించు దేవతలకు అట్టిశక్తి గలుగునట్లు వరమునిచ్చువాడు. (332.)

(అవతారిక.) అది యెట్లనగా ;

## 333. వాయువాహనః. (860)

"వాయుం వాహయతీతి వాయువాహనః" జగత్ప్రాణమైయుండు వాయువును వీవజేయువాడు. (333.)

(అవతారిక.) ఇక పండ్రెండు అధ్యాత్మ విషయములు చెప్పబడును.

334. వాసుదేవః 335. బృహద్భానుః. 336. ఆదిదేవః.

వాసుదేవః = వ్యాపించుచు క్రీడించువాడు. బృహద్భానుః = గొప్పకిరణములను గలవాడు. ఆదిదేవః = మొట్టమొదట క్రీడించువాడు.

---

## 334. వాసుదేవః. (700-714.)

"వాసుశ్చాసౌ దేవశ్చ వాసుదేవః" 'వాసుః' అనగా సూర్యుడు తనకిరణంబులచే ఆవరించునట్లు ప్రపంచంబును వ్యాపించి తనయందు దానిని వసింపచేసి తాను వానియందు వసించువాడు. 'దేవః' అనగా క్రిందజెప్పినట్లు క్రీడించువాడు, జయముగోరువాడు, ప్రకాశించువాడు, స్తోత్రముచేయబడువాడు, పోవువాడు, అని ఇట్లు వాసుదేవపదంబుచే జగంబున వ్యాపించి క్రీడించువాడని తెలిసది.

* ఛాదయామి జగత్సర్వం భూత్వా సూర్య ఇవాంశుభిః। సర్వభూతాధివాసశ్చ వాసుదేవస్తతః స్మృతః। (భా. మో. 166.) [సమస్తలోకములను, సూర్యుడు కిరణంబులచే ఆవరించియున్నట్లు నేను ఆవరించియున్నాను. సమస్త భూతంబులకును ఉనికిపట్టుగా అగుదును. కనుక నన్ను వాసుదేవుడందురు] ✣ సర్వత్రాసౌ సమస్తఞ్చ వసత్యత్రేతివై యతః। తత స్స వాసుదేవేతి విద్వద్భిః పరిపఠ్యతే * (వి. పు. 1-2-12.) [వీడు అంతటవసించును. వీనియందును అన్నియు వసించును. కనుక నే వీనిని వాసుదేవుడందురు.]

ఇచట చెప్పతలసిన విషయములు పరమరహస్యంబులగుటచే అధికముగా చెప్పబడలేదు. సదాచార్య సన్నిధిలో వినగలరు. (334.)

(అవతారిక.) దానినే వివరించుచున్నారు. † అందు భోగవిభూతిచే పరమాకాశముగా ప్రకాశించు ప్రకారమును తెల్పుచున్నారు.

## 335. బృహద్భానుః.

"బృహన్తః భానవః యస్యసః బృహద్భానుః" అంతట వ్యాపించిన కిరణములను గలవాడు. (335.)

(అవతారిక.) లీలావిభూతిరై క్రీడించు విధమును చెప్పుచున్నారు.

## 336. ఆదిదేవః. (491)

"ఆదిశ్చాసౌ దేవశ్చ ఆదిదేవః" లోకమునకు మూలకారణముగానుండి జగత్సృష్టిమున్నగువానిచే క్రీడించువాడు.

---

† వాసుదేవ శబ్దంబునగల "దేవః" అను పదంబునకు ఐదు అర్థములు చెప్పబడినవి. ఈ యర్థంబులను వివరించుచున్నారు అని భావము.

337. పురన్దరః. 338. అశోకః. 339. తారణః.
340. తారః. 341. శూరః.

పురన్దరః = త్రిపురములను పడగొట్టినవాడు. అశోకః = శోకమునకు విరోధి. తారణః = రక్షించువాడు. తారః = తప్పించువాడు. శూరః = జయశీలుడు.

---

* సంప్రయోజ్య వియోజ్యాఽయంకామకారకరః ప్రభుః । క్రీడతే భగవాన్ * (భా. అ. 30_40) [చేర్చియు విభజించియు జగత్ప్రభువగు నీతడు తలంచినట్లు క్రీడించును.] ఇత్యాదులు. (336.)

(అవతారిక.) ప్రపంచంబును ఆవరించియుండుటచే అసత్తులను నివారించు విధంబును నాలుగు నామంబులచే తెల్పుచున్నారు:—

## 337. పురన్దరః.

"పురాణి దారయతీతి పురన్దరః" అసురులయొక్క మూడుపురంబులను పడగొట్టినవాడు. ఇట్లనుటచే ఆధిదైవికంబులగు అసురులు పిశాచములు పిడుగు శాపము మున్నగువానినుండి రక్షించు విధముకూడ చెప్పబడినదాయె. (337.)

## 338. అశోకః. (338)

"న శోకః అశోకః" ఆధ్యాత్మికంబులగు శోకము మోహము ఆకలి మున్నగువానినుండి రక్షించువాడు. (338.)

## 339. తారణః.

"తారయతీతి తారణః" ఆధిభౌతికంబులగు శత్రుచోరవ్యాధ్యాదులనుండి రక్షించువాడు. (339.)

## 340. తారః. (968)

"తారయతీతి తారః" సమస్తసంసారభయంబునుండి రక్షించువాడు.

* గర్భజన్మజరామరణాదిసంసార సాగరమహాభయాత్తారయతీతి తస్మాదుచ్యతే తారః * (అ. శి.) [గర్భము జన్మము జర మరణము మున్నగు సంసారభయంబునుండి దాటించుటచే తారుడనబడెను.] (340.)

(అవతారిక.) జయించు స్వభావంబును చెప్పుచున్నారు.

## 341. శూరః. (650)

జయించు స్వభావముగల సమర్థుడగుటచే జయశీలుడు. (341.)

(అవతారిక.) క్రింద జెప్పినవానినన్నిటిని తనవిశేషభక్తులకు ప్రదర్శించుటకై వారలసమీపంబునకు పోవుటను చెప్పుచున్నారు:—

342. శౌరిః. 343. జనేశ్వరః. 344. అనుకూలః.
345. శతావర్తః. 346. పద్మీ.

శౌరిః = వసుదేవుని పుత్రుడు. జనేశ్వరః = జనంబులకు నీశ్వరుడు.
అనుకూలః = (1) తీరమునను సంచరించువాడు. (2) భక్తులకు వశుడు.
శతావర్తః = నూఱుసుళ్ళుగలవాడు. పద్మీ = లీలారవిందంబును గల వాడు.

---

## 342. శౌరిః. (649)

"శూరస్య వసుదేవస్య అపత్యం శౌరిః" శూరుడగు వసుదేవునిపుత్రుడు. అనగా, వారలకు తన మహిమంబును ప్రదర్శించిరి అని భావము. (342.)

## 343. జనేశ్వరః.

"జనానామ్ ఈశ్వరః జనేశ్వరః" ఇట్లు సమస్తంబును మునుగునట్లు ప్రకాశించు ఐశ్వర్యంబు అను మహాప్రవాహంబును గలవాడగుటచే జనంబులకు నీశ్వరుండు. (343.)

## 344. అనుకూలః.

(1) ఈత డిట్లుండియు స్వతః మహనీయుండగుటచే గర్వము మదము అభిమానము మున్నగునవి లేకుండుటవలన తీరంబును (హద్దును) అనుసరించినవాడు. * వీర్యవాన్ నచ వీర్యేణ మహతా స్వేన విస్మితః * [వీడు మహావీర్యవంతుడయ్యు తన వీర్యంబుచే గర్వింపకుండువాడు.]

(2) లేక భక్తులకు వశమైనవాడు. * హస్తావలమ్బకో హ్యేకః భక్తిక్రీతః జనార్దనః * [జనార్దనుడు భక్తిచే క్రీతుడైనపుడు స్వాధీనుడుగా నుండును.] (344.)

## 345. శతావర్తః.

"శతమ్ ఆవర్తాః యస్యసః శతావర్తః" ఇట్లు అతివేలముగానుండు తన యైశ్వర్యము హద్దును మీఱకుండునట్లు అడ్డగించుటచే ఇఱుకు స్థలంబులందు పోజాలని ప్రవాహము సుళ్ళనొందునట్లు సుళ్ళు నొందియుండును. (345.)

(అవతారిక.) ఇట్లు వాసుదేవునిగుణంబులను వివరించి రూపంబును వివరించుచున్నారు:—

## 346. పద్మీ.

"పద్మమ్ నిత్యమ్ అస్యాస్తీతి పద్మీ" లీలారవిందంబుతో నిత్యము ప్రకాశించువాడు. (346.)

347. పద్మ నిభేక్షణః. 348. పద్మనాభః. 349. అరవిన్దాక్షః.
350. పద్మగర్భః. 351. శరీరభృత్.

పద్మనిభేక్షణః = పద్మమువంటి చూపులుగలవాడు. పద్మనాభః = పద్మమువంటి నాభినిగలవాడు. అరవిందాక్షః = తామరలవంటి కన్నులుగలవాడు. పద్మగర్భః = పద్మమున వసించువాడు. శరీరభృత్ = శరీరమును పోషించువాడు.

---

## 347. పద్మనిభేక్షణః.

"పద్మనిభమ్ ఈక్షణమ్ యస్యసః పద్మనిభేక్షణః" నిర్మలంబగు కమలము చలించుటవలె, ఆశ్రితులశ్రమమును తొలగించు రమణీయంబగు వీక్షణము (చూపు) గలవాడు. (347.)

## 348. పద్మనాభః. (48-198)

"పద్మమివ నాభిః యస్యసః పద్మనాభః" పద్మమువంటి నాభినిగలవాడు. (348.)

## 349. అరవిన్దాక్షః.

"అరవిందే ఇవ అక్షిణీ యస్యసః అరవిందాక్షః" తామరవలె అందమగు నేత్రములు గలవాడు. (349.)

## 350. పద్మగర్భః.

"పద్మేన గీర్యతే స్వాన్తః అవస్థాప్యతే ఇతి పద్మగర్భః"

(1) తనవలె పరిమళించు మృదువగు ఆసనపద్మంబున వసించువాడు.

(2) లేక, తన్ను ఉపాసించువారలహృదయకమలంబున వసించియుండు వాడు. * దహరం విపాప్మం పరవేశ్మభూతం యత్పుణ్డరీకమ్ * (తై-నా. 6 10-23) [హృదయపుండరీకంబను ఏదహరాకాశము పాపము తొలగినదై పరమపురుషునికి మేలైనవాసస్థానమగునో;] * దహరం పుణ్డరీకం వేశ్మ * (ఛా. 8-1-1.) * నారాయణః సరసిజాసన సన్నివిష్టః * [పద్మాసనంబున నుపవిష్టుడు నారాయణుండు.] (350.)

## 351. శరీరభృత్.

"శరీరం స్వశరీరభూతం ఉపాసకం బిభర్తి పుష్ణాతీతి శరీరభృత్" ఇట్లు యోగుల హృదయకమలంబుననుండి తనగుణంబులచే తనకు శరీరముగానుండు ఉపాసకులను పోషించువాడు. ఉపాసింపబడు పరమపురుషునిగుణంబులచేతనే ఉపాసకులకు పోషణము. ఆ యుపాసకులు వానికి ఆత్మగాను శరీరముగాను ఉందురు.

* వసతి హృది సనాతనేచ తస్మిన్ భవతి పుమాన్ జగతోऽస్య సౌమ్యరూపః * (వి. పు. 3-7-24) [పురాణపురుషుడు హృదయంబున వసించునపుడు

352. మహర్ధిః. 353. ఋద్ధః. 354. వృద్ధాత్మా.
355. మహాక్షః. 356. గరుడధ్వజః.

మహర్ధిః = సంపన్నుడు. ఋద్ధః = సమృద్ధుడు. వృద్ధాత్మా = పెరిగిన స్వరూపము గలవాడు. మహాక్షః = గరుడవాహనుడు. గరుడధ్వజః = గరుడధ్వజుడు.

---

పురుషుడు లోకంబున సౌమ్యరూపముతో నుండును.] * బ్రహ్మవిద ఇవ సోమ్య తే ముఖం భాతి * (ఛా. ఉ.) [నీ ముఖము బ్రహ్మవిత్తుయొక్క ముఖమువలె ప్రకాశించుచున్నది.] * రక్షతే భగవాన్ విష్ణుః భక్తానాత్మశరీరవత్ * [విష్ణువు భక్తులను తనశరీరమువలె రక్షించును.] (351.)

(అవతారిక.) అనంతరము విభూతిచేతను వానినే వివరించుచున్నారు.

## 352. మహర్ధిః.

"మహతీ ఋద్ధిః యస్యసః మహర్ధిః" వారలకు యోగక్షేమంబులకు దగిన అపారమగు విభూతిని గలవాడు. (352.)

## 353. ఋద్ధః. (279)

వారల సమృద్ధిచే తానుకూడ సమృద్ధుడుగానుండువాడు.

* అభిషిచ్యచ లఙ్కాయాం రాక్షసేన్ద్రమ్ విభీషణమ్। కృతకృత్యః తదా రామః విజ్వరః ప్రముమోదహ * (రా. బా. 1-85) [రామచంద్రుడు విభీషణుని లంకలో రాక్షసరాజుగా అభిషేకముచేసి చింతలుతొలగి సంతసించెను.] (353.)

## 354. వృద్ధాత్మా.

"వృద్ధః ఆత్మా యస్యసః వృద్ధాత్మా" ఇట్టిమహామహిమంబును ఏకదేశమున అణచుకొనునట్లు పెరిగిన దివ్యాత్మస్వరూపము గలవాడు. (354.)

## 355. మహాక్షః.

"మహాన్ అక్షః యస్యసః మహాక్షః" భగవంతుని వహించుటచే రథావయవమువలెనుండు వేదమయుండగు గరుత్మంతుడు అక్షశబ్దముచే చెప్పబడును. ఆ గరుడుని వాహనముగా గలవాడు. (355.)

## 356. గరుడధ్వజః.

"గరుడః ధ్వజః యస్యసః గరుడధ్వజః" ఆగరుత్మంతునే ధ్వజముగాను గలవాడు. సర్వేశ్వరత్వంబునకు గరుడధ్వజత్వముగూడ నొక అసాధారణచిహ్నము. (356.)

357. అతులః. 358. శరభః.
359. భీమః. 360. సమయజ్ఞః.

అతులః = సాటిలేనివాడు. శరభః = శిక్షించువాడు. భీమః = భయంకరుడు. సమయజ్ఞః = (1) నియమము నెఱింగినవాడు. (2) కాలము నెఱింగిన వాడు. (3) వ్రతము నెఱింగినవాడు.

---

## 357. అతులః.

"న విద్యతే తులా యస్యసః అతులః" గరుడధ్వజుండగుటచే సాటిలేకుండు వాడు.

* న తస్య ప్రతిమా అస్తి * (తై. 2.) [వానికి సమమగు వస్తువులేదు.] (357.)

## 358. శరభః.

"శృణాతీతి శరభః" తనవ్యవస్థను మీఱినవారలను శిక్షించువాడు. (358.)

## 359. భీమః. (948)

"బిభ్యత్యస్మాదితి భీమః" వీడిట్లు శిక్షించుటచే వారలకు భయంకరుడు గానుండును. వీనియందుగల భయముచేతనే వాయ్వాదిదేవతలు తమతమవ్యవస్థను మీఱకుందురు.

* భీషా ఽ స్మాద్వాతః పవతే * (తై. ఆ. 8.) [వీనియందుగల భయంబుచే తనే వాయువు వీచుచున్నాడు.] ఇత్యాదులు. * భయాదేవాగ్నిస్తపతి। భయాత్తపతి సూర్యః। భయాదిన్ద్రశ్చ వాయుశ్చ * (క. ఉ. 2-6-3.) [వీనియందుగల భయముచేతనే అగ్ని దహించును. సూర్యుడు తపించును. ఇంద్రుడు వాయువు తమవ్యవస్థను చెల్లింతురు.] (359.)

## 360. సమయజ్ఞః.

"సమయం జానాతీతి సమయజ్ఞః"

(1) ఆయగ్ని పైగా జ్వలింపవలయును, వాయువు సదా వీచుచుండవలయును, ఇత్యాదివిధంబున ఆయాదేవతలకుందగిన సమయంబును అనగా అధికారనియమంబును ఎఱింగినవాడు. * సూర్యాచన్ద్రమసౌ ధాతా యథాపూర్వ మకల్పయత్ * (తై. ఉ.) [సూర్యచంద్రులను ధాత పూర్వమువలె సృజించెను.]

(2) భక్తులకు తన్ను ఒసగుకాలంబు నెఱింగినవాడు.

(3) భక్తులకు అభయ ప్రదానముకావించు వ్రతము నెఱింగినవాడు. (360.)

361. (క) హవిః. (ఖ) హరిః.
(గ) హవిర్హారిః 362. సర్వలక్షణలక్షణ్యః.

(క) హవిః = ఇచ్చువాడు, పుచ్చుకొనువాడు. హరిః = తొలగించువాడు. హవిర్హారిః = హవిస్సులను కైగొనువాడు. సర్వలక్షణ లక్షణ్యః = సమస్తలక్షణములతోను కూడియుండునట్లు ఎఱుంగదగినవాడు.

---

## 361. (క) హవిః. (703)

* తస్య తావదేవచిరం యావన్న విమోక్ష్యే, అథ సంపత్స్యే * (ఛా. 6_14_2.) [వానికి నేను విడిపించునంతరయే కాలవిళంబము. పిమ్మట చేర్చు కొందును.] అను శ్రుతిసిద్ధమగు సమయంబు నెఱింగి వారలకు సిరినిచ్చును. వారిచ్చు హవిస్సును తాను పుచ్చుకొనును. (361.క.)

## (ఖ) హరిః. (656)

"హరతీతి హరిః" వారలకు గల్గు విఘ్నములను తొలగించువాడు. * హరిర్హరతి పాపాని దుష్టచిత్తైరపి స్మృతః। అనిచ్ఛయాఽపి సంస్పృష్టః దహత్యేవహి పావకః * [చెడుతలంపుతో దలంచినను హరి పాపంబులను పోగొట్టును. ఎట్లనగా; ఇచ్ఛలేక తాకినను అగ్ని దహించును గదా ? (361.ఖ.)

## (గ) హవిర్హారిః.

"హవిః హరతీతి హవిర్హారిః" ఒకే నామము. యాగంబున హవిర్భాగములను కైకొనువాడు. * ఇడోపహూతం గేహేషు హరే భాగం క్రతుష్వహమ్। వర్ణశ్చ మే హరిః శ్రేష్ఠః తస్మాత్ హరిరహం స్మృతః * (భా. శా. 343_39.) [యాగంబున యజ్ఞభాగంబునుగైకొందును. హరితవర్ణము (ఆకుపచ్చ) గలవాడను. కనుక నేనన్ను హరి అనియందురు.] (361.గ.)

(అవతారిక.) అనంతరము లక్ష్మీపతిమూర్తి చెప్పబడును.

## 362. సర్వలక్షణలక్షణ్యః.

"సర్వలక్షణైః లక్షణ్యః సర్వలక్షణలక్షణ్యః" సాక్షాల్లక్ష్మీ సదా ఆలింగనము కావించుకొని యుండుటందెల్పు సమస్తలక్షణంబులతోను కూడియుండునట్లు ఎఱుంగదగినవాడు.

* ధ్యాయేత్కమలగర్భాభమ్ దేవం లక్ష్మీపతిస్తతః। కమలాలయహేతీశ విభూషిత కరద్వయమ్ * [శంఖచక్రంబులనుధరించి తామరయొక్క అంతర్భాగము వలె ప్రకాశించు లక్ష్మీపతిని చింతింపగలడు.] (362.)

363. లక్ష్మీవాన్. 364. సమితింజయః. 365. విక్షరః.
366. రోహితః. 367. మార్గః. 368. హేతుః.

లక్ష్మీవాన్ = లక్ష్మితో గూడినవాడు. సమితింజయః = యుద్ధమున జయించువాడు. విక్షరః = తగ్గకుండువాడు. రోహితః = ఎఱ్ఱనివాడు. మార్గః = వెదకబడువాడు. హేతుః = కారణభూతుడు.

---

### 363. లక్ష్మీవాన్.

" లక్ష్మీః అస్మిన్నస్తీతి లక్ష్మీవాన్ " లక్ష్మితో సదా కూడియుండువాడు.

* ద్వయన్దేవీపరిణయే లీలయైవ సమర్పయన్ । ప్రకాశయన్ననాదిత్వమ్ ఆత్మనా ప్రకృతేస్సహ * [ఆత్మకును తనకునుగల అనాదిసంబంధంబును ప్రకటించుచు ప్రణయకాలంబున లీలగా దేవికి ద్వయమంత్రంబు నుపదేశించు...] (363.)

### 364. సమితింజయః.

" సమితిం జయతీతి సమితింజయః " తండ్రివలె హితకారియగుటచే, సమస్తలోకపితయగు తనకు దాస్యముగావించు విషయంబున వివాదించు జీవకోటులను ఈలక్ష్మిచేతనే వివాదంబున జయించి వశముగావించుకొనువాడు. (364.)

### 365. విక్షరః.

" విగతః క్షరః యస్యసః విక్షరః " ఇట్లు భక్తులమీదగల ప్రీతి తగ్గకుండువాడు (365.)

### 366. రోహితః.

లక్ష్మీపతిమూర్తికి తామరయొక్క అంతర్భాగమువంటి శరీరముండుటచే ఎఱ్ఱనివర్ణముగలవాడు. చూ. 'సర్వలక్షణ లక్షణ్యాః' నామము 362. ప్రమాణము.)

### 367. మార్గః. (398)

" మృగ్యతే ఇతి మార్గః " ఇష్టసిద్ధికై ఉపాసకులచే వెదకబడువాడు. (367.)

### 368. హేతుః.

ఇష్టసిద్ధికి కారణమైనవాడు. (368.)

369. దామోదరః.　　　　370. సహః.
371. మహీధరః.　　　　372. మహాభాగః.

దామోదరః = (1) లోకములను ఉదరమున (కడుపులో) గలవాడు. (2) సుఖము నిచ్చువాడు. (3) దామమును (త్రాటిని) ఉదరమున గలవాడు.
సహః = సహించినవాడు.　　　　మహీధరః = భూమిని ధరించినవాడు.
మహాభాగః = మహాసౌభాగ్యమును గలవాడు.

---

## 369. దామోదరః.

"దామాని ఉదరే యస్యసః దామోదరః" (1) * దామాని లోకనామాది భాన్తి యస్యోదరాన్తరే। తేన దామోదరో దేవః * [దామ అని పేరొందిన లోకములు ఉదరంబున ఉండుటచే వాడు దామోదరుండని పేరొందెను.] అను నిరుక్తరీతిగా లోకములను కడుపులో గలవాడు.

(2) * దేవానాం సుఖశంసిత్వాల్ దామాద్దామోదరం విదుః * (భా. ఉ. 71-9) [దేవతలకు సుఖంబొనరించువాడగుటచే దామోదరుండగును.] అను నిరుక్తరీతిగా దేవతలకు సుఖంబొనరించువాడు.

(3) * తతస్స దామోదరతాం ప్రయయౌ దామబన్ధనాత్ * (వి. పు. 5-6-20) [త్రాటిచే కట్టబడుటచే వాడు దామోదరుండయ్యె.] అనినట్లు లక్ష్మియు గోరదగిన చాతుర్యము గలవాడయ్యు ఆశ్రితులయందుగల వాత్సల్యంబుచే యశోదయొక్క కట్టుకులోబడియుండెను గాన దామమును (త్రాటిని) ఉదరంబున గలవాడు. (369.)

## 370. సహః.

"సహతే ఇతి సహః" యశోద యిట్లు ఒనరించిన తర్జనభర్త్సనాదుల నోర్చుకొనియుండినవాడు. (370)

## 371. మహీధరః. (319)

"మహ్యాః ధరః మహీధరః" భూభారంబును తొలగించుటచే భూమిని ధరించినవాడు. (371.)

## 372. మహాభాగః.

"మహాన్ భాగః సౌభాగ్యం యస్యసః మహాభాగః" నీళాదిషోడశ (పదారువేలు) స్త్రీసహస్రంబును రుక్మిణీ సత్యభామాదులును కోరి వరింపదగిన మహా సౌభాగ్యము గలవాడు. (372.)

373. వేగవాన్ 374. అమితాశనః. 375. ఉద్భవః.
376. క్షోభణః. 377. దేవః. 378. శ్రీగర్భః.

వేగవాన్ = వేగముగలవాడు. అమితాశనః = అమితముగా భుజించినవాడు.
ఉద్భవః = సంసారనివర్తకుడు. క్షోభణః = కలతబెట్టువాడు.
దేవః = క్రీడించువాడు. శ్రీ గర్భః = లక్ష్మిని వర్ధిల్లజేయువాడు.

---

## 373. వేగవాన్.

"వేగః అస్యాస్తీతి వేగవాన్" మనుజులవలె అట్లాడునపుడుగూడ అపరిమితమైన పరమైశ్వర్యశక్తియొక్క వేగముగలవాడు. (373.)

(అవతారిక.) అది యెట్లనగా :—

## 374. అమితాశనః.

"అమితమ్ అశనం యస్యసః అమితాశనః" అపరిమితముగా ఇంద్రునికై కల్పించిన ఆహారంబును భుజించినవాడు. వీడట్లు భుజించుటంజూచి గోవులు ఆశ్చర్యంబునొంది * దేవోవా దానవోవా త్వమ్? * (వి. పు. 5-13-121.) [నీవు దేవుడా? లేక దానవుడా?] అని ప్రశ్నించియుండుటంజూడుడు. (374.)

## 375. ఉద్భవః. (796.)

"ఉద్గతః భవః యస్మాత్సః ఉద్భవః" * దామోదరం బన్ధహరమ్ * (వి. పు. 1-9-144.) అనినట్లు తన బంధంబును తలంచినవారలకు సంసారబంధంబును తొలగించుటచే సంసారబంధంబును పోగొట్టువాడు. (375.)

## 376. క్షోభణః.

"క్షోభయతీతి క్షోభణః" బంధనార్హులగు జీవరాసులను, ఆజీవరాసులను బంధించు ప్రకృతిని ప్రళయానంతరము సృష్టికాలమున కలతబెట్టువాడు. అనగా ఉత్పత్తియగునట్లుచేయువాడు. (376.)

## 377. దేవః.

"దీవ్యతి క్రీడతీతి దేవః" మాయయను పాశంబుచే జీవులను, వ్యాఘ్ర వరాహాది జంతువులవలె బంధించి క్రీడించువాడు. (377.)

## 378. శ్రీగర్భః.

"శ్రీః గర్భః యస్యసః శ్రీగర్భః" ఇష్టభోగక్రీడాసహాయంబుచే లక్ష్మిని సంతసింపజేసి వర్ధిల్లజేయువాఁడు.

379. పరమేశ్వరః. 380. కరణమ్.
381. కారణమ్. 382. కర్తా.

పరమేశ్వరః = పరమేశ్వరుడు. కరణమ్ = సాధనముగా నుండువాడు.
కారణమ్ = కారణభూతుడు. కర్తా = స్వతంత్రుడు.

---

* విష్ణోరేషాఽనపాయినీ * (వి. పు. 2. 914-4.) [ఈలక్ష్మి భగవంతుని విడిచియుండదు.] (378.)

## 379. పరమేశ్వరః.

"పరమశ్చాసౌ ఈశ్వరశ్చ పరమేశ్వరః" ఇట్లు లక్ష్మి కోరి కూడి యుండుటచే తనపరమైశ్వర్య ఫలంబునొందినవాడు. (379.)

## 380. కరణమ్.

"క్రియతే ఇతి కరణమ్" భక్తులు తన్ను పొందుటకు తానే సాధనముగా నుండుటచే స్వప్రాప్తిసాధనంబులలో శ్రేష్ఠమైనవాడు. లోకంబున, జ్ఞానకరణంబులగు శ్రోత్రాదులును, క్రియోపకరణంబులగు కరచరణాదులును ఈతని శక్తిలేశంబు నొందియుండుటచేతనే కరణంబులని పేరొందినవి.

* చక్షుశ్చ ద్రష్టవ్యఞ్చ నారాయణః, శ్రోత్రఞ్చ శ్రోతవ్యఞ్చ నారాయణః * (మ. ఉ.) [నేత్రంబును కనబడునదియు నారాయణుఁడే, శ్రోత్రంబును వినబడునదియు నారాయణుఁడే.] ఇత్యాది. (380.)

## 381. కారణమ్.

"కారయతీతి కారణమ్" ఆయాకరణంబులచే ప్రాణులకు ఆయాకార్యంబులను గావించు దేవతగానుండువాడు. (381.)

## 382. కర్తా. (317.)

"కరోతీతి కర్తా" ఆయాకార్యంబులకునధికారియై, ఆ కార్యముల ఫలంబులను భుజించు జీవుడు ఎట్లు తనసుఖదుఃఖాదులకు అభిమానియైయుండునో; అటులే సర్వేశ్వరుడుగూడ ఆజీవులకన్న అధికముగా వారలసుఖదుఃఖములకు అభిమానియై యుండును.

* వ్యసనేషు మనుష్యాణాం భృశం భవతి దుఃఖితః। ఉత్సవేషుచ సర్వేషు పితేవ పరితుష్యతి * (శ్రీరా. అయో. 2-41.) [మనుజులకు కష్టము వచ్చినప్పుడు రాముడు మిక్కిలి దుఃఖించును. ఉత్సవకాలంబులందు తండ్రివలె సంతసించును.]

## 383. వికర్తా. 384. గహనః. 385. గుహః.

వికర్తా = వికారము నొందువాడు. గహనః = అగోచరుడు. గుహః = రక్షించువాడు.

---

కనుకనే * బహు స్యామ్ ప్రజాయేయ * (తై. ౬_6_2.) అనితానే బహువుగా పుట్టునట్లు అభిమానించియున్నాడు. లేనిచో " న బహు స్యామ్... " అనియుండును. (382.)

## 383. వికర్తా.

" వికరోతీతి వికర్తా " జీవులు ఆఫలంబులను అనుభవించునపుడు తాను గూడ హర్ష శోకంబుచే వికారమునొందుచున్నాడు.

" బ్రహ్మంబునకు వికారముగల్గునట్లు చెప్పుట దోషముగాదా ? యన్న, దోషముగానేరదు. తనకై వికారమునొందుటయే దోషము, పరార్థమై వికారము నొందుట దోషముగాదు గుణమేయగును §

లేనిచో • పరదుఃఖదుఃఖిత్వము • (ఇతరుల దుఃఖమునకు దుఃఖించుటయే దయ) మున్నగు గుణంబులు వీనికుండునట్లు చెప్పుట విరోధించును. (383.)

## 384. గహనః. (548.)

ఇట్లు ప్రాణుల జ్ఞానాయతనంబగు నాత్మకును భోగమునకును భోగోపకరణం బులకును తాను అభిమానిగానుండునను మహాగుణము గల్గియుండుటచే ఆ విషయంబున ఈ రీతియనిచెప్పుటకు బుద్ధికి అగోచరుడుగానుండువాడు.

* సహైవ సన్తమ్ న విజానన్తి దేవాః * [కూడనేయుండు వానిని దేవతలు గూడ ఎఱుంగరు.] ఇత్యాదులు. (384.)

## 385. గుహః.

" గూహతీతి గుహః " ఇట్లు లోకమంతను రక్షించువాడు. (385.)

(అవతారిక.) ఇక ధ్రువమూర్తి చెప్పబడును.

---

§ కనుకనే * వ్యసనేషు మనుష్యాణామ్ * (నామము. 382.) ఇత్యాది శ్రీరామాయణ శ్లోకమున శ్రీరామగుణవర్ణన ప్రకరణంబున రాముడు దుఃఖించునట్లును సంతసించునట్లును చెప్పబడెను.

386. వ్యవసాయః.   387. వ్యవస్థానః.   388. సంస్థానః.
389. స్థానదః:   390. ధ్రువః.   391. పరర్ధిః.

వ్యవసాయః = బంధించువాడు.   వ్యవస్థానః = వ్యవస్థను గావించువాడు.
సంస్థానః = సమాప్తిగా నుండువాడు.   స్థానదః = పరమపదము నిచ్చువాడు.   ధ్రువః = స్థాపించినవాడు.   పరర్ధిః = ఉత్కృష్టమగు ఐశ్వర్యము ను గలవాడు.

---

### 386. వ్యవసాయః.

"విశేషేణ అవసీయతే బధ్యతే జ్యోతిశ్చక్రమితి వ్యవసాయః" ధ్రువమూర్తి, నక్షత్రములకు నాధారమగు ఆకాశంబును శరీరముగాగలవాడగుటచే తేజశ్చక్రంబులను తనయందు బంధించుకొనియుండును.

* భవచక్ర భృతమ్ దేవమ్ * [సంసార చక్రంబును భరించు దేవుని.] (386.)

### 387. వ్యవస్థానః.

"వ్యవతిష్ఠతే అస్మిన్నితి వ్యవస్థానః" కల ముహూర్తము ఇత్యాద్యనేక విధముగా చెప్పబడు కాలము తనయందే స్థాపింపబడియుండువాడు. (387.)

### 388. సంస్థానః.

"సంతిష్ఠతే సమాప్యతే అస్మిన్నితి సంస్థానః" సమస్తము తనయందే ముగించునట్లు ఉండువాడు.

### 389. స్థానదః.

"స్థానం దదాతీతి స్థానదః" పరమపదంబను స్థానంబునిచ్చువాడు. (389.)

### 390. ధ్రువః. (55)

"ధ్రువతి స్థిరయతీతి ధ్రువః" ఉత్తమంబగు తనస్థానంబు నిచ్చుటచే అర్వాచీనుడగు ధ్రువునిగూడ ధ్రువముగా (శాశ్వతముగా) కావించినవాడు. (390.)

(అవతారిక.) ఇక మృతసంజీవనంబగు రామకథ ప్రారంభింపజడును.

### 391. పరర్ధిః.

"పరా ఋద్ధిః యస్యసః పరర్ధిః" సర్వేశ్వరత్వంబునకన్న నుత్కృష్టమగు కల్యాణగుణసమృద్ధిని గలవాడు.

**392. పరమస్పష్టః. 393. తుష్టః. 394. పుష్టః**

పరమస్పష్టః = స్పష్టమగు పరత్వము గలవాడు. తుష్టః = సంతుష్టుడు.
పుష్టః = పరిపూర్ణుడు.

---

* విష్ణునాసదృశో వీర్యే సోమవత్ప్రియదర్శనః * (శ్రీరా. బా. 1-18) అని రాముని గుణైకదేశంబునకు దృష్టాంతముగా చంద్రాదులను చెప్పినట్లు, (అనుత్కృష్టులగు ఆ చంద్రాదులతో గూడ) పరుడగు విష్ణువునుగూడ సమానముగా చెప్పబడియుండుటం జూడుడు. అంతేకాక. * అవ్యక్తమ్ అక్షరం బ్రహ్మనిర్మితమ్। దేవానాం హృదయం సౌమ్యం గుహ్యం రామః పరన్తపః * (శ్రీరా. అ. 2-33) [అవ్యక్తంబను మూలప్రకృతియు, అక్షరంబను ముక్తస్వరూపంబును ప్రకృతిపరిణామంబగు ప్రపంచంబును, దేవతలహృదయంబునకు శుభాశ్రయంబగు పరమరహస్యంబును సమస్తంబును శత్రువులను జయించు శ్రీరాముడే] అని పరత్వావస్థయు ఈ యవతారంబుననే చెప్పబడెను. (391.)

## 392. పరమస్పష్టః.

"పరమశ్చాసౌ స్పష్టశ్చ పరమస్పష్టః" తన పరత్వము స్పష్టముగా ప్రకాశించునట్లుండువాడు.

* వ్యక్త మేషమహాయోగీ పరమాత్మా సనాతనః * (శ్రీరా. యు. 114-14) (వీడు మహాయోగసంపన్నుడై సనాతనుడై ప్రకాశించు పరమాత్మ.] (392.)

## 393. తుష్టః.

"తుష్యతీతి తుష్టః" అధికృతులకుందప్ప ఇతరులకునుపయోగములేని పరత్వముకన్న ఈయవతారంబున మనుష్యసామాన్యంబునకు యోగ్యమగు దశరథపుత్రత్వంబును జగత్పాలనంబును రెండును చేరియుండ గల్గుటచే సంతుష్టుడు.

* పితరం రోచయామాస తదా దశరథమ్ నృపమ్ * (శ్రీరా. బా. 15-31.) [అప్పుడు విష్ణువు దశరథ మహారాజును తండ్రిగా వరించెను.] * కులోచితమతిః క్షాత్రం ధర్మం స్వం బహుమన్యతే * (శ్రీరా. అ. 1-16.) [ఇక్ష్వాకువంశంబునకుందగిన దయాదాక్షిణ్యాదులందునిల్చి క్షత్రియధర్మమగు ప్రజాపాలనంబును గౌరవించును.] * ఆత్మానం మానుషంమన్యే రామం దశరథాత్మజమ్ * (రా. యు. 120-11.) [నేను నన్ను దశరథ పుత్రుఁడగు రాముఁడుగా నేదలంచి యుండెద.] (393.)

## 394. పుష్టః.

"పుష్యతీతి పుష్టః" ఇట్టి మహాగుణంబులచే పరిపూర్ణుడు.

* తమేవం గుణసమ్పన్నం రామమ్ * (రా. బా. 1-19.) [ఇట్టిగుణంబులతో గూడియుండు రాముని.] (394.)

395. శుభేక్షణః.  396. రామః.  397. విరామః.

శుభేక్షణః = శుభమగు దర్శనము గలవాడు.  రామః = రమింపజేయువాడు.
విరామః = తొలగించువాడు.

---

## 395. శుభేక్షణః.

" శుభమ్ ఈక్షణం యస్యసః శుభేక్షణః "

(1) ఇట్టి యైశ్వర్యశీలాదులను తిరస్కరించునట్టి శీతలములై యుండు తామరలనుబోలిన నేత్రములంగలవాడు. * సుభ్రూ రాయతతామ్రాక్షః సాక్షాద్విష్ణురివ స్వయమ్। రామః * (రా. అ. 2_43.) [అందంబగు కనుబొమలును, విశాలములై ఎఱ్ఱనివై యుండు నేత్రములుంగల రాముడు సాక్షాద్విష్ణువువలె ప్రకాశించెను.]

(2) లేక, తన్ను చూచుటయు తాను చూచుటయు అను రెండును శుభముగా నుండునట్లు ప్రకాశించువాడు. * యశ్చ రామం న పశ్యేత్తు యఞ్చ రామో న పశ్యతి। నిన్దితస్స వసేల్లోకే స్వాత్మాప్యేనం విగర్హతే * (రా. అ. 17_14.) [రాముని ఎవడు చూడలేదో, రాముడు ఎవనిని చూడలేదో, వాడు లోకంబున నిందింపబడి వసించును. వాని మనసుగూడ వానిని నిందించును.] (395.)

## 396. రామః.

" రమ్యతే అస్మిన్నితి రామః " తనగుణరూపంబులచే వశీకరింపబడిన సమస్త ప్రాణులును తనయందు రమించునట్లు ప్రకాశించువాడు.

* రామో రమయతాం శ్రేష్ఠః * (రా. అ. 53_1.) [రాముడు రమింపజేయువారలలో శ్రేష్ఠుడు.] * గుణాభిరామం రామఞ్చ * (రా. సు 16_1.) [గుణంబులచే అభిరాముండగు రాముని.] * తథా సర్వప్రజాకాన్తైః ప్రీతిసఞ్జననైః పితుః। గుణైర్విరురుచే రామః దీప్తస్సూర్య ఇవాంశుభిః * (రా. అ. 1_33.) [అటులే తండ్రివలెనందఱకును అభిమతంబులైన గుణములతో రాముడు సూర్యుడు కాంతిచే ప్రకాశించునట్లు ప్రకాశించుచుండెను.] (396.)

## 397. విరామః.

" విరమ్యతే అస్మిన్నితి విరామః " వరంబునిచ్చిన బ్రహ్మాదులును, ఈబ్రహ్మాదులిచ్చిన అవధ్యత్వము (నాశము లేకుండుట) మున్నగు వరంబులును, ఆవరంబులనొందిన రావణాదులును వీనియందు ఫలింపక తొలంగుదురు.

* బ్రహ్మా స్వయంభూశ్చతురాననోవా....త్రాతుం న శక్తాః యుధి రామవధ్యమ్ * (రా. సు. 51_55) [స్వయముగా నుద్భవించిన చతుర్ముఖుండగు బ్రహ్మ... రామునిచే చంపదగినవానిని కాపాడజాలరు.] ఇత్యాదులు. (397.)

398. (క) విరతః. (ఖ) మార్గః.
(గ) విరజోమార్గః. 399. నేయః.

(క) విరతః = విరమించినవాడు. (ఖ) మార్గః = వెదకబడువాడు. (గ) విరజో మార్గః = దోషములేని మార్గమును గలవాడు. నేయః = నియమింపదగినవాడు.

---

## 398. (క) విరతః.

స్వతః నిరపేక్షుండగుటచే అతి క్షుద్రములగు రాజ్యాదులను ఉపేక్షించి విరమించినవాడు.

* నచాస్య మహతీం లక్ష్మీం రాజ్యనాశో ఽపకర్షతి * (రా.అ. 16_32) [గొప్పది యగు వీరిదానలక్ష్మిని రాజ్యనాశము అపహరించలేదు.] * స పితుర్వచనం శ్రీమాన్ అభిషేకాత్పరం ప్రియమ్ * (రా. సు. 33_24) [రాముడు తండ్రివచనంబును అభిషేకంబునకన్న పరమప్రియముగా గ్రహించెను.] * ధర్మాపదేశా త్త్యజతశ్చ రాజ్యం మాఞ్చాప్యరణ్యం నయతః పదాతిమ్। నాసీద్వ్యథాయస్య నభీః న శోకః * (రా.సు. 36_29) [ధర్మనిమిత్తమై రాజ్యంబును వదలినప్పుడును, నన్ను అరణ్యంబునకు గొనివచ్చినప్పుడును ఎవనికి కష్టమో భయమో దుఃఖమో లేదో!]

## (ఖ) మార్గః. (367)

'మార్గ్యతే ఇతి మార్గః' భరద్వాజాది మహర్షులచే వెదకబడువాడు.

## (గ) విరజోమార్గః.

" విరజో మార్గః " అనియు పాఠాంతరము గలదు. అప్పుడు ఒకే నామము. అర్థము :— " విరజాః మార్గః యస్యసః విరజోమార్గః " నిర్దోషంబగు మార్గంబును ప్రదర్శించువాడు.

* యా గతిర్యజ్ఞశీలానామ్ ఆహితాగ్నేశ్చ యా గతిః * (రా. అ. 68_29) [యజ్ఞంబు లొనరించువారలకు నేగతియో ; నిత్యాగ్నిహోత్రులకు నేగతియో ; ... ఆగతికి జటాయువా! నీవు ఏగుము.] (398.)

## 399. నేయః.

" నేతుం అర్హః నేయః " సుహృత్తులచే (భక్తులచే) నియమింపదగినవాడు. అనగా భక్తులు తన్ను ఆజ్ఞాపింపదగినంతవారలకు అణగినవాడు అని భావము.

* అజ్ఞాప్యో ఽహం తపస్వినామ్ * (రా. అ. 6_23.) [మహర్షులచే ఆజ్ఞాపింపదగిన కింకరుడుగా నేనుందును. * యజనస్యాభీప్సితం యజ్ఞం మయి

## 400. నయః.

నయః = ఆకర్షకుడు.

---

శ్రేయస్యవస్థితే। నియుఙ్క్ష్వచాపి మాం కృత్యే సర్వం కర్తాఽస్మి తే వచః * (భా. స. 33_25.) [నీవు కోరియుండు యాగంబునుచేయుము. నీవు నియమించు కార్యములంజేయ నేను సిద్ధముగానుందును. అని కృష్ణుడు తానే చెప్పియున్నాడు.] * అయమస్మి మహాబాహో! బ్రూహి యత్తే వివక్షితమ్। కరిష్యామిహ తత్సర్వం యత్త్వం వక్ష్యసి భారత * (భా. ఉ. 71_5.) [నేనిదిగో సిద్ధముగానున్నాను. నీవు చెప్పగోరిన వానిని చెప్పుము. నీవు నియమించు అన్నిటిని చేయ సిద్ధముగానుందును.] * వాయుసూనోః సుహృత్త్వేన భక్త్యా పరమయాచ సః। శత్రూణామప్రకమ్ప్యోఽపి లఘుత్వమగమత్కపేః * (రా. యు. 59_121.) [హనుమంతుని సుహృత్త్వంబును పరమభక్తిని చూచి శత్రువులకు అప్రకంప్యుడయ్యు హనుమంతునకు లఘువుగా (తేలికగా) అయ్యె.] (చూ. నామము. 401.)

## 400. నయః.

"నీయన్తే అస్మిన్నితి నయః" ఆసుహృత్తులును ఆటులే తనవచనంబును అనుసరించునట్లు ఆకర్షించువాడు.

* రక్షితవ్యాస్త్వయా శశ్వత్ గర్భభూతాః తపోధనాః * (రా. ఆ. 1_20.) [నీయారస పుత్రులవంటి మహర్షులు నీచే రక్షింపదగినవారలు.] * పాణ్డవానాం భవాన్ నాథః భవన్తఞ్చాశ్రితాః వయమ్ * [నీవు పాండవులకు నాథుడవు. పాండవులును నిన్నే ఆశ్రయించియుండువారలు.] (400.)

శ్రీ విష్ణు సహస్రనామ వ్యాఖ్యానమున
చతుర్థ శతకము
సమాప్తము.

శ్రీమతే రామానుజాయ నమః.

# పఞ్చమ శతకము.



## 401. అనయః. 402. వీరః.

అనయః = (1) మృదువుగానివాడు. (2) శుభవిషయము లేనివాడు.
వీరః = పాఱజేయువాడు.

---

## 401. అనయః.

(1) "న నయః అనయః" దుర్బుద్ధులగు రావణాదులకు మృదువుగాకుండు వాడు. * హిమవాన్ మన్దరో మేరుః త్రైలోక్యంవా సహామరైః। శక్యం భుజాభ్యా ముద్ధర్తుం న సంఖ్యే భరతానుజః * (రా. యు. 59-111) [హిమవత్పర్వతంబునో మందర పర్వతంబునో మేరు పర్వతంబునో త్రైలోక్యంబునో భుజంబులచే నెత్త నగును. అయితే భరతుని దమ్ముడగు లక్ష్మణునిమాత్రము ఎత్తజాలడు.] (ప్రథమ యుద్ధమున తనశక్త్యాయుధంబుచే మూర్ఛిల్లిన లక్ష్మణుని రావణుఁడు ఎత్తజాచె. ఎత్తజాలడయ్యె. దీనికిం గారణముం దెల్పునది యీశ్లోకము. వెంటనే హనుమంతుడు ఎత్తగా తేలికగానుండె. దానికి కారణమును తెల్పునది * వాయుసూనోః * చూ. నామము. 399 అను శ్లోకము.)

(2) లేక, 'న అయః అనయః' అయః అనగా శుభావహంబగు విధి. అదిలేనివాడు. అనగా, లోకంబునకు తన్నుదప్ప ఇతరమగు శుభవిషయము లేకుండు వాడు. * ఏతే వయం సర్వసమృద్ధకామాః యేషామయం నో భవితా ప్రశాస్తా * (రా. అ. 16-44) [మేము సర్వవిధంబులను కొఱతలేకుండువారము. ఏలననగా; మాకు వీడు రక్షకుండుకాగలఁడు గదా?] (401.)

## 402. వీరః. (664)

"అజతీతి వీరః" రాక్షసులను భయపడి పాఱజేయువాడు.

* బ్రహ్మదణ్డప్రకాశానాం విద్యుజ్జ్వలితవర్చసామ్। స్మరన్ రాఘవబాణానాం వివ్యథే రాక్షసేశ్వరః * (రా. యు. 60-3.) [బ్రహ్మదండమువలె ప్రకాశించు మెఱపుతీగవలె జ్వలించు కాంతిగల రామబాణంబులను దలంచి రాక్షసరాజు మిక్కిలి బాధ నొందెను.] * మాతఙ్గ ఇవ సింహేన గరుడేనేవ పన్నగః। అభిభూతోఽభవ ద్రాజా రాఘవేణ మహాత్మనా * (రా. యు. 60-2) [ఏనుగు సింహముచేతను, సర్పము

## 403. శక్తిమతాం శ్రేష్ఠః. 404. ధర్మః.

శక్తిమతాం శ్రేష్ఠః = శక్తిమంతులచే గొనియాడబడినవాడు. ధర్మః = ధర్మస్వరూపి.

---

గరుడునిచేతనువలె రామునిచే రావణుడు తిరస్కరింపబడియె.] * వృక్షే వృక్షేచ పశ్యామి చీరకృష్ణాజినామ్బరమ్। గృహీతధనుషం రామం పాశహస్తమివాన్తకమ్ * (రా. ఆ. 39_14) [మారీచుడు రావణునితో చెప్పుచున్నాడు. ప్రతివృక్షంబునందును పాశములను ధరించిన యమునివలె ధనుస్సును ధరించియుండు రాముని చూచుచున్నాడను.] (402.)

## 403. శక్తిమతాం శ్రేష్ఠః.

శక్తిగలవారలగు దేవాదులచే మిక్కిలి కొనియాడబడినవాడు.

* అక్షయం మధుహన్తారం జానామి త్వాం సురేశ్వరమ్ * (రా. బా. 76_17.) [పరశురామవాక్యము. [రామా! నిన్ను మధువను రాక్షసునిజంపిన నిర్వికారుండగు దేవనాథునిగా నెఱుంగుదును.] * కథం దేవగణశ్రేష్ఠ! నాత్మానమవబుధ్యసే * (రా. యు. 120_6) [దేవశ్రేష్ఠుడా! నీవేల నిన్నెఱుంగకున్నావు?] * దేవాశ్చ దైత్యాశ్చ నిశాచరేన్ద్ర! గన్ధర్వవిద్యాధర నాగయక్షాః। రామస్య లోకత్రయనాయకస్య స్థాతుం న శక్తాః సమరేషు సర్వే * (రా సు. 51-44) [రావణా! దేవతలో దైత్యులో గంధర్వులో విద్యాధరులో నాగులో యక్షులో ఎవరయినను సరే త్రిలోకనాథుండగు రామునియెదుట యుద్ధమున నిలువజాలరు.] * సర్వాన్ లోకాన్ స సంహృత్య సంహృతాన్ సచరాచరాన్। పునరేవ తథా స్రష్టుం శక్తో రామో మహాశరైః * (రా. సు. 51_40) [రాముడు, సమస్తలోకంబులను సంహరించి, సంహరించిన చరాచరంబులనే మళ్ళి అటులే బాణంబులచేతనే సృజింపగలడు.]

## 404. ధర్మః.

“ధరతీతి ధర్మః” భోగమోక్షంబులకు సాధనముగానుండుటచే ధర్మరూపి.

* బ్రహ్మవిదాం వరః। లోకానాం త్వం పరోధర్మః * (రా. యు. 120_14.) [బ్రహ్మవిత్తులలో శ్రేష్ఠుడు. లోకంబునగల సమస్తధర్మములలోను నీవే శ్రేష్ఠమగు ధర్మము.] * ధర్మాత్మా సత్యసంధశ్చ రామో దాశరథిర్యది। పౌరుషేచాప్రతిద్వంద్వః శరైనం జహి రావణిమ్ * (రా. యు. 91_73.) [దశరథ పుత్రుండగు రాముడు, ధర్మాత్ముడై సత్యసంధుడై పరాక్రమంబునసాటిలేనివాడైయుండినచో ఓబాణమా! నీవు ఈ యింద్రజిత్తును చంపుము. అనిచెప్పి లక్ష్మణుడు ఇంద్రజిత్తుమీద బాణమును ప్రయోగించిచంపెను.] * యేచ వేదవిదో విప్రాః యేచాధ్యాత్మ

405. ధర్మ విదు త్తమః.

ధర్మవిదు త్తమః = ధర్మజ్ఞులలో శ్రేష్ఠుడు.

406. వైకుణ్ఠః.

వైకుణ్ఠః = సంబంధము గల్గునట్లు చేయువాడు.

---

విదో జనాః। తే వద న్తి మహాత్మానం కృష్ణం ధర్మం సనాతనమ్ * (భా. ఆ. 88_25.) [వేద విత్తులగు బ్రాహ్మణులును, ఆత్మజ్ఞాన సంపన్నులగువారును కృష్ణుని సనాతన ధర్మముగా చెప్పుదురు.] * పుణ్యా ద్వారవతీ తత్ర యత్రా స్తే మధుసూదనః। సాక్షాద్దేవః పురాణో౽సౌ సహి ధర్మః సనాతనః * (భా. ఆ. 88_24.) [సనాతన ధర్మస్వరూపియు సాక్షాత్పురాణపురుషుండునగు కృష్ణుడు వసించు ద్వారక పుణ్య మొనర్చినది.] (404.)

## 405. ధర్మవిదు త్తమః.

"ధర్మవిత్సు ఉ త్తమః ధర్మవిదు త్తమః" ధర్మము నెఱింగియుండు వసిష్ఠుడు వామదేవుడు మార్కండేయుడు మున్నగు మహర్షులకుశిష్యుడయ్యు వారును ఈతనియందు ధర్మసందేహంబు నెఱుంగదగు నట్లుండుటచే ధర్మము నెఱింగిన వారలలో శ్రేష్ఠుడు.

* సర్వదా౽భిగతస్సద్భిః సముద్ర ఇవ సింధుభిః * (రా. బా. 1_16.) [సముద్రము నదులచే చుట్టబడియుండునట్లు రాముడు సాధువులచే ఎల్లప్పుడు చుట్టబడి యుండును.] * ధర్మజ్ఞః సత్యసంధశ్చ * (రా. బా. 1. 12.) [ధర్మంబు నెఱింగినవాడు, సత్యసంధుడు.] * వేదవిద్భిః సుపూజితః * (రా. సు. 35_14.) [వేదవిత్తులచే పూజింపబడినవాడు.] * యథావత్సాఙ్గవేదవిత్ * (రా. అ. 1. 20.) [శాస్త్రరీతిగా అంగములతోగూడిన వేదంబుల నెఱింగినవాడు.] * త్వమప్రమేయశ్చ దురాసదశ్చ జితేన్ద్రియశ్చోత్తమధార్మికశ్చ। అక్షయ్యకీర్తిశ్చ విచక్షణశ్చ క్షితిక్షమావాన్ క్షతజోపమాక్షః * (రా. కి. 24_31.) [రామా! నీవు అప్రమేయుండవు. పొందజాలనివాడవు. జితేంద్రియుడవు. మహాధార్మికుడవు. నాశనములేని కీర్తిగలవాడవు. మహాపండితుండవు. భూమివంటి ఓర్పుగలవాడవు. ఎఱ్ఱని నేత్రములుగలవాడవు.] (405)

## 406. వైకుణ్ఠః.

"వికుణ్ఠానామ్ అయం వైకుణ్ఠః" * మయా సంశ్లేషితా భూమిః అద్భిర్వ్యోమచ వాయునా। వాయుశ్చ తేజసాసార్ధం వైకుణ్ఠత్వం తతో మమ * (భా. శా. 343_50.) [భూమి జలముతోను ఆకాశము వాయువుతోను, వాయువు తేజసుతోను నాచేత సంబంధము గల్గింపబడినది గాన నన్ను వైకుంఠుడనియందురు] అను నిరు క్తరీతిగా

407. పురుషః. 408. ప్రాణః. 409. ప్రాణదః.

పురుషః = (1) పరమపావనుడు. (2) పాలించువాడు. ప్రాణః = జీవనమైన వాడు. ప్రాణదః = ప్రాణంబు నిచ్చువాడు.

---

సమస్తంబును సంబంధము గల్గునట్లు చేయువాడు. ఇది ఈ యవతారంబున (రామావతారంబున) ప్రత్యక్షము. వీనిసన్నిధిలో సమస్తప్రాణులును పరస్పరనుపేక్షించుచుండును. వీడు లేనపుడు దేనిని అపేక్షింపక విరక్తిగా నుండును.

* రామమేవానుపశ్యన్తః నాభ్యహింసన్ పరస్పరమ్ * (రా. యు. 131-95) [రాముని చూచుచు ప్రాణులు పరస్పరము హింసించుకొనక ఉండినవి.]

* వ్యసృజన్ కబలాన్ నాగాః గావో వత్సాన్నపాయయన్ । పుత్రం దృష్ట్వా నాభ్యనన్దన్ విపులంవా ధనాగమమ్ । పుత్రం ప్రథమజం లబ్ధ్వా జననీ నాభ్యనన్దత * (రా. అ. 48-5) [రాముడు లేనపుడు ఏనుగులు కబళంబులను వీడినవి, గోవులు దూడలకు పాలివ్వలేదు. అధికధనలాభము గలిగినను ఎవడును సంతసింపడయ్యె. ప్రథమపుత్రుని పొందినను తల్లి సంతసింపదయ్యె.] ఇత్యాదులు. (406.)

## 407. పురుషః. (14)

(1) * స యత్ పూర్వోఽస్మాత్ సర్వస్మాత్ పాప్మనః ఔష త్తస్మాత్ పురుషః * అను నిరుక్తరీతిగా పరమపావనుడు. * పావనః సర్వలోకానాం త్వమేవ రఘునన్దన * (రా. ఉ. 82-8) [రామా! సమస్తలోకంబులందును మీరొకరే పరిశుద్ధులు.] * తవాఽహఞ్చక్షుషా సౌమ్య! పూతా సౌమ్యేన మానద * (రా. ఆ. 74-13) [శబరివాక్యము. రామా! చల్లని నీకటాక్షంబుచే నేను పరిశుద్ధి నొందితిని.]

(2) లేక, "పిపర్తి పాలయతీతి పురుషః" సమస్తంబును పాలించువాడు.

## 408. ప్రాణః. (67-322)

"ప్రాణితి అస్మాత్సర్వమితి ప్రాణః" అందఱను జీవించునట్లు చేయువాడు.

## 409. ప్రాణదః. (66-323-956)

"ప్రాణాన్ దదాతీతి ప్రాణదః" ప్రాణంబులనిచ్చువాడు. కనుకనే * అపివృక్షాః పరిమ్లానాః సపుష్పాఙ్కురకోరకాః * (రా. అ. 59-4) [రామ విరహంబున పువ్వులు మొలకలు మొగ్గలు అను వీనిలో చెట్లుకూడ వాడినవి.] (409.)

410. ప్రణమః. 411. పృథుః.
412. హిరణ్యగర్భః. 413. శత్రుఘ్నః.

ప్రణమః = వంగజేయువాడు. పృథుః = బలిసినవాడు. హిరణ్యగర్భః = (1) హృదయంబున ప్రకాశించువాడు. (2) స్వర్ణనిధికి సమమైనవాడు. శత్రుఘ్నః = శత్రువులను చంపువాడు.

---

## 410. ప్రణమః.

"ప్రణమయతీతి ప్రణమః" తనగుణంబులచే చరాచరంబులను వంగజేయువాడు.

* హృదయాన్యామమన్థేవ జనస్య గుణవత్తయా * (రా. అ. 25. 2.) [గుణంబులతిశయించియుండుటచే జనంబులహృదయంబులను మథించిన (తఱచి) నట్లుండెను.] (410.)

## 411. పృథుః.

"ప్రథతే ఇతి పృథుః" కీర్తిచే బలిసినవాడు.

* పృథుశ్రీః పార్థివాత్మజః * [రాజపుత్రుండగు రాముండు గొప్ప కీర్తిగలవాడు.] * రామోనామ జనైః శ్రుతః * (రా. బా. 1. 8.) [రాముండని ప్రసిద్ధుడై జనులచే గొనియాడబడినవాండు.] * తేషామతియశాః రామః * (రా. బా. 77_28.) [వారలలో మహాకీర్తిమంతుండగు రాముండు.] * యశసశ్చైకభాజనమ్ * (రా. కి. 15_20) [కీర్తికి ముఖ్యమగుస్థానము రాముడు.] (411.)

(అవతారిక.) అవతార కాలంబున లేకుండు వారలచేతను ధ్యానింపబడుటచే వారలను ఉపకరించు విధమును జెప్పుచున్నారు :—

## 412. హిరణ్యగర్భః. (71.)

(1) "హిరణ్యస్య ధ్యాతృహృదయస్య గర్భః హిరణ్యగర్భః" హితముగాను రమణీయముగాను ఉండుటచే హిరణ్యము (బంగారము) వంటి ధ్యానించువారల హృదయంబున ప్రకాశించువాండు.

(2) లేక, స్వర్ణనిధికి సమమైనవాడు. (412.)

## 413. శత్రుఘ్నః.

"శత్రూన్ హన్తీతి శత్రుఘ్నః" అట్లు ధ్యానించువారలకు విరోధులగు శబ్దాదివిషయంబులను రావణుని చంపినట్లు చంపువాడు.

## 414. వ్యాప్తః. 415. వాయుః. 416. అధోక్షజః.

వ్యాప్తః = వ్యాపించినవాడు. వాయుః = పోవువాడు. అధోక్షజః = తగ్గకుండువాడు.

---

* దశేన్ద్రియాననం ఘోరం యో మనోరజనీచరమ్ । వివేకశరజాలేన శమం నయతి యోగినామ్ * (సా. సం.) [యోగులయొక్క, ఇంద్రియంబులు అను పదిముఖములతోఁగూడిన ఘోరమైన మనసు అను రాక్షసుని (రావణుని) ఎవడు వివేకము అను బాణసమూహంబుచే విషయంబున శమింపజేయునో;] (413)

## 414. వ్యాప్తః.

" వ్యాప్నోతీతి వ్యాప్తః " బాల - వృద్ధ - శత్రు - మిత్ర - సేవకాది సమస్తులయందును సమమైన వాత్సల్యము గలవాడగుటచే అంతట వ్యాపించినవాఁడు.

* పౌరాన్ స్వజనవన్నిత్యం కుశలం పరిపృచ్ఛతి । పుత్రేష్వగ్నిషు దారేషు ప్రేష్య శిష్యగణేషుచ * (రా. అ. 2-37) [రాముఁడు, పట్టణంబున వసించువారలను తన జనంబులనువలె, పుత్ర - అగ్ని - పత్ని - సేవక - శిష్యుల విషయంబున కుశల ప్రశ్నము గావించును.] * రిపూణామపి వత్సల * (రా. యు. 50-56) [శత్రువుల యందును ప్రీతిగలవాఁడా!] (414)

## 415. వాయుః.

" వాతీతి వాయుః " తానే యచ్చటచ్చట వారలుండు స్థలంబులకు నేగువాఁడు.

* సోఽభ్యగచ్ఛన్మహాతేజాః శబరీం శత్రుసూదనః * (రా. బా. 1. 57) [శత్రువులను సంహరించు మహాతేజస్వియగు రాముడు శబరియుండు స్థలంబునకు నేగెను.] * భరద్వాజాశ్రమంగత్వా * (రా. బా. 1-87) [రాముడు భరద్వాజాశ్రమంబునకు నేగి] * గుహమాసాద్య ధర్మాత్మా * (రా. బా. 1-29) [రాముఁడు గుహుని జెంది.] (415.)

## 416. అధోక్షజః.

"అధః న క్షీయతే జాతు ఇతి అధోక్షజః" * అధో న క్షీయతే జాతు యస్మాత్తస్మాదధోక్షజః * (భా. ఉ. 89-10) అను నిరుక్తరీతిగ, అందఱచేతను సదా అనుభవింపబడుచునుండియు అమృతసముద్రమువలె కొంచమైనను తగ్గకుండువాడు.

* అక్షయ్యం మధుహన్తారమ్ * (చూ. నామము. 403) * అక్షయ్యా కీర్తిశ్చ...* (చూ. నామము. 405) (416.)

417. ఋతుః. 418. సుదర్శనః.
419. కాలః. 420. పరమేష్ఠీ.

ఋతుః = గుణములతో గూడినవాడు. సుదర్శనః = చూడదగినవాడు.
కాలః = చేర్చుకొనువాడు. పరమేష్ఠీ = పరమపదంబుననుండు వాడు.

---

## 417. ఋతుః.

"ఋచ్ఛతీతి ఋతుః" సదా నూతనములై అందఱకు నుల్లాసకరంబులైయుండు గుణంబులతో గూడినవాడు.

* ఘర్మాభితప్తాః పర్జన్యం హ్లాదయన్తమివ ప్రజాః * (రా. అ. 3. 26) [గ్రీష్మకాలంబున తపించియుండు వారలు మేఘంబును చూచునట్లు, రామునెంత చూచినను దశరథుఁడు తృప్తినొందఁడయ్యె.] (417.)

## 418. సుదర్శనః.

"శోభనం దర్శనం యస్యాసః సుదర్శనః" గుణస్వభావంబులెఱుంగని వారలకుంగూడ తనదర్శనమే శుభముగానుండువాఁడు.

* సోమవత్ ప్రియదర్శనః * (రా. బా. 1. 18.) [చంద్రునివలె ఇంపైన దర్శనముగలవాడు.] (418.)

## 419. కాలః.

"కలతే సంకలితం భవతి అస్మిన్నితి ఇతి కాలః" ఇట్టితనయాత్మ గుణంబులచే చరాచరంబులను తనయందు చేర్చుకొనువాఁడు. (419.)

## 420. పరమేష్ఠీ.

"పరమే తిష్ఠతీతి పరమేష్ఠీ" ఇట్లు ఇచట రావణుని వేటాడియు, లోకంబును రక్షించియు విహరించి మళ్ళి పరమస్థానంబగు వైకుంఠంబున నుండువాఁడు.

* వివేశ వైష్ణవం తేజః సశరీరః సహానుగః * (రా. ఉ. 110_12.) [వైష్ణవంబగు తనజ్యోతికి (స్థానమునకు) తమ్మునితో ఆ శరీరంబుతోనే యేగెను.]
* ఏవమేవ మహాబాహుః ఇక్ష్వాకుకులవర్ధనః । రావణం సగణం హత్వా దివమాక్రమితా ప్రభుః * (భా. స. 55_47.) [ఇట్లీరాముడు రావణుని సేనలతోఁచంపి పరమపదంబునకు నేగగలడు.] (420.)

421. పరిగ్రహః. 422. ఉగ్రః.
423. సంవత్సరః. 424. దక్షః.

పరిగ్రహః = పరిగ్రహించువాడు. ఉగ్రః = ఉగ్రుడు. సంవత్సరః = ఆదిశేషునిమీద వసించువాడు. దక్షః = శీఘ్రముగా నుండువాడు.

---

## 421. పరిగ్రహః.

" పరితః గ్రహః యస్యసః పరిగ్రహః " తనసంబంధమునొందిన పురవాసులును గ్రామవాసులునగు ప్రాణులు వారలసంబంధమునొందిన దేవతలు చెట్లు తీగలు మున్నగు వానికిని పరమపదంబునిచ్చినవాడుగాన అంతట అనుగ్రహించినవాఁడు.

(అవతారిక.) ఇక తన శీలగుణంబున కసాధ్యులగు దుష్టులను శిక్షించు పాతాళవాసియగు కల్కి వృత్తాంతము చెప్పబడును.

## 422. ఉగ్రః.

" ఉచ్యతీతి ఉగ్రః " యుగాంతమున పాపములతిశయించి వర్ణాశ్రమ వ్యవస్థలన్నియు నశించునపుడు ఉగ్రముగా ప్రకాశించువాఁడు.

* కల్కిచ విష్ణుర్భగవాన్ నష్టధర్మావతారకృత్ । ఉర్వ్యాం మ్లేచ్ఛగణం హత్వావస్థితోయః కలౌయుగే * (పా. సం.) [భూమిలో ధర్మములన్నియు నశించినపుడు భగవంతుడగు విష్ణువు కల్క్యవతారమునెత్తి మ్లేచ్ఛగణములనుచంపి కలియుగముననుండగలడు.] (422.)

## 423. సంవత్సరః. (92)

" సంవసతీతి సంవత్సరః " పాతాళమున సంహారమునకువలసిన పరికరములతో సమయము నెదురుచూచుచు ఆదిశేషునిమీదనుండువాఁడు.

* అనన్తశయనారూఢమ్.........చక్రాద్యాయుధ బృన్దేన మూర్తేన పరివారితమ్ * (సా. సం. 12-169.) [అనంతుండను శయనముననుండి సశరీరములగు చక్రాద్యాయుధములచే చుట్టబడినవానిని ధ్యానింతము.] (423.)

## 424. దక్షః. (917)

" దస్యువధే దక్షతే ఇతి దక్షః " దొంగలగుమ్లేచ్ఛులను సంహరించు విషయమున శీఘ్రముగానుండువాడు.

* క్షిప్రకారీ జనార్దనః * [జనార్దనుడు శీఘ్రముగా చేయువాఁడు.] (424.)

425. విశ్రామః. 426. విశ్వదక్షిణః. 427. విస్తారః.

విశ్రామః = విశ్రాంతినొందుస్థలము. విశ్వదక్షిణః = (1) అందఱియందును దాక్షిణ్యముగలవాడు. (2) భూమిని దక్షిణగానిచ్చినవాడు. విస్తారః = విస్తరింపజేయువాడు.

---

## 425. విశ్రామః.

"విశ్రమయతీతి విశ్రామః" పాపమును పాపఫలమును అనుభవించి దానిచే శ్రాంతులగు ప్రాణులకు ఆలసటను తీర్చుకొను స్థలము. (425.)

(అవతారిక.) అపచారమునొందినవారల విషయమున హితముచేయు విధమును చెప్పుచున్నారు:—

## 426. విశ్వదక్షిణః.

(1) "విశ్వస్మిన్ దక్షతే ఇతి విశ్వదక్షిణః" ఇష్టములనొనరించినవారలు అనిష్టములనొనరించినవారలు అనునందఱియందును దాక్షిణ్యముగలవాఁడు. అపకారులను క్షమించుటయే దాక్షిణ్యమనబడును. * స ఇమం సకలం లోకం ప్రసాదముపనేష్యతి * (భా. అర. 190-96.) [వాఁడీ సమస్త లోకములను ప్రసన్నత నొందింపగలఁడు.]

(2) లేక, "అశ్వమేధే విశ్వం దక్షిణా యస్యసః విశ్వదక్షిణః" అశ్వమేధయాగమున భూమిని బ్రాహ్మణులకు దక్షిణగా నిచ్చినవాఁడు. * తతశ్చోరక్షయం కృత్వా ద్విజేభ్యః పృథివీమిమామ్ । వాజిమేధే మహాయజ్ఞే విధివత్సంవిధాస్యతి * (భా. అ. 191-1.) [పిమ్మట ఈ కల్కిమూర్తి చోరులను జంపి తాఁజేయు అశ్వమేధ యాగమున బ్రాహ్మణులకు ఈ భూమిని దానముచేయగలఁడు] (426.)

## 427. విస్తారః.

కలిబలంబును తొలగించి కృతయుగమును ప్రవర్తింపజేయ వేదమర్యాదను విస్తరింపజేసినవాఁడు.

* తతోఽధర్మవినాశోవై ధర్మవృద్ధిశ్చ భారత । భవిష్యతి కృతేప్రాప్తే క్రియావాంశ్చ జనస్తథా * (భా. అ. 191-7.) [భారతా! అనంతరము కృతయుగము వచ్చినంతనే అధర్మవినాశమును, ధర్మవృద్ధియుఁగల్గును. అటులే మనుష్యులును సత్కార్యములను జేయువారలగుదురు.] (427.)

428. స్థావరస్థాణుః. 429. ప్రమాణమ్. 430. బీజమవ్యయమ్.
431. అర్థః. 432. అనర్థః.

స్థావరస్థాణుః = స్థాపించి శమించువాడు ప్రమాణమ్ = వ్యవస్థను గావించువాడు. అవ్యయంబీజమ్ = నాశములేనికారణము. అర్థః = పురుషార్థముగా నుండువాడు. అనర్థః = ప్రార్థింపబడకుండువాడు.

---

## 428. స్థావరస్థాణుః.

"స్థావరశ్చాసౌ స్థాణుశ్చ స్థావరస్థాణుః" ఇట్లు ధర్మమును స్థాపించి పిమ్మట శమించువాడు.

## 429. ప్రమాణమ్. (959)

"ప్రమీయతే అనేనేతి ప్రమాణమ్" పిమ్మట కృతయుగములోని ప్రాణులకు ఇది హితము, ఇది అహితము అను వ్యవస్థను గావించువాఁడు. ఈ శక్తిలేశము చేతనే ప్రత్యక్షాదులును ప్రమాణములగుచున్నవి.

* తచ్ఛీలమనువర్తన్తే మనుష్యాః లోకవాసినః * (భా. అర. 191_3.) [లోకమున వసించు మనుష్యులు వాని శీలమునను సరింతురు.] (429.)

## 430. బీజమవ్యయమ్.

ఇట్లు కలియుగాది దుష్కాలములందు ధర్మమార్గము నశించినప్పుడు ఆ ధర్మమును మఱల అంకురింపజేయుటచే నాశములేని బీజముగానుండువాడు. (430.)

## 431. అర్థః.

"అర్థ్యతే ఇతి అర్థః" అనన్యప్రయోజనులై భక్తిని మాత్రము అవలంబించిన ఉత్తమాధికారికి తానే పురుషార్థముగానుండువాఁడు.

* జ్ఞానవాన్మాం ప్రపద్యతే। వాసుదేవస్సర్వమ్ * (గీ. 7_19.) [జ్ఞానముగలవాడు నన్ను పొందగలఁడు. 'వాసుదేవుఁడే సర్వము' అనియుండు మహనీయుఁడు దుర్లభుఁడు.] (431.)

## 432. అనర్థః.

"న అర్థ్యతే ఇతి అనర్థః" అల్పసుకృతమొనర్చిన అర్థకామపరులు క్షుద్రఫలముల నపేక్షించుటచేత వారలచే స్వయంపురుషార్థమగు తాను ప్రార్థింపబడకుండువాడు. (432.)

433. మహాకోశః. 434. మహాభోగః.

435. మహాధనః. 436. అనిర్విణ్ణః.

మహాకోశః = గొప్పబొక్కసములంగలవాడు. మహాభోగః = మహాభోగములం గలవాడు. మహాధనః = అధిక ధనముగలవాడు. అనిర్విణ్ణః = విరామము లేకుండువాడు.

---

## 433. మహాకోశః.

"మహాన్తః కోశాః యస్యసః మహాకోశః" ఎల్లప్పుడును అంచఱకును ఎన్ని విధములుగా నిచ్చియు తగ్గకుండుటచే పెద్దవియగు శంఖపద్మాదినిధులు సముద్రము మేరుపర్వతము మున్నగువానిని బొక్కసముగాఁగలవాఁడు. (433.)

## 434. మహాభోగః.

"మహాన్ భోగః యస్మాత్సః మహాభోగః" అర్థముచే సాధింపదగిన భోగమును తనచేతనే విశేషముగా లభించునట్లుండువాఁడు.

* లభతేచ తతః కామాన్ మయైవ విహితాన్ హితాన్ * (గీ. 7-22.) [ఆ దేవతల మూలముగా వీని యభీష్టములును నాచేతనే యొసఁగఁబడును.] (434.)

## 435. మహాధనః.

"మహత్ ధనం యస్యసః మహాధనః" అమితమగు ధనముగలవాఁడు. దీనిని ప్రహ్లాదులు వివరించిరి :—

* మరీచిమిశ్రైః దక్షేణ తథైవాన్యైరనన్తతః । ధర్మః ప్రాప్తస్తథాచాన్యైః అర్థః కామస్తథా పరైః * (వి. పు. 1. 18. 23.) [మరీచి దక్షుఁడు మున్నగు అనేకులు ఆ భగవంతునుండి ధర్మమును బొందిరి. అటులే ఇతరులనేకులు అర్థమును బొందిరి. అటులే కామంబునుగూడ పలువురు లభించిరి.] (435.)

## 436. అనిర్విణ్ణః. (893)

"న నిర్విణ్ణః అనిర్విణ్ణః" ఇట్లు సృష్ట్యాదులను ఆయా యభీష్టదానములను మాటిమాటికి చేయుచునుండియు, సంసారులు శబ్దాదివిషయములందుగల ప్రీతిచే తన్ను అలక్ష్యము చేసినను, తాఁజేసిన కృషి నిష్ఫలంబయిననుగూడ మళ్ళి వారలను స్వాధీనము చేయనగునో యేమో అనునాశచే విరామములేక మరల ప్రయత్నించువాఁడు. కనుకనే వీనికి జగద్వ్యాపారము ఎడతెగకుండును.

* అవ్యుచ్ఛిన్నాస్తతస్త్వేతే సర్గస్థిత్యన్తసంయమాః * (వి. పు. 1-9-1.) [ఈ సృష్టి స్థితి సంహారములు ఎడతెగక అనాదిగా నడుచుచున్నవి.] (436.)

437. స్థవిష్ఠః.　438. భూః.　439. ధర్మయూపః.
440. మహామఖః.　441. నక్షత్రనేమిః.

స్థవిష్ఠః = బలిసినవాడు. భూః = సర్వాధారుడు. ధర్మయూపః = ధర్మమును చేర్చుకొనువాడు. మహామఖః = పూజ్యమగు యజ్ఞంబును అవయవముగా గలవాడు. నక్షత్రనేమిః = జ్యోతిశ్చక్రంబును ప్రవర్తింప జేయువాడు.

---

## 437. స్థవిష్ఠః. (53)

నక్షత్ర మండలంబను శింశుమారచక్రరూపిరై బలిసియుండువాఁడు.

* తారామయం భగవతః శింశుమారాకృతి ప్రభోః * (వి. పు. 2_9_1) [భగవంతునియొక్క శింశుమారమను మొసలియాకారముగల చక్రము నక్షత్రమయముగా నుండును.] (437.)

## 438. భూః.

"ధ్రువానుబంధేన సర్వాధారో భవతీతి భూః" ధ్రువునకే ఆధారముగా నుండుటచే సర్వాధారమైనవాఁడు.

* తస్య పుచ్ఛే ధ్రువః స్థితః * (వి. పు. 2_9) [దాని పుచ్ఛమున (తోకలో) ధ్రువుడు గలఁడు.] (438.)

## 439. ధర్మయూపః.

"ధర్మం యౌతీతి ధర్మయూపః" ధర్మమను తత్వమును శిరసుగా చేర్చుకొనువాఁడు.

* ధర్మోమూర్ధాన మాశ్రితః * [ధర్మము వీని శిరస్సును పొందియున్నది.]
* తచ్ఛిరో ధర్మః * [వాని శిరస్సు ధర్మము.] (439.)

## 440. మహామఖః.

"మహాన్ మఖః అవయవః యస్యసః మహామఖః" ధర్మమును శరీరముగా గలవాడగుటచే పూజ్యమగు యజ్ఞమును అవయవముగా గలవాఁడు. (440.)

## 441. నక్షత్రనేమిః.

"నక్షత్రం నయతీతి నక్షత్రనేమిః" జ్యోతిశ్చక్రమును ప్రవర్తింప జేయువాఁడు.

442. నక్షత్రీ. 443. క్షమః.

444. క్షామః. 445. సమీహానః.

నక్షత్రీ = నక్షత్ర స్వరూపి. క్షమః = వహించువాడు. క్షామః = కొఱతబడిన వాడు. సమీహానః = నియమించువాడు.

---

* ఏష భ్రమన్ భ్రామయతి చన్ద్రాదిత్యాదికాన్ గ్రహాన్ । భ్రమన్తమను తం యాన్తి నక్షత్రాణిచ చక్రవత్ * (వి. పు. 2-9-2) [వీఁడు తాను చుట్టుచు చంద్రసూర్యాదిగ్రహములను చుట్టించును. అట్లు చుట్టువానిని నక్షత్రములు చక్రమువలె అనుసరించుచున్నవి.] (441)

## 442. నక్షత్రీ.

"నక్షత్రమ్ అస్మిన్నస్తీతి నక్షత్రీ" శింశుమారాకారమగు నక్షత్రరూపము ధరించినవాడు.

* శింశుమారాకృతిప్రోక్తం యద్రూపం జ్యోతిషాందివి । నారాయణోఽయనం ధామ్నామ్ తస్యాధారః స్వయం హృది * (వి. పు. 2-9-4) [జ్యోతిర్గణములకు పైగా శింశుమార చక్రముండునట్లు ఏది చెప్పబడునదో; దానికాధారమై దాని హృదయమున సకలతేజోనియంతయగు నారాయణుఁడు ప్రకాశించుచున్నాఁడు.] (442.)

## 443. క్షమః.

"క్షమతే ఇతి క్షమః" ఇట్లు సమస్తభూభారమును అనాయాసముగా వహించువాడు. (443.)

## 444. క్షామః. (858)

అవాంతరప్రళయమున ఇతర నక్షత్రములు నశించినప్పుడు నాలుగు నక్షత్రములతో మాత్రము ధ్రువసమీపంబున నుండునని విష్ణుపురాణంబున చెప్పినట్లు అవాంతరప్రళయకాలమున నక్షత్రాంతరములచేఁ గొఱతబడినవాఁడు.

* తారకాః శింశుమారస్య నాస్తమేతి చతుష్టయమ్ * (వి. పు. 2-9-5) [శింశుమారచక్రముయొక్క నాలుగు నక్షత్రములు నశింపవు.] * యావన్మాత్రే ప్రదేశేతు మైత్రేయా ఽవస్థితో ధ్రువః । క్షయమాయాన్తి తావత్తు భూమేరాభూతసంప్లవే * (వి. పు. 2-8-97) [అవాంతర ప్రళయకాలమున ధ్రువుఁడుండు ప్రదేశము వఱకు నశించుచున్నయవి.] (444.)

## 445. సమీహానః.

"సమీహయతి ప్రేషయతీతి సమీహానః" అనంతరము సృష్టిలో అందఱను సదా ఆయాయధికారములందు నియమించువాఁడు. (445.)

446. యజ్ఞః. 447. ఇజ్యః।
448. మహేజ్యః. 449. క్రతుః.

యజ్ఞః = యజ్ఞస్వరూపి. ఇజ్యః = ఆరాధింపబడువాడు. మహేజ్యః = మహాయజ్ఞస్వరూపి. క్రతుః = ఆరాధింపబడువాడు.

---

## 446. యజ్ఞః. (971)

యజ్ఞముగాను యజ్ఞసాధనముగాను చెప్పబడుటచే యజ్ఞస్వరూపి.

* ఇజ్యాఫలస్య భూరేషా ఇజ్యాచాత్ర ప్రతిష్ఠితా * [యజ్ఞమునకుత్పత్తిస్థానము వీడు. యజ్ఞమును వీనిచేతనే స్థిరంబగును.] * యజ్ఞోవై విష్ణుః * (య. వే.) [విష్ణువు యాగస్వరూపి.] (446)

## 447. ఇజ్యః.

"ఇజ్యామర్హతీతి ఇజ్యః" కామ్యఫలములను కోరువారలచే ఇంద్రాదిద్వారా ఆరాధింపబడువాఁడు.

"యే యజన్తి పితౄన్ దేవాన్ బ్రాహ్మణాన్ సహుతాశనాన్ । సర్వభూతాన్తరాత్మానం విష్ణుమేవ యజన్తి తే * (భా. శా. 348_29) [ఎవరు పితృ-దేవతా-బ్రాహ్మణ-అగ్నులను ఆరాధింతురో; వారు సర్వభూతములకును అంతరాత్మయగు విష్ణువునే ఆరాధించుచున్నారు.] * యేఽప్యన్యదేవతాభక్తాః యజన్తే శ్రద్ధయాన్వితాః । తేఽపిమామేవ కౌన్తేయ యజన్త్యవిధి పూర్వకమ్ * (గీ. 9_23) [అర్జునా! ఎవ్వరు ఇతరదేవతలకు భక్తులై భక్తితో ఆదేవతల నారాధింతురో; వారు గూడ మార్గముతప్పినవారైనను (అనగా పరంపరగానైనను) నన్నే ఆరాధింతురు. (447.)

## 448. మహేజ్యః.

"మహతీ ఇజ్యా యస్యసః మహేజ్యః" కామమున నిచ్ఛలేని విలక్షణాధికారులు సాక్షాత్తుగా తన్ను ఆరాధించుటనే మహాయజ్ఞముగాగలవాడు.

* యేతు సర్వాణికర్మాణి మయి సన్న్యస్య మత్పరాః । అనన్యేనైవయోగేన మాం ధ్యాయన్త ఉపాసతే * (గీ. 12_6) [ఎవరు సర్వకర్మములను నాకు సమర్పించి మత్పరులై నిష్కాములై నన్ను ఉపాసింతురో; వారలకు సంసారమును తొలగింతును.] (448.)

## 449. క్రతుః.

"క్రియతే ఇతి క్రతుః" అగ్నిష్టోమము మున్నగు యాగములచే నారాధింపబడువాఁడు. (449.)

450. సత్రమ్. 451. సతాంగతిః. 452. సర్వదర్శీ.
453. నివృత్తాత్మా. 454. సర్వజ్ఞః.

సత్రమ్ = సత్రయాగంబుచే నారాధింపబడువాడు. సతాంగతిః = సత్తులకు గతియైనవాడు. సర్వదర్శీ = ప్రవృత్తి ధర్మనివృత్తి ధర్మములను చూచువాడు. నివృత్తాత్మా = మఱలిన మనస్సును గలవాడు. సర్వజ్ఞః = తన్నెఱింగినవాడు.

---

## 450. సత్త్రమ్.

"సతతం సీదతీతి సత్త్రమ్" బహుకాలము అనేక యజమానులుగూడి మాసోపవాసాదులచే చేయదగిన సత్త్రయాగంబుచే ఎల్లప్పుడును ఆరాధింపబడిన వాఁడు. (450.)

(అవతారిక.) ఇట్లింతవఱకు ప్రవృత్తి ధర్మనిష్ఠులగతి చెప్పబడియె. ఇక నివృత్తి ధర్మనిష్ఠులగతి చెప్పబడును.

## 451. సతాంగతిః. (186)

నివృత్తి ధర్మనిష్ఠులగు సత్తులకు గతియైనవాఁడు.

* నిర్ధూత దోషపఙ్కానాం యతీనాం సంయతాత్మనామ్। స్థానం తత్ పరమం విప్ర పుణ్యపాప పరిక్షయే॥ (వి. పు. 2-8-99) [విప్రా! దోషమను పంకమును కడిగి యత్నశీలురగు దృఢమనస్కులకు పుణ్యపాపములు నశింపగా ఆపరమ పదము లభించును.] (451.)

## 452. సర్వదర్శీ.

"సర్వౌ ద్వివిధావపి ప్రవృత్తినివృత్తిధర్మౌ ద్రష్టుమ్ శీలమస్యేతి సర్వదర్శీ" ప్రవృత్తిధర్మ-నివృత్తి ధర్మములను అధ్యక్షుఁడై చూచువాఁడు. (452.)

(అవతారిక.) ఇక నివృత్తి ధర్మాచార్యులగు నరనారాయణావతారము చెప్పబడును.

## 453. నివృత్తాత్మా. (231-604-780)

"నివృత్తః ఆత్మా యస్యసః నివృత్తాత్మా" పరమ వైరాగ్యమును ప్రకటించుటకై విషయములనుండి మనస్సును మఱలించినవాఁడు. (453.)

## 454. సర్వజ్ఞః. (821)

"ఆత్మానం సర్వం జానాతీతి సర్వజ్ఞః" అటులే సర్వప్రకారములచేతను సర్వాంతర్యామిగా తన్నెఱింగినవాఁడు. (454.)

455. జ్ఞానమ్ ఉత్తమమ్. 456. సువ్రతః.
457. సుముఖః. 458. సూక్ష్మః.

ఉత్తమంజ్ఞానమ్ = ఉత్తమజ్ఞానస్వరూపి. సువ్రతః = మంచి వ్రతములను అనుష్ఠించువాడు. సుముఖః = అందమగు ముఖములం గలవాడు. సూక్ష్మః = సూక్ష్మస్వరూపి.

---

## 455. ఉత్తమమ్ జ్ఞానమ్.

ఉత్తమములగు వైష్ణవధర్మములన్నియు నెఱింగిన జ్ఞానస్వరూపి.

* పఠన్తమనిశం శాస్త్రం పాఞ్చరాత్ర పురస్సరమ్ * [పాంచరాత్రాది శాస్త్రములను సదా పఠించు వానిని.] (455.)

## 456. సువ్రతః. (824)

"శోభనం వ్రతం యస్యసః సువ్రతః" * న మే పార్థాఽస్తి కర్తవ్యమ్ * (గీ. 3. 22) [అర్జునా! నాకు కర్తవ్యము అనునదియే లేదు.] అనినట్లు స్వార్థముగాక పరార్థమై చేయుచుండుటచే మంచి వ్రతముల ననుష్ఠించువాడు.

* ఏకపాదేన తిష్ఠన్త మాహర న్తఞ్చ మారుతమ్। పక్షమాసోపవాసాంశ్చ దిశన్త మనుచిన్తయేత్ * [ఒక పాదంబుతో నిలిచి వాయుభక్షణము గావించి పక్షమాసోపవాసంబుల ననుష్ఠించువానిని సదా చింతింపగలడు.] (456.)

## ¶ 457. (*a*) సుముఖః.

"శోభనం ముఖం యస్యసః సుముఖః" జపాదుల ననుష్ఠించునపుడు వికారము లేని అందమగు ముఖము గలవాఁడు.

* ఓఙ్కారలక్షణం మన్త్రం జపన్నాన్తరలక్షితమ్ * [ఓఙ్కారంబుతో గూడిన మంత్రంబును లోపలనే జపించుచునుండువానిని] * కృష్ణాయ కమలదలామల నేత్రాయ * [తామరపాకువలె నిర్మలమైన నేత్రములంగల కృష్ణునికొఱకు.] (457.)

## 458. (*a*) సూక్ష్మః.

తనకుదానే సూక్ష్మస్వరూపంబును సాక్షాత్కరించినవాడు. (458.)

---

¶ నామము 457 మొదలు 463 వఱకు అమృత మథనపరముగాగూడ భాష్య ముండుటచే *a*, *b* అను గుర్తు వేయబడియె. (రెండవయర్థము 195-వ పుటలో.)

459. సుఘోషః. 460. సుఖదః. 461. సుహృత్.
462. మనోహరః. 463. జితక్రోధః.

సుఘోషః = మంచి ఘోషముగలవాడు. సుఖదః = సుఖంబు నిచ్చువాడు. సుహృత్ = మంచి మనసుగలవాడు. మనోహరః = మనస్సును హరించువాడు. జితక్రోధః = కోపంబును జయించినవాడు.

---

## 459. (*a*) సుఘోషః.

“ శోభనః ఘోషః యస్యసః సుఘోషః ” ఉపనిషత్సంబంధమగు మంచి ఘోషంబును గలవాడు. (459.)

## 460. (*a*) సుఖదః. (890)

“ సుఖం దదాతీతి సుఖదః ” ఇట్లు సదాచారంబగు సమాధిని అనుష్ఠింప జేయుటచే ఆనిష్ఠనుగల వారలకు ఫలమగు పరమసుఖంబు నిచ్చువాఁడు. (460.)

(అవతారిక.) వీ డిట్లు పరోపకారశీలుఁడుగా నుండుటకుఁగారణం బేమనఁగా :—

## 461-(*a*) సుహృత్.

“ శోభనం హృదయం యస్యసః సుహృత్ ” ఉపకారంబునొనరింపకుండు వారల విషయంబునగూడ ‘ వీనికేమి మూడునో ; మన మేమిచేయ వచ్చును ’ అని శుభంబునుగోరు మంచి మనసుగలవాఁడు. (461.)

## 462-(*a*) మనోహరః.

“ మనః హరతీతి మనోహరః ” వీ డిట్లు స్వతః మంచిమనసుగలవాడగుటచే వారల మనసును అపహరించినవాఁడు. (462.)

## 463-(*a*) జితక్రోధః.

“ జితః క్రోధః యేనసః జితక్రోధః ” వారల కోపాదులను జయించినవాడు.

లేక, "సుముఖః" (నామము. 457) మొదలు "జితక్రోధః" (463) అను నింతవఱకు అమృతమథన పరముగాగూడ అర్థము చెప్పవచ్చును.

అమృత మథన కాలంబున:—

## 457-(b) సుముఖః

❖ ఆనన్దామృతసమ్పూర్ణ వదనేన్దుకాన్తినా । కలశాకృతిరూపేణ కరస్థేన విరాజితమ్ ❖ [ఆనందంబను అమృతము నిండియుండు చంద్రునివలె ప్రకాశించు ముఖారవిందంబుతో అమృతకలశంబును ధరించియుండువాఁడు.] అనినట్లు అందమగు ముఖమునుగలవాఁడు.

## 458-(b) సూక్ష్మః.

అసురవిషయంబున గూఢమగు నభిప్రాయము గలవాడగుటచే సూక్ష్ముఁడు.

## 459-(b) సుఘోషః.

దేవాసురఘోషమును, మథించునపుడు గల్గు ఘోషమును చేరియుండుటచే అద్భుతమైన ఘోషముగలవాఁడు.

## 460-(b) సుఖదః.

దేవతలకు సుఖంబు నిచ్చినవాఁడు.

## 461-(b) సుహృత్.

దానికి గారణంబగు మంచి హృదయముగలవాఁడు.

## 462-(b) మనోహరః.

❖ త్రైలోక్యవిస్మయకరం కాన్తాకృతిధరం స్మరేత్ ❖ [మూల్లోకంబునకును ఆశ్చర్యకరుండగు సుందరాకారుని స్మరింపగలఁడు.] అనినట్లు అసురులయొక్క మనసును అపహరించినవాఁడు.

## 463. (b) జితక్రోధః.

తనయందు ఆశ్చర్యంబును ప్రదర్శించి రాక్షసులకు దేవతలమీదనుండు కోపంబును జయించినవాఁడు.

464. వీరబాహుః. 465. విదారణః. 466. స్వాపనః.
467. స్వవశః. 468. వ్యాపీ. 469. నైకాత్మా.

వీరబాహుః = పరాక్రమముగల బాహువులం గలవాడు. విదారణః = చీల్చినవాడు. స్వాపనః = నిద్రింపజేయువాడు. స్వవశః = ఇష్టప్రకారము నడచువాడు. వ్యాపీ = వ్యాపించినవాడు. నైకాత్మా = అనేకరూపి.

---

## 464. వీరబాహుః.

"వీరాః బాహవః యస్యసః వీరబాహుః" రత్నమయములగు కంకణములు కేయూరములు (బాహుపురి) మొదలు మున్నగునవి చలించునట్లు క్షీరసముద్రమథనములంబున సంభ్రమించు మహాపరాక్రమముగల బలిసిన బాహువులంగలవాడు. (464.)

## 465. విదారణః.

"విదారయతీతి విదారణః" దివ్యాయుధంబుచే రాహుమున్నగువారిని జీల్చినవాడు.

## 466. స్వాపనః.

"స్వాపయతీతి స్వాపనః" అట్లు నశింపగా మిగిలియుండువారలను అందంబగు తనమందహాసము కటాక్షము భ్రూవిలాసము వీనిచే పరవశులై నిద్రింపజేయువాడు. అనగా మైమఱచునట్లు చేయువాడు. (466.)

## 467. స్వవశః.

"స్వస్య వశః స్వవశః" వారిట్లు నిద్రింపగా (మైమఱచి యుండగా) తమ భక్తులగు దేవతలతో యథేష్టముగా విహరించువాడు. (467.)

## 468. వ్యాపీ.

"వ్యాప్తుం శీలమస్యేతి వ్యాపీ" దేవతలు మందరపర్వతము వాసుకి మున్నగువారలకు శక్తి తగ్గినప్పుడు వారు తన శక్తిచే విశ్రమించునట్లు వారలయందు వ్యాపించినవాడు. (468.)

## 469. నైకాత్మా.

"నైకే ఆత్మానః యస్యసః నైకాత్మా" అక్కాలంబున బ్రహ్మరూపముగాను, కూర్మరూపముగాను, మోహినిరూపముగాను ఇట్లనేకరూపంబులతోనుండినవాడు.

470. నైకకర్మకృత్. 471. వత్సరః.
472. వత్సలః. 473. వత్సీ.

నైకకర్మకృత్ = అనేక కార్యములను ఒనరించినవాడు. వత్సరః = వసించువాడు. వత్సలః = ప్రీతిగలవాడు. వత్సీ = ఆత్మవర్గమును గలవాడు.

---

## 470. నైకకర్మకృత్.

"నైకాని కర్మాణి కరోతీతి నైకకర్మకృత్" సముద్రమథనకాలంబున మందరపర్వతంబును ధరించియు, అసురులను చంపియు, దేవతలకు అమృతంబు నిచ్చియు నిట్లు అనేక కార్యములనొనరించినవాఁడు. (470.)

(అవతారిక.) ఇక ధర్మ స్వరూపిని చెప్పుచున్నారు:—

## 471. వత్సరః.

"వసతీతి వత్సరః" పురుషార్థములను వ్యవస్థపఱుచుటకై అందఱి హృదయంబునను వసించుచుండువాఁడు. (471.)

(అవతారిక.) దీనికి గారణంబేమనగా:—

## 472. వత్సలః.

"వత్సాః అస్య సన్తీతి వత్సలః" దూడలగు అనగా తనయందు ప్రీతిగల చేతనులను ప్రేమించువాఁడు. చేతనులతో బహుకాలముగా వీనికి పరిచయముండియు, ఆచేతనుడు శరణంబనిమాత్రము (తనయొద్దకు) చేరినచో ఏకారణంబునకై వీడిట్లయ్యెనని విమర్శింపక అప్పుడీనిన దూడయందు ఆవు హుంకారంబుగలదై పాలుకాఱుపొదుగుగలదై ఏదిచేయవగునని యెఱుంగక తత్తఱపడునట్లు ఈతడు నగుచున్నాఁడు. ఇది రావణాదుల విషయంబున స్పష్టము.

* విదితస్సహి ధర్మజ్ఞః శరణాగతవత్సలః * (రా. సు. 20_20) [ధర్మజ్ఞుడగు రాముఁడు శరణాగతుల విషయంబున, ఆవుదూడయందు పడుపాటు పడునని ప్రసిద్ధముగదా?]

ఇట్టి యుదారశీలుండగు భగవంతునకు ఉపకరణంబగుటచేతనే సాధారణమగు ధర్మము (స్నేహము) నకు గూడ వాత్సల్యమనుపేరు గల్గెను. (472.)

## 473. వత్సీ.

"వత్సాః అస్య సన్తీతి వత్సీ" ఇట్లు నిత్యము తనచే పోషింపబడు ఆత్మవర్గములగు దూడలను అధికముగా గలవాఁడు. (473.)

474. రత్నగర్భః. 475. ధనేశ్వరః. 476. ధర్మగుప్.
477. ధర్మకృత్. 478. ధర్మీ.

రత్నగర్భః = విశేషధనమును గలవాడు. ధనేశ్వరః = ధనంబును ఇచ్చువాడు. ధర్మగుప్ = ధర్మమును రక్షించువాడు. ధర్మకృత్ = ధర్మమును చేయువాడు. ధర్మీ = ధర్మముగలవాడు.

---

## 474. రత్నగర్భః.

"రత్నం గర్భే యస్యసః రత్నగర్భః" ధనంబును గోరువారలకు నివ్వగల విశేషధనమును గలవాఁడు. (474.)

## 475. ధనేశ్వరః.

"ధనస్య ఈశ్వరః ధనేశ్వరః" వారు కోరు ధనంబును శీఘ్రముగా నిచ్చువాఁడు. (475.)

## 476. ధర్మగుప్.

"ధర్మం గోపాయతీతి ధర్మగుప్" ఇట్లు తానిచ్చిన అర్థకామ్యములు దుర్విషయంబున బోకుండ నివర్తింపించి వీనిచే ధర్మంబును గాపాడువాఁడు

* సాధుమార్గే స్థితానాఞ్చ సంయచ్ఛన్తం ధియాచ తౌ * [సాధుమార్గంబున నిల్చియుండువారలకు ఆరెంటిని ఆదరంబుతో నిచ్చువానిని...] (476.)

## 477. ధర్మకృత్.

"ధర్మం కరోతీతి ధర్మకృత్" ఇట్లందఱను ధార్మికులుగా జేయుటకై తనయనుగ్రహంబునకు గారణంబగు ధర్మంబును నిర్హేతుకముగా గల్గించుటచే ధర్మమును చేయువాఁడు.

* ధర్మసామాన్య మమలం అనాది నిధనం విభుమ్। దుర్లభం యత్ప్రబుద్ధానాం తత్ప్రసాదధియావినా * [సమస్తధర్మస్వరూపమై నిర్మలమై అద్యంతరహితమై సర్వవ్యాపకమైయుండు అది ఎట్టిజ్ఞానులకును తనసంకల్పములేనిచో దుర్లభముగా నుండును.] (477.)

## 478. ధర్మీ.

"ధర్మః అస్యాస్తీతి ధర్మీ" ప్రసిద్ధమై లోకంబున వ్యవహరింపబడు ధర్మము వీనికి సర్వసాధారణంబగునుపకరణం బగుటచే ధర్మమునుగలవాఁడు. (478.)

479. సత్. ¶　　480. అక్షరమ్‌సత్.
481. అసత్.　　482. క్షరమ్.

సత్ = సత్స్వరూపి (అనగా ఎల్లప్పుడునుండువాడు.) అక్షరమ్ = వికారము లేకుండువాడు. అసత్ = అసత్తుగా నుండువాడు. క్షరము = వికరించువాడు.

---

## 479. సత్.

ఈధర్మములచే సాధింపబడు భగవంతుడు సత్తుగానుండుటచే సచ్ఛబ్ద వాచ్యుడు. (479.)

## 480. (సత్) అక్షరమ్.

ఇట్లు నిత్యుడై నిరుపాధికసత్స్వభావయుక్తుడై సాధువైయుండుటచే తగ్గుట నశించుట మున్నగు వికారంబులు లేకుండువాఁడు.

* అపక్షయవినాశాభ్యాం పరిణామర్ధిజన్మభిః। వర్జితః శక్యతే వక్తుం యస్సదాఽస్తీతి కేవలమ్ * (వి. పు. 4-10.) [క్షయము (తగ్గుట), వినాశము, పరిణామము, సమృద్ధి, జన్మము మున్నగునవిలేక సదా కలఁడుగాన ఎల్లప్పుడును ఉండువాడు అనిమాత్రమే చెప్పనగును.]

క్షరమైనచో ఒకకాలమున నశించును. వీనికదిలేకుండుటచే అక్షరుఁడగును దీనినే * సదేవ సోమ్య ఇదమగ్ర ఆసీత్ * (ఛా. ఉ. 6. 2. 1.) అని శ్రుతిచెప్పెను

## 481. అసత్.

## 482. (అసత్) క్షరమ్.

హేయమగు భావంబుతో ఆశ్రయించినవారలవిషయంబున అసత్తుగాను క్షరముగాను ఉండువాడు. అసత్తులకు నిత్యమై నిరవధికమైయుండు సంసార భయంబునిచ్చుటచే ఇట్లు చెప్పబడియె. ఈ రెండు విషయంబులును శ్రుతి ప్రసిద్ధములు.

* ఏషఏవ సాధుకర్మ కారయతి; తం యమేభ్యో లోకేభ్య ఉన్నినీషతి। ఏషఏవ అసాధుకర్మ కారయతి; తం యమధో నినీషతి * (కౌ. ఉ. 3. 9.) [వీడు, ఎవనిని ఈ లోకంబునుండి ఉద్ధరింపగోరునో; వానిచే వీడే సత్కర్మములను చేయించును. ఎవనిని క్రింద పడద్రోయ గోరునో; వానిచే వీడే అసత్కర్మంబులను చేయించును.] (481-482.)

---

¶ ఇచ్చట శంకరభాష్యరీతిగా "సదసత్‌క్షరమక్షరమ్" అని పాఠము. భట్టరుల భాష్యరీతిగా "సదక్షరమసత్‌క్షరమ్" అని పాఠము. 'సత్' అనుటను ప్రత్యేకనామముగాను, 'అక్షరమ్' అనుదానితో చేర్చియు భాష్యము వ్రేసిరి.

483. అవిజ్ఞాతా. 484. సహస్రాంశుః. 485. విధాతా.

అవిజ్ఞాతా = ఎఱుంగకుండువాడు. సహస్రాంశుః = అమితమగు జ్ఞానముగల వాడు. విధాతా = విధించువాడు.

---

## 483. అవిజ్ఞాతా.

"న విజ్ఞాతా అవిజ్ఞాతా" సాధువుల (భక్తుల) యందు అనేకాపరాధంబులను చూచినను వారలను దండింపక క్షమించుటనుమాత్రమేగాదు, వారల యపరాధ ముండునట్లే ఎఱుంగకుండువాడు.

* ఉచ్యమానోఽపి పరుషం నోత్తరం ప్రతిపద్యతే. (రా. అ. 1-10) (రాముడు తన్నెవరు కఠినముగా బల్కినను బదులుచెప్ప నెఱుంగకుండును.] * సర్వజ్ఞతామేవ ముపాలభామహే త్వాంహ్యజ్ఞ ఏవాశ్రితదోషజోషణః * [నీ సర్వజ్ఞత్వము నిట్లు నిందించుచున్నాము. నీవు తెలియనివాడవే. ఏలయనగా, ఆశ్రితుల దోషంబుల నెఱుంగ కున్నావే.] అని కూరత్తాళ్వాను సాదించిరి.

కొందఱు 'పరమపురుషునకు జ్ఞానమాత్రమే యుండును. జ్ఞాతృత్వము లేదు. కనుకనే ఇచట 'అవిజ్ఞాతా' అని చెప్పబడియె' అని వ్యాఖ్యానించిరి. వారు శ్రుతి ఆచార్యసేవ ఔచిత్యము న్యాయము అను వీని నెఱుంగకుంచుటచే నిట్లుచెప్పిరి. వారల విషయంబున మనము దుఃఖింపవలయునేగాని, నిరసించుటయనవసరము. (483.)

## 484. సహస్రాంశుః.

"సహస్రమ్ అంశవః యస్యసః సహస్రాంశుః" అంశువనగా జ్ఞానము. అది అపరిమితముగా గలవాఁడు. అనగా సర్వజ్ఞుఁడు. ఆశ్రితుల యపరాధంబుల నెఱుంగ కుండు వీడెట్లు సర్వజ్ఞుడుకాగలడు? అని శంకింపవలదు. అపరాధంబుల నెఱుంగకుండుట యనఁగా; అపరాధంబులను గమనింపక ఉపేక్షించుటయే. ఇటులే భగవంతుడు పేక్షించును. * దోషో యద్యపి తస్య స్యాత్ * (రా. యు. 28-3) [వానికి దోషములుండినను నేను గమనించను.] అని తానే వచించెనుగదా?

* అపిచేత్ స దురాచారః భజతే మామనన్యభాక్। సాధురేవ స మన్తవ్యః * (గీ. 9-30) [నాభక్తుడెంతదురాచారపరుఁడయ్యు అన్యచింతలేక నన్నే పూజించు టచే వాడు సాధువుగానేయగును.] (484.)

## 485. విధాతా. (44)

"విదధాతీతి విధాతా" ఆశ్రితుల పాపంబులను గమనింపకుండినను ఆ పాప ఫలంబును ఆపాపమును అనుభవింపజేయు యమయాతనాదులును ఆశ్రితులును బాధింపవోయన్న; అవికూడ భగవంతునకధీనంబులగుటచే వీరలను బాధింపజాలవు. యముఁడే యిట్లు చెప్పియుండుటం జూడుడు.

## 486. కృతలక్షణః.

కృతలక్షణః = లక్షణమును ఏర్పాటు చేసియుండువాడు.

---

* అహమమరవరార్చితేనధాత్రా సమ ఇతి లోకహితాహితే నియుక్తః * (వి. పు. 3_7_15) [దేవశ్రేష్ఠులచే పూజింపబడు ఆ సర్వరక్షకుఁడు నన్ను ఈప్రాణుల హితాహితంబులందు నియమించెను.] అని. ఈ విషయంబున బ్రాహ్మము, వైష్ణవము, వామనము, నారసింహము, లైఙ్గము, విష్ణుధర్మము, విష్ణుతత్త్వము, శ్రీభాగవతము ఇత్యాదులందుగల యమకింకరసంవాదంబును చూడఁగలరు. ¶ (485.)

(అవతారిక.) ఇట్లు వీడు అపరాధంబులను సహించుచునుండినచో త్యాజ్యంబు (వీడదగినవి) లకును ఉపాదేయంబు (గ్రహింపదగినవి) లకును భేదమేమి యనఁగా ;

## 486. కృతలక్షణః.

"కృతం లక్షణం యేనసః కృతలక్షణః" విష్ణుసంబంధము నొందినవాఁడు ఉపాదేయుఁడు అని శ్రీరామాయణ మహాభారతాదులయందు తానే లక్షణము చెప్పి యుండుటచే విష్ణుసంబంధము లేనివాఁడు ఉపాదేయుఁడుగాడు అని తేలినది. ఇట్లనుటచే పక్షపాతాది దోషంబులకు ప్రసక్తియేలేదు.

* మిత్రభావేన సంప్రాప్తమ్ * (రా. యు. 18_3.) [స్నేహభావముతో వచ్చిన వానిని నేనొకప్పుడును వీడను.] * చక్రాఙ్కితాః ప్రవేష్టవ్యాః యావదాగమనంమమ। నాముద్రితాః ప్రవేష్టవ్యాః యావదాగమనం మమ * (హ. వ.) [నేనువచ్చువఱకు చక్రాంకనముగలవారలనే ప్రవేశింపజేయవలయును. చక్రాంకనములేనివారలను నేను వచ్చువఱకు ప్రవేశింపజేయవలదు.] * చక్రాదిధారణం పుంసాం పరసంబన్ధ వేదనమ్। పతివ్రతానిమిత్తం హి వలయాదివిభూషణమ్ * (వి. త.) [వలయాదు లెట్లు సౌమంగల్యచిహ్నంబులో; అటులే చక్రాది ధారణములు భగవత్సంబంధంబును సూచించినవి.] (486.)

---

¶ యమకింకర సంవాదము. * స్వపురుషమభివీక్ష్య పాశహస్తం వదతి యమః కిల తస్య కర్ణమూలే! పరిహర మధుసూదనప్రపన్నాన్ ప్రభురహమ్ అన్యనృణాం న వైష్ణవానామ్ * [పాశంబునెత్తుకొనిపోవు తనకింకరునిజూచి యముడు వాని కర్ణమున నేకాంతముగా నిట్లుచెప్పెను. 'నీవు విష్ణుభక్తులసమీపంబునకు నేగవలదు. నేనితరులకే ప్రభువు, విష్ణుభక్తులకు నేను ప్రభువు కాజాలను' అని. దీనిని తిరుమఙ్గైయాళ్వార్లు తమనాన్ముగన్ తిరువన్దాదిలో * తిఱమ్బేల్మిన్ కణ్డీర్ * (68) అను పాశురమున విస్తారముగా సాధించిరి.

487. గభస్తినేమిః. 488. సత్వస్థః. 489. సింహః.

గభస్తినేమిః = ప్రకాశమగు చక్రమును గలవాడు. సత్వస్థః = హృదయంబున నుండువాడు. సింహః = హింసించువాడు.

---

## 487. గభస్తినేమిః.

"గభస్తిః నేమిః యస్యసః గభస్తి నేమిః" వీరలను రక్షించుటకై అతి ప్రకాశమై వెయ్యి నేములంగల చక్రంబును ధరించినవాఁడు.

* వసతి మనసి యస్య సో ఽ వ్యయాత్మా పురుషవరస్య న తస్య దృష్టిపాతే। తవ గతి రథవా మమాస్తి చక్రప్రతిహతవీర్యబలస్య సోఽన్యలోక్యః * (వి. పు. 3. 35.) [నిర్వికారస్వరూపుఁడగు ఆపరమాత్మ ఎవనిహృదయంబున వసించుచునుండునో; తన చక్రంబుచే శత్రువులవీర్యబలంబును నశింపఁజేయు ఆ పురుషవరుని దృష్టి విషయంబున నీవో నేనో పోవ అనధికారులము. వాఁడు మననియామ్యకోటిలో జేరని విజాతీయుఁడు, అని యముడే చెప్పెను.] (487.)

## 488. సత్వస్థః.

"సత్వే హృదయే తిష్ఠతీతి సత్త్వస్థః" వీరలను పీడించు కర్మములు లేకుండుటచే యమాదులు సమీపింపజాలరు. కర్మము లేకుండుటకు గారణంబే మనఁగా; (సత్త్వస్థః) సత్త్వ మనగా హృదయము. వారలహృదయంబున భగవంతుడు ఉండుటచే కర్మములు భస్మములైనవి.

* హృది యది భగవా౯ అనాదిరాస్తే హరిరపి చక్రగదాధరోఽవ్యయాత్మా। తదఘమఘవిఘాతకర్తృభిన్నం భవతి కథం సతిచాన్ధకారమర్కే * (వి. పు. 2. 2_25) [విష్ణువు ఎవనిహృదయంబున వసించునో; వానిపాపంబులు, సూర్యుని యెదుట చీకటివలె నశించును.] * స్ఫటికమణిశిలామలః క్వ విష్ణుః ? మనసి నృణాం క్వచ మత్సరాదిదోషః ? (వి. పు. 3_7_22) [స్ఫటికమణివలె నతినిర్మలుండగు విష్ణువెక్కడ ? ఆతఁడు వసించు మనుష్యుల హృదయంబున మత్సరాదిదోషంబులెక్కడ ? ] * కిఙ్కరా దణ్డపాశావా న యమో న చ యాతనాః। సమస్తాస్తస్య యస్యాత్మా కేశవాలమ్బన స్సదా * (వి. పు. 2. 2_28) [యముఁడో యమకింకరులో యాతన (నరకవేదన) లో అన్నియు విష్ణుభక్తులకు లేవు.] * యే విష్ణుభక్తాః పురుషాః పృథివ్యాం యమస్య తే నిర్విషయాః భవన్తి * (వా. పు.) [విష్ణు భక్తులు యమునకు విషయులుగారు.] (488.)

## 489. సింహః. (202)

"హినస్తీతి సింహః" దీని నెఱుంగక యమాదులు విష్ణుభక్తులను సమీపించినచో వారలను హింసించును.

## 490. భూతమహేశ్వరః.

భూతమ హేశ్వరః = భూతములకు ఈశ్వరుడు.

---

* వాసుదేవపరం దృష్ట్వా వైష్ణవం దగ్ధ కిల్బిషమ్। దేవాః విభీతాః సంయాన్తి ప్రణిపత్య యథాగతమ్। దృష్ట్వా యమో ఽపి వైష్ణవం దగ్ధకిల్బిషమ్। ఉత్థాయ ప్రాఞ్జలిర్భూత్వా ననామ రవినన్దనః। తస్మాత్ సమ్పూజయేద్భక్త్యా వైష్ణవాన్ విష్ణువన్నరః। స యాతి విష్ణుసాయుజ్యం నాత్రకార్యా విచక్షణా ✤ (వి. పు.) [వాసుదేవుండే గతియని యుండుటచే సమస్తపాపంబులును తొలఁగిన వైష్ణవునిజూచి దేవతలు భయపడి నమస్కరించి వచ్చినట్లె వెళ్ళుదురు. సూర్యపుత్రుడగు యముఁడుఁగూడ ఈ వైష్ణవునిజూచి లేచి అంజలిచేసి నమస్కరించును. కనుక విష్ణుభక్తులను విష్ణువువలె నెవడు పూజించునో వాడు విష్ణుసాయుజ్యమునొందును. ఈవిషయంబున సంశయములేదు. అని మార్కండేయుడనెను.] ✤ కాశికాదీం స్తథా దృష్ట్వా బ్రహ్మా లోకపితామహః। ప్రత్యుద్గమ్య యథాన్యాయం స్వాగతేనాభ్యపూజయత్ ✤ (వి. పు.) [కాశికోపాఖ్యానంబున, భగవద్గాయకులకు కాశికాదులంజూచి బ్రహ్మ లేచి స్వాగతమిచ్చి పూజించెను.] అని ప్రారంభించి సవిస్తారముగా చెప్పబడియె. ✤ హరిపాదప్రపన్నానాం దూరీభూతాః స్వభావతః। తేషాన్తు సర్వభూతానాం హరిరేవ పతిర్యతః। వైష్ణవేభ్యోఽపి బిభ్యన్తి దేవాః నరకరక్షకాః। అవమానక్రియా తేషాం సంహరత్యఖిలం జగత్। కాలేనైతావతా తేషు నరకేషుహి కశ్చన। నదృశ్యతే మహావీర్యప్రభావాత్పరమేష్ఠినః ✤ (వి. త.) [విష్ణుభక్తులకు విష్ణువే స్వామియగుటంజేసి వారలంజూచి అందఱును దూరంబుననేగుదురు. దేవతలును నరకరక్షకులును విష్ణుభక్తులంజూచి భయపడుదురు. వారల నవమానించినచో లోకమంత నశించును. వాని ప్రభావంబుచే ఇంతవఱకు ఎవరును నరకంబున పడలేదు.] అని నరకప్రస్తావంబున చెప్పబడియున్నది. ✤ నరకే పచ్యమానస్తు యమేన పరిభాషితః। కిన్త్వయా నార్చితః దేవః కేశవః క్లేశనాశనః * (వి. ధ.) [నరకంబున బాధపడుచునుండువానింజూచి యముడు చెప్పుచున్నాడు. 'నీవింతకు పూర్వము కేశవుని పూజించలేదా ?' అని.] (489.)

(అవతారిక.) క్రింద జెప్పియుండు విషయంబులందు వాడు సమర్థుడుగా నుండుటకు గారణం బేమనగా ;

## 490. భూతమహేశ్వరః.

"భూతానాం మహేశ్వరః భూతమహేశ్వరః" భూతంబులకు నీశ్వరులగు బ్రహ్మరుద్రాదులకు నియామకుడై వారల కారణమై వారలను నియమించు ప్రభావము గలవాడు. (490.)

| | | |
|---|---|---|
| 491. ఆదిదేవః. | 492. మహాదేవః. | 493. దేవేశః. |
| 494. దేవభృత్. | 495. గురుః. | 496. ఉత్తరః. |

ఆదిదేవః = ఆదిదేవుడు. మహాదేవః = క్రీడించువాడు. దేవేశః = దేవతలకు ఈశ్వరుడు. దేవభృత్ = దేవతలను భరించువాడు. గురుః = గురువు. ఉత్తరః = (1) తప్పింపజేయువాడు. (2) లేచువాడు.

---

## 491. ఆదిదేవః. (336)

"ఆదిశ్చాసౌ దేవశ్చ ఆదిదేవః" అందఱకును ఆదిగా ప్రకాశించువాడు. (491.)

## 492. మహాదేవః.

"మహాంశ్చాసౌ దేవశ్చ మహాదేవః" బ్రహ్మాదులను బంతివలె నాడు వాడు. (492.)

## 493. దేవేశః.

"దేవానామ్ ఈశః దేవేశః" ఆ బ్రహ్మాదులను తమతమ యధికారములందు నియమించువాడు. (493.)

## 494. దేవభృత్.

"దేవాన్ బిభర్తీతి దేవభృత్" బ్రహ్మాది దేవతలను యథేష్టముగ వినియోగించుచు భరించువాడు. (494.)

## 495. గురుః.

వేదంబులచే ఆదేవతలకు తమతమయధికారం బిట్టిదని యుపదేశించుటచే గురువు.

* యో బ్రహ్మాణం విదధాతి పూర్వం యోవై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై *
[ఎవడు బ్రహ్మను సృజించి వానికి వేదంబుల నుపదేశించెనో ;]

హయగ్రీవోపాఖ్యానంబున ఈగురుత్వము స్పష్టముగా చెప్పబడియున్నది:
* జగ్రాహ వేదానఖిలాన్ రసాతలగతాన్ హరిః। ప్రాదాచ్చ బ్రహ్మణే రాజన్ తతః స్వాం ప్రకృతిం గతః * [విష్ణువు పాతాళంబునుం డివేదంబులను గ్రహించి బ్రహ్మదేవున కిచ్చి తనస్థానంబునకు నేగెను.] (495.)

## 496. ఉత్తరః.

(1) "ఉత్తరన్తి అస్మాదితి ఉత్తరః" ఆదేవతలకు అసురులచే గల్గు ఆపదలను తప్పింపజేయువాడు.

497. గోపతిః. 498. గోప్తా.
499. జ్ఞానగమ్యః. 500. పురాతనః.

గోపతిః = వాక్కులకు పతి. గోప్తా = రక్షకుడు. జ్ఞానగమ్యః = సమాధిచే పొందదగినవాడు. పురాతనః = అనాదిగా నుండువాడు.

---

(2) దేవతల స్తోత్రానంతరము వారలకార్యార్థమై లేచువాడు. * ఏవం స్తుతస్సభగవాన్ పురుషస్సర్వతోముఖః। జహౌ నిద్రామథ తదా దేవకార్యార్థముత్థితః * (భా. శా. 348_47) [ఇట్లు స్తోత్రముచేయబడిన ఆ భగవంతుడు నిద్రనువీడి దేవకార్యార్థమై లేచెను.] (496.)

## 497. గోపతిః. (599)

"గవాం పతిః గోపతిః" చందస్సు భాష అని వ్యవహరింపబడు సమస్త వాక్కులకును పతి. (497.)

## 498. గోప్తా. (600)

"గోపాయతీతి గోప్తా" ఇట్లు సమస్త విద్యలను రక్షించుటచే రక్షకుడు. (498.)

## 499. జ్ఞానగమ్యః.

"జ్ఞానేన గమ్యః జ్ఞానగమ్యః" పరవిద్యచే ఎఱుగబడు సమాధిచే పొందదగినవాడు గాన జ్ఞానంబుచే నెఱుంగదగినవాడు. (499.)

## 500. పురాతనః.

"పురా పూర్వమ్ భవతీతి పురాతనః" ఇట్లు ప్రతికల్పంబునను విద్యను ప్రవర్తింపజేయుటచే అనాదిగా ప్రవర్తింపజేయువాడు. (500.)


శ్రీ విష్ణు సహస్రనామ వ్యాఖ్యానమున
పంచమ శతకము
సమాప్తము.

శ్రీమతే రామానుజాయనమః.

# షష్ఠ శతకము.



501. శరీరభూతభృత్. 502. భోక్తా.
503. కపీన్ద్రః 504. భూరిదక్షిణః.

శరీరభూతభృత్ = శరీరముగానుండు తత్త్వములనుభరించువాడు. భోక్తా = భుజించువాడు. కపీన్ద్రః = వానర రూపంబునెత్తిన దేవతలకు ప్రభువు. భూరిదక్షిణః = విశేషముగా దక్షిణ నిచ్చినవాడు.

---

## 501. శరీరభూతభృత్.

"శరీరభూతం బిభర్తీతి శరీరభూతభృత్" తనకు శరీరముగానుండు తత్త్వములను హయగ్రీవరూపముతో భరించువాడు. (501.)

## 502. భోక్తా. (145)

"భుఙ్క్తే ఇతి భోక్తా" హవ్యకవ్యములను భుజించువాడు ఈహయగ్రీవుడు. (502.)

## 503. కపీన్ద్రః.

"కపీనామ్ ఇన్ద్రః కపీన్ద్రః" (ఇదిమొదలు రామావతారంబునే ప్రకారాంతరముగా అనుభవించుచున్నారు.) తనకు అసదృశంబగు మనుష్యావతారంబు (రామావతారంబు) నెత్తి దానిలో తాను ప్రవర్తింపజేసిన వేదోక్తకర్మంబులను ప్రవర్తింపజేసి వానరరూపంబగు మాఱువేషము ధరించిన దేవతలకు ప్రభువుగా నుండినవాడు.

* సర్వలోకేశ్వర స్సాక్షాత్ లోకానాం హితకామ్యయా। సర్వైః పరివృతో దేవైః వానరత్వముపాగతైః * (రా. యు 114-16) [సర్వలోకేశ్వరుండు లోకహితము చేయగోరి వానరరూపము ధరించిన సమస్తదేవతలతో పరివేష్టింపబడెను.] (503.)

## 504. భూరిదక్షిణః.

"భూరయః దక్షిణాః యస్యసః భూరిదక్షిణః" లోకశిక్షణార్థమె అశ్వమేధాదియాగంబుల ననుష్ఠించి విశేషముగా దక్షిణనిచ్చినవాడు.

* అశ్వమేధశతైరిష్ట్వా తథా బహుసువర్ణకైః। గవాం కోట్యయుతం దత్వా బ్రహ్మలోకం గమిష్యతి * (శ్రీరా. బా. 1-94) [రాముడు అశ్వమేధయాగముచేసి అమితముగా సువర్ణంబును అనేకకోటిగోవులను దక్షిణగా నిచ్చి బ్రహ్మలోకంబునకు నేగును.] (504.)

505. సోమపః. 506. అమృతపః.
507. సోమః. 508. పురుజిత్.

సోమపః = సోమపానము కావించినవాడు. అమృతపః = (1) అమృతపానము చేసినవాడు. (2) తన యనుభవంబును పాలించువాడు. సోమః = అమృతముగా నుండువాడు. పురుజిత్ = పలువురను జయించినవాడు.

---

## 505. సోమపః.

"సోమం పిబతీతి సోమపః" ఆ యశ్వమేధయాగంబున సోమపానము కావించినవాడు. (505.)

## 506. అమృతపః.

(1) "అమృతం పిబతీతి అమృతపః" * యత్కిఞ్చిద్ధూయతే వహ్నౌ హవిర్మన్త్రైర్విధానతః। తత్సర్వ మమృతం కృత్వా విష్ణవే సమ్ప్రయచ్ఛతి * [అగ్నిలో హోమముచేసినవానిని అమృతముగా జేసి విష్ణువున కిచ్చును.] * అహంహి సర్వ యజ్ఞానాం భోక్తాచ ప్రభురేవచ * (గీ. 9. 24) [సమస్త యాగములను అనుభవించువాడును నేనే ఫలంబులనిచ్చువాడును నేనే.] అనినట్లు హవిఃపరిణామరూపమగు అమృతంబును పానము చేసినవాడు.

(2) లేదా "అమృతం పాతీతి అమృతపః" తనయనుష్ఠానంబుననుసరించినవారలకు పరమపదంబున తనయనుభవంబను అమృతంబునిచ్చి పాలించువాడు.

* యత్రదేవాః అమృతమానశానా స్తృతీ యేధామన్యధైరయ న్త * (తై-ఉ-నా. 6-15) [ఏమూడవలోకంబున దేవతలు అమృతపానము కావించునట్లు చెప్పబడునో;]

## 507. సోమః.

సోమ శబ్దమిచట అమృతవాచకము. తనకును, తన్ను అనుభవించువారలకును అమృతముగా నుండువాడు.

* సఖల్వమృతోపమః * [వాడు అమృతమువంటివాడు.] * మహతా తపసా రామ మహతాచాపి కర్మణా। రాజ్ఞా దశరథేనాసి లబ్ధోఽమృతమివామరైః * (రా. అ. 66-3) [రామా! దశరథుడు, గొప్ప తపంబులొనర్చి పలుపాట్లుపడి దేవతలు అమృతమునొందినట్లు నిన్ను పొందెను.] * అమృతస్యేవ నాతృప్యన్ ప్రేక్షమాణాః జనార్దనమ్ * [విష్ణువును, అమృతమును చూచినట్లు ఎంతచూచియు తృప్తి నొందరైరి.] (507.)

## 508. పురుజిత్.

"పురూన్ జయతీతి పురుజిత్" * సత్యేన లోకాన్ జయతి దీనాన్ దానేన రాఘవః। గురూన్ శుశ్రూషయా వీరః ధనుసా యుధి శాత్రవాన్ *

509. పురుసత్తమః. 510. వినయః.
511. జయః. 512. సత్యసన్ధః.

పురుసత్తమః = మహనీయులయందుండువాడు. వినయః = అణచినవాడు. జయః = ఆశ్రితులచే జయింపబడినవాడు. సత్యసన్ధః = సత్యమగు ప్రతిజ్ఞగలవాడు.

---

(రా. అ. 12_29) [శ్రీరామచంద్రుడు, సత్యంబుచే లోకంబులను, దీనజనంబులను దానముచేతను, శుశ్రూషచే గురువులను, శత్రువులను ధనుస్సుచేతను జయించినవాడు.] (508.)

## 509. పురుసత్తమః.

"పురుషు సత్తమః పురుసత్తమః" * స్నేహో మే పరమో రాజన్ త్వయి నిత్యం ప్రతిష్ఠితః। భక్తిశ్చ నియతా వీర! భావో నాన్యత్ర గచ్ఛతి * (రా. ఉ.) [రామా! నీయందే నాకు స్నేహము పూర్ణముగ నున్నది. నా హృదయము నీవిషయముననదప్ప ఇతరవిషయంబులయందు నేగదు.] అనినట్లు తన గుణామృతసాగరంబును పానముచేయగోరిన హనుమదాదులందు నిత్యముగా నుండువాడు. (509.)

## 510. వినయః.

"వినీయన్తే అస్మాత్ ఇతి వినయః" మారీచాది దుర్జనులను తమ వీర్యాది గుణంబులచే నణచినవాడు. (510.)

## 511. జయః.

"జీయతే ఆజ్ఞాప్యతే ఇతి జయః" ఆశ్రితులకు విధేయుడుగా నుండుటచే ఆశ్రితులచే జయింపబడినవాడు. * ఆజ్ఞాప్యోఽహంతపస్వినామ్ * (రా. ఆ. 6_23) [ఋషులచే నాజ్ఞాపింపదగినవాడను.] * తతో నారాయణో విష్ణుః నియుక్తః సురసత్తమైః * (రా. బా. 15_1) [దేవతలచే నాజ్ఞాపింపబడిన నారాయణుండు భూమిలో నవతరించెను.] (511.)

## 512. సత్యసన్ధః.

"సత్యా సంధా యస్యసః సత్యసన్ధః" ఆమహనీయులయందు గావించిన ప్రతిజ్ఞ సత్యముగా నుండునట్లు ప్రవర్తించినవాడు.

* అప్యహం జీవితం జహ్యాం త్వాంవా సీతే సలక్ష్మణామ్। నతు ప్రతిజ్ఞాం సంశ్రుత్య బ్రాహ్మణేభ్యో విశేషతః * (రా. అ. 20_19) [సీతా! నేను నాప్రాణంబును, లేక నిన్ను, లేక లక్ష్మణుని విడిచినను విడుతునేగాని కావించిన ప్రతిజ్ఞను మాత్రము వదలను. అందును బ్రాహ్మణవిషయంబున చెప్పవలయునా? అని శ్రీరాముడే సీతతో జెప్పెను.] (512.)

**513. దాశార్హః. 514. సాత్వతాంపతిః. 515. జీవః.**
**516. వినయితా. 517. సాక్షీ.**

దాశార్హః = (1) దానమునకుం దగినవాడు. (2) దశార్హవంశంబున నవతరించినవాడు. సాత్వతాంపతిః = (1) భాగవతులకు నాథుడు. (2) సాత్వత వంశ నిర్వాహకుడు. జీవః = జీవింపజేయువాడు. వినయితా = రక్షించువాడు. సాక్షీ = చూచువాడు.

---

## 513. దాశార్హః.

"దాశమ్ దానమ్ అర్హతీతి దాశార్హః" (1) దాశ అనఁగా దానము. దానికి దగినవాడు. భక్తులకు తన్ను ఇచ్చుటకును, అటులే భక్తులు తమ్ము వానికి సమర్పించుటకును దగినవాడు.

(2) "దశార్హస్యాయమ్ దాశార్హః" కృష్ణావతారంబున దశార్హవంశంబున (యదు వంశంబున) జనించినవాడు. (513.)

## 514. సాత్వతాం పతిః.

(1) పరమసత్త్వనిష్ఠులై తనపాదారవిందంబులం దప్ప ఇతరవిషయంబులను చింతింపని భాగవతులకు పతియై యుండువాడు.

(2) సాత్వత వంశమగు యాదవవంశంబున జనించి దాని నిర్వాహకుడై యుండువాడు. (514.)

## 515. జీవః.

"జీవయతీతి జీవః" ఆభాగవతులను ఆత్మనాశము గలుగకుండ రక్షించి తనపరిచర్య నిచ్చి జీవింపజేయువాడు.

* ఆనన్దమూర్తిః భగవాన్ హరిః త్రైలోక్య పూజితః। ద్రష్టుం న సహతే దేవి క్లిష్టాన్ స్వపరిచారకాన్ * [ఆనందమూర్తియగు భగవంతుడు తన భక్తులు దుఃఖింపగా చూడజాలడు.] (515.)

## 516. వినయితా.

"వినయతే రక్షతి ఇతి వినయితా" రాజకుమారుని బుజ్జగించునట్లు భక్తులను బుజ్జగించి రక్షించువాడు. (516.)

## 517. సాక్షీ. (15)

"సాక్షాత్ ద్రష్టా సాక్షీ" భక్తులు సన్మార్గముననే ప్రవర్తించుటకై వారు చేయు కృత్యములను నేరుగా చూచుచునుండువాడు. (517.)

518. ముకున్దః. 519. అమితవిక్రమః. 520. అమ్భోనిధిః.
521. అనన్తాత్మా. 522. మహోదధిశయః.

ముకుందః = మోక్షము నిచ్చువాడు. అమితవిక్రమః = అపరిమితంబగు బలము గలవాడు. అమ్భోనిధిః = సముద్రజలంబున ఆదికూర్మమై యుండువాడు. అనన్తాత్మా = ఆదిశేషునకు ఆత్మగా నుండువాడు. మహోదధిశయః = సముద్రమున శయనించువాడు.

---

## 518. ముకున్దః.

"ముక్తిం దదాతీతి ముకున్దః" మోక్షమునిచ్చిననే జీవింతుము అని భక్తులు ప్రార్థించినప్పుడు వారలకు మోక్షము నిచ్చువాడు. (518.)

## 519. అమితవిక్రమః. (647)

"అమితః విక్రమః యస్యసః అమితవిక్రమః" వారు తన్ను ధ్యానించునప్పుడును ఆరాధించునప్పుడును, అను సంధింపబడు తత్త్వసముదాయములనన్నింటిని ధరించు ఆధారశక్తియను అపరిమితబలంబును ధరించినవాడు.

* కాలవైశ్వానరశ్చాయి నానాస్వాధో నివాసినః। ఆధారశక్తిసంజ్ఞస్యహ్యామూర్తస్యచ వై విభుః। అభిమానతనుర్వైవై నానాభేదైశ్చ వర్తతే॥ (పౌ. సం.) [కాలవైశ్వానరుండనియు ఆధారశక్తియనియు పేరొంది అశరీరియై పలువిధంబులుగా నేగువాడై క్రిందిలోకంబున నేకాకియైయుండు సర్వవ్యాపకుండగు భగవంతుడు ఆయాకాలంబున తనయిచ్ఛచే నంగీకరింపబడు శరీరములనేకములుగలవు.] (519.)

## 520. అమ్భోనిధిః.

"అమ్బుని నిధీయతే ఇతి అమ్భోనిధిః" మంత్రరీతిగా, పాతాళంబున సముద్రజలంబున సమస్తలోకంబును ఉద్ధరించునట్టి ఆదికూర్మమై యుండువాడు. (520.)

## 521. అనన్తాత్మా.

"అనన్తస్య ఆత్మా అనన్తాత్మా" దానిమీదనుండు సమస్తజగత్తునకును ఆధారస్తంభమగు ఆదిశేషునకును అంతరాత్మగా నుండువాడు.

* ఆధారశక్తేరుపరి విమలం దీప్తవిగ్రహమ్। జ్వాలాశతసమాకీర్ణం శఙ్ఖచక్రగదాధరమ్। అనన్తేశం న్యసేత్ ॥ (జ. సం.) [ఆధారశక్తిమీద నిర్మలమై ప్రకాశించు దివ్యమఙ్గళవిగ్రహధారియై అనేకజ్వాలలతో గూడినవాడై శంఖచక్రగదాధారియై ప్రకాశించు అనంతేశుని హృదయంబున స్థాపింపవలయును.] (521.)

## 522. మహోదధిశయః.

"మహోదధౌ శేతే ఇతి మహోదధిశయః" [వాండే ప్రళయకాలంబున ఆయనంతుండగు శయనంబున సముద్రములో శయనించువాడు.] (522.)

523. అన్తకః. 524. అజః.
525. మహార్హః. 526. స్వాభావ్యః.

అన్తకః = నాశముచేయువాడు. అజః = అకారమునకు అర్థమైనవాడు.
మహార్హః = పూజింపదగినవాడు. స్వాభావ్యః=స్వామిగా నుండువాడు.

---

## 523. అన్తకః.

"అన్తం కరోతీతి అన్తకః" అప్పుడు సమస్తంబును నాశముచేయువాడు.
* అన్తే పృథివ్యాః సలిలే దృశ్యసే త్వం మహోరగే * (రా. యు. 120_23.)
[భూమి నశించుకాలంబున జలంబునందు మహాసర్పము మీఁద కన బడుచున్నావు.]

## 524. అజః. (96_206.)

అక్కాలంబున సమస్త తత్వములును లయంబునొందగా అప్పుడు తన స్వరూపంబును కేవలప్రణవప్రకృతియై సకలశబ్దకారణమెయుండు అకారంబునకు అర్థముగా చెప్పబడియుండువాఁడు. * తస్య ప్రకృతిలీనస్య యః పరస్స మహేశ్వరః * (తై. ఉ. 10_24.) [ప్రకృతిలో లయించిన దానియర్థము ఎవ్వడో; వాఁడే పరమేశ్వరుఁడు.] (524.)

## 525. మహార్హః.

"మహమ్ అర్హతీతి మహార్హః" అప్పుడు ప్రణవంబుచే పూజింపబడినవాడు.

* బ్రహ్మణే త్వా మహస ఓమిత్యాత్మానం యుఞ్జీతైతద్వై మహోపనిషదం దేవానాం గుహ్యమ్ * (తై. ఉ. 63_78) ][బ్రహ్మతేజస్సగు నీకు దాసుఁడని ఆత్మను సమర్పింపఁగలఁడు. ఇదియే మహోపనిషదర్థమగు దేవరహస్యము.] (525.)

## 526. స్వాభావ్యః.

"స్వైః భావ్యతే ఇతి స్వాభావ్యః" ఇట్లే ప్రణవంబను మంత్రంబుచే తన సొత్తుగానుండు ఆత్మకోటులు తన్ను ఆశ్రయించునట్లు స్వామిగా నుండువాడు.

* స్వోజ్జీవనేచ్ఛా యది తే స్వసత్తాయాం స్పృహా యది। ఆత్మదాస్యం హరేః స్వామ్యం స్వభావంచసదాస్మర * (వి. త.) [నీ యుజ్జీవనంబునను స్వరూపస్థితిలోను నీకు ఇచ్ఛయుండినచో ఆత్మయొక్క దాస్యంబును విష్ణువుయొక్క స్వామిత్వంబును ఎల్లప్పుడును చింతించుము.] (526.)

527. జితామిత్రః. 528. ప్రమోదనః.
529. ఆనన్దః. 530. నన్దనః.

జితామిత్రః = శత్రువులను జయించినవాడు. ప్రమోదనః = సంతోషము గల్గించువాడు. ఆనన్దః = ఆనందము గలవాడు. నన్దనః = ఆనందింప జేయువాడు.

---

## 527. జితామిత్రః.

"జితాః అమిత్రాః యేనసః జితామిత్రః" రహస్యార్థంబు నెఱుంగలేక విరోధించు భక్తులయొక్క అహంకార మమకార కామక్రోధాదులను తొలగించు వాడు.

* కామ ఏష క్రోధ ఏషః రజోగుణసముద్భవః * (అని ప్రారంభించి) * జహి శత్రుం మహాబాహో కామరూపం దురాసదమ్ * (గీ. 3-37 నుంచి 43.) [అర్జునా! రాజస గుణంబుచే జనించు కామము, అయాలముగాజనించు క్రోధము .........కామరూపమైయుండు అడంపశక్యంబుగాని శత్రువును జయించుము.] అనునంతవఱకు చెప్పబడియుండును. (527.)

## 528. ప్రమోదనః.

"ప్రమోదయతీతి ప్రమోదనః" ఇట్లు తన సంబంధమునొందిన వారలను వారు మొట్టమొదట తన్ను అనుసంధించునప్పుడే వారలను సంతోషము గల్గించు వాడు. (528.)

(అవతారిక.) ఇక కపిలమూర్తిని వర్ణించుచున్నారు:—

## 529. ఆనన్దః.

"ఆనన్దః అస్యాస్తీతి ఆనన్దః" ఆనందవల్లిలో విచారింపబడిన వాచామ గోచరమగు ఆనందముగలవాడు. (529.)

## 530. నన్దనః.

"నన్దయతీతి నన్దనః"

(1) ఆ యానందంబును ముక్తిదశలో చేతనులకిచ్చి యానందింపజేయువాడు. * ఏష హ్యేవానన్దయాతి * (తై. ఉ. ఆ. 7.) [వీడే ఆనందింపఁజేయుచున్నాఁడు.]

(2) లేక, ఆనందరూపుడగు వీనియల్పాంశంబును ఇతరప్రాణులుపొంది ఆనందించుచున్నవి.] (530.)

**531. నన్దః.　　532. సత్యధర్మా.　　533. త్రివిక్రమః.**
**534. మహర్షిః.　　535. కపిలాచార్యః.**

నన్దః = సమృద్ధుడు.　సత్యధర్మా = సత్యమైన వ్యాపారంబును గలవాడు. త్రివిక్రమః = వేదంబున వ్యాపించినవాడు.　మహర్షిః = కపిలమహర్షి.　కపిలాచార్యః = కపిలాచార్యుడు.

---

## 531. నన్దః.

"నన్దన్తి అస్మిన్నితి నన్దః" ఇట్టి యపరిమితంబులగు భోక్తలచేతను, భోగ్య వస్తువులచేతను, భోగోపకరణంబులచేతను, సమృద్ధుఁడుగానుండువాఁడు. (531.)

## 532. సత్యధర్మా.

"సత్యః ధర్మః యస్యసః సత్యధర్మా" ఇట్లు తన్ను ఆశ్రయించినవార లను ఆరంభము మొదలు అంతమువఱకు సరిగా నడచుటచే సత్యమైన వ్యాపారంబును గలవాడు. (532)

## 533. త్రివిక్రమః.

"త్రీన్ క్రమతే ఇతి త్రివిక్రమః" ఇట్టి మహామహిమశాలియగుటచే, * త్రిరిత్యేవం త్రయోవేదాః కీర్తితాః మునిసత్తమైః । క్రమతే తాన్ తథా సర్వాన్ త్రివిక్రమ ఇతి స్మృతః * [త్రి అనగా మూడు వేదంబులని మహర్షులందురు. వాని నన్నిటిని వ్యాపించియుండుటచే నిన్ను త్రివిక్రముడందురు.] అను నిరుక్తరీతిగా, సమస్త వేదంబులకును వీఁడే వాచ్యుడుగా నుండువాడు. (533.)

## 534. మహర్షిః.

"మహాంశ్చాసౌ ఋషిశ్చ మహర్షిః" ఈవేదంబులను ప్రత్యక్షముగా చూడగల కపిలమహర్షి.

* శ్రుతీః ఋగాద్యాః వక్త్రేభ్యః ప్రోద్గిరన్తమతః స్మరేత్ * [ఋగాది వేదంబులను చెప్పుచునుండు వానిని స్మరింపగలడు.] * సాఙ్ఖ్యస్య వక్తా కపిలః పరమర్షిః స ఉచ్యతే * [సాంఖ్యంబును చెప్పిన కపిలుడు పరమర్షియగును.] (534.)

## 535. కపిలాచార్యః.

"కపిలశ్చాసౌ ఆచార్యశ్చ కపిలాచార్యః" కపిల (గోరోచన) వర్ణముగల వాడగు ఆచార్యుడు, అనగా తత్త్వప్రవచనము గావించువాడు. (535.)

536. కృతజ్ఞః. 537. మేదినీపతిః.
538. త్రిపదః. 539. త్రిదశాధ్యక్షః.

కృతజ్ఞః = కృతజ్ఞుడు. మేదినీపతిః = భూమిని ధరించువాడు. త్రిపదః = (1) మూడు జ్ఞానములనుగలవాడు. (2) మూడు పదములను గలవాడు. (3) మూడు మూపురములనుగలవాడు. త్రిదశాధ్యక్షః = దేవతలకు స్వామి.

---

## 536. కృతజ్ఞః. (83)

"కృతమేవ జానాతీతి కృతజ్ఞః" తనవిషయంబున నపరాధంబొనరించిన నగరపుత్రులకై వారలపుత్రుడగు అంశుమంతుండు ప్రార్థింపగా దానినే దలంచినవాడు.

* కపిలముపగమ్య భక్తినమ్రః తదా తుష్టావ సచైవం భగవానాహ...వరం వృణీష్వ ఇతిచ * (వి. పు. 4-4-24, 26) [కపిలునిపొంది భక్తినమ్రుడై అప్పుడిట్లు నుతించెను. ఆతడును వీనితో నిట్లు చెప్పెను......వరంబును గోరుము అని.] (536.)

## 537. మేదినీపతిః.

"మేదిన్యాః పతిః మేదినీపతిః" * యస్యేయం వసుధా సర్వా వాసుదేవస్య ధీమతః। కాపిలం రూపమాస్థాయ ధారయత్యనిశం ధరామ్. * (రా. బా. 40-2) [ఈభూమియంతయు సర్వజ్ఞుండగు ఏ వాసుదేవునిదో; వాడు కపిలరూపంబుతో సదా ఈ భూమిని ధరించుచున్నాడు.] అనినట్లు భూమిని ధరించువాడు. (537.)

## 538. త్రిపదః.

"త్రీణి పదాని యస్యసః త్రిపదః"

(1) చిత్తు అచిత్తు ఈశ్వరుడు అనుమూడు పదములను (అనగా జ్ఞానములను) కపిలరూపముతో ప్రకటించినవాడు.

(2) ప్రణవంబున అకార-ఉకార-మకారంబులు అను మూడు పదంబులను గలవాడు.

(3) వరాహరూపము ధరించినప్పుడు * తస్మై వాసం త్రికకుదః వారాహం రూపమాస్థితః * [అటులే మూడు మూపురములంగల వరాహరూపము ధరించితిని.] అనినట్లు మూడు మూపురములం గలవాడు. (538.)

## 539. త్రిదశాధ్యక్షః.

"త్రిదశానామ్ అధ్యక్షః త్రిదశాధ్యక్షః" ఈ వరాహరూపియగు భగవంతుతే ప్రళయాపదలో సహాయముగా నుండుటచే బ్రహ్మాది దేవతలకు స్వామి. (539.)

540. మహాశృఙ్గః. 541. కృతాన్తకృత్.
542. మహావరాహః. 543. గోవిన్దః.

మహాశృఙ్గః = పెద్దకోఱలు గలవాడు. కృతాన్తకృత్ = (1) హిరణ్యాక్షుని చంపినవాడు. (2) వరాహ స్మృతిచే తనసిద్ధాంతంబును ప్రకటించినవాడు. మహావరాహః = మహా వరాహమూర్తి. గోవిన్దః = భూమిని పొందినవాడు.

---

## 540. మహాశృఙ్గః.

"మహాన్ శృఙ్గః యస్యసః మహాశృఙ్గః" అగ్రభాగంబున భూమండలంబును గల సాటిలేని కోఱనుగలవాడు.

* ఏకశృఙ్గో వరాహస్త్వమ్ * (రా. యు. 120-14) [ఒక కొమ్ముగల వరాహంబును నీవే] * (540.)

## 541. కృతాన్తకృత్.

(1) "కృతాన్తం కృన్తతీతి కృతాన్తకృత్" యమునిబోలిన హిరణ్యాక్షుని జంపినవాడు. * హతో హిరణ్యాక్షమహాసురః * [హిరణ్యాక్షుండను మహాసురుడు చంపబడియె.]

(2) "కృతాన్తం కరోతీతి కృతాన్తకృత్" వరాహస్మృతి - వరాహ పురాణంబులచే తన సిద్ధాంతంబును ప్రకటించినవాడు. (541.)

## 542. మహావరాహః.

"మహాంశ్చాసౌ వరాహశ్చ మహావరాహః" * తతస్సముత్క్షిప్య ధరాం స్వదంష్ట్రయా మహావరాహః స్ఫుటపద్మలోచనః । రసాతలాదుత్పలపత్రసన్నిభః సముత్థితో నీలఇవాచలో మహాన్ * (వి. పు. 1-4-2) [ఈతడు పిమ్మట మహావరాహరూపియై భూమిని పాతాళంబునుండి పైకెత్తెను.] అనినట్లు మహావరాహమూర్తియై ప్రకాశించినవాడు. (542.)

## 543- గోవిన్దః. (189)

"గాం విన్దతే ఇతి గోవిన్దః" * నష్టాఞ్చ ధరణీం పూర్వమవిన్దఞ్చగుహాగతామ్। గోవిన్ద ఇతి తేనాహమ్ * (భా. శా. 342-42) [పూర్వము భూమి నష్టమై గుహాలోనుండగా దానిని పొందితినిగాన నన్ను గోవిందుడనియందురు.] అనునిరుక్తరీతిగా నష్టమైన భూమిని వరాహరూపియై మళ్లి పొందినవాడు. (543.)

(అవతారిక.) ఇక రహస్య విషయము చెప్పబడును.

544. సుషేణః. 545. జనకాఙ్గదీ. 546. గుహ్యః.
547. గభీరః. 548. గహనః.

సుషేణః = పంచోపనిషత్తులను శరీరముగాగలవాడు. కనకాంగదీ = దివ్యాభరణములం గలవాడు. గుహ్యః = దాగియుండువాడు. గభీరః = గంభీరుడు. గహనః = చోరజాలకుండువాడు.

---

## 544. సుషేణః.

"సుశోభనా సేనా యస్యసః సుషేణః" బద్ధ-ముక్త-నిత్యులు అను త్రివిధ చేతనకోటులను జయించుటకనుపకరణంబగుటచే సేనవలెనుండు శుద్ధసత్వమయంబు లగు పఞ్చోపనిషత్తులను శరీరముగా గలవాడు. (544.)

## 545. కనకాఙ్గదీ.

"కనకాని అఙ్గదాని అస్య సన్తీతి కనకాఙ్గదీ" క్రిందఁజెప్పిన దివ్యదేహంబు నకు దగిన సువర్ణమయంబగు (అనగా అప్రాకృతద్రవ్యములైన పఞ్చోపనిషత్త్వము లగు) అనేకదివ్యాభరణంబులను ధరించినవాఁడు. (545.)

## 546. గుహ్యః.

"గుహ్యతే ఇతి గుహ్యః" ఇట్లు పంచోపనిషన్మయంబగుదివ్యదేహంబుచే దాఁచఁబడినవాడు. (546.)

## 547. గభీరః.

అతినిర్మలంబగు తనదివ్యదేహంబున ఈశ్వరత్వంబునకుదగిన గాంభీర్యము గలవాడు. వీనితో సంబంధించినంతమాత్రాన అనాద్యవిద్యచే దూషితుండయిన సంసారిచేతనుఁడు చిల్లయొరసినజలమువలె నిర్మలుండై అతి గంభీరుఁడై ప్రకాశించు చుండ; స్వతః ప్రకాశుండగు ఆ భగవంతుడు ప్రకాశించుననుట చెప్పవలయునా యేమి ? (547.)

## 548. గహనః.

రత్నాకరంబగు సముద్రము లోపలనుండురత్నాదులు స్పష్టముగా కనఁబడు నంత నిర్మలంబుగానుండినను లోపలచోరజాలకుండునట్లు, భగవంతునిదివ్యమంగళ విగ్రహము దివ్యాత్మ స్వరూపంబునకు ప్రకాశముగానుండినను చోరఁజాలకుండును.

549. గుప్తః 550. చక్రగదాధరః. 551. వేధాః.
552. స్వాఙ్గః. 553. అజితః.

గుప్తః = రక్షింపబడినవాడు. చక్రగదాధరః = దివ్యాయుధములను ధరించినవాడు. వేధాః = ప్రకాశింపజేయువాడు. స్వాఙ్గః = ఛత్రచామరాది సమస్తాంగంబులతో గూడినవాడు. అజితః = అజిత యను నగరమును గలవాడు.

---

## 549. గుప్తః.

తన గౌరవంబునెఱింగిన పూర్వాచార్యులచే రక్షింపఁబడినవాఁడు. (549.)

(అవతారిక.) ఎచ్చట ? ఏ లక్షణంబులతో రక్షింపఁబడుననఁగా ;

## 550. చక్రగదాధరః.

"చక్రగదే ధరతీతి చక్రగదాధరః" * తమసః పరమో ధాతా శఙ్ఖచక్ర గదాధరః * (రా. యు. 114-14.) అనినట్లు క్రిందఁజెప్పిన నిత్యమగు దివ్యమఙ్గళ విగ్రహంబును దివ్యభూషణంబులునుపలె, పఞ్చశక్తిమయంబులగు శంఖచక్రాది దివ్యాయుధంబులతోఁగూడి పరమపదంబున రక్షింపబడువాఁడు. (550.)

## 551. వేధాః.

"విదధాతీతి వేధాః" అపరిమితంబగు ఇట్టివైభవము సదా ప్రకాశించునట్లుండువాఁడు. (551.)

## 552. స్వాఙ్గః.

"స్వం అఙ్గం యస్యసః స్వాఙ్గః" పరమపదంబున తనయాధిరాజ్యంబునకుఁదగిన ఛత్రచామరాది సకలాంగంబులతోనుండువాఁడు. (552.)

## 553. అజితః.

క్రిందఁజెప్పిన పంచోపనిషత్తులచేనేర్పడి నిత్యమైయుండుటచే లీలావిభూతివలె ఉత్పత్తివినాశాదులు లేక నిత్యమైన అజిత అను దివ్యనగరముగలవాఁడు.

* పురం హిరణ్మయీం బ్రహ్మ వివేశాపరాజితా * (ఛా. 1-116.) [సువర్ణమయమగు అపరాజిత అను పట్టణంబున బ్రహ్మముగలదు.] (553.)

554. కృష్ణః. 555. దృఢః. 556. సఙ్కర్షణః.
557. అచ్యుతః. 558. వరుణః. 559. వారుణః.

కృష్ణః = నల్లని శరీరము గలవాడు. దృఢః = స్థూలమైనవాడు. సంకర్షణః = సంకర్షణుడు. అచ్యుతః = జారనివాడు వరుణః = ఆవరించువాడు. వారుణః = వరించువారలను గలవాడు.

---

## 554. కృష్ణః. (58)

కాళమేఘమువలె నల్లని శరీరముగలవాఁడు. వరాహాద్యవతారంబులుగూడ వక్ష్యోపనిషన్మయంబులే. * కృషామి మేదినీంపార్థ భూత్వా కృష్ణాయసోమహాన్। కృష్ణోవర్ణశ్చ మే యస్మాత్ తేన కృష్ణోఽహమర్జున * (భా. శా. 143_19.) [అర్జునా! నేను నల్లని కొయ్యగుద్దేయై భూమిని చీల్చియుండుటవలనను, కృష్ణవర్ణుండగుటవలనను నన్ను కృష్ణు డనియందురు.]

క్రిందజెప్పిన అర్థములన్నియు శ్రీ కృష్ణతత్వంబున స్పష్టము. (554.)

## 555. దృఢః.

ఈనిత్యశరీరంబుననే ఉపాసకానుగ్రహార్థమై వ్యూహరూపియై అందు కొంచము స్థూలమైనవాడు. (555.)

## 556. సంకర్షణః.

"సఙ్కృషతీతి సఙ్కర్షణః" వాడెవ్వడనగా, చేతనాచేతనంబులను తమయందు ఒకటిగా చేరునట్లు ఆకర్షించు సంకర్షణ భగవంతుడు. (556.)

## 557. అచ్యుతః. (101_320)

"న చ్యవతే ఇతి అచ్యుతః" * చ్యవనోత్పత్తియుక్తేషు బ్రహ్మేన్ద్ర వరుణాదిషు। యస్మాన్నచ్యవసే స్థానాత్ తస్మాత్ సఙ్కీర్త్యసేఽచ్యుతః * అను ఋషి నిరుక్తరీతిగా వ్యూహంబునగూడ తన స్థానంబునుండి జారనివాడు. (557.)

## 558. వరుణః.

"వ్రియతే సర్వమనేనేతి వరుణః" * తేనేదమావృతమ్ * అనినట్లు సమస్తంబును ఆవరించియుండువాడు. (558.)

## 559. వారుణః.

"వృణుతే ఇతి వరుణః, తత్రభవః వారుణః" * తేషు చాప్యహమ్ * (గీ. 9_21) [వారలయందును నేనుందును] అనినిట్లు తన్ను వరించువారలగు పలువురను గలవాడు.] (559.)

560. వృక్షః. 561. పుష్కరాక్షః. 562. మహామనాః.
563. భగవాన్. 564. భగహా.

వృక్షః = వరించువాడు. పుష్కరాక్షః = పోషించు నేత్రములం గలవాడు. మహామనాః = ఉదారమగు హృదయము గలవాడు. భగవాన్ = పూజ్యుడు. భగహా = షాడ్గుణ్య పరిపూర్ణుడు.

---

## 560. వృక్షః.

"వృక్షతే వృణీతే ఇతి వృక్షః" అట్లు తన్ను వరించువారలలో తన్ను ఎవ్వరు నీడవలె అను వర్తింతురో; వారలకు తన సర్వస్వంబునిచ్చి వారల యప రాధంబులను సహించుచు వారలను వరించువాడు.

* నివాసవృక్షః సాధూనామాపన్నానాం పరాగతిః * (రా. కి. 15-19) [సాధువులు ఉజ్జీవింపదగిన వృక్షము. ఆపదనొందినవారలకు శరణము.] (560.)

## 561. పుష్కరాక్షః. (40)

"పుష్కరే అక్షిణీ యస్యసః పుష్కరాక్షః" వారలయందు కృపను వర్షించి పోషించు నేత్రలంగలవాడు. (561.)

## 562. మహామనాః.

"మహత్ మనః యస్యసః మహామనాః" వారలయందు అత్యుదారంబగు హృదయము గలవాడు. (562.)

## 563. భగవాన్.

"భగః అస్యాఽస్తీతి భగవాన్" ఇట్లు సమస్తదోషంబులకును విరోధియై కల్యాణగుణస్వరూపియై యుండుటచే పరమపూజ్యుడై యుండువాడు. (563.)

## 564. భగహా.

"భగమ్ షాడ్గుణ్యమ్ హన్తి ప్రాప్నోతీతి భగహా" * ఐశ్వర్యస్య సమగ్రస్య వీర్యస్య యశసః శ్రియః। జ్ఞానవైరాగ్యయోశ్చైవ షణ్ణాం భగ ఇతీరణా * (వి. పు. 6-5-74) [ఐశ్వర్యము వీర్యము యశస్సు సంపద జ్ఞానము వైరాగ్యము అను నీయాఱు గుణంబులకు భగంబనిపేరు.] అను వచనరీతిగా భగమనగా షాడ్గుణ్యము దానిని హన్తి = పొందుచున్నాడు. (హన హింసాగత్యోః అని ధాతువు. ఇచట గమనార్థకము.) జ్ఞానైశ్వర్యాది గుణంబులచేతను అటులే ప్రకాశించువాడు. ఇచట శ్రీ విష్ణు పురాణంబున ఆఱవ యంశంబున చెప్పబడిన భగవచ్ఛబ్ద నిర్వచన ప్రకరణంబను సంధేయము. (564.)

365. నన్దీ (ఆనన్దీ.) 566. వనమాలీ.
567. హలాయుధః. 568. ఆదిత్యః.

ఆనన్దీ = (1) నందగోపుని తండ్రిగాగలవాడు. (2) ఆనందించువాడు. వనమాలీ = వనమాలను గలవాడు. హలాయుధః = నాగలిని ఆయుధముగా గలవాడు. ఆదిత్యః = (1) 'అ' అను అక్షరముచే పొందదగినవాడు. (2) దేవకీ సుతుడు.

---

## 565. (1) నన్దీ. (2) (ఆనన్దీ.)

"నన్దః అస్యాస్తీతి నన్దీ" (1) వ్యూహంబున నిట్లు సంకర్షణుడైయుండి తన బలభద్రావతారంబున నందగోపుని తండ్రిగా గలవాడు.

(2) 'ఆనన్దీ' అనియు పదచ్ఛేదముగలదు. అప్పుడు "ఆనన్దః అస్యాస్తీతి ఆనన్దీ" గోపికలను మధువును అనుభవించుటచే ఆనందించువాడు అని యర్థము. (565.)

## 566. వనమాలీ.

"వనమాలా అస్యాస్తీతి వనమాలీ" తన సృష్టికిజెందిన గంధాభిమానియగు వైజయన్తియను మాలనుధరించువాడు. (566.)

## 567. హలాయుధః.

"హలమ్ ఆయుధమ్ యస్యసః హలాయుధః" క్రిందజెప్పిన భూతములకు సమృద్ధిని గల్గించు హలము (నాగలి) అను నాయుధంబును ధరించినవాడు.

* బలభద్రం సమృద్ధ్యర్థం సీరకర్మణి చిన్తయేత్ * [భూమిని దున్నుకాలంబున సమృద్ధికై బలరాముని చింతింపగలడు.] (567.)

## 568. ఆదిత్యః. (39)

(1) "ఆతా ఇత్యః అదిత్యః" తన (సంకర్షణ) బీజమంత్రమగు 'అకారము' చేత (ఆయను అక్షరముచేత) పొందదగినవాడు.

(2) "అదిత్యాః దేవక్యాః అపత్యంపుమాన్ ఆదిత్యః" పూర్వజన్మంబున అదితిగానుండిన దేవకికి పుత్రుడు.

* దాక్షాయణీ త్వమదితిః సంభూతా వసుధాతలే। నిత్యైవ త్వం జగద్ధాత్రీ ప్రసాదంవై కరోమ్యహమ్ * (వి. ధ. 63-44) [దాక్షాయణీ! పూర్వము నీవు అదితిగా జనించితివి. అట్టి నిన్ను నేనిప్పుడనుగ్రహించుచున్నాను.] అని దేవకితో భగవంతుడు చెప్పెను. (568.)

(అవతారిక.) ఇక నారాయణ విషయము చెప్పబడును.

569. జ్యోతిరాదిత్యః. 570. సహిష్ణుః.
571. గతిసత్తమః. 572. సుధన్వా.

జ్యోతిరాదిత్యః = జ్యోతిర్మయుండగు నాదిత్యుడు. సహిష్ణుః = సహించినవాడు. గతిసత్తమః = గతియని నమ్మి ఆశ్రయింపదగినవాడు. సుధన్వా = మంచిధనుస్సును ధరించినవాడు.

---

## 569. జ్యోతిరాదిత్యః.

“జ్యోతిశ్చాసౌ ఆదిత్యశ్చ జ్యోతిరాదిత్యః” ఈతనితేజస్సున సూర్యుని తేజస్సు చీకటివలె నగుటచే వీడు జ్యోతి స్వరూపుండగు నాదిత్యుడు.

* తయోర్భవేన యుధ్యతోః। నిష్ప్రభాణిచ తేజాంసి బ్రహ్మాచైవాఽఽసనాచ్చ్యుతః ✦ (భా. శాం. 344_90) [వారిద్దఱును రుద్రునితో యుద్ధముచేయునప్పుడు తేజస్సులన్నియు కాంతిని వీడినవయ్యె. బ్రహ్మకూడ ఆసనంబునుండి జాఱెను.] (569.)

## 570. సహిష్ణుః. (146.)

“సహతే ఇతి సహిష్ణుః” అప్పుడు బ్రహ్మాదులయపరాధంబును సహించినవాడు.

* ప్రసాదయామాస భవః దేవం నారాయణం ప్రభుమ్। శరణం జగతామాద్యం వరేణ్యం వరదం హరిమ్। తదైవనరదో దేవః జితక్రోధః జితేంద్రియః। ప్రీతిమానభవత్తత్ర రుద్రేణ సహసజ్గతః * (భా. శా. 344_119) [జగంబులకు ఆదియై సర్వశ్రేష్ఠుడై అభీష్టంబులనిచ్చువాడై సమస్తపాపహరుడై సర్వవ్యాపకుడైయుండు శ్రీమన్నారాయణుని రుద్రుడు ప్రార్థించెను. అటులే అభీష్టంబులను తీర్చు ఆదేవదేవుడు కోపము తొలగి అతిప్రీతితో రుద్రునితో గూడెను.] (570.)

## 571. గతిసత్తమః.

“గతౌ సత్తమః గతిసత్తమః” అతడే పరమధర్మముల నుపదేశించు నాచార్యుడైయుండుటచే గతియని నమ్మి ఆశ్రయింపదగినవాడు.

* అహోహ్యనుగృహీతోఽద్య ధర్మ ఏభిః సురైరిహ * (భా. శా. 335_17) [ఈ దేవతలచే ధర్మమిప్పుడు అనుగ్రహింపబడియె.] (571.)

## 572. సుధన్వా.

“సు శోభనం ధనుః యస్యసః సుధన్వా” అమృతార్థమై దేవాసురులకు యుద్ధము గల్గినప్పుడు అసురసంహారార్థమై మంచి ధనుస్సును ధరించినవాడు. (572.)

573. ఖణ్డపరశుః. 574. దారుణః 575. ద్రవిణప్రదః
576. దివిస్పృక్. 577. సర్వదృక్.

ఖణ్డపరశుః = పరశువును ఖండించినవాడు. దారుణః = భయంకరుడు. ద్రవిణప్రదః = ధనమువంటి శాస్త్రములనిచ్చినవాడు. దివిస్పృక్ = పరమపదంబును స్పృశించినవాడు. సర్వదృక్ = సమస్తంబును చూచినవాడు.

---

## 573. ఖణ్డపరశుః.

"ఖణ్డః పరశుః యేనసః ఖణ్డపరశుః" రుద్రసంబంధమగు యుద్ధంబున పరశువును (గండ్రగొడ్డలిని) ఖండించినవాడు.

* అథ రుద్రవిఘాతార్థం ఇషీకాం నర ఉద్ధరన్ । మన్త్రైశ్చ సంయుయోజాశు సోఽభవత్ పరశుర్మహాన్ । క్షిప్తశ్చ సహసారుద్రే ఖణ్డనం ప్రాప్తవాంస్తదా । తతోఽహం ఖణ్డపరశుః తతః పరశుఖణ్డనాత్ * (భా. శా. 344-86) (573.)

## 574. దారుణః.

"దారయతీతి దారుణః" ఇట్లు బాహ్యశత్రువులను ఆంతరశత్రువులను ఖండించుటచే భయంకరుడు. (574.)

(అవతారిక.) ఇక వ్యాసావతారము.

## 575. ద్రవిణప్రదః.

"ద్రవిణం ప్రదదాతీతి ద్రవిణప్రదః" ధనమువలె నతి శ్లాఘ్యములగు సమస్త శాస్త్రంబులను వాని యర్థంబులను జనంబులకు నిచ్చినవాడు.

* వహాన్యే వామహస్తేన సర్వశాస్త్రార్థసఞ్చయమ్ । దక్షిణేనచ శాస్త్రార్థాన్ ఆదిశంశ్చ యథాస్థితాన్ * [సకల శాస్త్రార్థంబులను వామ (ఎడమ) హస్తమున ధరించి కుడిచేతితో ఆ యర్థంబులను ఉపదేశించుచు నుండు వ్యాసమూర్తిని ధ్యానింతము.] అని వారిధ్యాన శ్లోకము. (575.)

## 576. దివిస్పృక్.

"దివి స్పృశతీతి దివిస్పృక్" పరమపదంబుననుండు తత్వరహస్యంబును గూడ పరవిద్యచే స్పృశించినవాడు. అనగా, పరమార్థంబు నెఱింగినవాడని భావము. ఇది వారి మంత్రంబున ప్రసిద్ధము. (576.)

## 577. సర్వదృక్. (201)

"సర్వం పశ్యతీతి సర్వదృక్" ఇతరంబులగు సమస్తవైభవంబులను చూచినవాడు. (577.)

578. వ్యాసః. 579. వాచస్పతిః. 580. అయోనిజః.
581. త్రిసామా. 582. సామగః.

వ్యాసః = వేదంబులను విభజించినవాడు. వాచస్పతిః = మహాభారతంబును రచించినవాడు. అయోనిజః = అయోనిజుడు. త్రిసామా = సామ త్రయంబును గలవాడు. సామగః = సామములను గానముచేయువాడు.

---

## 578. వ్యాసః.

"వ్యస్యన్తే విభజ్యన్తే వేదాః అనేనేతి వ్యాసః" యుగానుసారముగా మందమతులగు మనుష్యుల క్షేమార్థమై వేదంబులను విభజించినవాడు.

* యుగానుసారబోధానామఖేదజననాయవై । విభజంస్తు చతుర్ధావై వేదమేతం త్రికాలవిత్ * [యుగంబునకు దగిన జ్ఞానముగల జనంబులకు సుఖముగా నుండ గోరి త్రికాలజ్ఞులగు వ్యాసులు మొత్తముగానుండిన వేదంబును నాలుగువిధములుగా విభజించెను.] (578.)

## 579. వాచస్పతిః. (218)

ఐదవవేదమగు మహాభారత వాక్యములకు స్వామి. (579.)

## 580. అయోనిజః.

"న యోనిజః అయోనిజః" సారస్వతావతారంబున భగవంతునివాక్కునం జనించియుండుటచే అయోనిజుడు.

* అథ భూయో జగత్స్రష్ట్వా భోశబ్దేనానువాదయన్ । సరస్వతీ ముచ్చచార తత్ర సారస్వతోఽభవత్ * (భా. శాం. 350_37) [అనంతరము ఒళ్ళి ముల్లోకం బును సృజించి 'ఓమ్' అను శబ్దమునుచ్చరించి సరస్వతిని ఉచ్చరించెను. దాని నుండి సారస్వతుడు పుట్టెను.] (580.)

## 581. త్రిసామా.

"త్రీణి సామాని యస్యసః త్రిసామా" బృహత్తు రథంతరము వామదేవ్యము అను మూడు సామంబులచే గానము చేయబడినవాడు. (581.)

## 582. సామగః.

"సామాని గాయతీతి సామగః" తానుగూడ తనయనుభవంబుచే గల్గిన ప్రీతిచే అట్టి సామములను గానము చేయువాడు. (582.)

583. సామ. 584. నిర్వాణమ్. 585. భేషజమ్.
586. భిషక్. 587. సన్న్యాసకృత్,

సామ = పాపములను నాశము చేయువాడు. నిర్వాణమ్ = పరమగతికి నిమిత్తమైనవాడు. భేషజమ్ = పరమౌషధమైనవాడు. భిషక్ = వైద్యుడు. సన్న్యాసకృత్ = సాత్త్వికత్యాగంబుచే భేదించువాడు.

---

## 583. సామ.

"స్వగాయకానాం పాపం స్యతి నాశయతీతి సామ" తన్ను గానము చేయువారలపాపములను నాశము చేయువాడు. (583.)

## 584. నిర్వాణమ్.

ఇట్లు పాపము తొలగినవారలకు పరమగతికి నిమిత్తమైనవాడు. (584.)

## 585. భేషజమ్.

* దేవాః దేవర్షయశ్చైవ యం విదుః దుఃఖభేషజమ్ * అనినట్లు సంసారంబను వ్యాధికి పరమౌషధమయినవాడు. (585.)

## 586. భిషక్.

"భిషజ్యతి చికిత్సతీతి భిషక్" సంసారంబనురోగమునకు కారణంబు నెఱింగి చికిత్స చేయువైద్యుడు. (586.)

(అవతారిక.) అతడెట్లు చికిత్సజేయుననగా ;

## 587. సన్న్యాసకృత్.

"సన్న్యాసేన కృన్తతీతి సన్న్యాసకృత్" విషయంబునందు వైరాగ్యంబును గలిగించువాడు. నాది అనునభిమానంబును తొలగించుట అను సాత్త్వికభరన్యాసము సన్న్యాసము. దానిచే రజస్తమస్సులను ఛేదించువాడు. భరన్యాసంబనగా భర్తయగు పరమపురుషునియందు తన భారంబును పెట్టుట.

* వేదాన్త విజ్ఞానసునిశ్చితార్థాః * (తై. ఉ. 10-24) [వేదాంతంబును విభజించి యెఱింగి దానిచే పరమార్థంబును నిశ్చయించినవారు.] (587.)

588. శమః. 589. శాన్తః. 590. నిష్ఠా.
591. శాన్తిః. 592. పరాయణమ్. 593. శుభాఙ్గః.

శమః = శాంతిని ఉపదేశించువాడు. శాన్తః = శాంతుడు. నిష్ఠా = స్థిరమై యుండు స్థలము. శాన్తిః = మఱచునట్లు చేయువాడు. పరాయణమ్ = పరమభక్తిని గల్గించువాడు. శుభాఙ్గః = అష్టాంగములను ఇచ్చువాడు.

---

## 588. శమః.

"శాన్త్యుపాయమాచష్టే ఇతి శమః" దీనికై ఇచ్ఛ భయము కోపము మున్నగువానిని అణచవలయునను ఉపాయము నుపదేశించువాడు. (588.)

## 589. శాన్తః.

"శామ్యతీతి శాన్తః" సముద్రమువలె అపారమహిమ గలిగియుండియు అలలేక స్తబ్దముగానుండు సముద్రమువలె కొంచమైనను అహంకారములేక శాంతుడై యుండువాడు. (589.)

## 590. నిష్ఠా.

"నిష్ఠీయతే అస్మిన్నితి నిష్ఠా" విరక్తులగు మహనీయుల హృదయంబులను స్థిరముగా నసింపదగిన స్థలముగా నొందియుండువాడు. (590.)

## 591. శాన్తిః.

"శ్యామ్యన్తి అస్మిన్నితి శాన్తిః" వారు పరసమాధినుండి తన్ను అనుభవించునప్పుడు తాముండుస్థితిని మఱచునట్లు చేయువాడు. (591.)

## 592. పరాయణమ్.

"పరమ్ అయనం అస్మాదితి పరాయణమ్" అట్లు సమాధినొందినవారలకు వెంటనే మోక్షంబునిచ్చు పరమభక్తిని అనుగ్రహించు ఉపాయమైనవాడు.

✦ నిర్మమః శాన్తః...మద్భక్తిం లభతే పరామ్ * (గీ. 18-53,54) [మమకారము తొలగినవాడు శాంతుడు...నాయందు పరమభక్తిని పొందగలడు.] (592.)

## 593. శుభాఙ్గః. (788)

"శుభాని అఙ్గాని యస్యసః శుభాఙ్గః" ఇట్లు తనయందు భక్తిసేయుటకు అనువగు § అష్టాంగములను ఇచ్చువాడు. (593.)

---

§ అష్టాంగములు (1) యమము (2) నియమము (3) ప్రాణాయామము (4) ప్రత్యాహారము (5) ధ్యానము (6) ధారణ (7) మననము (8) సమాధి అనునవి.

594. శాన్తిదః. 595. స్రష్టా.
596. కుముదః. 597. కువలేశయః.

శాన్తిదః = శాంతి నిచ్చినవాడు. స్రష్టా = సృజించువాడు. కుముదః = ప్రకృతి మండలంబున సంతసించువాడు. కువలేశయః = జీవులను నియమించు వాడు.

---

## 594. శాన్తిదః.

"శాన్తిం దదాతీతి శాన్తిదః" ఇట్లు భక్తియోగము చేకూడినవారలకు మళ్ళి సంసారమార్గంబున కేగకుండునట్లు తన సాయుజ్యంబను శాంతినిచ్చువాడు.

* విశ్వస్యైకం పరివేష్టితారం జ్ఞాత్వా శివం శాన్తి మత్యన్త మేతి * (శ్వే-ఉ. 2-7) [లోకమంతయు నొకడై వ్యాపించి మంగళాకారుడై యుండు పరమాత్మను ఎఱింగి పరమశాంతిని పొందుచున్నాడు.] * తత్ప్రసాదాత్ పరామ్ శాన్తిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్ * (గీ. 18-62) [ఆసర్వేశ్వరునియనుగ్రహంబుచే పరమ శాంతిని శాశ్వతమైన స్థానమును పొందగలవు.] (594.)

## 595. స్రష్టా. (990)

"సృజతీతి స్రష్టా" ఇట్లు మోక్షాపేక్షగలవారలను ప్రకృతినుండి విడిపించి, భోగంబునిచ్చుగల వారలను వారల కర్మానుసారముగా సృజించువాడు. (595.)

## 596. కుముదః. (813)

"కౌ మోదతే ఇతి కుముదః" ఇట్లు బ్రహ్మాది స్తంబపర్యంతముగల ప్రాణులకు వారల స్థితికి దగిన భోగంబులను గల్గించు భూమియగు ప్రకృతిమండలంబున ఆ ప్రాణులను చేర్చి అనుభవింపజేసి తాను సంతసించువాడు.

" అనీశశ్చాత్మా బధ్యతే భోక్తృభావాత్ * (శ్వే. ఉ. 1-8.) [పరతంత్రుడగు ఆత్మ భోక్తయై కట్టుపడును.] (596.)

## 597. కువలేశయః.

"కౌ భూమౌ ఆసంసారం భ్రామ్యన్తీతి కువలాః జీవాః, కువలాశ్చతే ఈశాశ్చ కువలేశాః, కువలేశాన్ యాతీతి కువలేశయః" భూమిలో సంసారమున్నంత

598. గోహితః. 599. గోపతిః. 600. గోప్తా.

గోహితః = ప్రకృతికి వ్యవస్థాపకుడు. గోపతిః = స్వర్గమునకు నాథుడు. గోప్తా = రక్షకుడు.

---

వఱకు చుట్టుచునుండుటచే 'కువలాః' అనగా జీవులు 'కువలేశాః' తమ దేహేంద్రియాదులకు తామే యీశ్వరులుగా అభిమానించియుండువారు. అట్టి వారలను అటులే అభిమానించియుండునట్లు నియమించువాడు. (అనగా తమదేహంబులకు తామే యీశ్వరులమని యభిమానించియుండువారలను అటులేయుండునట్లు నియమించువాడని భావము.) (597.)

598. గోహితః.

"గోః ప్రకృతేః హితః గోహితః" సంసారంబను విత్తనంబును చల్లు భూమి యగు ప్రకృతి మండలంబున కధిష్ఠాతయై కార్యము చేయుటచే వ్యవస్థాపకుడు. (598.)

599. గోపతిః. (497)

"గోః భూమేః పతిః గోపతిః" భోగభూమియగు స్వర్గంబునకుగూడ నాథుడు. (599.)

600. గోప్తా. (498)

"గోపాయతీతి గోప్తా" కర్మఫలంబగు ఈ చక్రమును రక్షించువాడు. (600.)



శ్రీమతే రామానుజాయనమః.

# సప్తమ శతకము.

## 601. వృషభాక్షః. 602. వృషప్రియః. 603. అనివర్తీ-

వృషభాక్షః = ధర్మమును బండికన్నుగాగలవాడు. వృషప్రియః = ధర్మములను ప్రియములుగాగలవాడు. అనివర్తీ = నివర్తింప జేయనివాడు.

---

### 601. వృషభాక్షః.

"వృషభః అక్షః యస్యసః వృషభాక్షః" వృషభ మనగా ధర్మము దానినే సంసారంబను చక్రంబునకు § బండికన్నుగా గలవాడు. (అనగా ధర్మమూల ముగా కర్మఫలములను రక్షించువాడు అని భావము.) (601.)

### 602. వృషప్రియః.

"వృషా ప్రవర్తకనివర్తకా ధర్మా ప్రియా యస్యసః వృషప్రియః" ఇట్లు ప్రవర్తక నివర్తక ధర్మములను ప్రియములుగా గలవాఁడు. వానికి ప్రియముగానుండుటచేతనే ఈ రెండు కర్మములును ధర్మములైనవి. శ్రుతిలో 'చేయవలయును' అని విధించు విధియు వాని ప్రీతినే దెల్పుచున్నవి. ఇది "ఫలమత ఉపపత్తేః * (బ. సూ. 3. 2. 37.) అను బ్రహ్మ సూత్ర వ్యాఖ్యానంబున స్పష్టము. కనుకనే ద్రమిడాచార్యులు గూడ ఇట్లనిరి:—

* ఫల సంబిభత్సయాహి కర్మభిరాత్మానం పిప్రీషన్తి। సప్రీతో ఽలం ఫలా యేతిహి శాస్త్రీ) మర్యాదా * [ఫలము గలుగవలయునను నిచ్ఛతోనే కర్మంబుల నొనరించి పరమాత్మను తృప్తిజెందించుచున్నారు. వాఁడు ప్రీతుఁడైనచో ఫలంబునివ్వఁగలడనియే శాస్త్ర మర్యాద.] అని. (602.)

### 603. అనివర్తీ.

"ప్రవృత్తిరతాన్ సంసారాత్ న నివర్త యతీతి అనివర్తీ" వారలలో ప్రవృత్తిధర్మనిష్ఠులను ధూమాదిమార్గంబుచే పితృలోకాదుల నొందజేసి మళ్ళి సంసారంబునకే మఱలించుటచే వారలను సంసారమండలంబునుండి నివర్తింపజేయని వాఁడు. కనుకనే సంసారము విరామములేకున్నది.

---

§ క్రింద చెప్పఁబడిన కర్మఫలంబునకు ధర్మము సాధనమగుటచే కర్మ ఫలము చక్రమైనప్పుడు ఇది బండికన్నుగానుండుట న్యాయమే.

604. నివృత్తాత్మా. 605, సంక్షేప్తా. 606. క్షేమకృత్.
607. శివః. 608. శ్రీవత్సవక్షాః.

నివృత్తాత్మా = నివృత్తి ధర్మనిష్ఠులగు ఆత్మలను గలవాడు. సంక్షేప్తా = సంకోచింప జేయువాడు. క్షేమకృత్ = క్షేమము గల్గించువాడు. శివః = మంగళకరుడు. శ్రీవత్సవక్షాః = శ్రీవత్సంబును వక్షంబున గలవాడు.

---

* ధూమోరాత్రి స్తథా కృష్ణః షణ్మాసాః దక్షిణాయనమ్। తత్రచాన్ద్రమసం జ్యోతిః యోగీ ప్రాప్య నివర్తతే * (గీ. 8. 25.) [ధూమము రాత్రి కృష్ణపక్షము దక్షిణాయనము వీనిలో మరణించిన యోగి చంద్రతేజంబునొంది మఱలును.] * కృతాత్యయేనుశయవాన్ * (3. 1. 8.) అను బ్రహ్మసూత్ర వ్యాఖ్యానంబున ఈ విషయము విచారింపబడియుండును. (603.)

## 604. నివృత్తాత్మా. (231-453-780.)

“నివృత్తాః ఆత్మానః యస్యసః నివృత్తాత్మా” నివృత్తి ధర్మనిష్ఠులగు ఆత్మలను తనదిగా గలవాడు. (604.)

## 605. సంక్షేప్తా.

“సంక్షిపతీతి సంక్షేప్తా” ప్రవృత్తి ధర్మనిష్ఠులయొక్క స్వాభావిక జ్ఞానంబును సంకోచింపజేయువాడు. (605.)

## 606. క్షేమకృత్.

“క్షేమం కరోతీతి క్షేమకృత్” నివృత్తిధర్మనిష్ఠులకు అజ్ఞానసంకోచంబును తొలగించి క్షేమమును (మోక్షమును) కలిగించువాడు. (606.)

## 607. శివః. (27.)

ఇట్లు భోగంబునను మోక్షంబునను అపేక్షగలవారలకు మంగళము గల్గించువాడు.

* సంసారమోక్షస్థితి బంధహేతుః * [సంసారము మోక్షము స్థితి బంధము వీనికి హేతువైనవాడు.] (607.)

## 608. శ్రీవత్సవక్షాః.

“శ్రీవత్సః వక్షసి యస్యసః శ్రీవత్సవక్షాః” నియామ్యులగు చేతన వర్గంబులకన్న వీనిని విభజింపజేయు లక్ష్మీపతిత్వంబనుసదృష్టసూచకంబగు † శ్రీవత్సంబును వక్షంబున గలవాడు. (608.)

---

† మహాపురుషలక్షణంబగు తెల్లని వెండ్రుకలసుడిని శ్రీవత్సమందురు.

609. శ్రీవాసః. 610. శ్రీపతిః.
611. శ్రీమతాంవరః. 612. శ్రీదః.

శ్రీవాసః = లక్ష్మికి వాసస్థానము. శ్రీపతిః = లక్ష్మీపతి. శ్రీమతాంవరః = శ్రీమంతులలో శ్రేష్ఠుడు. శ్రీదః = లక్ష్మికి జీవనాధారముగనుండు వాడు.

---

## 609. శ్రీవాసః.

"శ్రీః వసత్యస్మిన్ ఇతి శ్రీవాసః" శ్రీమహాలక్ష్మి నిత్యము యథేచ్ఛగా విహరించు కల్పక వృక్షంబులు నిండియుండు ఉద్యానమువంటివాడు. (609.)

## 610. శ్రీపతిః.

"శ్రియః పతిః శ్రీపతిః" * తుల్య శీలనయోవృత్తామ్ * (రా. సు. 16.5.) అని నట్లు ఆ లక్ష్మికిఁదగిన స్వయంవర నాయకుఁడు.

* హ్రీశ్చ తే లక్ష్మీశ్చ పత్న్యౌ * (పు. సూ.) [భూదేవియు శ్రీదేవియు నీకు పత్నులు.] * అస్యేశానా జగతో విష్ణుపత్నీ * [విష్ణు పత్ని ఈ జగత్తునకు ఈశ్వరి.] (610.)

## 611. శ్రీమతాం వరః.

శ్రీమహాలక్ష్మి సదా సాదరంబుగా కన్నార జూచియానందించుటకు పాత్రము భగవంతుఁడు. బ్రహ్మాదులోయన్న ; ఆలక్ష్మిఏదేనొక కాలవిశేషంబున ఏదేనొక కార్యార్థమై కటాక్షించునపుడు విధివశంబుగా పడు కటాక్షలేశంబునకు పాత్రులై దానిచే సామ్రాజ్యలక్ష్మినొంది 'శ్రీమాన్' అను పేరును పొందుచున్నారు. కనుక అట్టి బ్రహ్మాదులందఱకును శ్రేష్ఠుఁడు.

* శుక్లమాల్యామ్బరధరా స్నాతా భూషణభూషితా। పశ్యతాం సర్వ దేవానాం యయౌ వక్షస్థలం హరేః। తయా ఽ వలోకితాః దేవాః హరివక్షస్థల స్థయా। లక్ష్మ్యా మైత్రేయ సహసా పరాం నిర్వృతి మాగతాః * (వి. పు. 19-106) [స్నానమొనర్చి తెల్లని మాలలను వస్త్రంబులను ధరించి భూషణంబులచే భూషితయై వచ్చి లక్ష్మి విష్ణువుయొక్క వక్షస్థలంబునొందెను. మైత్రేయా! విష్ణువక్షస్థలంబు నొందిన ఆలక్ష్మిచే కటాక్షింపబడిన దేవతలు పరమతృప్తినొందిరి.] (611.)

## 612. శ్రీదః.

"శ్రియం దదాతీతి శ్రీదః" నిత్యమై నిర్వ్యాజమైయుండు ప్రేమరస సంపదను ఆలక్ష్మికి నిచ్చువాఁడు. అనగా ఆలక్ష్మికి జీవనాధారముగానుండువాఁడు. దీనిని ఆశ్రయించుటచేతనే లక్ష్మికి 'శ్రీః' అను నామముగల్గె.

613. శ్రీశః.　　614. శ్రీనివాసః.
615. శ్రీనిధిః.　　616. శ్రీవిభావనః.

శ్రీశః = లక్ష్మికి నీశుడు. శ్రీనివాసః = లక్ష్మికివాసస్థలము. శ్రీనిధిః = లక్ష్మికి నిధి. శ్రీవిభావనః = లక్ష్మి సంబంధముచేతనే ప్రసిద్ధినొందినవాడు.

---

* నచ సీతా త్వయా హీనా నచా ఽ హమపి రాఘవ। ముహూర్తమపి జీవావః జలాన్మత్స్యావివోద్ధృతౌ * (రా. అ. 53. 31.) [రామా! నిన్ను వీడినచో సీతయు, నేను జీవింపము. అట్లుండినచో; జలంబునుండి యెత్తివేసిన మత్స్యము వలె నొక ముహూర్తమే జీవించియుందుము.] * విష్ణో శ్శేషాఽనపాయినీ * (వి. పు. 19_144.) [లక్ష్మి విష్ణువును వీడకుండును.] (612.)

## 613. శ్రీశః.

(1) "శ్రియః ఈశః శ్రీశః" లక్ష్మికిని లక్ష్మీత్వము గల్గుటకు గారణం బదుటచే లక్ష్మికి నీశుడు.

(2) లేక, "శ్రీః ఈశా యస్యసః శ్రీశః" సర్వావస్థలలోను లక్ష్మిని నియామికగా గలవాడు.

* ఆదావాత్మగుణత్వేన భోగరూపేణ విగ్రహే। అధారకస్వరూపేణ దాసీ భావేన వా సదా * [ఆదిలో ఆత్మగుణముగాను, విగ్రహంబున భోగ్యరూపముగాను ఆధార స్వరూపముగాను, లేక దాసీభావంబుతోను ఉండును.] (613.)

## 614. శ్రీనివాసః. (185)

"శ్రియో నివాసః శ్రీనివాసః" కల్పక వృక్షంబునకు కల్పకవల్లి (తీఁగ) వలె లక్ష్మికి ప్రాపుగా నుండువాడు. (614.)

## 615. శ్రీనిధిః.

"శ్రీః నిధీయతే అస్మిన్నితి శ్రీనిధిః" పెట్టెలో బెట్టబడిన రత్నమాలవలె లక్ష్మి వీనియందు పెట్టబడియుండును. (615.)

## 616. శ్రీవిభావనః.

"శ్రియా విభావ్యతే ఇతి శ్రీవిభావనః" * అప్రమేయం హి తత్తేజః యస్య సా జనకాత్మజా * (రా. ఆ. 37_18) [సీత ఎవనికో ; వాని తేజస్సు బుద్ధికి అగోచరముగా నుండును.] అని మారీచుడు చెప్పినట్లు లక్ష్మిసంబంధముచేతనే ప్రసిద్ధి నొందినవాడు. (616.)

617. శ్రీధరః. 618. శ్రీకరః.
619. శ్రేయశ్శ్రీమాన్. 620. లోకత్రయాశ్రయః.

శ్రీధరః = లక్ష్మిని స్వతః ధరించినవాడు. శ్రీకరః = అవతారములందు తనకుదగినట్లు లక్ష్మినికావించుకొనినవాడు. శ్రేయశ్శ్రీమాన్ = లక్ష్మితో సదా కూడియుండువాడు. లోకత్రయాశ్రయః = ముల్లోకంబునకు ఆశ్రయముగానుండువాడు.

---

## 617. శ్రీధరః.

"శ్రియం ధరతీతి శ్రీధరః" రత్నము కాంతిని, పువ్వు పరిమళంబును, చంద్రుడు వెన్నెలను అమృతము మాధుర్యమును పొందియుండునట్లు లక్ష్మిని స్వభావముగా ధరించినవాడు.

* న విహాతుం మయా శక్యా కీర్తిరాత్మనతా యథా * (రా అ. 30-29) [మనస్వియగు పురుషుడెట్లు కీర్తిని విడువజాలడో ; అటులే ఈసీతను విడువజాలను.]

## 618. శ్రీకరః.

"శ్రియం కరోతీతి శ్రీకరః" పరత్వావస్థలోవలె వ్యూహావతారములలోను తనకు దగినట్లు లక్ష్మిని కావించుకొనినవాడు. అనగా తాను మనుష్యుడుగా పుట్టినప్పుడు లక్ష్మిని మనుష్యదేహముతోను, దేవరూపము నొందినప్పుడు దేవరూపముతోను ఉండునట్లు కావించుకొనినవాడు.

* దేవత్వే దేవదేహేయం మనుష్యత్వేచ మానుషీ । విష్ణోర్దేహానురూపాంవై కరోత్యేషాఽఽత్మనస్తనుమ్ * (వి. పు. 1-9-142) [విష్ణువు దేవరూపముధరించినప్పుడు దేవరూపముతోను మనుష్యరూపము ధరించినప్పుడు మనుష్యరూపముతోను ఇట్లు విష్ణు శరీరంబునకుదగినట్లు తాను శరీరంబునుధరించి వానిని వీడకుండును.]

## 619. శ్రేయశ్శ్రీమాన్.

"శ్రేయసే శ్రీయతే ఇతి శ్రేయశ్శ్రీః, సా నిత్యమస్తీతి శ్రేయశ్శ్రీమాన్" సర్వపురుషార్థములును సిద్ధించుటకై ఆశ్రయింపబడు లక్ష్మితో నిత్యముగూడియుండువాడు. ఇది శ్రీ సూక్త శ్రీరామాయణ శ్రీవిష్ణుపురాణాదులలో ప్రసిద్ధము. (619.)

## 620. లోకత్రయాశ్రయః.

"లోకత్రయస్య ఆశ్రయః లోకత్రయాశ్రయః" జగన్మాతయగు లక్ష్మితో గూడి సదా సమస్తంబునకును తండ్రివలె ఆశ్రయముగా నుండువాడు.

* త్వమ్ మాతా సర్వలోకానాం దేవదేవో హరిః పితా * (వి. పు. 1-9-125) [సమస్తలోకంబునకును నీవు తల్లివి. విష్ణువు తండ్రి.] (620.)

621. స్వక్షః. 622. స్వఙ్గః. 623. శతానన్దః.
624. నన్దిః. 625. జ్యోతిర్గణేశ్వరః.

స్వక్షః = మంచి నేత్రాది కరణంబులను గలవాడు. స్వఙ్గః = దివ్యశరీరముగలవాడు. శతానన్దః = అపరిమితమగు ఆనందముగలవాడు. నన్దిః = సమృద్ధుడు. జ్యోతిర్గణేశ్వరః = నిత్యసూరులకు నీశుడు.

---

## 621. స్వక్షః.

“ శోభనమ్ అక్షి యస్యాసః స్వక్షః ” లక్ష్మీసౌందర్యంబను అమృతసముద్రంబును పూర్ణముగా అనుభవింపదగిన నేత్రాదికరణములుంగలవాడు. (621.)

## 622. స్వఙ్గః.

“ సు శోభనమ్ అఙ్గం యస్యాసః స్వఙ్గః ” ఆలక్ష్మియు కోరదగిన దివ్యదేహము గలవాడు. (622.)

## 623. శతానన్దః.

“ శతమ్ అపరిమితః ఆనన్దః యస్యాసః శతానన్దః ” పరస్పరము ప్రవాహరసము ప్రవహించు అపరిమితానందము గలవాడు. (623.)

## 624. నన్దిః.

“ నందతి సమృద్ధ్యతీతి నన్దిః ” ఇట్లు పెల్లుబ్బుడును అంతటను సర్వప్రకారంబులచేతను ఈ లక్ష్మిచే సమృద్ధిబొందినవాడు. (624.)

## 625. జ్యోతిర్గణేశ్వరః.

“ జ్యోతిర్గణస్య ఈశ్వరః జ్యోతిర్గణేశ్వరః ” జ్యోతిశ్శబ్దము ప్రశస్తము * మహీనాం పదమస్మి దేవాః * (పు. సూ.) [పరమాత్మయొక్క జ్యోతిర్మయంబగు స్థానంబును గోరుచున్నారు] * పూర్వే సాధ్యాస్సన్తి దేవాః * (పు. సూ.) [పరమసాధ్యము చేకూడిన దేవులు గోరుచున్నారు] అను ప్రమాణములచేతగా సదా ప్రకాశించు నిత్యసూరులను చెప్పును. ఇద్దఱును (అనగా లక్ష్మికిని నారాయణునకును) అనుకూలురై తేజోరూపులై ప్రకాశించు అనంత గరుడవిష్వక్సేనాదిపరిచారకగణంబులచే సేవింపబడుటచే వారలకు నీశ్వరుడు.

(అవతారిక.) ఇట్లు ఇంతవఱకు పరావస్థలోనిరహస్యము చెప్పబడెను. ఇక సౌశీల్యముయొక్క పరమావధిలోని రహస్యమును చెప్పుచున్నారు.

34

626. విజితాత్మా. 627. విధేయాత్మా. 628. సత్కీర్తిః.
629. ఛిన్నసంశయః. 630. ఉదీర్ణః.

విజితాత్మా = భక్తులచేజయింపబడిన మనస్సుగలవాడు. విధేయాత్మా=భక్తులకు విధేయమగు మనస్సుగలవాడు. సత్కీర్తిః = మంచికీర్తిగలవాడు. ఛిన్నసంశయః = ఆశ్రయణ విషయంబునగల్గు సందేహంబులను దీర్చువాడు. ఉదీర్ణః = ప్రకాశించువాడు.

---

## 626. విజితాత్మా.

“విజితః ఆత్మా యస్యసః విజితాత్మా” ఇట్లు మహాలక్ష్మితో నిత్యసంబంధము నొందిన మనస్సుగలవాడయ్యు తన్నాశ్రయించినవారలకు వశమయిన మనస్సు గలవాడు. (626.)

## 627. విధేయాత్మా.

“విధేయః ఆత్మా యస్యసః విధేయాత్మా” ఆభక్తులకు విధేయుడైనప్పుడు వారు ‘ఇచటికి రమ్ము, ఇచటనుండుము, ఇచటగూర్చుండుము, దీనిని భుజించుము’ అని విధించునట్లుండువాడు. (627.)

## 628. సత్కీర్తిః.

“సతీ కీర్తిః యస్యసః సత్కీర్తిః” ఇట్టి సౌశీల్యముండియు మంచి కీర్తి గలవాడు.

* యథా సర్వేశ్వరః కృష్ణః ప్రోచ్యతే సర్వపణ్డితైః। తథాపి స్వల్పమేవోక్తం భూతార్థే కతమా స్తుతిః * [కృష్ణుని సర్వేశ్వరునిగా పండితులు చెప్పుచున్నారు. అది స్వల్పమాత్రమేయగును. యథార్థవిషయంబున స్తోత్రమెంత ?] * స్థానే హృషీకేశ తవ ప్రకీర్త్యా * (గీ. 11_36.) [కృష్ణా నీకీర్తిచే లోకమంతయు సంతసించుచున్నది.] (628.)

## 629. ఛిన్నసంశయః.

“ఛిన్నః సంశయః యేనసః ఛిన్నసంశయః” ఇట్లు సౌశీల్యగుణయుక్తుడగుటచే తన్ను ఎఱుంగుటయు సాధించుటయు పొందుటయు సులభమో దుర్లభమో అని అవ్విషయంబున గల్గు సందేహంబులను తొలగించువాడు. (అనగా తనవిషయంబున గల్గు సందేహములను సౌలభ్యంబుచే తీర్చువాడు, అని భావము.) (629.)

## 630. ఉదీర్ణః.

అది యెట్లనగా ? (ఉదీర్ణః) కర్మచక్షుస్సులును (సంసారులును) ప్రత్యక్షముగా చూడనగునట్లు రామకృష్ణాదిరూపములతో అవతరించినవాడు. (630.)

631. సర్వతశ్చక్షుః. 632. అనీశః. 633. శాశ్వతస్థిరః.
634. భూశయః. 635. భూషణః.

సర్వతశ్చక్షుః = అందఱ నేత్రములును తనమీద నేగలవాడు. అనీశః = పరతంత్రుడు. శాశ్వతస్థిరః = సదా స్థిరముగా నుండువాడు. భూశయః = దివ్య దేశములందు ఆవిర్భవించువాడు. భూషణః = ఇట్టి శీలగుణంబుచే తన్ను అలంకరించుకొన్నవాడు.

---

## 631. సర్వతశ్చక్షుః.

"సర్వతః చక్షూంషి యస్యసః సర్వతశ్చక్షుః" అట్లనతరించి అస్మదాదుల నేత్రములకు సాక్షాత్కరించుటచే అందఱ నేత్రములును వీనియందే గలవాడు. దీనిచే సంశయము తొలగిన విధము చెప్పబడినదాయె. స్పష్టమై ప్రత్యక్షమైయుండు విషయంబున సందేహమునకు ప్రసక్తియేలేదుగదా ? కనుకనే "ఛిన్నసంశయః" అని చెప్పబడియె. (631.)

## 632. అనీశః.

"న ఈశః అనీశః" అటులే స్నానము అలంకారము మున్నగు తన వ్యాపారములన్నియు వారలయధీనముగా నుండుటచే వారలకు వీడు పరతంత్రుడు. (632.)

## 633. శాశ్వతస్థిరః.

"శాశ్వతశ్చాసౌ స్థిరశ్చ శాశ్వతస్థిరః" అటులే సదా ప్రత్యక్షముగా సేవించి యనుభవించునట్లు అనేకబింబములను తనశరీరముగా ధరించి ఎల్లప్పుడు నుండువాడు. (633.)

## 634. భూశయః.

"భూషు శేతే ఇతి భూశయః" భక్తులు తన నిత్యసాన్నిధ్యంబు నపేక్షించి స్వయంవ్యక్తమానుషాదిరూపమైయుండు ఆయతనాది (ఇల్లు - గుడి మున్నగునవి) భూములంజూపి ఇచటనుండవలయునని ప్రార్థింపగా, వారలననుగ్రహించుటకై వానిలో నావిర్భవించువాడు. (634.)

## 635. భూషణః.

"భూషయతీతి భూషణః" ఇట్టిశీలగుణాతిశయంబుచే శ్రియఃపతియగు తన్ను అలంకరించుకొనువాడు.

శ్రీమంతులు నిత్యదరిద్రుల గృహంబుల కతిథులైవచ్చి వారలిచ్చు భోజనంబుల నారగించి (భుజించి) వారలతో సమానయోగక్షేమముగానుండినచో అది వారలకు (శ్రీమంతులకు) దూషణము కాజాలదు భూషణమే యగును. (635.)

636. భూతిః. 637. విశోకః-అశోకః. 638. శోకనాశనః.
639. అర్చిష్మాన్. 640. అర్చితః.

భూతిః = భక్తులకు ఐశ్వర్యముగా నుండువాడు. విశోకః (అశోకః) = శోకము తొలగినవాడు. శోకనాశనః = దుఃఖమును తొలగించువాడు. అర్చిష్మాన్ = తేజముగలవాడు. అర్చితః = అర్చావతారంబుగలవాడు.

---

## 636. భూతిః.

ఇతరోపాయంబులను ఎఱుంగనివారలకు పుత్రమిత్రక్షేత్రాది ఐశ్వర్యములుగా నుండువాడు. (636.)

## 637. విశోకః - అశోకః. (338.)

"విగతః శోకః యస్యసః విశోకః" ఇట్లు ఒకప్రాణినైనను నాథహీనముగా విడువకుండుటచే ఆవిషయంబున శోకము తొలగినవాడు. "అశోకః" అనియు పాఠముగలదు. అప్పుడు నిదియే యర్థము. (637.)

## 638. శోకనాశనః.

"శోకం నాశయతీతి శోకనాశనః" వారలకు తనవియోగంబునే గల్గు శోకంబును తొలగించువాడు.

* సోఽహం భగవశ్శోచామి తమ్మాభగవాన్ శోకస్య పారం తారయతు * (ఛా. ఉ. 7-1-3.) [స్వామీ! అట్టి నేను దుఃఖించుటచే మహాత్ములగు మీరు ఆశోకమును తీర్చవలయును.] (638.)

## 639. అర్చిష్మాన్.

"అర్చిః అస్యాస్తీతి అర్చిష్మాన్" వారలయొక్క బాహ్యనేత్రము అభ్యంతరనేత్రము అనురెండు నేత్రంబులను తెలిపించు దివ్యతేజంబునుగలవాడు. (639.)

## 640. అర్చితః.

"అర్చా అస్య సఞ్జాతా ఇతి అర్చితః" ఇట్లు ప్రకాశించు అర్చావతారంబును ధరించినవాడు.

ఈయర్చావతారము, పరత్వమువలె దూరదేశముననుండునదిగాదు. విభవావతారమువలె ఏదేనొక కాలవిశేషంబున ఏదేనొక స్థలవిశేషంబునమాత్రమే యుండునదిగాదు. ఎల్లప్పుడును సకలక్షేత్రగృహములలో ప్రత్యక్షముగానుండును. దీనితత్వరహస్యము భగవచ్ఛాస్త్రము బోధాయనస్మృతి వైష్ణవస్మృతి పురాణములు మున్నగువానిలోను విష్ణుధర్మముననుసుప్రసిద్ధము.

## 641. కుమ్భః.　　　642. విశుద్ధాత్మా.

కుమ్భః = కోరబడినవాడు.　విశుద్ధాత్మా = పరిశుద్ధస్వభావుడు.

---

* సురూపాం ప్రతిమాం విష్ణోః ప్రసన్నవదనేక్షణామ్। కృత్వా మనః ప్రీతికరీమ్ సువర్ణరజతాదిభిః......తామర్చయేత్ తాం ప్రణమేత్ తాం యజేత్ తాం విచిన్తయేత్। విశత్యపాస్తదోషస్తు తామేవ బ్రహ్మరూపిణీమ్ * ఇత్యాది. (వి. ధ. 103. 19-28.) [అందముగలదై ప్రసన్నమగు ముఖము నేత్రములు గలదై యుండునట్లు తనకిష్టమగు విధంబున విష్ణుప్రతిమను సువర్ణము వెండి మున్నగు లోహంబులచే నిర్మించి......దానినే నమస్కరింపవలయును. దానినే పూజింపవలయును. దానినే ధ్యానించవలయును. ఇట్లు కావించినచో వాఁడు సమస్త పాపములును తొలఁగి ఆ విష్ణు పాదారవిందంబులనొందును.]　(640.)

## 641. కుమ్భః.

(1) "కామ్యతే ఇతి కుమ్భః" ఆ ప్రతిమలో భక్తులు గోరు సౌందర్యాదులతోనే భగవంతుడు నుండునట్లు వారలచే కోరఁబడువాఁడు.

(2) లేక "కా భాతీతి కుంభః" క్షేత్రాదిభూమిలో ధ్యానారాధనాదులకు విషయముగా ప్రకాశించువాఁడు.

(3) లేక, "క్షా భాతీతి కుమ్భః" ఆ దివ్య క్షేత్రములయందు జన్మము మరణము మున్నగుస్వల్పసంబంధముండినను భక్తులకు యమకింకరులభయంబును తొలఁగించి ప్రకాశించువాఁడు.

* అధ్వావనిషు సర్వాసు నిత్యం కుర్వతి సన్నిధిమ్। ముక్తయే సర్వభూతానాం విశేషేణతు వై భువి * [భూమిలో అచ్చటచ్చట సమస్త ప్రాణులకును ముక్తినిగలిగింప వారు సంచరించు మార్గములందెల్ల నిత్యముగా సన్నిధిగావించుచునుండును.]

భగవంతుడు అర్చారూపముతోనుండు దివ్యక్షేత్రములయందు మరణించిన వారలను తాను నేరుగానో లేక తనకింకరులమూలముగానో (యమభటులను జయించి) వారలను శోధించి వారలకు ఆ జన్మంబుననో లేక పుణ్యమగు జన్మాంతరంబుననో తనపాదారవిందంబులను చేర్చుకొనునట్లు శాస్త్రంబులందు స్పష్టము.　(641.)

## 642. విశుద్ధాత్మా.

"విశుద్ధశ్చాసౌ ఆత్మాచ విశుద్ధాత్మా" తన్నాశ్రయించినవారలకు తారతమ్యములేక అందఱకును తనసర్వస్వంబును అనుగ్రహించుటచే పరిశుద్ధస్వభావుఁడు.

643. విశోధనః. 644. అనిరుద్ధః. 645. అప్రతిరథః.
646. ప్రద్యుమ్నః. 647. అమితవిక్రమః.

విశోధనః = శోధించువాడు. అనిరుద్ధః = అనిరుద్ధ స్వరూపి. అప్రతిరథః = సాటిలేనివాడు. ప్రద్యుమ్నః = పురుషోత్తముడు. అమితవిక్రమః = త్రివిక్రముడు.

---

## 643. విశోధనః.

"విశోధయతీతి విశోధనః" తన క్షేత్రంబులందు మరణించినవారలను శోధించి తనప్రాప్తికి దగినట్లు గావించుకొనువాఁడు. (643.)

(అవతారిక.) అనంతరము, క్షేత్రవిశేషంబులందు పూర్వోక్త వ్యూహ రూపముగాను విభవరూపముగాను విచ్చేసియుండు విధమును చెప్పుచున్నారు:—

## 644. అనిరుద్ధః. (187.)

* జనార్దనాఖ్యయా దేవ స్త్వనిరుద్ధో జగత్ప్రభుః। భూభాగే వసుభాణ్డాఖ్యే నిత్యసన్నిహితః స్థితః * [అనిరుద్ధుఁడు, భూమిలో వసుభాండంబను భూభాగమున జనార్దనరూపంబుతో సేవసాదించుచున్నాఁడు.] అను ఋషుల నిరుక్తరీతిగా భూమిలో వసుభాండంబను క్షేత్రంబున జనార్దనరూపంబుతోనుండు అనిరుద్ధ స్వరూపుఁడు. (644.)

## 645. అప్రతిరథః.

"న ప్రతిరథః అప్రతిరథః" వాడే జనార్దనుండగుటచే విరోధులను నశింప జేయువిషయంబున తనకు ఎదురుగా వేఱొక రథము లేనివాఁడు. (అనగా, విరోధులను తొలగించు విషయంబున సాటిలేనివాడు.) (645.)

## 646. ప్రద్యుమ్నః.

"ప్రకృష్టం ద్యుమ్నం యస్యసః, ప్రద్యుమ్నః" తన్ను ప్రకాశింప జేయుటయను నైశ్వర్యము గలవాఁడు. పురుషోత్తముడు. (646.)

## 647. అమితవిక్రమః. (519)

* యామునం జలమాశ్రిత్య దేవదేవః త్రివిక్రమః। స్థితః కమలసమ్భూతే నృణాంచ సుగతిప్రదః * అనినట్లు యమునా తీర్థంబుననుండు త్రివిక్రముఁడు. (647.)

## 648. కాలనేమినిహా. 649. శౌరిః. 650. శూరః.

కాలనేమినిహా=కలిదోషంబులను తొలగించువాడు. శౌరిః=తిరుకణ్ణపురము అను దివ్యదేశమునను డు శౌరిరాజులు. శూరః=శ్రీరాముడు.

---

### 648. కాలనేమినిహా.

"కాలస్య నేమిం నిహన్తీతి కాలనేమినిహా" * అవిద్యాఖ్యాచ యా యోనిః కాలచక్రస్య దుర్ధరా। సా మయీయం సమాశ్రిత్య విగ్రహం విధునోతిచ। ధ్యాయేత్త్రత్ప్రసరఘ్నంచ దేవమ్ * [కాలచక్రముయొక్క అవిద్యయను బండికంటి నాశ్రయించి కదలించుచునుండుదాని ప్రచారంబును అణచు దేవుని ధ్యానింతము.] అను కాలనేమినాశకుని ధ్యానంబున చెప్పినట్లు, క్రిందఁజెప్పిన క్షేత్రములందుండి కలికల్మషంబును తొలఁగించువాఁడు. (648.)

### 649. శౌరిః. (342.)

"శూరస్య వసుదేవస్య అపత్యమ్ శౌరిః" * ఉత్పలావదకే ¶ దేశే శౌరిసంజ్ఞోఽచ్యుతః స్థితః * అనినట్లు తిరుకణ్ణపురము అను దివ్యదేశంబున శౌరిరాజులను నామముతోనుండువాఁడు. (649.)

### 650. శూరః. (341.)

* ధరాధరే చిత్రకూటే రక్షఃక్షయకరో మహాన్। సంస్థితశ్చ పరోరామః పద్మపత్రాయతేక్షణః * [చిత్రకూట పర్వతంబున రాక్షసులనుజంపిన శ్రీరాముఁడు గలఁడు.] అనినట్లు చిత్రకూటంబున విచ్చేసియుండు శ్రీరాముఁడు. (650.)

---

¶ ఇచట అస్మదాచార్యులగు శ్రీమాన్ ఉ. వే. ప్రతివాది భయంకరం అణ్ణంగరాచార్యులువారు సాధింతురు:— కొన్ని కోశములందు 'ఉత్పలావర్తకే' అను పాఠముగలదు. అది ప్రామాదికము. 'ఉత్పలావదకే' అనునదే శుద్ధపాఠము. 'పలము = మాంసము. అది శోషించినవారు ఉత్పలులు, శరీరశోషణంబుచే మాంసముతొలఁగి దేహమును ఉపేక్షించియుండు ముముక్షువులు. * తేషాం మహోపతోవాసముత్పలావదకం విదుః * అను ప్రమాణరీత్యా వారలకు రక్షకుడగు సర్వేశ్వరుడు వసించుస్థలము [ఉత్ + పల + అవత్ + అకము] అని యర్థము. ఇది * శరణ్యముకున్దత్వమ్ ఉత్పలావదకత్తిలే ప్రసిద్ధమ్ * (ఆచార్యహృదయము ప్రకరణము 3. సూత్రము 32) అనుసూత్రమున మణవాళమామునులవ్యాఖ్యానంబున స్పష్టము అని.

651. శూరజనేశ్వరః. 652. త్రిలోకాత్మా.
653. త్రిలోకేశః. 654. కేశవః.

శూరజనేశ్వరః = శూరులగు సుగ్రీవాదులకు నీశ్వరుడు. త్రిలోకాత్మా = త్రిలోకనాథుడు. త్రిలోకేశః = విశ్వేశ్వరుడు. కేశవః = కేశవుడు.

---

## 651. శూరజనేశ్వరః.

"శూరజనానామ్ ఈశ్వరః శూరజనేశ్వరః" ఆరామునకిది విశేషణము. ఆరాముఁడు శూరులగు సుగ్రీవ హనుమదాది శూరులకు నియామకుడు. (651.)

## 652. త్రిలోకాత్మా.

* మగధామణ్డలే విప్ర మహామేధధరాశ్రితః। సంస్థితో లోకనాథాత్మా దేవదేవో జనార్దనః * అనినట్లు మగధదేశంబున విచ్చేసియుండు త్రిలోకనాథుఁడు. (అనగా, భక్తానుగ్రహార్థమై ముల్లోకంబునను ఏఁగువాఁడు అనియర్థము.) (652.)

## 653. త్రిలోకేశః.

* శుభమాసాద్య భూభాగం ప్రాగ్జ్యోతిషపురే తథా। దేవం విశ్వేశ్వరాఖ్యంతు స్థితమేత్య స్వగోచరాత్ * అనినట్లు ప్రాగ్జ్యోతిషపురంబున విచ్చేసియుండు విశ్వేశ్వరుఁడు. (653.)

## 654. కేశవః. (23.)

* కేశవః క్లేశహా లోకే ద్వైరూప్యేణ క్షితౌ స్థితః। మధురాఖ్యే మహాక్షేత్రే వారాణస్యామపి ద్విజ * [మధురలోను కాశిలోను క్లేశహరుండగు కేశవుఁడు గలఁడు.] అనినట్లు మధురలోను కాశిలోను విచ్చేసియుండు కేశవుఁడు.

* క ఇతి బ్రహ్మణో నామ ఈశోఽహం సర్వదేహినామ్। ఆవాం తవాఙ్గే సంభూతౌ తస్మాత్ కేశవనామవాన్ * (హ. వం. 279. 47.) [క అనగా బ్రహ్మ. నేను (రుద్రుఁడు) ఈశుఁడను మేమిద్దఱు నీశరీరంబునుండి గల్గినవారము. కనుక నీకు కేశవుఁడు అను నామముగల్గె.] (654.)

655. కేశిహా. 656. హరిః. 657. కామదేవః.
658. కామపాలః. 659. కామీ. 660. కాన్తః.

కేశిహా = కేశియనుదానవునిచంపినవాడు. హరిః = హరి. కామదేవః = కామదేవుడు. కామపాలః = పురుషార్థంబులను పాలించువాడు. కామీ = కోరబడువాడు. కాన్తః = మనోజ్ఞుడు.

---

(అవతారిక.) ఈ కేశవశబ్దమునకు తానే వేఱొక నిర్వచనము చెప్పుచున్నారు:—

## 655. కేశిహా.

"కేశినం హన్తీతి కేశిహా" * కేశవం కేశిహన్తారమ్ * అనినట్లు కేశియను దానవునిచంపినవాడు. (655.)

## 656. హరిః. (361)

* గిరౌ గోవర్ధనాఖ్యేతు దేవః సర్వేశ్వరో హరిః । సంస్థితః పూజితః స్థానే * అనినట్లు గోవర్ధనపర్వతంబున హరియనునామముతో విచ్చేసియుండువాఁడు. (656.)

## 657. కామదేవః.

* కామదేవస్తు భగవాన్ సర్వేషాం సర్వకామదః । శఙ్కరాలయమాసాద్య సంస్థితోఽప్సరసార్చితః * అనినట్లు శంకరాలయక్షేత్రంబున అందఱకును సమస్తపురుషార్థంబులనిచ్చుచు అప్సరస్సులచే పూజింపఁబడి కామదేవుండను పేరుతో విచ్చేసియుండువాడు. 'కామదేవః' అనగా కామంబుల నిచ్చువాడని యర్థము. (656.)

## 658. కామపాలః.

"కామం పాలయతీతి కామపాలః" అట్లు తానిచ్చిన పురుషార్థంబులను తానే రక్షించువాఁడు. (658.)

## 659. కామీ.

"కామాః అస్య సన్తీతి కామీ" పురుషార్థంబులను అధికముగా నిచ్చుటచే కోరఁబడువాఁడు. (659.)

## 660. కాన్తః. (297)

అతడు స్వతః మనోజ్ఞుడుగానుండును. కనుకనే అప్సరసలుగూడ పూజింతురు. (నామము 657)

ఇటులే ఇకమీదగూడ ఆయానామసామర్థ్యంబుచే ఆయాక్షేత్ర సంబంధము నూహింపవలయును. (660.)

## 661. కృతాగమః. 662. అనిర్దేశ్యవపుః. 663. విష్ణుః. 664. వీరః. 665. అనన్తః.

కృతాగమః = మంత్ర విద్యలను రచించినవాడు. అనిర్దేశ్యవపుః = నిర్దేశింపజాలని శరీరముగలవాడు. విష్ణుః = వ్యాపించినవాడు. వీరః = నిరసించువాడు. అనన్తః = అవధిలేనివాడు.

---

(అవతారిక.) అనంతరము శక్తీశావతారమును చెప్పుచున్నారు:—

### 661. కృతాగమః. (795)

"కృతః ఆగమః యేనసః కృతాగమః" * నానామన్త్రమయీం దివ్యాం వ్యఞ్జయత్యమలాత్మనామ్ * అను ఋషివచనరీతిగా పలువిధంబులగు మంత్ర విద్యలను రచించినవాడు.

### 662. అనిర్దేశ్యవపుః. (179)

"అనిర్దేశ్యం వపుః యస్యసః అనిర్దేశ్యవపుః" * యుగానుసార కాన్తిశ్చ * అనినట్లు ఆయాయుగంబులకుందగినట్లు శరీరంబును ధరించుటచే ఇట్టిదని నిర్దేశింపజాలని శరీరముగలవాడు. (662)

### 663. విష్ణుః. (2.259.)

"వేవేష్టి వ్యాప్నోతీతి విష్ణుః" ఇట్లు తన శక్తిచే లోకంబును వ్యాపించినవాడు.

* యస్మాద్విష్టమిదం సర్వం తస్య శక్త్యా మహాత్మనః। తస్మాత్స ప్రోచ్యతే విష్ణుః విశేర్ధాతోః ప్రవేశనాత్ * (ఆ. పు.) [ఆ మహనీయుడు తనశక్తిచే ఈ ప్రపంచమంతయు వ్యాపించియుండుటచే వానిని విష్ణువు అనియందురు.] (663.)

### 664. వీరః. (402.)

"అజతి క్షిపతి హినస్తీతి వీరః" * ఆజ్ఞాప్రతీక్షకేణైవ గదాచక్రద్వయేనతు। ప్రేరితేన హినస్త్యాశు సాధుసన్తాపకారిణః ॥ [తనయాజ్ఞను ఎదురుచూచు గదాచక్రములను నియోగించి సాధువులను హింసించువారలను చంపుచున్నాడు.] అనినట్లు సాధువులను హింసించువారలను గదాచక్రంబులను నియోగించి నిరసించువాడు. (664.)

### 665. అనన్తః.

"న అన్తః యస్యసః అనన్తః" దేశము కాలము వస్తువు వీనిచే అవధిలేకుండువాడు. (అనగా, ఎల్లప్పుడును అంతటను సకలవిధంబులచేతను ప్రవర్తించువాడనిభావము.)

666. ధనఞ్జయః. 667. బ్రహ్మణ్యః.
668. బ్రహ్మకృద్బ్రహ్మా. 669. బ్రహ్మ.

ధనఞ్జయః = ధనమును జయించినవాడు. బ్రహ్మణ్యః = ప్రకృతికిని ఆత్మకును హితమైనవాడు. బ్రహ్మకృద్బ్రహ్మా = చతుర్ముఖబ్రహ్మకును నియామకుడు. బ్రహ్మ = బ్రహ్మస్వరూపమై వెలయువాడు.

---

* నాన్తోఽస్తి మమ దివ్యానాం విభూతీనాం... విస్తరస్య మే * (గీ. 10. 10.) [నావిస్తారంబునకు అవధియే లేదు.] * అద్వైతస్యైవ వాన్తో నాస్తి యద్బ్రహ్మ * (య. 7. కా. 3-4.) [ఇదియే బ్రహ్మమగుటచే దీనికి అవధియే లేదు.] (665.)

(అవతారిక.) వీనిగుణవిభూతులుకూడ ఇటులే అపరిమితముగా నుండుననుచున్నారు :—

## 666. ధనఞ్జయః.

"ధనంజయ తీతి ధనఞ్జయః" వీనిని పొందవలయునను ఆశ సంపాదించినచో దానియందు లోభము, దానిని రక్షించుట, దానిచే జీవించుట మున్నగు సమస్తంబును ధనంబునకన్న వీనివిషయమున అధికముగానుండుటచే స్వర్ణరత్నాదిధనంబులను మీఱి యుండువాఁడు. (666.)

## 667. బ్రహ్మణ్యః.

"బృహతే హితః బ్రహ్మణ్యః" ప్రకృతికిని ఆత్మకును హితమైనవాఁడు. అపరిమితభోగమోక్షంబులు అను రెంటిని కర్మజ్ఞానములచే అనుభవించుటచే బృహత్తుగా (పెద్దదిగా) నుండు చేతనమునకును, అపరిమితభోగోపకరణంబులుగా పరిణమించుటచే బృహత్తుగా (పెద్దదిగా) నుండు అచేతనమునకును, స్థితిభోగాది సర్వావస్థలోను హేతువై హితమైయుండువాఁడు. (667.)

## 668. బ్రహ్మకృద్బ్రహ్మా.

"బృహ్మకృతః బ్రహ్మా బ్రహ్మకృద్బ్రహ్మా" (బ్రహ్మకృత్) ప్రకృతియొక్క కార్యవర్గమగు మహదహంకారాదివిస్తారములను చేయు చతుర్ముఖబ్రహ్మకును, (బ్రహ్మా) నియామకుఁడు. (అనగా సర్వస్రష్టయగు బ్రహ్మదేవునకును నియామకుడు అని భావము.) (668.)

## 669. బ్రహ్మ.

"బృంహతి వర్ధతే ఇతి బ్రహ్మ" ఇట్లు వ్యక్తముగాను అవ్యక్తముగాను వుండు సమష్టివ్యష్టిపురుషులను బలియఁజేయుచు, తానుకూడ నిరతిశయ కల్యాణ

670. బ్రహ్మవివర్ధనః. 671. బ్రహ్మవిత్.
672. బ్రాహ్మణః. 673. బ్రహ్మీ.

బ్రహ్మవివర్ధనః = ధర్మములను వృద్ధిచెందించువాడు. బ్రహ్మవిత్ = వేదముల నెఱింగినవాడు. బ్రాహ్మణః = (1) బ్రాహ్మణుడు. (2) వేదంబును పఠించువాడు. బ్రహ్మీ = సమస్తమును తనదిగా గలవాడు.

---

గుణములచేతను విభవములచేతను బలిసి సకలవేదాంతవేద్యమగు పరబ్రహ్మ స్వరూపమై ప్రకాశించువాఁడు.

* బృహత్త్వాత్ బృంహణత్త్వాచ్చ బ్రహ్మేతి పరికీర్త్యతే * (669.)

## 670. బ్రహ్మవివర్ధనః.

"బ్రహ్మ వివర్ధయతీతి బ్రహ్మ వివర్ధనః" * తపో బ్రహ్మ * (తై. భృ. 2. 1.) అను శ్రుతిరీతిగా, ఇట్లు వృద్ధిఁజెందు ప్రపంచమునకాదికారణంబగు తపను మున్నగు ధర్మములను వృద్ధిఁజెందించువాఁడు. (670.)

## 671. బ్రహ్మవిత్.

"బ్రహ్మవేత్తీతి బ్రహ్మవిత్" పరబ్రహ్మ వాచకంబగుటచే బ్రహ్మమనఁబడు వేదంబునంత నెఱింగినవాఁడు.

* అనాదినిధనం బ్రహ్మ న దేవాః నర్షయోవిదుః। ఏకస్తద్వేద భగవాన్ ధాతా నారాయణ స్స్వయమ్ * (భా. మో. 380. 19.) [అనాదియగు వేదంబును దేవతలో మహర్షులో ఎఱుంగరు. ఆనారాయణుండొకఁడే యెఱుంగును.] (671.)

## 672. బ్రాహ్మణః.

(1) ఆవేదంబున ఎఱుంగఁదగినవానిని వ్యవస్థచేయుటకై తాను అత్రి గోత్రాదులందు దత్తాత్రేయాదిబ్రాహ్మణరూపంబుతో అవతరించినవాఁడు.

(2) "బ్రహ్మ నయతీతి బ్రాహ్మణః" * బ్రహ్మ నయత్యణతి * అను నిరుక్తరీతిగా వేదంబును పఠించువాఁడు. (672.)

## 673. బ్రహ్మీ.

"బ్రహ్మ అస్యాస్తీతి బ్రహ్మీ" * సర్వబ్రహ్మమయోహరిః * [సర్వ వస్తు స్వరూపము విష్ణువు] అను వచన రీతిగా ప్రమాణ ప్రమేయ రూపముగానుండు సమస్త పదార్థములను తనదిగా గలవాఁడు. (673.)

**674. బ్రహ్మజ్ఞః. 675. బ్రాహ్మణప్రియః. 676. మహాక్రమః.**

బ్రహ్మజ్ఞః = వేదార్థంబుల నెఱింగినవాఁడు. బ్రాహ్మణప్రియః = వేదాధికారులందు ప్రీతిగలవాఁడు. మహాక్రమః = గొప్ప మెట్లు గలవాఁడు.

---

## 674. బ్రహ్మజ్ఞః.

"బ్రహ్మ వేదం జానాతీతి బ్రహ్మజ్ఞః" * వేదవిదేవచాహమ్ * (గీ. 15 15.) అనుగీతారీతిగా వేదంబును అర్థపర్యంతము సాక్షాత్కరించినవాఁడు. (674.)

## 675. బ్రాహ్మణప్రియః.

"బ్రాహ్మణాః ప్రియాః యస్యసః బ్రాహ్మణప్రియః" బ్రాహ్మణులనఁగా వేదాధికారులు. వారలయందు ప్రీతిగలవాఁడు.

* ఘ్నన్తం శపన్తం పరుషం వదన్తం యో బ్రాహ్మణం న ప్రణమేద్యథార్హమ్ * [కొట్టినను శపించినను కఠినముగా పల్కినను ఎవఁడు బ్రాహ్మణుని తగినట్లు పూజించి నమస్కరించలేదో; వాడు నాకుజెందినవాడుగాడు.] * యేతు ధర్మ్యామృతమిదం యథోక్తం పర్యుపాసతే శ్రద్దధానాః మత్పరమాః భక్తాస్తేఽతీవ మే ప్రియాః * (గీ. 12. 20.) [ఎవరు ధర్మరూపమగునమృతముగానుండు ఈభక్తియోగంబుచే నన్ను శ్రద్ధతోను మత్పరమైన భక్తితోను ఉపాసింతురో; వారే నా భక్తవరులు. నాప్రియులు.] * విప్రప్రసాదాదసురాన్ జయామి * (వి. ధ. 52-23.) [బ్రాహ్మణులయనుగ్రహంబుచే రాక్షసులను జయించుచున్నాను.] (675.)

(అవతారిక.) అనంతరము వారలవిషయమున వానికిగల్గు వాత్సల్యాతిశయమును చెప్పుచున్నారు:—

## 676. మహాక్రమః.

"మహాన్ క్రమః యస్యసః మహాక్రమః" సర్వోత్కృష్టుఁడగు తన్ను పొందునట్లు సంసారంబను పాతాళంబునుండి జీవులను దరిఁజేర్చగోరి గొప్ప మెట్లను గట్టియుండువాడు. (అనగా, చేతనుల యుజ్జీవనార్థమై ఉపాయములను క్రమక్రమముగా ప్రదర్శించియుండువాడు, అని భావము.)

తల్లియెట్లు చంటిబిడ్డకు మొట్టమొదట చంటిపాలునుగుడిపించుట, పిమ్మట ఆవుపాలును గుడిపించుట, పిమ్మట ఆహారంబునిచ్చుట, పిమ్మట భోగాదులను అనుభవింపఁజేయుట అనునీక్రమంబున చేయుచుండునో; అటులే సర్వేశ్వరుఁడుగూడ సుకృతియగునొకనికి మొట్టమొదట తనయందు ద్వేషంబును తొలఁగించి, అనంతరము

677. మహాకర్మా. 678. మహాతేజాః. 679. మహోరగః.

మహాకర్మా = గొప్ప కార్యములంగలవాడు. మహాతేజాః = గొప్ప కాంతి గలవాడు. మహోరగః = గొప్పవాడగు తాను హృదయంబున ప్రవేశించువాడు.

---

అభిముఖ్యంబును గల్గించి పిమ్మట అనువర్తింపఁజేసి, దానిమీఁద జ్ఞానంబును దాని మీఁద శక్తిని అనంతరము విశ్వాసంబును గలిగించి ఇట్లు క్రమక్రమముగా తన స్వాధీనముగావించుకొనును.

* జన్మాంతరసహస్రేషు తపోధ్యానసమాధిభిః। నరాణాం క్షీణపాపానాం కృష్ణే భక్తిః ప్రజాయతే * (వి. ధ.) [అనేక జన్మంబులందు తపస్సు ధ్యానము యోగము మున్నగువానిచే పాపములొలఁగిన నరులకు కృష్ణునిమీద భక్తిగల్గును.] * బహూనామ్ జన్మనామన్తే జ్ఞానవాన్మామ్ ప్రపద్యతే * (గీ. 7_19.) [అనేక పుణ్య జన్మములనుబొంది చిట్టచివర జ్ఞానియై నన్నుబొందఁగలఁడు.] * అభ్యాస యోగయుక్తేన మామిచ్ఛాప్తుం ధనఞ్జయ * (గీ. 12_9.) [అర్జునా! అభ్యాస యోగంబుచేసి పిమ్మట నన్ను పొందఁజూడుము.] (676.)

## 677. మహాకర్మా. (793.)

"మహత్ కర్మ యస్యసః మహాకర్మా" క్రిమికీటాదులవలెనుండు అల్ప ప్రాణులనుగూడ తనమహావిభవంబులను అనుభవించునట్లు ఉచ్ఛస్థితికి దెచ్చుటచే అత్యాశ్చర్యములగు కార్యములంగలవాఁడు. (677.)

## 678. మహాతేజాః.

"మహత్ తేజః యస్యసః మహాతేజాః" ఇట్లు తామసులకు గల్గు అనాదియగు అజ్ఞానంబును తొలఁగించు మహాకాంతిని గలవాఁడు. (678.)

## 679. మహోరగః.

"ఉరసా గచ్ఛతీతి ఉరగః, మహాంశ్చాసౌ ఉరగశ్చ మహోరగః" అది యెట్లనఁగా? (మహోరగః) గొప్పవాడగు తాను అత్యల్పులనుపొంది వారల కరణంబులందు ప్రవేశించి అందును వారలహృదయంబున ప్రవేశించి వారల యజ్ఞానంబును తొలఁగించువాఁడు.

* యో న విత్తైర్న విభవైః న వాసోభిః న భూషణైః। తోష్యతే హృదయే నైవ కస్తమీశం న పూజయేత్ * (వి. ధ. 90_69.) [ఎవడు ద్రవ్యములచేతనో విభవంబులచేతనో వస్త్రంబులచేతనో భూషణంబులచేతనో సంతోషింపక కేవల హృదయముచేతనే సంతసించునో; వానిని ఎవఁడు పూజింపకుండును.] (679.)

**680. మహాక్రతుః.　681. మహాయజ్వా.　682. మహాయజ్ఞః.**

మహాక్రతుః = సులభముగా ఆరాధింపదగినవాడు. మహాయజ్వా = ఉత్కృష్టులగు యాగము చేయువారలంగలవాడు. మహాయజ్ఞః = గొప్ప యాగములంగలవాడు.

---

## 680. మహాక్రతుః.

"మహాన్ క్రతుః యస్యసః మహాక్రతుః" అతిసులభముగా చేయఁగల (క్రతు) ఆరాధనముగలవాఁడు.

* యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్। యత్తపస్యసి కౌన్తేయ తత్కురుష్వ మదర్పణమ్ * (గీ. 9-27.) [దేనిని చేయుచుంటివో, దేనినిదినుచుంటివో, దేనిని వ్రేల్చుచుంటివో, దేనినొసఁగుచుంటివో, దేనిని తపము చేయుచుంటివో వానినన్నిటిని నాకే సమర్పింపుము.] (680.)

## 681. మహాయజ్వా.

"మహాన్తః యజ్వానః యస్యసః మహాయజ్వా" ఇతరులను పూజించు వారలకన్న తన్ను పూజించువారలు ఉత్కృష్టులుగాన ఉత్కృష్టులగు యాజకులను (యాగము చేయువారలను) గలవాఁడు.

* తేషామేకాన్తినః శ్రేష్ఠాః తేచైవానన్యదేవతాః * [భగవంతుని దప్ప ఇతర దైవమును మ్రొక్కరు గాన వీరలలో ఏకాంతులే శ్రేష్ఠులు.] (681.)

## 682. మహాయజ్ఞః.

"మహాన్ యజ్ఞః యస్యసః మహాయజ్ఞః" ఇతరయాగంబులకన్న ఉత్కృష్టంబులగు అభిగమనము మధుపర్కము మున్నగు గొప్పయాగంబులను గలవాఁడు. (అనగా, ఇతరయాగంబులకన్న తన్నారాధించుటను గొప్పదిగా గలవాడు అని భావము.)

* సర్వేషాంకిల ధర్మాణాముత్తమో వైష్ణవో విధిః * [సమస్తధర్మముల కన్న వైష్ణవధర్మము ఉత్తమము.] * రక్షతే భగవాన్ విష్ణుః భక్తానాత్మ శరీరవత్ * [విష్ణువు భక్తులను తనశరీరమువలె రక్షించును.] * యాః క్రియాః సంప్రయుక్తాః స్యుః ఏకాన్తగతబుద్ధిభిః। తాస్సర్వాః శిరసా దేవః ప్రతి గృహ్ణాతివై స్వయమ్ * [పరమైకాంతులగు జ్ఞానులచే కావింపఁబడు సమస్త పూజలను భగవంతుడు తనశిరస్సుచే అంగీకరించును.] * అహోహ్యేకాన్తినః సర్వాన్ ప్రీణాతి భగవాన్ హరిః। విధిప్రయుక్తాం పూజాఞ్చ గృహ్ణాతి శిరసా స్వయమ్ * (సా. సం.) [ఏకాంతులగు పరమభాగవతులను భగవంతుఁడు సంతసింపఁజేయును వారుచేయు పూజను తనశిరసుతో తానే గ్రహించును.] (682.)

683. మహాహవిః. 684. స్తవ్యః. 685. స్తవప్రియః.

మహాహవిః = గొప్ప హవిస్సును గలవాడు. స్తవ్యః = స్తోత్రంబునకుఁదగిన వాడు. స్తవప్రియః = స్తోత్ర ప్రియుఁడు.

---

## 683. మహాహవిః.

(1) "మహాన్తి హవీంషి యస్యసః మహాహవిః" హింసాదులులేని పరమసాత్వికంబగు హవిస్సును గలవాఁడు. * బ్రహ్మార్పణం బ్రహ్మహవిః * (గీ. 4-24.) [బ్రహ్మమయంబులగు సాధనంబులచే చేయఁబడు బ్రహ్మమయంబగు హవిస్సును.]

(2) * ఇదమహం మామమృతయోనౌ సూర్యే జ్యోతిషి జుహోమి * (తై. ఉ. 2-25.) [నేను ఈ నన్ను అమృతకారణంబగు సూర్యునిజ్యోతిస్సులో హోమముచేసెద.] అనినట్లు జీవాత్మయను మహత్తమగు హవిస్సును గలవాఁడు. (683.)

(అవతారిక.) ఇట్లింతవఱకు మానసకాయికవ్యాపారంబులచే ఆరాధించుట చెప్పఁబడియె. ఇక వాచికవ్యాపారంబుచే నారాధించుటను చెప్పుచున్నారు :—

## 684. స్తవ్యః.

"స్తోతుమ్ అర్హః స్తవ్యః" పరమమంగళములై నిత్యములై నిరవధికములై నిర్దిష్టములై యుండు గుణంబులును, స్వతస్సిద్ధములైయుండు నామసహస్రంబును గల భగవంతుఁడే స్తోత్రంబునకు దగినవాఁడు. దీనికి విరుద్ధగుణంబులు గలవారగుటచే దేవతాంతరంబులు స్తోత్రముచేయుదగినవారుగారు.

* ఆదరేణ యథా స్తౌతి ధనవన్తం ధనేచ్ఛయా। తథాచేద్విశ్వకర్తారం కో నముచ్యేత బంధనాత్ * [ధనముగోరువాడు ధనికుని ఎంతయాదరముతో స్తోత్రముచేయునో; అట్లు భగవంతుని చేసినచో ఎవఁడు సంసారబంధనంబునుండి వీడబడకుండును ?] (684.)

## 685. స్తవప్రియః.

"స్తవః ప్రియః యస్యసః స్తవప్రియః" ఎట్లయినను, ఏభాషతోనైనను, ఎవఁడైనను, తన్ను గౌరవించవలయుననను తలంపుతోనో, తిరస్కరించవలయునను తలంపుతోనో, గుణసంకీర్తనముగావించు తలంపుతోనో చేయఁబడునది తనవిషయమై యుండినచో దానిని మిక్కిలి ప్రియముగాచూచును. ఈ విషయము ఘంటాకరాదుల వృత్తాంతంబున స్పష్టము. (685.)

686. స్తోత్రమ్. 687. స్తుతః.
688. స్తోతా. 689. రణప్రియః.

స్తోత్రమ్=స్తోత్రమును పూర్తికావించుకొనువాడు. స్తుతః = స్తోత్రము చేయబడువాడు. స్తోతా = స్తోత్రము చేయువాడు. రణప్రియః = యుద్ధమున ప్రీతిగలవాడు.

---

## 686. స్తోత్రమ్.

"స్తూయతే అనేన అయమితి స్తోత్రమ్" తనస్తోత్రమయ్యు దానిని తాను అనుగ్రహించి పూర్తిగావించుకొనువాఁడు. అనగా, తన్ను స్తోత్రము చేయుటకు వలసిన జ్ఞానమును ఇచ్చి తానే ఆస్తోత్రమును పూర్తిచేయించుకొనును అని భావము. ఈ విషయము ధ్రువుఁడు స్తోత్రము చేసినప్పుడు స్పష్టము. (686.)

## 687. స్తుతః.

"స్తూయతే అయమితి స్తుతః". సహస్రఫణంబులుగల ఆదిశేషుడు వేదరూపియగుగరుడుడు నిత్యసూరులు బ్రహ్మాదులు అస్మదాదులు (మనబోటివారు) మున్నగువారిచే తారతమ్యములేక సర్వకాలంబులందును తమతమయిష్టసిద్ధికై స్తోత్రము చేయఁబడువాఁడు.

* అశేషదేవేశనరేశ్వరేశ్వరైః సదా స్తుతం యచ్చరితం మహాద్భుతమ్ * [సమస్తదేవతలచేతను రాజులచేతను ఇతరులచేతను సదా స్తోత్రము చేయబడిన అత్యద్భుతంబగు వానిచరిత్రంబును] ఇత్యాదులు. (687.)

## 688. స్తోతా.

"స్తౌతీతి స్తోతా" తన్ను స్తోత్రముచేయువానిని తానే స్తోత్రము చేయువాఁడు. ఇది కృష్ణునికైలాస యాత్రలో స్పష్టము. (688.)

## 689. రణప్రియః.

"ప్రియః రణః యస్యసః రణప్రియః" సాధుపరిత్రాణమునకై అసుర రాక్షసాదులతో యుద్ధము చేయుటలో ఇచ్ఛగలవాడు. ఇది శ్రీ రామాయణ మహాభారతాదులలో స్పష్టము.

* తతస్సకామం సుగ్రీవమంగదంచ మహాబలమ్। చకార రాఘవః ప్రీతః హత్వా రావణమాహవే * (రా. యు. 111-31.) [పిమ్మట రాముఁడు యుద్ధంబున రావణుని జంపి దానిచే సుగ్రీవుని మహాబలవంతుఁడైన అంగదుని మిక్కిలి సంతసింపఁజేసెను.] (689.)

690. పూర్ణః. 691. పూరయితా. 692. పుణ్యః.
693. పుణ్యకీర్తిః. 694. అనామయః.

పూర్ణః = పూర్ణుడు. పూరయితా = మనోరథమును పూర్తిచేయించువాడు. పుణ్యః = పరిశుద్ధముగావించువాడు. పుణ్యకీర్తిః = పరిశుద్ధమగు కీర్తిగలవాడు. అనామయః = సంసారమును తొలగించువాడు.

---

(అవతారిక.) అధికవ్యయము అతిప్రయాసము పడి సత్కరింపకుండ ఇట్లు కేవల స్తోత్రమాత్రముచే వీఁడు సాధ్యుఁ డగుటకుగారణంబేమనగా :—

## 690. పూర్ణః.

అవాప్తసమస్తకాముఁడుగాన స్వయముగానే పూర్ణుడు. (690.)

## 691. పూరయితా.

ఇట్లు పూర్ణుడయ్యు అపూర్ణునివలె స్తోత్రంబునపేక్షించుచు స్తోత్రముచేయు వానిమనోరథంబును పూర్తిచేయించువాడు. (691.)

## 692. పుణ్యః. (925)

"పునాతీతి పుణ్యః" పాపులనుగూడ తనస్తోత్రమునకుపయోగించునట్లు పరిశుద్ధముగావించువాఁడు. (692.)

## 693. పుణ్యకీర్తిః.

"పుణ్యా కీర్తిః యస్యసః పుణ్యకీర్తిః" తనసంకీర్తనంబును అటులే సకలపాపంబును తొలగించునంత పరిశుద్ధముగా గలవాఁడు.

* నామ సంకీర్తనం భక్త్యా విలాయనమనుత్తమమ్। మైత్రేయాశేష పాపానాం ధాతూనామివ పావకః * [మైత్రేయా! భక్తితో నామసంకీర్తన మొనరించుటయు, వానిగుణములందు అవగాహించుటయు అగ్ని వృక్షాదులను దహించునట్లు సమస్త పాపనాశకంబగును.] * అవశేనాపి యన్నామ్ని కీర్తితే సర్వపాతకైః। పుమాన్ విముచ్యతే సద్యః సింహత్రస్తైః మృగైరివ * (వి. పు. 6. 91.) [ఎవనిపేరు అవశముగానైనను కీర్తించినచో సింహంబునకు భయపడి మృగములుపాఱునట్లు మనుష్యుడు సమస్త పాపంబులనుండి తొలగబడును.] (693.)

## 694. అనామయః.

ఇట్లు తనసంబంధమను దివ్యౌషధముచే సంసారమను వ్యాధిని తొలగించుటచే సంసారమను వ్యాధికి విరోధి. భగవంతుని అనుభవింపకుండ చేతనులశక్తిని అడ్డగించుటచే సంసారమే వ్యాధిగా చెప్పఁబడెను. (694.)

695. మనోజవః. 696. తీర్థకరః.
697. వసురేతాః. 698. వసుప్రదః.

మనోజవః = మనసుకన్న వేగముగలవాడు. తీర్థకరః = తీర్థములనుగలవాడు. వసురేతాః = తేజసునే కారణముగాగలవాడు. వసుప్రదః = వసుదేవుని పుత్రుడుగా పుట్టినవాడు.

---

## 695. మనోజవః.

"మనసః జవః యస్యసః మనోజవః" భక్తులకు సంసారమను వ్యాధిని శీఘ్రముగా తొలగించుటచే మనసు కన్న అతి వేగముగలవాడు.

* సప్తజన్మకృతం పాపం స్వల్పంవా యదివా బహు। విష్ణోరాలయ విన్యాస ప్రారంభాదేవ నశ్యతి ॰ (వి. ధ. 83-20.) [సప్త (ఏడు) జన్మములందు సంపాదింపఁబడిన పాపము స్వల్పమయ్యు అధికమయ్యు విష్ణువుయొక్క ఆలయంబున ఒక అడుగు పెట్టినంతనే నశించును] (695.)

## 696. తీర్థకరః.

(1) "తీర్థాని కరోతీతి తీర్థకరః" స్మరించినను కీర్తించినను ఆ మాత్రంబుననే సమస్తంబును తనవలె పరిశుద్ధముగా చేయు గంగా-పుష్కరాదితీర్థంబులకును పరిశుద్ధికి గారణమైనవాఁడు.

(2) శ్రుతిస్మృత్యాది శాస్త్రంబులను ప్రవర్తింప జేసినవాఁడు. * యోగజ్ఞానం...ఏతత్సర్వం జనార్దనాత్ * [యోగజ్ఞానము సాంఖ్యము...ఇవి యన్నియు విష్ణువునుండి గల్గినవి.] (చూ ఫలశ్రుతి. శ్లో. 19.)

(3) సముద్రమువలె అగాధమై దుష్ప్రవేశమైయుండు తనవిషయమున ప్రవేశించుటకుఁదగిన ఘట్టములను గట్టినవాఁడు. (696.)

(అవతారిక.) ఇక కృష్ణావతారమును చెప్పుచున్నారు.

## 697. వసురేతాః.

"వసుః రేతః యస్యసః వసురేతాః" తనదివ్యతేజస్సునే అవతారమునకు కారణముగా గలవాడు. వసువనగా తేజస్సు. (697.)

## 698. వసుప్రదః. (699.)

"వసు నిధిమ్ పుత్రత్వేన ప్రదదాతీతి వసుప్రదః" పరమనిధియగు తన్నే దేవకీవసుదేవులకు పుత్రుఁడుగా నిచ్చినవాఁడు. (698.)

699. వసుప్రదః. 700. వాసుదేవః.

వసుప్రదః = వసుదేవునకు గౌరవంబు నిచ్చినవాడు. వాసుదేవః = వసుదేవ పుత్రుడు.

---

## 699. వసుప్రదః. (698.)

"వసు తేజః ప్రదదాతీతి వసుప్రదః" దేవకీవసుదేవులకు జగత్పితయగు తనకును తండ్రిగానుండుట అను మహాతేజంబు నిచ్చినవాఁడు. (699.)

## 700. వాసుదేవః. (334-714.)

"వసుదేవస్య అపత్యం పుమాన్ వాసుదేవః" వసుదేవునికి పుత్రుఁడుగా అవతరించినవాడు. (700.)

శ్రీ విష్ణు సహస్రనామ వ్యాఖ్యానమున
సప్తమ శతకము
సమాప్తము.

శ్రీమతే రామానుజాయనమః.

# అష్టమ శతకము.

701. వసుః. 702. వసుమనాః.
703. హవిః. 704. సద్గతిః.

వసుః = వసించువాడు. వసుమనాః = వసుదేవునిమీదమనసును గలవాడు.
హవిః = కొనియేగబడినవాడు. సద్గతిః = సాధువులకుగతియైనవాడు.

---

(అవతారిక.) ఈయవతారంబునకు మూలకారణంబగు క్షీరసాగర వాసమును చెప్పుచున్నారు:—

## 701. వసుః. (105-271.)

"వసతీతి వసుః" అవతారములకు మూలకందముగా క్షీరసముద్రంబున వసించువాడు. * స లోకానాం హితార్థాయ క్షీరోదే వసతి ప్రభుః * (భా. స. 47-26.) [వాఁడు లోకహితార్థమై క్షీరసముద్రంబున వసించుచున్నాఁడు] * ఏష నారాయణః శ్రీమాన్ క్షీరార్ణవనికేతనః। నాగపర్యఙ్కముత్సృజ్య హ్యాగతో మధురాంపురీమ్ * (హ. వ. 113-62.) క్షీరసముద్రంబున వసించు శ్రీమన్నారాయణుండే శేషశయనంబును విడిచి మధురాపురికి వచ్చెను.] ఇత్యాదులు. (701.)

## 702. వసుమనాః. (106.)

"వసౌ మనః యస్యసః వసుమనాః" దేవదత్తుని దత్తుడనునట్లును, సత్యభామను భామ అనునట్లును, భీమసేనుని భీముడనునట్లును, వసుదేవుడు వసుశబ్దంబుచే చెప్పబడెను. లక్ష్మికి జన్మభూమియగు క్షీరసముద్రంబున వసించుచుండియు వసుదేవుని యందు మనసుగలవాఁడు. (702.)

## 703. హవిః. (361.)

"హూయతే ఇతి హవిః" వీ డిట్లు దేవకీ వసుదేవులయందు వాసముచేయ గోరుచుండియు, వారలు వీనికి కంసునిచే భయంబుగలునోయని వీనిమీదగల ప్రీత్యతిశయంబుచే వీనిశక్తిని చూడక యశోదానందగోపులసమీపంబునకు కొని పోబడినవాఁడు. (703.)

## 704. సద్గతిః.

"సతాం గతిః సద్గతిః" అవతరించినపుడే అనురులయాపదను తొల గించుటచే వసుదేవాదిసాధువులకు గతియైనవాఁడు.

* సతాం సన్తోషమధికం ప్రశమం చణ్డమారుతః * (వి. పు. 5-3-4.) [సాధువులకు అధికసంతోషకరుఁడై దుష్టులు అను చండమారుతంబునకు శాంత పరుడైయుండువాడు......] (704.)

705. సత్కృతిః. 706. సత్తా.
707. సద్భూతిః. 708. సత్పరాయణమ్. (ణః)

సత్కృతిః = సత్కార్యములను గలవాడు. సత్తా = సత్తు అయినవాడు. సద్భూతిః = సాధువులకు ఐశ్వర్యమైయుండువాడు. (1) సత్పరాయణమ్ = సాధువులకు పరమగతిగానుండువాడు. (2) సత్పరాయణః = సాధువులే తనకు గతిగానుండువాడు.

---

## 705. సత్కృతిః.

"సత్యః కృతయః యస్యసః సత్కృతిః" పాలు పెరుగు దొంగలించుట, రోకటితో గట్టువడుట, రాసక్రీడ మున్నగుదివ్య చేష్టితంబులనొనరించి వీనిని విని కని యానందించువారలయొక్క సంసారబంధంబును తొలగించుటచే సత్కార్యంబులను గలవాఁడు. (705.)

## 706. సత్తా.

సత్తులకు తానే సత్తగానుండువాఁడు.

* న తదస్తి వినా యత్స్యాత్ మయా * (గీ. 10-39.) [నన్ను విడిచి ఏది ధరించియుండదు.] అనినట్లు వాడు లేవప్పుడు ఏదియు ధరించియుండదు. (706.)

## 707. సద్భూతిః.

"సతాం భూతిః సద్భూతిః" సాధువులకు పుత్ర మిత్ర బంధు-దూత-సారథ్యాదిసమస్తంబును తానేయై యుండువాఁడు. (707.)

## 708. (1) సత్పరాయణమ్. (2) సత్పరాయణః.

(1) "సతాం పరాయణమ్ సత్పరాయణమ్" * కృష్ణాశ్రయాః కృష్ణబలాః కృష్ణనాథాశ్చ పాణ్డవాః । కృష్ణః పరాయణం తేషామ్ * (భా. ద్రో. 173-24) [పాండవులు, కృష్ణునేయాశ్రయించినవారై, ఆకృష్ణునిచేతనే బలముగలవారై, కృష్ణునే నాథునిగానవ్యవసించియుండువారలు. అట్టి పాండవులకు కృష్ణుడే పరమ సాధనంబుగా నుండును.] అనినట్లు సత్తులకు పరమగతిగా నుండువాడు.

(2) 'సత్పరాయణః' అనియు పాఠముగలదు. అప్పుడు, "సన్తః పరాయణం యస్యసః సత్పరాయణః" సాధువులే తనకు పరమగతిగా దలంచియుండువాఁడు. * మమ ప్రాణాహి పాణ్డవాః * (భా. ఉ. 90-33) [పాండవులు నాకు ప్రాణభూతులుగారా ?] * పాణ్డవానాం భవాన్నాథః భవన్తఞ్చాశ్రితాః వయమ్ *

709. శూరసేనః. 710. యదుశ్రేష్ఠః.
711. సన్నివాసః. 712. సుయామునః.

శూరసేనః = శూరులను సేనగా గలవాడు. యదుశ్రేష్ఠః = యాదవులలో శ్రేష్ఠుడు. సన్నివాసః = సాధువులకు విశ్రాంతిస్థలము. సుయామునః = యమునానదిలో కావించిన జలక్రీడాదులను పుణ్యముగా గలవాడు.

---

(భా. స. 21_10) [నీవు పాండవులకు నాథుడవు. మేమును నిన్నే యాశ్రయించియుండువారము.] * జ్ఞానీత్వాత్మైవ మే మతమ్ * (గీ. 7_13) [జ్ఞానిని నాయాత్మగానే నేను తలంతును.] (708)

## 709. శూరసేనః.

"శూరాః సేనాః యస్యసః శూరసేనః" యాదవపాండవాదిశూరులను భూభారంబును తొలగించుటకై సహాయముగాగలవాఁడు. (709.)

## 710. యదుశ్రేష్ఠః.

"యదూనాం శ్రేష్ఠః యదుశ్రేష్ఠః" యయాతిశాపంబుచే అధోగతినొందిన యదువంశంబును ఉద్ధరింపజేసినందున యదువులలో శ్రేష్ఠుడు.

* అయం స కథ్యతే ప్రాజ్ఞైః పురాణార్థ విశారదైః । గోపాలో యాదవం వంశం మగ్నమభ్యుద్ధరిష్యతి * (వి. పు.) [ఆదిదేవుడు గోపాలుడై యవతరించి యదువంశంబును ఉద్ధరింపజేయ గలఁడు, అని పురాణార్థంబు నెఱింగినవారలచే చెప్పఁబడినవాఁడు వీఁడే.] (710.)

## 711. సన్నివాసః.

"సతాం నివాసః సన్నివాసః" సనకాదిసాధువులకు విశ్రాంతిస్థలముగా నుండువాఁడు.

* సనన్దనాద్యైః మునిభిః సిద్ధయోగైరకల్మషైః । సఞ్చిన్త్యమానం తత్రస్థైః నాసాగ్రన్యస్తలోచనైః * (వి 5_842.) [యోగము చేకూరియుండుటచే పరిశుద్ధులగు సనందనాదిమునులచే ఎల్లప్పుడు చింతింపఁబడువానిని.] (711.)

## 712. సుయామునః.

"శోభనం యామునం యస్యసః సుయామునః" తాను యమునానదిలో కావించిన జలక్రీడ రాసక్రీడ పుష్పాపచయము మున్నగు కృత్యములను పుణ్యముగా గలవాడు. (712.)

713. భూతావాసః. 714. వాసుదేవః.
715. సర్వాసునిలయః. 716. అనలః.

భూతావాసః = సమస్తభూతంబులకును వాసస్థలము. వాసుదేవః = వాసుదేవ వ్యూహమైయుండువాడు. సర్వాసునిలయః = అందఱప్రాణంబునకును ఆధారభూతుడు. అనలః = (1) తృప్తినొందనివాడు. (2) సహింప జాలనివాడు.

---

### 713. భూతావాసః.

"భూతానామ్ ఆవాసః భూతావాసః" కృష్ణుడై యవతరించియుండియు పరత్వదశయందువలె సమస్త భూతంబులకును వాసస్థలమైనవాడు. (713.)

### 714. వాసుదేవః. (334-700)

"వాసుశ్చాసౌ దేవశ్చ వాసుదేవః" వసుదేవునిపుత్రుఁడయ్యు ద్వాదశాక్షరమంత్రంబు నుపదేశించిన వ్యూహవాసుదేవుఁడై ప్రకాశించువాఁడు. (714.)

### 715. సర్వాసునిలయః.

"సర్వేషామ్ అసూనాం నిలయః సర్వాసునిలయః" అందఱప్రాణంబలకును ఆధారముగానుండువాఁడు.

* అసూర్యమివ సూర్యేణ నివాతమివ వాయునా। కృష్ణేన సముపేతేన జహృషే భారతం పురమ్. * (భా. స. 33-15) [సూర్యుడులేకయుండి సూర్యుని పొందినట్లును, వాయువులేకయుండి వాయువును పొందినట్లును, భారతపట్టణము కృష్ణునిపొంది సంతసించినది.] ఇత్యాదులు. (715.)

### 716. అనలః. (294)

(1) "న అలః అనలః" భక్తులకు తాను సమస్తకార్యంబులను చేసియు తృప్తినొందనివాఁడు. * ఋణం ప్రవృద్ధమివ మే హృదయాన్నాపసర్పతి * (భా. ఉ. 8-22) [పెరిగిన అప్పువలె ద్రౌపది గోవిందా అని పిల్చినది నాహృదయంబునుండి తొలఁగదయ్యె.]

(2) తన భక్తులవిషయంబున కావించిన అపరాధములను సహింపజాలనివాఁడు. * ద్వౌతు మే వధకాలేఽస్మిన్ న క్షన్తవ్యౌ కథఞ్చన। యజ్ఞవిఘ్నకరం

717. దర్పహా.   718. దర్పదః.

719. (1) అదృప్తః. (2) దృప్తః. 720. దుర్ధరః.

దర్పహా = దేవతలగర్వంబు నణచినవాడు. దర్పదః = గర్వంబును గల్గించినవాడు. (1) అదృప్తః = గర్వింపకుండువాడు. (2) దృప్తః = గర్వించినవాడు. దుర్ధరః = (1) ధరింపజాలని చేష్టలంగలవాడు. (2) గ్రహింపజాలనివాడు.

---

హన్యాన్ ప్రాణవానాశ్చ దుర్బ్రాహ్మణాన్ * [చంపదలసినప్పుడు వీరలనిద్దఱను క్షమింపను. చంపియే తీఱుదును. వార్తాహరనగా, యాగవిఘ్న మొనరించినవారలు, పాండవులకు శత్రువులు అనువీరు.] (716.)

## 717. దర్పహా.

"దర్పం హన్తీతి దర్పహా" గోవర్ధనోద్ధారణము పారిజాతాపహరణము మున్నగువానిచే దేవతలగర్వంబునణఁచినవాఁడు. (717.)

## 718. దర్పదః.

"దర్పం దదాతీతి దర్పదః" శత్రువులను నిరసించి ఎవరికిని జయింపరాని ద్వారకాపురిని నిర్మించి శంఖనిధి పద్మనిధి దేవపారిజాతము దేవసభ మున్నగువాని నిచ్చియుండుటచే నిర్భరులగు యాదవులకు మధుపానాదులను చేయించి గర్వంబును గల్గించినవాఁడు. (718.)

## 719. (1) అదృప్తః. (2) దృప్తః.

(1) "న దృప్తః అదృప్తః" అట్లుండియు తాను గర్వింపకుండువాఁడు. * ఏవంవిధాని కర్మాణి కృత్వా గరుడవాహనః । న విస్మయముపాగచ్ఛత్ పారమైష్ఠ్యేన తేజసా * (భా. స. 51-29) [ఆగరుడవాహనుఁడిట్టికార్యంబులనొనరించియు పరంజ్యోతిస్వరూపంబగు తనమహిమంబునుగూర్చి కొంచెమైనను గర్వింపలేదు.]

(2) లేక, "దృప్తః" అనిఛేదము. యశోదాదేవియొక్క లాలనాదులచే గర్వించినవాఁడు. (719.)

## 720. దుర్ధరః (267)

"దుఃఖేనాపి ధర్తుమ్ అశక్యః దుర్ధరః"

(1) బాలక్రీడ లొనరించినప్పుడు మదపుటేనుఁగువలె యశోదానందగోపులచే ధరింపజాలనిచేష్టల నొనరించినవాఁడు. * యదిశక్నోషి గచ్ఛ త్వమతిచఞ్చలచేష్టిత * (వి. పు. 5-6-15) [ఓరీతుంటరీ! నీకుశక్తియుండినచో వెళ్లుము.] అని యశోద యనెను.

## 721. అపరాజితః.

అపరాజితః = పాండవులకు అపజయముగలుగకుండ చేసినవాడు.

---

(2) లేక, దురాత్ములచే గ్రహింపఁజాలనివాఁడు. * ఇమంహి పుణ్డరీకాక్షం జిఘృక్షన్త్యల్పచేతసః। పటేనాగ్నిం ప్రజ్వలితం యథా బాలో యథాఽబలాః * (భా. ఉ. 129_16) [జ్వలించు అగ్నిని బాలుఁడో బాలికయో వస్త్రాంబుతో బట్టఁజూచునట్లు ఈయల్పులు కృష్ణుని గ్రహింప గోరుచున్నారు.] * దుర్గ్రహః పాణినా వాయుః దుస్స్పర్శః పాణినా శశీ। దుర్ధరా పృథివీ మూర్ధ్నా దుర్గ్రహః కేశవో బలాత్ * (భా. ఉ. 129_40) [వాయువును హస్తంబులచే పట్టఁజాలము. చంద్రుని స్పర్శింపఁజాలము. ఇటులే కేశవుని బలంబుచే గ్రహింపఁజాలము.] ఇత్యాదులు. (720.)

## 721. అపరాజితః. (866)

"అపరాజితాః అస్య సన్తీతి అపరాజితః" భారతయుద్ధంబున వేఱు పరికరంబుల నపేక్షింపక తన్నుమాత్రము సహాయముగా అపేక్షించినంతమాత్రాన పాండవులకు అపజయము కలుగకుండ జేసినవాఁడు.

* యస్య త్వం పురుషవ్యాఘ్ర సారథ్య ముపజగ్మివాన్। ధ్రువఏవ జయస్తస్య న తస్యాస్తి పరాజయః * (భా. ఉ. 52_12) [ఓ పురుషశ్రేష్ఠుఁడా! నీవెవనికి సారథిగానుందువో; వానికి జయము నిశ్చయము. వానికపజయము గలుగదు.] * శక్తోఽహం ధనుషైకేన నిహన్తుం సర్వపాణ్డవాన్। యద్యేషాం నో భవేద్గోప్తా విష్ణుః కారణపూరుషః * [కృష్ణుఁడు ఈపాండవులకు రక్షకుఁడుగా లేకుండినచో పాండవులను ఒక బాణముచేతనే చంపుదును.] * యథాఽహం నాభిజానామి వాసుదేవపరాజయమ్। మాతుశ్చ పాణిగ్రహణం సముద్రస్యచ శోషణమ్। ఏతేన సత్యవాక్యేన సిద్ధ్యతామగదోప్యయమ్ (చ. సం.) [వాసుదేవుఁడు అపజయంబునొందియుండుట నెఱుంగను. ఎట్లనఁగా, నాతల్లియొక్క వివాహంబును నేనెఱుంగను. సముద్రము శోషించియుండుట నెఱుంగను. కనుక ఈ సత్యవాక్యంబుచే ఈ వ్యాధి తొలగుగాక.] (721.)

(అవతారిక.) దుర్బలురగు పాండవులను బలవంతురగు కౌరవులు జయింపకుండుటకు కారణం బేమనగా :__

722. విశ్వమూర్తిః.　　　723. మహామూర్తిః.
724. దీప్తమూర్తిః.　　　725. అమూర్తిమాన్.

విశ్వమూర్తిః = ప్రపంచంబును శరీరముగాగలవాడు. మహామూర్తిః = విశ్వరూపంబున పెద్దశరీరంబును గలవాడు. దీప్తమూర్తిః = ప్రకాశించునవి యన్నియు తన మూర్తిగా గలవాడు. అమూర్తిమాన్ = అవ్యక్తాదులకు స్వామి.

---

## 722. విశ్వమూర్తిః.

"విశ్వమ్ మూర్తిః యస్యసః విశ్వమూర్తిః" * అహమాత్మా గుడాకేశ! సర్వభూతాశయస్థితః * (గీ. 10_20) [అర్జునా సర్వభూతముల హృదయంబులందు వసించి వానికాధారముగనుండువాఁడు నేనే] అనినట్లు సమస్తప్రపంచంబును తనకు శరీరముగాగలవాడు. కనుక నే తనకిష్టులగు పాండవులు జయించునట్లును తనకనిష్టులగు కౌరవులు జయింపకుండునట్లును ప్రవర్తింపజేసెను. (722.)

## 723. మహామూర్తిః.

"మహతీ మూర్తిః యస్యసః మహామూర్తిః" విశ్వరూపంబును ప్రదర్శించినప్పుడు ప్రపంచమంతయు ఆశ్రయించునట్టి పెద్దదగు శరీరముగలవాఁడు.

* ఇహైకస్థం జగత్కృత్స్నం పశ్యాద్య సచరాచరమ్। మమ దేహే గుడాకేశ! యచ్చాన్యద్ద్రష్టుమిచ్ఛసి * (గీ. 11_7) [అర్జునా! చరాచరాత్మకంబగు సమస్తప్రపంచంబును నాశరీరైకదేశంబుననే ఉండుటఁజూడుము. ఇంక నేదేనియాశ్చర్యంబులనుచూడ గోరినను చూడుము.] (723.)

## 724. దీప్త మూర్తిః.

"దీప్తా మూర్తిః యస్యసః దీప్తమూర్తిః" ప్రపంచంబున నేదేనొక వస్తువు ఏదేనొకగుణవిశేషంబుచే ప్రకాశించినచో అవియన్నియు తనవిశేషమూర్తిగా గలవాఁడు,

* యద్యద్విభూతిమత్సత్త్వం శ్రీమదూర్జితమేవవా। తత్తదేవావగచ్ఛ త్వం మమ తేజోఽంశసంభవమ్ * (గీ. 10_41) [ఐశ్వర్యముగలదియు బలముగలదియు వైభవముగలదియునగు ప్రాణియేదిగలదో; అది నాతేజసుయొక్క అంశంబునుండి పుట్టినదిగా ఎఱుంగుము.] (724.)

## 725. అమూర్తిమాన్.

"నాస్తి మూర్తిః యేషాన్తే అమూర్తయః, అమూర్తయః అస్య సన్తీతి అమూర్తిమాన్" శరీరములేని మూలప్రకృతి జీవాత్మ మున్నగువానిని తనదిగా గలవాడు.

726. అనేకమూర్తిః. 727. అవ్యక్తః. 728. శతమూర్తిః.

అనేకమూర్తిః = అనేకశరీరములను కృష్ణావతారంబున పరిగ్రహించినవాడు.
అవ్యక్తః = అవతారంబున తనమహిమ బయలువడకుండువాడు.
శతమూర్తిః = అనేకరూపములం గలవాడు.

---

* యస్యాఽఽత్మా శరీరమ్ * (శ. బ్రా. 14-6-30) [ఎవనికి ఆత్మ శరీరమో......] * యస్యాఽవ్యక్తం శరీరమ్ * (సు. ఉ. 7) [ఎవనికి అవ్యక్తము శరీరమో......]

ఇచట అమూర్తిమాన్ అనగా శరీరములేనివాఁడు, అని కొందఱు వ్యాఖ్యానించిరి. అట్లయినచో క్రిందను మీఁదను భగవంతునకు శరీరముండునట్లు చెప్పుటచే ఆవాక్యములు విరోధించును. కాకయు, 'అమూర్తి' అనక 'అమూర్తిమాన్' అని మతుప్ప్రత్యయం (మాన్) బుతో చెప్పుటయు వ్యర్థమగును. కనుక క్రిందజేసిన వ్యాఖ్యానమేయుక్తము. (725.)

## 726. అనేకమూర్తిః.

"అనేకాః మూర్తయః యస్యసః అనేకమూర్తిః" కృష్ణుడై యుండియు వాసుదేవాది నాలుగు వ్యూహమూర్తులను వీడకుండుటచేతను, * షోడశస్త్రీసహస్రాణి శతమేకమ్ తతోఽధికమ్। తావన్తి చక్రే రూపాణి భగవాన్ దేవకీసుతః * (వి. పు. 5-32-18.) [౧౬౧౦౦ గోపికలకు తగినట్లు దేవకీసుతుఁడగు భగవంతుఁడు తానుగూడ అన్నిరూపంబులను ధరించెను.] అనినట్లు ఈకృష్ణావతారంబున అనేకమూర్తులను పరిగ్రహించియుండుటచేతను అనేకరూపములను పరిగ్రహించినవాడు. (726.)

## 727. అవ్యక్తః.

"న వ్యక్తః అవ్యక్తః" అవతారకాలంబున తనమహిమ బయలువడకుండునట్లు మనుష్యభావంబుచే దాగించుకొని యుండువాఁడు.

* నాఽహం ప్రకాశస్సర్వస్య * (గీ. 7. 25.) [నేనందఱకును ప్రకాశించువాఁడనుగాను. * నాఽహం వేదైర్నతపసా * (గీ. 11-53) [నన్ను వేదంబులచేతనో లేక తపంబులచేతనో చూడఁజాలడు.] ఇత్యాదులు. (727.)

## 728. శతమూర్తిః.

"శతం మూర్తయః యస్యసః శతమూర్తిః" తన్నుచూడ గోరిన అర్జునునకు విశ్వరూపంబును ప్రదర్శించినపుడు అనేక మూర్తులను గలవాడు.

* పశ్య మే పార్థ! రూపాణి శతశోఽథ సహస్రశః * (గీ. 11. 5.) [అర్జునా! నాయొక్కయనేకరూపములను చూడుము.] (728.)

729. శతాననః. 730. ఏకః.
731. నైకః. 732. సః.

శతాననః = అనేకముఖములంగలవాడు. ఏకః = అద్వితీయుడు. నైకః = అనేకుడు. సః = నిశ్చయింపజేయువాడు.

---

## 729. శతాననః.

"శతం ఆననాని యస్యసః శతాననః" * అనేకవక్త్రనయనమ్ * (గీ. 11_10.) అనినట్లు విశ్వరూపకాలమున అనేకముఖములను గలవాడు. (729.)

## 730. ఏకః.

క్రిందఁజెప్పిన మహిమంబులతో గూడియుండు తనవలె మఱొకఁడు లేకుండుటచే రెండు మున్నగు సంఖ్యలేక తానొకఁడైయుండువాఁడు. అనగా అద్వితీయుడు. ఇద్దఱు బ్రాహ్మణులు, ముగ్గురు క్షత్రియులు, మున్నగు స్థలంబులందు బ్రాహ్మణ్యము క్షత్రియత్వము మున్నగు జాతిధర్మములు సమానముగానుండుటచే రెండు మూఁడు మున్నగు సంఖ్యలుండునట్లు, భగవంతునకుఁగల సర్వేశ్వరత్వాదిచిహ్నంబులు మఱొకరియందుండిననే రెండు మున్నగు సంఖ్యలకు ప్రసక్తియుండును. అనగా భగవంతునకు సమమగు వేఱొక వ్యక్తియుండిననే రెండు అనఁబడు ద్వితీయముండును. అది లేదుగాన వీఁడు అద్వితీయుఁడు. కనుకనే 'ఏకము' అని అద్వైతముగా జెప్పబడియె.

* ఏక ఇద్రాజా జగతో బభూవ * (య వే.కా. 4_1_32.) [జగంబునకంత నొకడే రాజైయుండును.] * న తస్య ప్రతిమా౽స్తి * [వానికి సమమయినవాఁడు లేఁడు.] ఇత్యాదులు. (730.)

(అవతారిక.) ఇచ్చట ఏకమన్నది, ఈశ్వరునిదప్ప వేఱొకటి లేకుండుటచే దానిని చెప్పననియు, సర్వము వానివికారంబగుటచే దానిని చెప్పననియు కొందఱందురు. అది ప్రమాణవిరుద్ధము. క్రింద జెప్పినట్లు వీనివంటి మహామహిమశాలి మఱొకఁడు లేఁడు అనియే సిద్ధాంతము. దీనిని వివరించుచున్నారు :_

## 731. నైకః.

"న ఏకః నైకః" తనకు విభూతిరై విజాతీయమైయుండు సమస్త పదార్థంబులంగెవాఁడైయుండుటచే అనేకుఁడు.

* నాన్తో౽స్తి మమ దివ్యానాం విభూతీనాం పరన్తప! * (గీ. 10_40.) [అర్జునా! దివ్యములగు నావైభవంబులకు అంతమేలేదు.] (731.)

## 732. సః.

"స్యతి నిశ్చయీకరోతీతి సః" ఇట్టి సిద్ధాంతంబును ఆబాలవృద్ధము నిశ్చయింప జేయువాఁడు.

733. వః. 734. కః. 735. కిమ్.
736. యత్. 737. తత్.

వః = వసించువాడు. కః = ప్రకాశించువాడు. కిమ్ = ప్రశ్న చేయదగినవాడు.
యత్ = ప్రయత్నించువాడు. తత్ = జ్ఞానభక్తులను గల్గించువాడు.

---

## 733. వః.

"వసతీతి వః" * వసన్తి తత్ర భూతాని భూతాత్మన్యఖిలాత్మని। సచ భూతేష్వశేషేషు వకారార్థస్తతోమునే * [సమస్తప్రాణులను శరీరముగా నొంది వానికంతరాత్మగానుండు పరమపురుషునియందు సమస్తభూతంబులును వసించును. వాఁడును సమస్త ప్రాణులందును వసించుచున్నాఁడు. కనుక వాఁడే వకారార్థంబగును.] అను నిరుక్తరీతిగా సమస్త భూతంబులందును వసించువాఁడు.

## 734. కః.

"కనతి దీవ్యతే ఇతి కః" మలిన పదార్థంబులందు తాను వసించుచుండియు ప్రకాశముగానుండువాఁడు. (734.)

## 735. కిమ్.

తత్త్వంబు నెఱుంగగోరినవారలచే నిరుపాధికముగా ప్రశ్న చేయఁదగినవాఁడు * సోఽన్వేష్టవ్యః స విజిజ్ఞాసితవ్యః * (ఛా. ఉ. 8-7-1.) [వాఁడు వెదకఁదగినవాఁడు. వాఁడు విచారించి యెఱుంగ దగినవాఁడు.] (735.)

## 736. యత్.

"యతతే ఇతి యత్" భక్తులను రక్షించుటకై సదా ప్రయత్నించువాడు.

* కృష్ణ కృష్ణేతి కృష్ణేతి యో మాం స్మరతి నిత్యశః। జలం భిత్త్వా యథా పద్మం నరకాదుద్ధరామ్యహమ్ * [ఎవఁడు నిత్యము కృష్ణ కృష్ణ కృష్ణ అని స్మరించునో; జలంబును చీల్చుకొని తామర వెలుపడునట్లు నరకంబునుండి వానిని ఉద్ధరించెదను] * అహం స్మరామి మద్భక్తం నయామి పరమాంగతిమ్ * (వ. పు) [నాభక్తుని నేను స్మరించి పరమగతినొంద జేసెదను.] (736.)

## 737. తత్.

"తనోతీతి తత్" భక్తులకు జ్ఞానము భక్తి అను వీనిని గల్గించువాఁడు. కనుకనే జ్ఞాన ప్రదానార్థమై గాయత్రిని జపించుచుందురు. (737.)

738. పదమనుత్తమమ్. 739. లోకబన్ధుః.
740. లోకనాథః. 741. మాధవః.

పదమనుత్తమమ్ = పరమప్రాప్యుడు. లోకబన్ధుః = లోకములకుబంధువు. లోకనాథః = లోకనాథుడు. మాధవః = (1) లక్ష్మీపతి (2) యదువంశంబున అవతరించినవాడు. (3) మౌనాదులంగలవాడు.

---

## 738. పదమనుత్తమమ్.

వారలకు పరమప్రాప్యమైనవాఁడు. (738.)

(అవతారిక.) ఇట్లిందఱను తారతమ్యము లేక అనుగ్రహించుటకుఁ గారణంబగు సంబంధమును చెప్పుచున్నారు:—

## 739. లోకబన్ధుః.

"లోకానాం బన్ధుః లోకబన్ధుః" సమస్త లోకంబులను తనజనంబుగా గలవాఁడు.

* మాతా పితా భ్రాతా నివాస శ్శరణం సుహృద్గతి ర్నారాయణః * (సు. ఉ. 6.) [తల్లి తండ్రి సోదరుఁడు నివాసస్థానము శరణము మిత్రుడు గతి సమస్తము నారాయణుఁడే.] (739.)

(అవతారిక.) ఈలోకబంధుత్వంబునకు అసాధారణ సంబంధంబును చెప్పుచున్నారు:—

## 740. లోకనాథః.

"లోకానాం నాథః లోకనాథః" సమస్త లోకంబులకును నాథుఁడు.

(అవతారిక.) వీఁడు లోకబంధువగునప్పుడు లక్ష్మీసహితుఁడై తలిదండ్రులుగానుండుటచే దానిని దెల్పుచున్నారు:—

## 741. మాధవః. (73-169)

(1) "మాయాః ధవః మాధవః." లక్ష్మీపతి.

(2) మధువని పేరొందిన యాదవకులంబున అవతరించినవాఁడు.

(3) * మౌనాత్ ధ్యానాచ్చ యోగాచ్చ విద్ధి భారత! మాధవమ్ * (భా. ఉ. 71-4) అను నిరుక్తరీతిగా మౌన ధ్యాన యోగంబులం గలవాఁడు. (741.)

(అవతారిక.) క్రిందఁజెప్పిన భగవంతునిస్వామిత్వంబునంగీకరించియుండు భక్తులవిషయంబున ఆతఁడుండు స్థితిని చెప్పుచున్నారు:—

742. భక్తవత్సలః 743. సువర్ణవర్ణః.
744. హేమాఙ్గః. 745. వరాఙ్గః.

భక్తవత్సలః = భక్తుల విషయంబున ప్రీతిగలవాడు. సువర్ణవర్ణః = బంగారు వర్ణము గలవాడు. హేమాఙ్గః = శ్లాఘ్యమగు శరీరము గలవాడు. వరాఙ్గః = దివ్యమంగళవిగ్రహము గలవాడు.

---

## 742. భక్తవత్సలః.

"భక్తేషు వత్సలః భక్తవత్సలః" ఇట్టిభక్తులను లభించినప్పుడు తనకు వేఱొకటి యుండుసట్లు స్మరింపక సమస్తంబును మఱచియుండువాఁడు. (742.)

## 743. సువర్ణవర్ణః.

"సువర్ణస్యేవ వర్ణః యస్యసః సువర్ణవర్ణః" క్రిందఁ జెప్పిన గుణంబులకుం దగినట్లు బంగారంబు నొరసినట్లు ప్రకాశించు వర్ణము గలవాఁడు.

* యదా పశ్యః పశ్యతే రుక్మవర్ణమ్ * (ము. ఉ. 3-3.) [సదా ప్రాజ్ఞుఁడై స్వర్ణవర్ణుఁడైయుండువానిని ఎప్పుడు చూచునో;] * రుక్మాభం స్వప్నధీగమ్యమ్ * (మ. స్మృ. 12-122) [స్వప్నమువలె బుద్ధికి గోచరముగాని స్వర్ణవర్ణుని.] * హిరణ్మయః పురుషః సర్వఏవ సువర్ణః * (ఛా. ఉ. 1-6-6.) [సువర్ణమయుండగు పురుషుఁడు, సమస్తమును సువర్ణమే.] (743.)

## 744. హేమాఙ్గః.

"హేమ అఙ్గమ్ యస్యసః హేమాఙ్గః" క్రిందఁ జెప్పిన స్వర్ణవర్ణంబున కాధారమై నిత్యమై శుద్ధసత్త్వమయమై ప్రకాశించు శరీరము గలవాఁడు.

* య ఏషోఽన్తరాదిత్యే హిరణ్మయః పురుషః దృశ్యతే * (ఛా. ఉ. 1-6-6.) [సూర్యమండలమధ్యంబున హిరణ్మయుఁడుగాను శుద్ధసత్త్వమయుడుగాను ఉండు పురుషుఁడెవఁడు కనఁబడునో;] (744.)

## 745. వరాఙ్గః.

"వరమ్ అఙ్గమ్ యస్యసః వరాఙ్గః" ఇట్లు ఉపనిషత్తులలో చెప్పబడినదియు, దేవకిచే గోరఁబడినదియు, దేవకీప్రార్థనంబుచే దివ్యచిహ్నంబులను ఉపసంహరించినదియునగు దివ్యమంగళవిగ్రహంబు గలవాఁడు.

746. చన్దనాఙ్గదీ.  747. వీరహా.  748. విషమః.
749. శూన్యః.  750. ఘృతాశీః.  751. అచలః.

చన్దనాఙ్గదీ = ఆనందమునిచ్చు దివ్యాభరణములంగలవాడు. వీరహా = అసుర వీరులను చంపినవాడు. విషమః = వైషమ్యము గలవాడు. శూన్యః = దోషములు లేకుండువాడు. ఘృతాశీః = నేతిలో నిచ్ఛగలవాడు. అచలః = కదలింపఁజాలనివాడు.

---

* ఫుల్లేన్దీవరపత్త్రాభమ్ చతుర్బాహుం నిరీక్ష్య తమ్। శ్రీవత్సవక్షసం జాతం తుష్టావాఽఽనకదున్దుభిః * (వి. పు. 5-3-8.) [వికసించిన నల్లకలువవంటి వర్ణముగలవాఁడై నాలుగుబాహువులతోను శ్రీవత్సంబను చిహ్నంబుతోను అవతరించియుండువానిం జూచి వసుదేవులు స్తోత్రము చేసిరి.] (745)

## 746. చన్దనాఙ్గదీ.

"చన్దనాని అఙ్గదాని అస్యసన్తీతి చన్దనాఙ్గదీ" చందనమువలె సంతసింపఁజేయు బాహుపురి మున్నగు దివ్యాభరణంబులంగలవాఁడు. (746.)

## 747. వీరహా. (168 - 927)

"వీరాన్ హన్తీతి వీరహా" చంటిబిడ్డగానుండియు పూతనా - శకట - యమళార్జునాది దేవశత్రువులను నిశ్శేషముగా చంపినవాఁడు. (747.)

## 748. విషమః.

ఇట్లు దుష్టనిగ్రహమును శిష్టపరిపాలనమును చేయుచుండుటచే వైషమ్యము గలవాడు. (748.)

## 749. శూన్యః.

మనుష్యుడై యవతరించియు ఎట్టి దోషంబును లేనివాఁడు. (749.)

## 750. ఘృతాశీః.

"ఘృతే ఆశీః యస్యసః ఘృతాశీః" (1) వ్రేపల్లెలో నుండు నెయ్యి మున్నగువానిలో నిచ్ఛగలవాఁడు.

(2) తనకల్యాణగుణంబులచే జగత్తును సంతసింపఁజేయుటలో ఇచ్ఛగలవాడు.

## 751. అచలః.

"న చలః అచలః". దుర్యోధనాది దుర్మార్గులచే కదలింపఁజాలనివాఁడు. (751.)

752. చలః. 753. అమానీ.
754. మానదః. 755. మాన్యః.

చలః = పాండవాదులకై తనప్రతిజ్ఞనుండి చలించినవాడు. అమానీ = అహంకారము లేనివాడు. మానదః = గౌరవంబునిచ్చినవాడు. మాన్యః = గౌరవముగా దలంచువాడు.

---

## 752. చలః.

"చలతీతి చలః" తన్నాశ్రయించిన పాండవాదులకై తనసత్యసంకల్పంబును వీడినవాఁడు. అనఁగా భారతయుద్ధంబున ఆయుధంబునెత్తనని ప్రతిజ్ఞ కావించియుండియు, భీష్మునితో నర్జునుఁడు యుద్ధమొనరించునపుడు భీష్మ బాణంబులచే మూర్ఛిల్లిన అర్జునునిరక్షణార్థమై తనప్రతిజ్ఞనుగూడ వీడి చక్రాయుధంబును ఎత్తియుండుటచే తన ప్రతిజ్ఞనుండి చలించినవాఁడు.

* తమాత్తచక్రం ప్రణదన్తముచ్చైః క్రుద్ధం మహేన్ద్రావరజం సమీక్ష్య। సర్వాణి భూతాని భృశం వినేదుః క్షయం కురూణామితి చిన్తయిత్వా ॥ స వాసుదేవః ప్రగృహీతచక్రః సంవర్తయిష్యన్నివ జీవలోకమ్। అభ్యుత్పతన్ లోకగురుః బభాసే భూతాని ధక్ష్యన్నివ ధూమకేతుః * (భా. భీ. 59_94) [చక్రాయుధంబునెత్తి గర్జించుచు కోపావిష్ణుఁడైయుండు కృష్ణుని జూచి ఇక కౌరవులు నశించిరని సమస్త ప్రాణులును సంతసించిరి.] (752.)

## 753. అమానీ.

"న మానీ అమానీ" భక్తుల విషయంబున అహంకారము లేనివాడు. కనుకనే దూత్యాదులను లజ్జలేక అంగీకరించెను. (753.)

## 754. మానదః.

"మానం దదాతీతి మానదః" అర్జునునకు మహారథికుడనియు, ఉగ్రసేన మహారాజునకును యుధిష్ఠిరునకును సార్వభౌముడనియు బహుమానంబును ఇచ్చినవాడు

## 755. మాన్యః.

వారలకు సారథ్యాదులనొనరించుటనే తనకు గౌరవముగా దలంచువాడు.

* స సారథే స్స్వాత్త్వతకౌరవాణాం క్రుద్ధస్య ముచ్యేత రణేఽద్య కశ్చిత్ * [కోపావిష్టుండగు పాండవసారథిని యుద్ధంబున నెదిరించిన ఎవఁడును ప్రాణంబులతో మనలడు.] (755.)

(అవతారిక.) ఇట్లు కార్యంబులను గావించువాఁ డెవ్వడనగా :—

756. లోకస్వామీ. 757. త్రిలోకధృత్.
758. సుమేధాః. 759. మేధజః.

లోకస్వామీ = లోకనాథుడు. త్రిలోకధృత్ = ముల్లోకంబును ధరించువాడు. సుమేధాః = మంచితలంపుగలవాడు. మేధజః = దేవకియొక్క యాగ ఫలముగా అవతరించినవాడు.

---

## 756. లోకస్వామీ.

"లోకానాం స్వామీ లోకస్వామీ" సకలలోకనాయకుడు. (756.)

(అవతారిక.) ఇట్టి మహనీయుఁడు అతినీచులతో చేరుటకు గారణం బేమనగా :—

## 757. త్రిలోకధృత్.

"త్రీన్ లోకాన్ ధరతీతి త్రిలోకధృత్" ముల్లోకంబును ధరించుటయు పోషించుటయు తానే యగుటయే కారణము.

* విష్టభ్యాహమిదం కృత్స్నమ్ ఏకాంశేన స్థితో జగత్ * (గీ. 10_42) [నేనీ సమస్తలోకంబులను నామహిమంబున స్వల్పభాగంచేతనే నిల్పుచుందును.] (757.)

## 758. సుమేధాః.

"సుశోభనా మేధా యస్యసః సుమేధాః" తన్నారాధించువారలవిషయంబున మంచి తలంపు గలవాడు. (758.)

## 759. మేధజః.

"మేధే జాయతే ఇతి మేధజః" కనుకనే (అనగా భక్తుల విషయంబున మంచి తలంపు గలవాడగుటవలననే) దేవకి పుత్రునిగోరి గావించిన వ్రతంబను యాగంబున అవతరించినవాఁడు.

* స్తుతోఽహం యత్త్వయా పూర్వం పుత్రార్థిన్యా తదద్య తే। సఫలం దేవి సఞ్జాతం జాతోఽహం యత్తవోదరాత్ * (వి. పు. 5_3_14) [కృష్ణుఁడు దేవకితో చెప్పెను :— పూర్వము నీవు పుత్రునిగోరి ప్రార్థించితివి గదా! దానిని నెఱ వేర్చుటకనియే నే నిపుడు నీకు పుత్రుఁడుగా పుట్టియున్నాఁడను.] * సమ్యగారాధి తేనోక్తం యత్ప్రసన్నేన తే శుభే। తత్కృతం సకలం దేవి * (వి. ధ. 33_39.) [నీ యారాధనంబుచే సంతసించి నేను చెప్పినవానినన్నింటిని నెఱవేర్చితిని.] (759.)

760. ధన్యః. 761. సత్యమేధాః. 762. ధరాధరః.

ధన్యః = ధనముగలవాడు. సత్యమేధాః = అవతారములోని వ్యాపారములు సత్యముగానుండువాడు. ధరాధరః = గోవర్ధనపర్వతంబును ధరించిన వాడు,

---

## 760. ధన్యః.

" ధనం లబ్ధ్వా ధన్యః " దేవకియందు జనించుట యను ధనంబు నొందినవాఁడు.

* జాతోఽహం యత్తవోదరాత్ * (వి. పు. 5_13_24.) [నీ యుదరంబు నుండి జనించితిని.] * అహం వో బాన్ధవో జాతః * (వి. పు 5_13_11.) [మీకు నేను బంధువుగానే పుట్టియున్నవాడను.] (చూ. నామము. 761.) (760.)

## 761. సత్యమేధాః.

"సత్య మేధా యస్య సః సత్యమేధాః" గోపులు వసుదేవుడు మున్నగు వారియందు పైకి నటనగా లేక సత్యమగు బుద్ధితో గలసి మెలసియుండినవాఁడు.

కృష్ణుఁడు గోపాలురితో చెప్పుచున్నాడు :— * యదివోఽస్తి మయి ప్రీతిః శ్లాఘ్యోఽహం భవతాం యది। తదాత్మబుద్ధిసదృశీ బుద్ధిర్వః క్రియతాం మయి * (వి.పు. 5_13_1) [నామీఁద మీకు ప్రీతియుండి, మీకు నేను శ్లాఘ్యుఁడై యుండినచో, నేను మీయొద్ద నుండునట్లు మీరుకూడ నాయొద్ద నుండగలరు.] * నాఽహం దేవః న గన్ధర్వః న యక్షః నచ దానవః। అహం వో బాన్ధవో జాతః న నశ్చిన్త్య మతోఽన్యథా * (వి. పు. 5_13_11.) [నేను దేవుఁడు గాదు గంధర్వుఁడు గాదు, యక్షుఁడు గాదు. దానవుఁడు గాదు. మీ బంధువుగానే పుట్టిన వాఁడను. నన్ను వేఱువిధముగా తలంపవలదు.] (761.)

## 762. ధరాధరః.

" ధరమ్ ఆధరతీతి ధరాధరః " ఇంద్రుడంపిన కుంభవర్షంబునుండి వ్రేపల్లెను రక్షింప గోవర్ధన పర్వతంబును ధరించినవాఁడు.

* తదేతదఖిలం గోష్ఠం త్రాతవ్యమధునా మయా। ఇమమద్రిమహం ధైర్యాత్ ఉత్పాట్యోరు శిలామయమ్। ధారయిష్యామి గోష్ఠస్య పృథుచ్ఛత్రమివాపరమ్ * (వి. పు. 5_11_13.) [ఇప్పుడే వ్రేపల్లెనంత గాపాడవలసియుండును గాన ఈపర్వతమును గొడుగువలె పైకెత్తి కాపాడెదను.] (762.)

763. తేజోవృషః. 764. ద్యుతిధరః.
765. సర్వశస్త్రభృతాం వరః.
766. ప్రగ్రహః. 767. నిగ్రహః.

తేజోవృషః = కాంతిని వర్షించువాడు. ద్యుతిధరః = అతిమానుష దివ్యశక్తిని గలవాడు. సర్వశస్త్రభృతాంవరః = అస్త్రధారులలో శ్రేష్ఠుడు. ప్రగ్రహః = భక్తులను తనవచనానుసారము నడపించువాడు. నిగ్రహః = శత్రువులను నిరసించువాడు.

---

## 763. తేజోవృషః.

" తేజః వర్షతీతి తేజోవృషః " సుహృత్తులను పాలించుటయను తేజస్సును వర్షించువాఁడు. అనగా దీనికై తన శక్తిని ఉపయోగించువాడు అని భావము.

## 764. ద్యుతిధరః.

" ద్యుతిం ధరతీతి ద్యుతిధరః " కనుకనే (అనగా సుహృత్తులకై తనశక్తిని ఉపయోగించుటవలననే) బాలుఁడయ్యు దేవేంద్రునిగూడ జయించునంత మనుష్యునకు దగని కాంతిని గలవాఁడు. (764.)

## 765. సర్వశస్త్రభృతాం వరః.

నరక - జరాసంధాదులతో యుద్ధము చేసినప్పుడు అనేకాస్త్రంబులను ప్రయోగించుటచే అస్త్రధారులందఱిలో శ్రేష్ఠుఁడు.

* మనుష్యధర్మలీలస్య లీలా సా జగతీపతేః। అస్త్రాణ్యనేకరూపాణి యదరాతిషు ముఞ్చతి * [శత్రువులమీఁద నానాస్త్రంబులను ప్రయోగించుట మనుష్యులవలె నటించు ఆభగవంతునియొక్క లీల.] (765.)

## 766. ప్రగ్రహః.

" ప్రగృహ్యతే అనేనేతి ప్రగ్రహః " పగ్గమిడినట్లు అర్జునుని చేసినవాఁడు. (అనగా, స్వాధీనముకావించుకొనినవాఁడని భావము.) (766.)

## 767. నిగ్రహః.

" నిగృహ్యన్తే శత్రవ ఇతి నిగ్రహః " అర్జునునిపౌరుషంబునెదురుచూడక తనసారథ్యవైచిత్ర్యంబుచేతనే శత్రువులను నిరసించినవాఁడు. (767.)

768. వ్యగ్రః. 769. నైకశృఙ్గః.
770. గదాగ్రజః. 771. చతుర్మూర్తిః

వ్యగ్రః = తొందరపడువాడు. నైకశృఙ్గః = పలువిధంబుగా శత్రువులను బాధించువాడు. గదాగ్రజః = గదునకు అన్న. చతుర్మూర్తిః = నాలుగుమూర్తులను గలవాడు.

---

## 768. వ్యగ్రః.

అర్జునునిశత్రువులను నశింపఁజేయువిషయంబున యుద్ధంబను కార్యంబును చేయువలయునోర్వనివాఁడు.

* యే యాన్తి యాన్త్యేవ శినిప్రవీర! యేఽవస్థితాః సత్త్వరం తేఽపి యాన్తు। భీష్మం రథాత్ పశ్యత పాత్యమానం ద్రోణంచ సఙ్ఖ్యే సగణం మయాఽద్య * (భా. భీ. 59_86.) [వీరా! ఎవరెవరు పోవుచున్నారో, వారును ఇచటనుండు వారును అందఱును పోవుదురుగాక. నేనొకఁడే భీష్ముని ద్రోణుని యుద్ధంబున వారలగుంపుతో చంపెద చూడుడు.] (768.)

## 769. నైకశృఙ్గః.

“నైకాని శృఙ్గాణి వైరిబాధకాని యస్యసః నైకశృఙ్గః” యుద్ధంబున బుద్ధిసామర్థ్యము, సారథ్యము, ఆయుధంబులను గ్రహింపకుండుటయను వ్యాజము, సమయమువచ్చినప్పుడు ఆయుధములను గ్రహించుట అనియిట్లు పలువిధంబుగా శత్రువులను బాధించు వ్యాపారంబులను గావించినవాఁడు. 769.)

## 770. గదాగ్రజః.

“గదస్య అగ్రజః గదాగ్రజః” వసుదేవునిపత్నియైన సునామకు పుత్రుఁడగు గదునకు ముందు పుట్టినవాడు. (770)

(అవతారిక.) ఈ విభవావతారంబునగూడ దీనికి గారణంబగు వ్యూహమును జ్ఞాపక పఱచుచున్నారు:—

## 771. చతుర్మూర్తిః.

“చతస్రః మూర్తయః యస్యసః చతుర్మూర్తిః” బలభద్ర - వాసుదేవ - ప్రద్యుమ్న - అనిరుద్ధులు అను నాలుగు మూర్తులతో యదుకులంబున అవతరించినవాఁడు

772. చతుర్బాహుః.　　773. చతుర్వ్యూహః.
774. చతుర్గతిః.　　775. చతురాత్మా.

చతుర్బాహుః = నాలుగు భుజములతో అవతరించినవాడు. చతుర్వ్యూహః = నాలుగు వ్యూహములను గలవాడు. చతుర్గతిః = నాలుగు గతులను గలవాడు. చతురాత్మా = నాలుగు స్వరూపములం గలవాడు,

---

## 772. చతుర్బాహుః.

"చత్వారః బాహవః యస్యసః చతుర్బాహుః" వ్యూహంబునకు మూలమగు పరస్వరూపముతో దేవకీగర్భంబున అవతరించుటచే నాలుగుబాహువులం గలవాఁడు.

* ఉపసంహర సర్వాత్మన్ రూపమేతచ్చతుర్భుజమ్। జానాతు మాఽవతారం తే కంసోఽయం దితిజన్మజః ॥ (వి. పు. 5. 3. 13) [చతుర్భుజములతోనుండు ఈరూపంబును సంహరించుకొనుము. ఈ కంసుడు నీయవతారంబును ఎఱుంగకూడదు.] అని దేవకీదేవియే చెప్పియుండుటం జూడుడు. (772)

## 773. చతుర్వ్యూహః. (140)

"చత్వారః వ్యూహాః యస్యసః చతుర్వ్యూహః" ఈ యవతారంబునగూడ తనషడ్గుణంబులను చేర్చియు విభజించియు వ్యవస్థకావించుటచే నాలుగు వ్యూహములంగలవాఁడు. (అనగా, జ్ఞానము మొన్నగు గుణంబులాఱును వాసుదేవరూపంబున పూర్ణముగానుండును. ఇతరములగు మూడురూపములయందు రెండు రెండు గుణంబులు నిండియుండును. ఇట్లు నాలుగు వ్యూహములంగలవాడు, అని భావము.) (773.)

## 774. చతుర్గతిః.

"చతస్రః గతయః ప్రాప్తయః యస్మిన్ సః చతుర్గతిః" ఇంద్రపదము బ్రహ్మపదము కైవల్యము మోక్షము అనబడు నాలుగువిధంబులగు గతులను ఉపాసకులతారతమ్యంబునకు దగినట్లు ఇచ్చువాడు. (774.)

## 775. చతురాత్మా. (139)

"చత్వారః ఆత్మానః యస్యసః చతురాత్మా" జాగ్రత్ - స్వప్న సుషుప్తి - తురీయము అను నాలుగు అవస్థలలోను నాలుగురూపములతో ప్రకాశించువాడు. (775.)

776. చతుర్భావః. 777. చతుర్వేదవిత్. 778. ఏకపాత్.
779. సమావర్తః. 780. నివృత్తాత్మా.

చతుర్భావః = నాలుగు ప్రయోజనములంగలవాడు. చతుర్వేదవిత్ = నాలుగు వేదంబుల నెఱింగినవారలకు స్వల్పముగా నెఱుంగదగియుండువాడు. ఏకపాత్ = అంశావతారమైనవాడు. సమావర్తః = మళ్లి మళ్లి అవతరించుచునుండువాడు. నివృత్తాత్మ = నిరపేక్షుడు.

---

## 776. చతుర్భావః.

"చత్వారః భావాః యస్యసః చతుర్భావః" వాసుదేవ-సంకర్షణ-ప్రద్యుమ్న-అనిరుద్ధ మూర్తులలో లోకసృష్టి శాస్త్ర ప్రదానము మున్నగు నాలుగు ప్రయోజనములను ప్రకటించినవాడు. (776.)

## 777. చతుర్వేదవిత్.

"చతుర్వేదైః విద్యతే కణికామాత్రతయా జ్ఞాయతే ఇతి చతుర్వేదవిత్" నాలుగు వేదంబుల నెఱింగినవారలకును తన మహిమార్ణవంబున స్వల్ప మాత్రమే యెఱుంగదగునట్లుండువాడు. (777.)

## 778. ఏకపాత్.

"ఏకః పాదః యస్యసః ఏకపాత్" * అంశావతారో బ్రహ్మర్షే యోఽయం యదుకులోద్భవః * (వి. పు. 5-1-2) [ఓ బ్రహ్మర్షీ! యదుకులంబున నవతరించిన ఇదియే అంశావతారమగును.] అనినట్లు అంశావతారమైనవాఁడు. (778.)

## 779. సమావర్తః.

"సమన్తాత్ ఆవర్తః యస్యసః సమావర్తః" ఈ వ్యూహవిభవంబులు వీని యందు మాటిమాటి వచ్చునట్లుండువాడు. (అనగా మళ్ళి మళ్ళి అవతరించుచునుండువాడని భావము.) (779.)

## 780. నివృత్తాత్మా. (231-453-604)

"నివృత్తః ఆత్మా యస్యసః నివృత్తాత్మా" కృపావశుఁడై ఈజగద్వ్యాపారంబున ప్రవర్తించునేగాని స్వతః అవాప్తసమస్తకాముండగుటచే దీనియందు కొంచెమైనను అపేక్ష లేకుండువాఁడు.

* అవాకీ అనాదరః" (ఛా. ఉ. 3-14) [మౌనముగా నుండును. కారణం బేమనఁగా (అనాదరః) దేనియందును అపేక్షలేదు.] (780.)

781. దుర్జయః. 782. దురతిక్రమః. 783. దుర్లభః.
784. దుర్గమః. 785. దుర్గః.

దుర్జయః = జయింపజాలనివాడు. దురతిక్రమః = అతిక్రమింపజాలనివాడు.
దుర్లభః = పొందజాలనివాడు. దుర్గమః = దాపింపజాలనివాడు.
దుర్గః = ప్రవేశింపజాలనివాడు.

---

## 781. దుర్జయః.

"దుఃఖేనాపి జేతుమ్ అశక్యః దుర్జయః" దేవమనుష్యాదుల శక్తిచే వశీకరింపజాలఁడుగాన జయింపజాలనివాఁడు.

* యన్నదర్శితవానేషః కస్తదన్వేష్టుమర్హతి * [వీఁడు తన్నుతానే చూపకుండినచో వీనినెవఁడు అన్వేషింపగలడు?] (781.)

## 782. దురతిక్రమః.

"దుఃఖేనాపి అతిక్రమితుం అశక్యః దురతిక్రమః" లోకులకు తనపాదమూలమునందప్పవేఱుగతి లేకుండుటచే ఎవరిచేతను అతిక్రమింపజాలనివాఁడు.

* వాసుదేవమనారాధ్య కో మోక్షం సమవాప్నుయాత్ * [విష్ణువును పూజింపక మోక్షంబునెవడు పొందఁగలఁడు?] (782.)

## 783. దుర్లభః.

"దుఃఖేనాపి లబ్ధుమ్ అశక్యః దుర్లభః" ఇంద్రియములను జయింపనివారలచే పొందజాలనివాఁడు

* తస్యాప్యన్యమనస్కస్య సులభో న జనార్దనః * (వి. ధ. 78-6) [వేఱు విషయంబున మనసు పడినవానికి విష్ణువు సులభుఁడుగాడు.] * అప్రాప్యః కేశవో రాజన్ యిన్ద్రియైరజితైః నృణామ్ * (భా. ఉ. 78-21.) [ఇంద్రియములను జయింపనివారలచే కేశవుఁడు పొంద దగినవాఁడుగాఁడు.] (783.)

## 784. దుర్గమః.

"దుఃఖేనాపి గన్తుమ్ అశక్యః దుర్గమః" కంటి నొప్పిగలవారు మధ్యాహ్నసూర్యుని చూడజాలకుండునట్లు మహాతేజస్వియగుటచే ఎవరిచేతను దాపింపజాలకుండువాఁడు. (784.)

## 785. దుర్గః.

"దుఃఖేన గచ్ఛన్త్యత్రేతి దుర్గః" అవిద్య మున్నగు ఆవరణంబులు ఆచ్ఛాదించుకొనియుండుటచే ప్రవేశింపజాలనివాఁడు. (785.)

786. దురావాసః. 787. దురారిహా.
788. శుభాఙ్గః. 789. లోకసారఙ్గః.

దురావాసః = దుర్లభమగు వాసమును గలవాడు. దురారిహా = దుర్మార్గంబున ప్రవేశించియుండువారలను నశింపజేయువాడు. శుభాఙ్గః = దివ్య మంగళ విగ్రహాయుక్తుడు. లోకసారఙ్గః = లోకమున సారములను ఉపదేశించి మోహింపజేయువాడు.

---

## 786. దురావాసః.

"దుఃఖేనాపి ఆవాసయితుమ్ అశక్యః దురావాసః" క్రింద చెప్పిన ట్లుండుటచే తన పాదారవిందవాసమును దుర్లభముగా గలవాఁడు. (786.)

(అవతారిక.) ఇట్లు దుర్లభముగానుండుట, వీనిని పొందవలయునను ఇచ్ఛయేలేని పాపులవిషయంబని దెల్ప బుద్ధావతారంబును చెప్పుచున్నారు. [ఇది మొదలు "మహాగర్తః" (నా. 810) అను నామమువఱకు బుద్ధావతారవిషయము.]

## 787. దురారిహా.

"దురారీన్ హన్తీతి దురారిహా" దుర్మార్గంబున ప్రవేశించియుండుటచే తనకు శత్రువులుగానుండువారలను వేదమార్గంబును విడువజేయుటమన్నగు అనేకోపాయంబులచే నశింపఁజేయువాఁడు.

* మాయామోహేన తేదైత్యాః ప్రకారైః బహుభిస్తథా। వ్యుత్థాపితా యథా నైషాం త్రయీం కశ్చిదరోచయత్ । నిహతాశ్చ సురాదేవైః సన్మార్గపరిపన్థినః * (వి. పు. 3-18-34.) [ఆయసురులను మాయలచే పలువిధములుగా మోహింపజేయగా వారందఱు వేదమార్గమునుగోరక సాధుమార్గ విరోధులైరి. అట్టివీరలు దేవతలచే చంపబడిరి.] (787.)

(అవతారిక.) వీఁడు వారలయందెట్లు ప్రవేశించుననఁగా ;

## 788. శుభాఙ్గః. (593.)

"శుభమ్ అఙ్గమ్ యస్యసః శుభాఙ్గః" వీఁడు మిక్కిలి విశ్వాసింపఁదగినవాఁడు అని మోహించునట్టి అతిమనోహరంబగు దివ్యమంగళ విగ్రహముగలవాఁడు. (788.)

(అవతారిక.) వాఁడెట్లు మోహింపఁజేయుననఁగా.

## 789. లోకసారఙ్గః.

"లోకే సారమ్ గచ్ఛతీతి లోకసారఙ్గః" బుద్ధావతారంబున లోకంబున సారములగు భోగమోక్షమార్గములను వారల కుపదేశించి మోహింపజేయువాఁడు. (789.)

790. సుతన్తుః.　　791. తన్తువర్ధనః.　　792. ఇన్ద్రకర్మా.
793. మహాకర్మా.　　794. కృతకర్మా.

సుతన్తుః = అసురవశీకారము అనువలను గలవాడు. తన్తువర్ధనః = సంసారమను తంతువును పెరుగజేసినవాడు. ఇన్ద్రకర్మా = దేవతలకై ఇట్టి కార్యములం జేసినవాడు. మహాకర్మా = న్యాయమగు కార్యములం గలవాడు. కృతకర్మా = నాస్తికాచారములను ఆచరించినవాడు.

---

## 790. సుతన్తుః.

"శోభనః తన్తుః యస్యసః సుతన్తుః" శాంతవేషాదులను ఆరోపించుకొని ప్రదర్శించు అసురవశీకారము అను వలను వారు మీఱకుండునట్లు ఉండువాఁడు. (790.)

## 791. తన్తువర్ధనః.

"తన్తుం వర్ధయతీతి తన్తువర్ధనః" వారలకు నిట్లు పాపంబున రుచిని గల్గించి దాని చే సంసారంబను తంతువును పెరుగజేసినవాఁడు.

* తానహం ద్విషతః క్రూరాన్ సంసారేషు నరాధమాన్ । క్షిపామ్యజస్రమ శుభానాసురీష్వేవ యోనిషు......(గీ. 16_19.) [సన్మార్గవిరోధులగు అనరాధములను ఆసురయోనులయందు పడద్రోసి, వారు సదా సంసారదుఃఖమును అనుభవించునట్లు చేయుదును.] ఇత్యాది. (791.)

## 792. ఇన్ద్రకర్మా.

"ఇన్ద్రాయ కర్మ యస్యసః ఇన్ద్రకర్మా" * తమూచుః సకలాః దేవాః ప్రణిపాతపురస్సరమ్ । ప్రసీద నాథ దైత్యేభ్యః త్రాహీతి శరణార్థినః * (వి. పు. 3_17_36) అనినట్లు శరణమొందిన ఇంద్రాదిదేవతలకై ఇట్టికార్యములను గావించినవాఁడు. (792.)

## 793. మహాకర్మా. (677.)

"మహత్ కర్మ యస్యసః మహాకర్మా" ఇట్లు ఆశ్రితరక్షణార్థముగాను దురాచారపరులశిక్షణార్థముగాను వంచింపవలసియుండుటచే న్యాయమగు కర్మములను గలవాఁడు. (793.)

## 794. కృతకర్మా.

"కృతం కర్మ యేనసః కృతకర్మా" వారలను వంచించుటకై తానుగూడ నాస్తికాచారములను ఆచరించినవాడు. (794.)

795. కృతాగమః. 796. ఉద్భవః. 797. సున్దరః.
798. సున్దః. 799. రత్ననాభః.

కృతాగమః = జైనాగమాది గ్రంథములను రచించినవాడు. ఉద్భవః = సంసారమునుండి దాటినట్లుండువాడు. సున్దరః = అందగాడు. సున్దః = తడిగాచేయువాడు. రత్ననాభః అందమగు నాభినిగలవాడు.

---

795. కృతాగమః. (661.)

"కృతః ఆగమః యేనసః కృతాగమః" ఆ యనుష్ఠానములను దృఢపఱచుటకై బుద్ధాగమజైనాగమాది మతగ్రంథములను రచించినవాఁడు. (795.)

796. ఉద్భవః. (375.)

"ఉద్గత ఇవ భవాత్ ఉద్భవః" మోక్షమును ఉపదేశించునట్లు అభినయించుటచే సంసారమును దాటినట్లుండువాడు. (796.)

797. సున్దరః.

ఆయాసురప్రకృతులనేత్రములను ఆకర్షించు సుందరరూపముగలవాఁడు. (797.)

798. సున్దః.

"సుష్ఠు ఉనత్తి క్లేదయతీతి సున్దః" తనసౌందర్యముచే ఆయాసురప్రకృతులమనంబున తడి గల్గునట్లు చేయువాఁడు. (798.)

799. రత్ననాభః.

"రత్నమివ నాభిః యస్యసః రత్ననాభః" తనపాండిత్యమునకు దగినట్లు రత్నమువలె అందమగు నాభిని గలవాఁడు. (799.)

## 800　సులోచనః.

సులోచనః = అందములగు నేత్రములంగలవాడు.

---

## 800. సులోచనః.

“సుశోభనే లోచనే యస్యసః సులోచనః” ఆటులే శన వచనములందు మనంబునిండినవారలను అపహరించు నేత్రములుగలవాఁడు.

✤ పునశ్చ రక్తామ్బరధృక్ మాయామోహోఽజితేక్షణః ✤ (వి. పు. 3_28_16)
[ఎఱ్ఱని వస్త్రములను ధరించినవాఁడై తనకగపడినవారలను తనమాయచే మోహింపఁ జేయువాఁడు.]
(౮౦౦ (

శ్రీ విష్ణు సహస్రనామ వ్యాఖ్యానమున
అష్టమ శతకము
సమాప్తము.

శ్రీమతే రామానుజాయనమః.

# నవమ శతకము.

801. అర్కః. 802. వాజసనిః. 803. శృఙ్గీ.
804. జయన్తః. 805. సర్వవిజ్జయీ.

అర్కః = స్తోత్రము చేయబడినవాడు. వాజసనిః = ఐహికవిషయమున రుచిని గల్గించినవాడు. శృఙ్గీ = నెమిలిపించమును ధరించినవాడు. జయన్తః = ఆస్తికులను జయించినవాడు. సర్వవిజ్జయీ = సర్వజ్ఞులనుగూడ జయించినవాడు.

---

## 801. అర్కః.

"అర్చ్యతే స్తూయతే ఇతి అర్కః" 'ఆహా వీఁడెంత మహనీయుఁడు! వీఁడే పరమధార్మికుఁడు' అని వారలచే బుద్ధావతారమున స్తోత్రము చేయబడిన వాఁడు. (801.)

## 802. వాజసనిః.

"వాజమ్ ఐహికమ్ అన్నమేవ సనతి సంభజతీతి వాజసనిః" బుద్ధావతారంబున నాస్తిక్యవాదంబొనరించి ఐహికములగు అన్నాదులయందే రుచిని గల్గించినవాడు. ప్రతిదినంబును ప్రాతఃకాలమున దధ్యోదనంబును భుజించుట క్షపణకమతాచారము.

## 803. శృఙ్గీ.

"శృఙ్గమ్ అస్యాస్తీతి శృఙ్గీ" జీవహింస చేయరాదనుటకు చిహ్నముగా నెమిలి పురిని కొమ్మువలె కరంబున ధరించియుండువాఁడు. (803.)

## 804. జయన్తః.

"జయతీతి జయన్తః" జ్ఞానమే ఆత్మ, ప్రపంచమంతయు మిథ్య అను నిట్టి మిథ్యావాదములచే ఆస్తిక్యవాదులను జయించినవాఁడు. (804.)

## 805. సర్వవిజ్జయీ.

"సర్వవిదః జేతుం శీలమస్యేతి సర్వవిజ్జయీ" వీఁడిట్లు ప్రమాణవిరుద్ధములగు నాస్తిక్యవాదములచే సర్వజ్ఞులగు ఆస్తికులనుగూడ జయించినవాఁడు. (805.)

806. సువర్ణబిన్దుః. 807. అక్షోభ్యః. 808. సర్వవాగీశ్వరేశ్వరః.
809. మహాహ్రదః. 810. మహాగర్తః.

సువర్ణబిన్దుః = అతి చాతుర్యవాదములచే అపలపించినవాడు. అక్షోభ్యః = గంభీరహృదయుడు. సర్వవాగీశ్వరేశ్వరః = వాచాలకులలో శ్రేష్ఠుడు. మహాహ్రదః = మడుగువలెనుండువాడు. మహాగర్తః = రౌరవాది నరకములందు పడద్రోయువాడు.

---

## 801. సువర్ణబిన్దుః.

"సువర్ణైః బిన్దతి అపలపతీతి సువర్ణబిన్దుః" అతిచాతుర్యమైన అక్షరములు గల వాక్యములచే ఆస్తిక్య మతమును అపలపించినవాఁడు. (806.)

## 807. అక్షోభ్యః. (999)

"న క్షోభ్యః అక్షోభ్యః" గంభీరహృదయుండగుటచే కలుతనొందింపజాలని వాఁడు. (807.)

## 808. సర్వవాగీశ్వరేశ్వరః.

"సర్వేషాం వాచః ఈశ్వరాణామ్ ఈశ్వరః" మహావాగ్మలకందఱకును శ్రేష్ఠుడు. (808.)

## 809. మహాహ్రదః.

"మహాంశ్చాసౌ హ్రదశ్చ మహాహ్రదః" పాపులు మళ్ళీ తలయెత్తక మునుగజేయునదియు, పుణ్యపురుషులు మునిగిమునిగియానందించునట్లు తృప్తినొందించు నదియునగు పెద్ద మడువువలె నుండువాడు. (809.)

## 810. మహాగర్తః.

"మహాన్తః గర్తాః యస్మాత్సః మహాగర్తః" ఇట్లు తమనాస్తికవాదములచే బాహ్యమతములందును కుదృష్టిమతములందును ప్రవేశించి నశించినవారలను రౌరవాదినరకములు అనుపల్లములందు పడద్రోయువాడు. (810.)

(అవతారిక.) ఇట్లింతవఱకు భగవదాజ్ఞారూపమగు శాస్త్రంబులను మీఱినవారలగు అసురులను నిగ్రహించు ప్రకారము (బుద్ధావతారము) చెప్పబడియె. ఇక, తనదైవికసంపదను అనుభవించుటకై జనించిన శాస్త్రవశ్యులను అనుగ్రహించు ప్రకారమును చెప్పుచున్నారు:—

811. మహాభూతః
812. మహానిధిః.
813. కుముదః
814. కున్దరః

మహాభూతః = మహనీయులను సొత్తుగా గలవాడు. మహానిధిః = ఆ మహనీయులను ఆదరించువాడు. కుముదః = ప్రకృతిమండలంబున సంతసించువాడు. కున్దరహః = (1) పరతత్వజ్ఞానము నిచ్చువాడు. (2) మోక్షము నిచ్చువాడు. (3) మొల్లపూవువలె నిర్మలుడు. (4) పాపమును తొలగించువాడు. (పుట. 281.)

---

## 811. మహాభూతః.

"మహాన్తః భూతాః యస్యసః మహాభూతః" * మహాత్మానస్తు మాం పార్థ * (గీ. 9-13) [అర్జునా! మహనీయులు నన్ను పొందుదురు.] అనినట్లు మహనీయులను తన సొత్తుగా దలంచువాఁడు. (811.)

## 812. మహానిధిః.

"మహాన్తః నిధయః యస్యసః మహానిధిః" ఆ మహనీయులను నిధివలె అధిక ప్రియముతో ఆదరించువాడు. (812.)

## 813. కుముదః. (596)

"కౌ ప్రకృతిమణ్డలే మోదతే ఇతి కుముదః" ఈ ప్రకృతిమండలంబుననే వారలతోఁ గలిసియుండి సంతసించువాడు. (813.)

## 814. కున్దరః.

(1) "కున్దమ్ పరతత్వజ్ఞానమ్ రాతి దదాతీతి కున్దరః" కున్దమనగా పరతత్త్వజ్ఞానము. * దదామి బుద్ధియోగం తమ్ * (గీ. 10-10.) [నేనే ఆబుద్ధియోగంబును వానికినిత్తును.] అని తానే చెప్పినట్లు వారలకు పరతత్వ జ్ఞానంబు నిచ్చువాడు.

(2) "కుమ్ మోక్షభువం రాతీతి కున్దరః" మోక్షభూమి నిచ్చువాఁడు.

(3) కుందమనగా మొల్లపూవు. దానివలె అతినిర్మలమైనవాడు. (814.)

815. కున్దః. 816. పర్జన్యః. 817. పావనః.
818. అనిలః. 819. అమృతాశః.

కున్దః = (1) పరభక్తి పరజ్ఞానాదుల నిచ్చువాడు. (2) తాను తొలగించిన పాపంబులు మళ్ళీ దాపింపకుండా గావించువాడు. పర్జన్యః = తాపత్రయంబును హరించువాడు. పావనః = ఏగువాడు. అనిలః = ప్రేరకులు లేనివాడు. అమృతాశః = అమృతమును పానము చేయించువాడు.

---

## 815. కున్దః.

"కుమ్ దదాతీతి కున్దః" క్రమక్రమముగా పూర్వవాసనను జయించి జ్ఞాన భక్త్యాదులను పొందినవారలకు ఉత్తరోత్తరము పరభక్తిపరజ్ఞానాదిభూమి నిచ్చువాడు. (815.)

లేక

(814) కున్దరః "కుమ్ దారయతీతి కున్దరః" పాపంబును తొలగించువాడు. (815) కున్దః "కుమ్ దాయతి శోధయతీతి కున్దః" తాను తొలగించిన పాపము మళ్ళి దాపింపకుండునట్లు కావించువాడు.

## 816. పర్జన్యః.

"తాపత్రయం పర్షతి ఆర్దయతీతి పర్జన్యః" తనతత్త్వంబునెఱింగిన జ్ఞానులయొక్క తాపత్రయంబును హరించువాఁడు. (816.)

## 817. పావనః. (293)

"పవతే గచ్ఛతీతి పావనః" భక్తుల తాపత్రయంబును హరించుటకై వారల యొద్దకు తానేయేగువాడు. (817.)

## 818. అనిలః. (236)

"నాస్తి ఇలః ప్రేరకః యస్యసః అనిలః" వారల నను(గహించు విషయంబున ప్రేరకులు లేనివాడు.

* తదప్యప్రార్థితః ధ్యాతో దదాతి మాధుసూదనః * [మధుసూదనుని చింతించి నంతనే వాడు వీఁడు గోరని పురుషార్థము నిచ్చును.] (818.)

## 819. అమృతాశః.

"అమృతమ్ ఆశయతీతి అమృతాశః" తన గుణామృతంబును వారలను పానము చేయించువాఁడు. (819.)

820. అమృతవపుః. 821. సర్వజ్ఞః. 822. సర్వతోముఖః.
823. సులభః. 824. సువ్రతః.

అమృతవపుః = అమృతమువంటి దేహముగలవాడు. సర్వజ్ఞః = సర్వజ్ఞుడు. సర్వతోముఖః = ఏదేనొక వ్యాజంబునే పొందదగినవాడు. సులభః = సులభుడు. సువ్రతః = శరణాగత రక్షణంబను వ్రతము గలవాడు.

---

## 820. అమృతవపుః.

"అమృతం వపుః యస్యసః అమృతవపుః" అమృతమువలె గోరదగిన దేహముగలవాడు. (820.)

## 821. సర్వజ్ఞః. (454)

"సర్వం జానాతీతి సర్వజ్ఞః" భక్తులకు, ఇది శక్యము ఇది అశక్యము, ఇది సాధ్యము ఇది అసాధ్యము, అను సమస్తంబును ఎఱింగినవాఁడు. (821.)

## 822. సర్వతోముఖః.

"సర్వతః ముఖం యస్యసః సర్వతోముఖః" ఈ యుపాయముచేతనే వీనిని సాధింపవచ్చును. ఇతరోపాయములచే సాధింపఁజాలఁడు అను నియమము లేక ఏమార్గమునైనను వ్యాజమాత్రముగా గొని భక్తులు ప్రవేశింపఁదగియుండుఁవాడు

* ఆర్తోవా యదివా దృప్తః పరేషాం శరణాగతః * (రా. యు. 18-28.)
[ఆర్తుఁడుగానో దృప్తుఁడుగానో శత్రువులనుండి వచ్చి శరణమునొందినవానిని రక్షింపవలయును. (ఆర్తుఁడు = ఆకించన్యము అనన్యగతిత్వము మున్నగునవి గలవాడై ఆశ్రయించినవాడు, దృప్తుఁడు = పరిహాసాదులకై శరణము అని చెప్పినవాఁడు.)]

## 823. సులభః.

"సుఖేన లబ్ధుం శక్యః సులభః" కనుకనే వాఁడు అనర్ఘుఁడుగానుండియు (అధికమూల్యము గలవాఁడయ్యు) సుఖముగా వెలలేకయే పొందదగినవాఁడు. కనుకనే, కృష్ణావతారంబున పలువంకరలుగల గూని యొకతె కృష్ణునకు కొంచెము చందము నిచ్చి * వస్త్రే ప్రగృహ్య గోవిందం మమ గేహం వ్రజేతివై * (గోవిందుని వస్త్రంబును పట్టి యీడ్చి తన గృహంబునకు రమ్మని చెప్పెను) అని నిర్బంధించెను.

## 824. సువ్రతః. (456)

"సుశోభనం వ్రతం యస్యసః సువ్రతః" * సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతిచ యాచతే। అభయం సర్వభూతేభ్యః దదామ్యేతత్ వ్రతం మమ * (రా. యు 18-33) [తన దోషరాశిని జూచి వెనుదీయక నాశరణ్యా స్వరూపంబునే నమ్మి మిత్రవేషముతో నైనను ఒకతూరియైనను కాయిక ప్రపత్తియో లేక వాచికప్రపత్తియో చేసినచో

825. సిద్ధః. 826. శత్రుజిచ్ఛత్రుతాపనః.

సిద్ధః = అయత్నసాధ్యుడు. శత్రుజిచ్ఛత్రుతాపనః = శత్రువులను తపింపచేయువాడు.

---

దానికిని తత్సంబంధిసంబంధులకును సర్వభూతములకును భయనివృత్తిచేయుటయే నామముఖ్య సంకల్పము. దేనిని తప్పినను దీనిని తప్పుటలేదు. [అని తానే తెల్పినట్లు ఏరీతిగానైనను శరణమని వచ్చి వారలను పాలించుట అను దృఢవ్రతమును గలవాడు. (824.)

## 825. సిద్ధః. (98)

తన తత్త్వస్థితిని యథార్థముగా నెఱింగినవారలకు సాధింపవలసినట్లులేక సిద్ధముగా నుండువాడు. (825.)

(అవతారిక.) ఇట్లింతవఱకు వానియొక్క సాక్షాదవతారములను తెల్పు నామములు చెప్పబడినవి. ఇక వాడు ఇతరులయందు అనుప్రవేశించి లోకరక్షణము గావించిన నామములను తెల్పుచున్నారు:—

## 826. శత్రుజిచ్ఛత్రుతాపనః.

"శత్రుజిద్భిః శత్రూన్ తాపయతీతి శత్రుజిచ్ఛత్రుతాపనః" శత్రువులను జయించు సామర్థ్యముగల కకుత్స్థపురుకుత్సాదులకు తన శక్తి నిచ్చి వారల మూలముగా అసుర గంధర్వాదులను తపింపజేయువాడు.

* శతక్రతోః వృషభరూపధారిణః కకుత్స్థోఽతిరోషసమన్వితః భగవతశ్చరాచర గురోః అచ్యుతస్య తేజసా ఆప్యాయితో దేవాసురసఙ్గ్రామే సమస్తానేవాసురాన్ని జఘాన * (వి. పు. 4-2-31) [వృషభరూపంబును ధరించిన ఇంద్రునిమీఁద అతి రోషముతో నెక్కి కకుత్స్థుఁడు చరాచరనాథుండగు అచ్యుతుని తేజసుచే అతి దార్ఢ్యము గలవాఁడై దేవాసుర యుద్ధంబున అసురులను చంపెను.] * పురుకుత్సోఽపి రసాతలగతశ్చాసౌ భగవత్తేజసాఽఽప్యాయితవీర్యః సకలగన్ధర్వాన్ జఘాన * (వి. పు.) [పురుకుత్సుఁడు పాతాలంబు నొంది భగవత్తేజంబుచే దృఢమగు వీర్యము గలవాఁడై గంధర్వుల నందఱను చంపెను.] (826.)

827. న్యగ్రోధోదుమ్బరః. 828. అశ్వత్థః.

829. చాణూరాంధ్రనిషూదనః.

న్యగ్రోధోదుమ్బరః = అంజలియొసఁగువారలచే అడ్డగింపబడువాఁడు, పరమ పదముగలవాఁడు. అశ్వత్థః = ఇంద్రాదులయందు అనుప్రవేశించి సమస్తంబును ప్రవర్తింపజేయువాఁడు. చాణూరాంధ్ర నిషూదనః = చాణూరాంధ్రనాశకుఁడు.

---

## 827. న్యగ్రోధోదుమ్బరః.

"న్యగ్రోధశ్చాసౌ ఉదుమ్బరశ్చ న్యగ్రోధోదుమ్బరః" (ఉత్ + అమ్బరః ఉదుమ్బరః, ఆర్షసంధి) 'న్యగ్రోధః' తాను అతిశ్రేష్ఠులచే సేవింపఁబడువాఁడయ్యు, * అఞ్జలిః పరమా ముద్రా క్షిప్రం దేవప్రసాదినీ * (అంజలి యనునది భగవంతుని వెంటనే స్వాధీనపఱచుకొనుటకు నేర్పడిన పరమసాధనము) * కృతాపరాధస్య హి తే నాన్యత్పశ్యామ్యహం క్షమమ్ । అన్తరేణాఞ్జలిం బధ్వా లక్ష్మణస్య ప్రసాదనాత్ * (రా. కి. 32-17) (సుగ్రీవా! అపరాధియగు నీకు లక్ష్మణునకు అంజలి చేయుటండప్ప వేఱు ఉపాయఁంబులేదు.) అనినట్లు అతినీచులచేతను తన యనుగ్రహంబును అపేక్షించి ప్రార్థింపబడువాఁడు. [ఉదుమ్బరః] అత్యుత్కృష్టమగు పరమపదము గలవాఁడు. అనగా, అంజలిచేయువారలచే తమ్ము అనుగ్రహించుమని అడ్డగించి నిల్పబడు వాడుగాను, పరమపదంబును గలవాడుగాను ఉండువాడు అని భావము. (827.)

(అవతారిక.) అనంతరము తనయంగభూతులగు ఆయాదేవతలయందు అనుప్రవేశించి కావించు జగన్నియమనంబును తెల్పుచున్నారు :—

## 828. అశ్వత్థః.

"న శ్వః అశ్వః, తత్ ఏషామ్ అస్తీతి అశ్వాః ఇన్ద్రాదయః, తేషు తిష్ఠతీతి అశ్వత్థః" 'ఇప్పుడుండునది రేపుండదు' అనునట్లు అనిత్యములగు ఇంద్రాది స్థానములయందుండువారలయందు అనుప్రవేశించి సమస్తమును ప్రవర్తింపజేయువాఁడు. ఇది శ్రీ విష్ణుపురాణంబునస్పష్టము. (828.)

## 829. చాణూరాన్ధ్రనిషూధనః.

"చాణూరమ్ ఆన్ధ్రం నిషూదయతీతి చాణూరాన్ధ్రనిషూదనః" ఆ యింద్రాదులకు విరోధియగు చాణూరుండను అసురాంధ్రమల్లుని చంపినవాఁడు. (829.)

830. సహస్రార్చిః. 831. సప్తజిహ్వః.
832. సప్తైధాః. 833. సప్తవాహనః.

సహస్రార్చిః = సహస్రకిరణంబుల నిచ్చినవాడు. సప్తజిహ్వః = అగ్నిరూపి. సప్తైధాః = ఔపాసనాదులచే ఆరాధింపబడువాడు. సప్తవాహనః = సూర్యుని ప్రవర్తింపజేయువాడు.

---

## 830. సహస్రార్చిః.

"సహస్రమ్ అర్చీంషి యస్యసః సహస్రార్చిః" పాచనము (వంటజేయుట) శోషణము ప్రతాపనము (తపించుట) మున్నగు ధర్మములకు అధ్యక్షములై లోకంబులకు ఉపకరించు సహస్రకిరణంబులను సూర్యునకు నిచ్చువాడు.

* యదాదిత్యగతం తేజః జగద్భాసయతేఽఖిలమ్। యచ్చన్ద్రమసి యచ్చాగ్నౌ తత్తేజోవిద్ధి మామకమ్ * (గీ. 15-12) [సమస్తలోకంబులను ప్రకాశింపజేయు సూర్యునియందుండు తేజసును, చంద్రుడు అగ్ని వీరలయందుండు తేజసును నా తేజసేయని యెఱుంగుము.] (830.)

## 831. సప్తజిహ్వః.

"సప్త జిహ్వాః యస్యసః సప్తజిహ్వః" దేవతలకు హవిస్సును తెచ్చి యిచ్చు కాళి కరాళి మున్నగు ఏడుజ్వాలలతో అగ్నిలో ప్రకాశించువాడు.

* తద్వక్త్రో దేవతానాఞ్చ హుతభుక్ పరమేశ్వరః। మన్త్రపూతం యదాఽఽదాయ హుతమాజ్య పురస్సరమ్। బ్రహ్మాణ్డభువనం సర్వం సన్తర్పయతి సర్వదా * (పా. సం.) [అగ్నిని ముఖముగాగల దేవతలలో హవిస్సును భుజించువాడు పరమేశ్వరుడు. మంత్రముచే పరిశుద్ధమగు నెయ్యి మున్నగు హోమద్రవ్యముచే బ్రహ్మాండమగు సమస్తలోకంబులకును సదా తృప్తిని వాడే గల్గించుచున్నాడు.] (831.)

## 832. సప్తైధాః.

"సప్త ఏధాంసి యస్యసః సప్తైధాః" ఔపాసనము మున్నగు ఏడు విధములగు వైదిక క్రియలచే ఆరాధింపబడువాడు. (832.)

## 833. సప్తవాహనః.

(1) "సప్తవాహనాని యస్యసః సప్త వాహనః" గాయత్రి మున్నగు ఏడు ఛందస్సులను అశ్వములుగాగల సూర్యుని ప్రవర్తింపజేయువాడు.

(2) లేక. "సప్తవాయుస్కన్ధాన్ వహతి వాహయతీతి సప్తవాహనః" సప్తవాయుస్కంధములను అధిష్ఠించియుండువాడు. (833.)

834. అమూర్తిః. 835. అనఘః. 836. అచిన్త్యః.
837. భయకృత్. 838. భయనాశనః.

అమూర్తిః = అప్రాకృత దివ్యమంగళ విగ్రహుండు. అనఘః = దోషములేనివాడు. అచిన్త్యః = ఉపమానము లేనివాడు. భయకృత్ = భయమును గల్గించువాడు. భయనాశనః = భయమును తొలగించువాడు.

---

## 834. అమూర్తిః.

"న మూర్తిః యస్యసః అమూర్తిః" ఇట్లు తాను అధిష్ఠించియుండు పాంచ భౌతికమూర్తికన్న భిన్నమైన అప్రాకృతదివ్యమంగళవిగ్రహముగలవాడు. (834.)

## 835. అనఘః. (148)

"నాస్తి అఘం యస్యసః అనఘః" అకర్మవశ్యుండగుటచే ఆ భూత చక్రంబున మునిగియుండు జీవునికన్న విలక్షణుండుగాన దోషములేనివాండు. (835.)

## 836. అచిన్త్యః.

"న చిన్త్యః అచిన్త్యః" ముక్తపురుషులకు సముడుగానూడ చింతింపజాలని వాండు. (అనగా, ఎట్టి గొప్పవస్తువుగానుండినను తనకు సమముగా చింతింపజాలనివాడు అని భావము.) (836.)

## 837. భయకృత్.

"భయం కరోతీతి భయకృత్" తనయాజ్ఞను మీఱువారలకు భయమును గల్గించువాండు. (చూ. నామము. 838.) (837.)

## 838. భయనాశనః.

"భయం నాశయతీతి భయనాశనః" అయితే తన యాజ్ఞను అనువర్తించు వారల భయంబును తొలగించువాండు.

* భయాభయకరః కృష్ణః * [భయంబును గల్గించువాండును తొలగించు వాండును కృష్ణుండే.] (838.)

(అవతారిక.) అనంతరము అణిమ మున్నగు అష్టైశ్వర్యములను అధిష్ఠించియుండుటను చెప్పుచున్నారు:—

839. అణుః. 840. బృహత్. 841. కృశః.
842. స్థూలః. 843. గుణభృత్.

అణుః = అణిమ అను ఐశ్వర్యముగలవాడు. బృహత్ = మహిమ అను ఐశ్వర్యము గలవాడు. కృశః = లఘిమ అను ఐశ్వర్యము గలవాడు. స్థూలః = ప్రాప్తి అను ఐశ్వర్యము గలవాడు. గుణభృత్ = ఈశిత్వము అను ఐశ్వర్యము గలవాడు.

---

## 839. అణుః.

"సర్వమ్ అణతి గచ్ఛతీతి అణుః" అతి సూక్ష్మమైన హృదయాకాశంబున అణగి, దానికిని సూక్ష్మమైన జీవాత్మలో ప్రవేశించు శక్తి గలవాడగుటచే 'అణిమ' అను ఐశ్వర్యము గలవాఁడు. కనుకనే * అణోరణీయాన్ * (తై.ఉ.) అని వీనిని అణువుకన్న అణువుగా శ్రుతి చెప్పెను. (839)

## 840. బృహత్.

"బృంహతీతి బృహత్" * మహతో మహీయాన్ * (తై. ఉ.) [మహత్తుకన్న మహత్తుగానుండువాడు.] అనివట్లు అతి విస్తారముగానుండు పరమాకాశంబును తన యల్పభాగంబుననే యణచుకొనునంత పరమమహత్తుగానుండుటచే 'మహిమ' అను నైశ్వర్యము గలవాడు. (840.)

## 841. కృశః.

"కృశ్యతీతి కృశః" దూది వాయువు మున్నగువానికన్న తేలికగానుండుటచే అంతటనేను అడ్డము లేక పోవునట్లు చిక్కియుండువాఁడుగాన 'లఘిమ' అను నైశర్వము గలవాడు. (841.)

## 842. స్థూలః.

"తిష్ఠతీతి స్థూలః" ఒకచోటనేయుండి సమస్తంబును స్పర్శించు 'ప్రాప్తి' యను నైశ్వర్యము గలవాఁడగుటచే బలిసినవాఁడు. (842.)

## 843. గుణభృత్.

"గుణాన్ బిభర్తీతి గుణభృత్" తన సంకల్పంబుచే సమస్తంబును సర్వావస్థలోను తనగుణమువలె ధరించియుండువాడగుటచే 'ఈశిత్వము' అను నైశ్వర్యము గలవాడు. (843.)

844. నిర్గుణః
845. మహాన్.
846. అధృతః.
847. స్వధృతః.

నిర్గుణః = వశిత్వము అను ఐశ్వర్యముగలవాఁడు. మహాన్ = ప్రాకామ్యము అను ఐశ్వర్యము గలవాఁడు. అధృతః = కట్టువడకుండువాఁడు. స్వధృతః = స్వాభావికమగు ఐశ్వర్యము గలవాఁడు.

---

## 844. నిర్గుణః.

“నిర్గతః గుణః యస్యసః నిర్గుణః” ఇట్లు సమస్తగుణంబును భరించినను దానికి వశముగాకుండుటచే దాని గుణము కొంచెమైనను తనకు సంబంధింపకుండు వాఁడుగాన ‘వశిత్వము’ అను గుణము గలవాఁడు. (స్వతంత్రుఁడని భావము.) (844.)

## 845. మహాన్.

“మహ్యతే ఇతి మహాన్” అన్నిటిలోను ఉత్కృష్టుఁడగుటచే కోరినవి యన్నియు సిద్ధించు ప్రాకామ్యము అను మహైశ్వర్యము గలవాఁడు. (845.)

## 846. అధృతః.

“న ధృతః అధృతః” పరులఛాయలో ప్రవేశించి వారలహృదయంబును వశీకరించుట, తన్ను ధ్యానించువారల హృదయంబున అధిష్ఠించుట, జీవునితో గూడినదియు జీవునితో గూడనిదియునగు శరీరంబున ప్రవేశించుట, ఇష్టాపూర్తాది సత్కార్యంబులందు అధిష్ఠించుట అనునిట్టి చతుర్విధంబగు వానియధేచ్ఛా వ్యాపారంబులచే దేనియందును కట్టువడకుండుటచే ధరింపఁబడకుండువాఁడు. (అనగా, ఇట్టి విశ్వరూపుఁడయ్యు తన మహిమంబుచే దేనియందును కట్టువడకుండువాఁడు.) కనుకనే, పరమపదంబునకు నేగఁదగిన సిద్ధిలేకుండియు (కృష్ణావతారమున) వైదిక పుత్రులను తన సంకల్పమాత్రంబుచే పరమపదంబునొందఁజేసెను. పునరావృత్తిలేని ఆ పరమపదంబునుండి మళ్ళి యీ సంసారసాగరంబున బ్రవేశింపఁజేసెను. దీనిచే చిత్తును అచిత్తును ఈ చిదచిత్తులస్వరూపంబును మార్చు శక్తిగలవాఁడయ్యు, వాఁడు ఏదోయొక కారణంబుచే మార్చకున్నాఁడని యూహింపఁబడుచున్నది. (846.)

(అవతారిక.) మంత్ర - ఓషధి - తప - స్సమాధులు సిద్ధించియుండు బద్ధసంసారులయొక్క అణిమాద్యైశ్వర్యంబులకన్న వీని యైశ్వర్యంబునకుం గల విశేష మేమనగా:

## 847. స్వధృతః.

“స్వేన ధృతం స్వధృతం, సస్వధృతమ్ అస్యాస్తీతి స్వధృతః” సమాధ్యాది కారణ విశేషంబుచే గల్గినవిగాక స్వతసిద్ధమగు నైశ్వర్యముగలవాఁడు. (847.)

848. స్వాస్యః. 849. ప్రాగ్వంశః.
850. వంశవర్ధనః 851. భారభృత్.

స్వాస్యః=స్థిరమైన ఐశ్వర్యమును గలవాడు. ప్రాగ్వంశః=నిత్యసూరులకును ఉత్పత్తిస్థానమైనవాడు. వంశవర్ధనః=నిత్యసూరుల వంశమును వృద్ధి చేయించువాడు. భారభృత్=ముక్తుల భారంబును వహించువాడు.

---

## 848. స్వాస్యః.

"సుశోభనా ఆస్యా స్థితిః యస్యసః స్వాస్య" సంసారదశలో తిరోహితమై ముక్తిదశలో ఆవిర్భవించునట్టి ముక్తపురుషులయైశ్వర్యమువలెగాక సదా అవిర్భవించుయుండు ఐశ్వర్యమను స్థితినిగలవాఁడు.

*నైవం భగవతః సతాఽఽవిర్భావాత్* [సదా ఆవిర్భవించియుండుటచే భగవంతున కిట్లుగాదు.] (848)

## 849. ప్రాగ్వంశః.

"ప్రాచాం వంశః ప్రాగ్వంశః" అనాదిగా ముక్తులుగానుండు నిత్యసూరులకుగూడ ఉత్పత్తిస్థానమైనవాఁడు. సమస్తము వాని యిచ్ఛను అనువర్తించుచు నుండుటచే నిత్యసూరుల యైశ్వర్యముగూడ వీని యిచ్ఛాధీనముగా నుండును.

*తదష్టగుణమైస్వర్యం నాథస్వాభావికం పరమ్। నిరస్తాతిశయం యస్య తతః స్తోష్యామి కిన్త్వహమ్* (వి. పు.) [నాథా! ఎనిమిదిమడుఁగులుగానుండు ఐశ్వర్యంబును సహజముగా గల్గి తనకు పైఁబడిన యతిశయము లేకుండు పరవస్తువును నే నెట్లు నుతింతును!]

(అవతారిక.) నిత్యసూరు కన్న వీఁడు విలక్షణుండుగానుండుటకుఁ గారణమును చెప్పుచున్నారు:—

## 850. వంశవర్ధనః.

"వంశం వర్ధయతీతి వంశవర్ధనః" తనసంతానములుగానుండు నిత్యసూరుల వంశంబును (వర్గంబును) వృద్ధిచేయించువాఁడు. (850.)

## 851. భారభృత్.

"భారం బిభర్తీతి భారభృత్" ముక్తులయొక్క సంసారభారంబును తొలఁగించుట, వారలస్వరూపంబును అవిర్భవింపజేయుట, తనతో జేర్చుకొనుట అనునీవారలభారంబును వహించువాఁడు, (851.)

852. కథితః. 853. యోగీ.
854. యోగీశః. 855. సర్వకామదః.

కథితః=శాస్త్రములచే చెప్పబడినవాడు. యోగీ=అఘటితఘటనాసామర్థ్యము గలవాడు. యోగీశః=యోగంబును నెఱవేర్చువాడు. సర్వకామదః=సమస్త ఫలంబుల నిచ్చువాడు.

---

## 852. కథితః.

క్రిందఁ జెప్పినవియు ఇక చెప్పబోవునవియునగు సమస్తగుణంబులతో గూడి యుండునట్లు సకలశాస్త్రములచేతను చెప్పబడినవాఁడు.

*వేదేషు సపురాణేషు సాఙ్గోపాఙ్గేషు గీయసే* [వేదములు వేదాంగములు ఉపాంగములు పురాణములు అనువీనియందు నీవు చెప్పబడియున్నావు] *వేదే రామాయణే పుణ్యే భారతే భరతర్షభ। ఆదౌ మధ్యే తథాఽన్తేచ విష్ణుః సర్వత్ర గీయతే * [అర్జునా! పుణ్యమగు వేదమునను శ్రీరామాయణంబునను భారతంబునను ఆదిమొదలు అంతమువఱకు అంతట విష్ణువే చెప్పబడెను.] *వచసాం వాచ్యముత్తమమ్ * (జి. 1-7) [వాక్కులకు సుత్తమమగు అర్థముగా నుండువానిని] (852)

## 853. యోగీ.

"యుజ్యతే ఇతి యోగః, సః అస్యాస్తీతి యోగీ" యోగము అనఁగా అఘటితఘటనా సామర్థ్యము. (కూడనివానినన్నింటిని జేర్పించుశక్తి.) అదిగలవాఁడు. (853.)

## 854. యోగీశః.

"యోగినామ్ ఈశః యోగీశః" సనకసనందనాది యోగులయోగంబును నెఱవేర్చువాడు.

*సనన్దనాదీనపకల్మషాన్ మునీన్ చకార భూయోఽతిపవిత్రితం పదమ్* (వి. పు.) [అపగతదోషులగు సనందనాదిమహర్షులను అతిపరిశుద్ధులుగా గావించినవాడు. (854.)

## 855. సర్వకామదః.

"సర్వాన్ కామాన్ దదాతీతి సర్వకామదః" యోగభ్రష్టులకుఁగూడ అణిమాది సమస్తఫలంబులను యోగఫలంబుగా నిచ్చువాఁడు.

*ప్రాప్య పుణ్యకృతాం లోకాన్ ఉషిత్వా శాశ్వతీః సమాః* (గీ. 6-41) [యోగభ్రష్టుఁడు పుణ్యపురుషులుండులోకంబున బహుదినములుండి...]. (855.)

856. ఆశ్రమః. 857. శ్రమణః.

858. క్షామః. 859. సుపర్ణః.

ఆశ్రమః = విశ్రమింపచేయువాడు. శ్రమణః = అభ్యసింపజేయువాడు.

క్షామః = శక్తుడు. సుపర్ణః = దరిచేర్చువాడు.

---

## 856. ఆశ్రమః.

"ఆశ్రమ్యన్తే అనేనేతి ఆశ్రమః" ఆయోగభ్రష్టులు అణిమాదులనుండి నివృత్తులైనప్పుడు, బ్రహ్మవిత్తులగు శ్రీవైష్ణవుల గృహంబులందువారలకు జన్మంబునిచ్చి విశ్రమింపఁజేయువాడు.

*శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభిజాయతే* (గీ. 6_41) [యోగభ్రష్టుఁడు పరిశుద్ధులగు శ్రీమంతులగృహంబున జనించును.] (856.)

## 857. శ్రమణః.

"శ్రమ్యన్తే అనేనేతి శ్రమణః" ఇట్లు అణిమాదిఫలంబుల ననుభవించియు మహనీయులగృహంబులందు జనించియుండు ఈ యోగభ్రష్టులకు పూర్వజన్మంబున ప్రారంభించిన యోగంబును ఈ జన్మంబున సుఖముగా అభ్యసింపఁజేయువాఁడు.

*తత్ర తం బుద్ధిసంయోగం లభతే పౌర్వదేహికమ్* (గీ. 6_43.) [యోగభ్రష్టుడు బ్రహ్మవిత్తులగృహంబున జనించి పూర్వజన్మంబున గల్గిన బుద్ధియోగంబును మఱల పొందును.] (857.)

## 858. క్షామః. (444)

"క్షమన్తే అనేనేతి క్షామః" తనధ్యానంబున ప్రవర్తించినంతనే యోగభ్రష్టులనుగూడ ముక్తులుగా చేయశక్తుఁడు.

*నహి కల్యాణకృత్కశ్చిత్ దుర్గతిం తాతగచ్ఛతి* (గీ. 6_40.) [సకల శుభములొసఁగు సత్కార్యములనొనరించినవాఁడు దుర్గతినొందఁడు.] (858.)

## 859. సుపర్ణః. (194.)

"సుష్ఠు పారం నయతీతి సుపర్ణః" ఇట్లు సమాధిదశ చేకూరినవారు సుఖముగా తమస్సుయొక్కతీరము చేరునట్లు చేయువాఁడు.

860. వాయువాహనః. 861. ధనుర్ధరః 862. ధనుర్వేదః.

వాయువాహనః = గరుడునిచే ఉద్ధరించువాడు. ధనుర్ధరః = ధనుస్సును ధరించియుండువాడు. ధనుర్వేదః = ధనుర్విద్యా ప్రవర్తకుడు.

---

* స్వపారం భగవాన్ నయతి * (మా. సం.) [తనతీరంబును భగవంతుఁడు చేర్చుకొనుచున్నాఁడు.] * అనేకజన్మసంసిద్ధః తతోయాతి పరాం గతిమ్ * (గీ. 6-45.) [అనేకజన్మములంబడసి శ్రేష్ఠమగు ఈ యోగసంసిద్ధినొందును.] (859.)

## 860. వాయువాహనః (333.)

"వాయునా వాహయతీతి వాయువాహనః" వారు ప్రబలహేతువులచే పతితులైనచో వారలను అతివివేకశాలియగు గరుత్మంతుని చేనుద్ధరింపఁజేయువాఁడు. ఇటులే, పరమభాగవతుండగు వసువు బ్రహ్మర్షిశాపంబుచే అధోగతి నొందగా, వారిని గరుత్మంతునిచే సద్గతినొందఁజేసినట్లు శ్రీ విష్ణుతత్వంబున ప్రసిద్ధము *అథవా పక్షిరాట్ తూర్ణమాగత్య స్వామినః పదమ్ నేష్యతి * [అనంతరము గరుత్మంతుఁడు వేగముగా వచ్చి తన స్వామిపాదంబులను చేర్చును.] (860.)

## 861. ధనుర్ధరః.

"ధనుః ధరతీతి ధనుర్ధరః" ఇట్టియుపాసకులవిరోధులను నిరసించుటకై తానే ధనుస్సును ధరించి యుండువాఁడు.

* ఏతదర్థంహి లోకేఽస్మిన్ క్షత్రియైః ధార్యతే ధనుః* [దీనికై లోకంబున క్షత్రియులు ధనుస్సును ధరించుచున్నారు.] *క్షత్రియైః ధార్యతే చాపః నార్తశబ్దో భవేదితి * (రా. అ. 10-3.) [దీననాదము వినగూడదనియే క్షత్రియులు ధనుస్సును ధరించుచున్నారు.] (861.)

## 862. ధనుర్వేదః.

"ధనుః విన్దతీతి ధనుర్వేదః" సురనరేంద్రాదులు ధనుర్విద్యాదులను లభించునట్లు ఆయాశాస్త్రంబులను ప్రవర్తింపంజేసినవాఁడు. (862.)

**863. దణ్డః.** **864. దమయితా.** **865. అదమః.**
**866. అపరాజితః.** **867. సర్వసహః.**

దణ్డః = దండించువాడు. దమయితా = దండించినవాడు. అదమః = నిరంకుశుడు. అపరాజితః = నిరోధింపబడనివాడు. సర్వసహః = సమస్తంబును భరించువాడు.

---

## 863. దణ్డః.

"దామ్యతీతి దణ్డః" వేదధర్మములకు రక్షకులగు రాజులమూలముగా దండనీతిచే దుష్టులను దండించువాఁడు. (863.)

## 864. దమయితా.

"దమయతీతి దమయితా" తానుగూడ అటులే రావణాదులను సాక్షాత్తుగా దండించినవాఁడు. (864.)

## 865. అదమః.

"న దమః అదమః" ఇట్లు తన్ను దండించువాడు లేకుండుటచే నిరంకుశముగానుండువాఁడు.

*భస్మ కుర్యాత్ జగత్సర్వం మనసైవ జనార్దనః। నతు కృత్స్నమ్ జగత్ శక్తం కిఞ్చిత్కర్తుం జనార్దనే* (భా. ఉ. 67-8.) [జనార్దనుఁడు ఈ లోకమునంతను మనసుచేతనే భస్మమొనరింప శక్తుఁడు. ఇవియన్నియు నొకటిగా గూడినను ఏమియు చేయఁజాలవు. (865.)

## 866. అపరాజితః (721.)

"న పరాజితః అపరాజితః" ఇట్లు సర్వతోముఖంబుగా తనయాజ్ఞను చెల్లించుటచే ఎచ్చటను ఎక్కాలంబునను ఎవరిచేతను అడ్డగింపబడనివాఁడు.

*దాశార్హమపరాజితమ్* [అపజయమునొందని దాశార్హుని.] (866.)

## 867. సర్వసహః.

"సర్వం సహతే బిభర్తీతి సర్వసహః" మందాధికారులు ఆరాధించు దేవతాంతరంబులనుగూడ తన యాజ్ఞచే భరించువాఁడు. (867.)

868. నియన్తా. 869. నియమః.
870. యమః 871. సత్త్వవాన్.

నియన్తా = నియమించువాడు. నియమః = తామేయిచ్చువాడు. యమః = రక్షించువాడు. సత్వవాన్ = శుద్ధసత్వగుణంబునుగలవాడు.

---

## 868. నియన్తా.

"నియచ్ఛతీతి నియన్తా" ఆదేవతలను ఆశ్రయించినవారలకు ఆయాదేవతల యందు భక్తిగల్గునట్లు తామే నియమించువాఁడు.

*యోయో యాంయాం తనుం భక్తః శ్రద్ధయాఽర్చితుమిచ్ఛతి। లభతేచ తతః కామాన్ మయైవ విహితాన్ హితాన్* (గీ. 7. 21.) [ఎవడెవఁడు ఏయే శరీరంబును శ్రద్ధతో పూజింపఁదలంచునో; వారలకందఱకును నేనే ఆయా దేవతలమూలముగా ఫలముల నిచ్చుచుందును.]

## 869. నియమః. (163.)

"నియమ్యతే ఇతి నియమః" ఆయాదేవతలమూలముగా వారలకు ఆయువు భోగము మున్నగువానిని తానే యిచ్చువాఁడు.

* లభతే చ తతః కామాన్మయైవ విహితాన్ హితాన్ * (గీ. 7_22) [ఆదేవతలమూలముగా నేనిచ్చు అభీష్టములను పొందును.]

## 870. యమః. (164)

"యచ్ఛతీతియమః" ఆయాఫలనియామకులగు యమాదులనుగూడ స్వామిగా నుండి రక్షించువాడు.

* ప్రభవతి సంయమనే మమాపి విష్ణుః * (వి. పు. 3_7_13) [నన్నుగూడ నియమించి రక్షించువాఁడు విష్ణువే.]

(అవతారిక.) ఇట్లింతవఱకురజస్తమస్సుల నియమనము చెప్పఁబడియె. ఇక, సత్త్వవిషయమును చెప్పుచున్నారు :—

## 871. సత్త్వవాన్.

"సత్త్వం అస్యాస్తీతి సత్వవాన్" మోక్షకారణమగు సత్వమునకు తానే అధిష్ఠాతగా నుండుటచే సత్వముగలవాడు. *మహాన్ ప్రభుర్వై పురుషః సత్త్వస్యైష ప్రవర్తకః* (శ్వే-ఉ. 3_12) [మహాప్రభువగు వీఁడు సత్వప్రవర్తకుఁడు.]

872. సాత్త్వికః. 873. సత్యః.
874. సత్యధర్మపరాయణః. 875. అభిప్రాయః.

సాత్త్వికః = సత్త్వగుణఫలములను ఇచ్చువాడు. సత్యః=(1) యథార్థవైభవము గలవాడు. (2) సత్యమున నిల్చియుండువాడు. సత్యధర్మపరాయణః = సాత్త్వికులు చేయు ధర్మములను స్వీకరించువాడు. అభిప్రాయః = కోరబడువాడు.

---

బ్రహ్మాదులమూలముగా రజస్తమస్సులను అధిష్ఠించియుండును. సాక్షాత్తుగా సత్త్వమును అధిష్ఠించియుండును. (871.)

## 872. సాత్త్వికః.

"సత్త్వం అస్తీతి సాత్త్వికః" సత్త్వగుణఫలములగు ధర్మము జ్ఞానము వైరాగ్యము ఐశ్వర్యము అనువానికిని నియామకుండగుటచే సత్త్వగుణఫలముల నిచ్చువాడు. (872.)

## 873. సత్యః. (107-213)

(1) సాత్త్వికశాస్త్రంబులందు ప్రతిపాదింపఁబడుటచే యథార్థవైభవము గలవాఁడు.

(2) *సత్యే ప్రతిష్ఠితః కృష్ణః సత్యమస్మిన్ ప్రతిష్ఠితమ్। సత్తాఽసత్తే చ గోవిన్దః తస్మాత్సత్యః సతాం మతః* (భా. ఉ. 69-13) [కృష్ణుఁడు సత్యముననే నిల్చియుండువాఁడు. సత్యమును వీనియందు నిల్చియుండును. సత్తయు అసత్తయు గోవిందుడే. కనుకనే వానిని సత్యునిగానందురు.] అను భారతరీతిగా సత్యమున ప్రతిష్ఠితుఁడై యుండుటచే సత్యుఁడనబడినవాడు. (873.)

## 874. సత్యధర్మపరాయణః.

"సత్యః ధర్మః పరాయణం యస్యాసః సత్యధర్మపరాయణః" సాత్త్వికాధికారులు చేయు ధర్మములను ప్రీతితో స్వీకరించువాఁడు. (873.)

## 875. అభిప్రాయః.

సత్యధర్మంబున నిష్ఠగలమహనీయులచే పరమప్రయోజనముగా కోరఁబడు వాడు. (875.)

876. ప్రియార్హః. 877. అర్హః.
878. ప్రియకృత్. 879. ప్రీతివర్ధనః.

ప్రియార్హః = జ్ఞానులను అనుగ్రహించువాడు. అర్హః = జ్ఞానులకు దగినవాడు. ప్రియకృత్ = ప్రియులుగా గావించువాడు. ప్రీతివర్ధనః = భక్తిని వృద్ధిజెంచువాడు.

---

## 876. ప్రియార్హః.

"ప్రియం అర్హతీతి ప్రియార్హః" * తేషాం జ్ఞానీ నిత్యయుక్తః ఏకభక్తిః విశిష్యతే * (గీ. 7_17) [వారలలో జ్ఞాని సదా నాతోనే గూడినాయందే భక్తి గలవాడైయుండుటచే వాడే శ్రేష్ఠుడు. అర్థకామపరులను ఆత్మప్రాప్తికాములను వీరు తన్ను ప్రార్థించిరే అను నాదార్యముచే అనుగ్రహింతును.] అనినట్లు ప్రియులగు జ్ఞానులను అనుగ్రహించువాడు. 876.)

## 877. అర్హః.

"అర్హతీతి అర్హః" * ఆస్థితః సహి యుక్తాత్మా మామేవానుత్తమాంగతిమ్ (గీ. 7_18) [నన్నే పరమగతియని యాశ్రయించినవాడు నాకుదగినవాడు.] అనినట్లు ఇతరంబునుగోరక భగవదేకపరాయణుండగువానికి (జ్ఞానికి) దగినవాడు. (877.)

## 878. ప్రియకృత్.

"ప్రియాన్ కరోతీతి ప్రియకృత్" ప్రయోజనాంతరంబు నపేక్షించి తన్నాశ్రయించిన వారలనుగూడ చిట్టచివర తనకు ప్రియులుగా (అనగా తన్నే కోరునట్లు) గావించుకొనువాడు. (878.)

## 879. ప్రీతివర్ధనః.

"ప్రీతిం వర్ధయతీతి ప్రీతివర్ధనః" అటులే వారలకు పైపైగా తనగుణంబులం జూపి తనయందు ప్రీతి (భక్తి) వర్ధిల్లునట్లు కావించువాడు.

* భజతాం ప్రీతి పూర్వకమ్। దదామి బుద్ధియోగం తమ్ * (గీ. 10_10.) [ప్రీతితో నన్ను భజించువారలకు అట్టిబుద్ధియోగంబు నిత్తును.] (879.)

880. విహాయసగతిః. 881. జ్యోతిః. 882. సురుచిః.

విహాయసగతిః = పరమపదంబు నిచ్చువాడు. జ్యోతిః = అర్చిస్సుగానుండు వాడు. సురుచిః = దినముగానుండువాడు.

---

## 880. విహాయసగతిః.

" విహాసం గమ్యతే ఇతి విహాయసగతిః " భక్తియొక్క పరమావధి నొందిన మహనీయులకు గతిగా పరమాకాశంబును (పరమపదంబును) ఇచ్చువాఁడు.

* భుక్త్వాచ మత్ప్రసాదతః। మమానుస్మరణం ప్రాప్య మమ లోకే నివత్స్యసి * [సమస్త భోగంబులను అనుభవించి చిట్టచివర నాయనుగ్రహంబుచే నన్నే స్మరించి నాలోకంబున వసింపగలవు.] (880.)

(అవతారక.) ఇక † అర్చిరాదిమార్గములను వరసగా చెప్పుచున్నారు:—

## 881. జ్యోతిః.

" ద్యోత్యతే అస్మాదితి జ్యోతిః " అర్చిస్సు అను ప్రథమపదమును నియమించువాఁడు.

* తేఽర్చిషమభిసంభవన్తి * (ఛా. 5-10-1) [వారు అర్చిరాదిలోకము నొందుదురు.] (881.)

## 882. సురుచిః.

" సుశోభనా రుచిః యస్యాసః సురుచిః " సూర్యోదయంబుచే ప్రకాశించుటచే రుచియనఁగా దినము. దానిని నియమించువాఁడు.

---

† అర్చిరాది మార్గమనగా (అర్చిః ఆదిః యస్య మార్గస్య సః అర్చిరాదిః) మోక్షమునొందువారలు దేహావసానకాలంబున సుషుమ్నానాడిమూలముగా బయలు వెడలిన పిమ్మట మోక్షంబునకు నేగుమార్గము. అర్చిస్సు (అగ్ని), దినము, శుక్లపక్షము, ఉత్తరాయణము, సంవత్సరము, వాయువు, సూర్యుడు, చంద్రుడు, మెఱపు, వరుణుడు, ఇంద్రుడు, బ్రహ్మ అను వీరలలోకములమూలముగా ముక్తుడేగును. ఈ యాతివాహికులు (ముక్తుని పరమపదంబునకు గొనిపోవు దేవతలు ఆతివాహికులు) ముక్తుని పూజించి తమ తమ లోకంబుననుండి పైపైనుండు లోకము వఱకు చేర్చెదరు. అర్చిస్సు, దినము మున్నగునవి తత్తదభిమానిదేవతలను చెప్పును. వీరలలో, మెఱపునను అభిమానియగు అమానవుడు తనలోకమునకు వచ్చిచేరిన ముక్తుని అచటినుండి బ్రహ్మప్రాప్తి వఱకు చేర్చును. ఈయమానవునకు పైనుండు వరుణాదులు తమతమలోకములలో సహాయులుగానుందురు. ఇవి శ్రీభాష్యమునను (అధ్యాయము ४ పాదము 3.), పిళ్ళైలోకాచార్యులు సాయించిన ' అర్చిరాది ' అను రహస్యమునను స్పష్టము.

883. హుతభుగ్విభుః. 884. రవిః.
885. విరోచనః. 886. సూర్యః.

హుతభుగ్విభుః = శుక్లపక్షముగానుండువాడు. రవిః = ఉత్తరాయణముగా నుండువాడు. విరోచనః = సంవత్సరముగానుండువాడు. సూర్యః = వాయులోకముగా నుండువాడు.

---

* అర్చిషోఽహః * (ఛా. ఉ. 5. 10-1.) [అర్చిస్సును గడచినచో దినాభిమాని దేవత.] (832.)

## 883. హుతభుగ్విభుః.

అమృతముగా పరిణమించు హోమద్రవ్యములను భుజించు చంద్రునకు పూర్తి గల్గించు శుక్లపక్షాభిమానిగానుండువాడు.

* అహ్న ఆపూర్యమాణః పక్షః * (ఛా. ఉ. 5-10-1.) [దినాభిమాని నుండి శుక్ల పక్షాభిమాని నొందును.] (883.)

## 884. రవిః

"రూయతే శబ్ద్యతే ఇతి రవిః" దేవతల నిద్రనుండి మేల్కొనుకాలము గాన రవియనగా ఉత్తరాయణము. దానికి అభిమానిగానుండువాడు.

*ఆపూర్యమాణపక్షాత్ యాన్ షడుదఙ్ఙేతి మాసాన్ *(ఛా. ఉ. 5. 10-1.) [శుక్లపక్షాభిమానినుండి షణ్మాసాత్మకంబగు ఉత్తరాయణాభిమానినొందును.] (884.)

## 885. విరోచనః.

"విరోచయతి విద్యోతయతీతి విరోచనః" ఉత్తరాయణము, దక్షిణాయణము అను రెండు మార్గములచే రథము పోయి సూర్యుడు ప్రకాశించు సంవత్సరంబునకు అభిమాని.

* మాసేభ్యః సంవత్సరమ్ * ఛా. ఉ. 5. 10-1.) [మాసంబునుండి సంవత్సరాభిమాని నొందును.] (885.)

## 886. సూర్యః.

"సరత్యస్మాదితి సూర్యః" అంతట సంచరించుటచే సూర్యుఁడనగా వాయువు. ఆవాయులోకాభిమాని. * స వాయులోకమ్ * (ఛా. ఉ.) (886.)

887. సవితా. 889. రవిలోచనః.

889. అనన్తహుతభుగ్భోక్తా. 890. సుఖదః.

సవితా = సూర్యలోకముగానుండువాడు. రవిలోచనః = చంద్ర - విద్యుత్ - వరుణులుగానుండువాడు. అనన్తహుతభుగ్భోక్తా = ఇంద్రుని బ్రహ్మను గలవాడు. సుఖదః = తన్ను పొందుట అను సుఖంబు నిచ్చువాడు.

---

## 887. సవితా. (969.)

"సూతే ఇతి సవితా" * సంవత్సరాదాదిత్యమ్ * (ఛా. ఉ. 5. 10-1.) అనినట్లు సూర్య లోకాభిమాని, (887.)

## 888. రవిలోచనః.

"రవిణా లోచయతీతి రవిలోచనః" సూర్యకిరణముల ద్వారా ప్రకాశించు చంద్ర విద్యుద్వరుణాభిమాని.

* ఆదిత్యాచ్చన్ద్రమసమ్, చన్ద్రమసో, విద్యుతమ్ * (ఛా. ఉ. 5-10-1.) [సూర్యునుండి చంద్రుని, చంద్రునుండి విద్యుల్లోకంబును.] * స వరుణలోకమ్ * (కౌ. బ్రా. 1-3.) [వాఁడు వరుణలోకంబునొందును.] (888.)

## 889. అనన్తహుతభుగ్భోక్తా.

"అనన్తా హుతభుగ్భోక్తారా యస్యాసః అనన్తహుతభుగ్భోక్తా" 'హుతం భుఙ్క్తే ఇతి హుతభుక్'. హోమముచేయఁబడిన హవిస్సును భజించువాఁడు ఇంద్రుడు. 'భునక్తి ఇతి భోక్తా' ప్రజలను గాపాడువాఁడు బ్రహ్మ. వీరల లోకములను పొందఁజేయువాడు.

* స ఇన్ద్రలోకమ్ స ప్రజాపతిలోకమ్ * [వాఁడింద్రలోకంబును, వాఁడు బ్రహ్మలోకంబును చేర్చును.] (889.)

## 890. సుఖదః. (460.)

"సుఖం దదాతీతి సుఖదః" †† అమానవునికరంబులచే స్పృశింపజేసి సంసారంబును సవాసనగాతొలగించి స్వప్రాప్తియను సుఖంబునిచ్చువాఁడు.

---

†† ఈయమానవుఁడు విరజానదీతీరంబుననుండు నొక నిత్యసూరి. వీరు సంసారవినిర్ముక్తులై యేతెంచువారలను తనకరంబులచే స్పృశించును. పిమ్మట ముక్తులు తమప్రాకృతసూక్ష్మశరీరంబులను విడిచి దివ్య రూపంబులనొందుదురు.

891. నైకదః. 892. అగ్రజః.

నైకదః = గంధము మున్నగు అనేక వస్తువుల నిచ్చు వారలం గలవాడు.
అగ్రజః = పరమభోగ్యముగా ఎదుట సేవసాదించువాడు.

---

* తత్పురుషోఽమానవస్స ఏనాన్ బ్రహ్మ గమయతి * (ఛా. ఉ. 5-10-3.)
[ఆ పురుషుఁడే అమానవుఁడు. వాఁడే వీరలను బ్రహ్మముతో చేర్చును.] (890.)

## 891. నైకదః.

"ఏకాని దదాతీతి ఏకదాః, న ఏకదాః నైకదాః, నైకదాః అస్య సన్తీతి నైకదః" అపరిమితంబులగు దివ్యమాలలు దివ్యాంజనములు దివ్యవస్త్రములు మున్నగు బ్రహ్మాలంకారంబులతో ముక్తుని ఎదుర్కొనుచు తనయొద్దకు చేర్చు దివ్యాప్సరస్సులంగలవాఁడు.

* తం పఞ్చశతాన్యప్సరసః ఉపధావన్తి, శతం మాలాహస్తాః శతమఞ్జన హస్తాః......తం బ్రహ్మాలంకారేణ అలంకుర్వన్తి * (కౌ. బ్రా. 1-4.) [వానిని ఐదునూఱు అప్సరస్స్త్రీలును మాలలతోను అంజనముతోను ఎదుర్కొని వచ్చి వానిని బ్రహ్మాలంకారముచే నలంకరింతురు.] (891.)

## 892. అగ్రజః.

"అగ్రే జాయతే ఇతి అగ్రజః" ఇట్లు అర్చిరాదిగతిచే సమీపించిన ముక్తులయెదుట సకలైశ్వర్యరూపిణియగు లక్ష్మితోఁగూడి పర్యఙ్కవిద్యలో జెప్పినట్లు పరమభోగ్యముగా సేవసాదించువాఁడు. (892.)

* స ఆగచ్ఛత్యమితౌజసం పర్యఙ్కమ్............ఉపశ్రీరుపబృంహణం తస్మిన్ బ్రహ్మాస్తే తమిత్థంవిత్పాదేనైవాగ్ర ఆరోహతి తంబ్రహ్మాహ కోఽసీతి... సా యా బ్రహ్మణి చితిర్యా వ్యష్టిః తాం చితిం జయతి తాం వ్యష్టిం వ్యశ్నుతే * (కౌ. బ్రా.) [లక్ష్మిమున్నగు మహిషీలతో నాసీనుడైయుండు ఆభగవంతుని పర్యంకంబుమీద ముక్తుడు కాలుతో త్రొక్కి యెక్కును. అప్పుడు వానిని పరమ పురుషుఁడు నీ వెవ్వడవని యడుగును......బ్రహ్మమునందు నెట్టిచైతన్యమో, ఎట్టివిశేషమో ఆ చైతన్యంబును ఆవిశేషంబును ముక్తుఁడు పొందును,] అని పర్యంక విద్యలో చెప్పబడియుండును.

893. అనిర్విణ్ణః. 894. సదామర్షీ.
895. లోకాధిష్ఠానమ్. 896. అద్భుతః.

అనిర్విణ్ణః = దుఃఖము తొలగినవాడు. సదామర్షీ = కైంకర్యంబును స్వీకరించువాడు. లోకాధిష్ఠానమ్ = ఉత్తమలోకములకు ఆధారభూతుడు. అద్భుతః = ఆశ్చర్యముగా నుండువాడు.

---

## 893. అనిర్విణ్ణః. (436.)

"న నిర్విణ్ణః అనిర్విణ్ణః" ఆశ్రితులనిట్లు సంసారంబను పాతాళంబునుండి పైకెత్తి తన్నుపొందఁజేయుటచే వారు దుఃఖింపకుండుటంజూచి తాను దుఃఖము తొలఁగినవాఁడు.

* కృతకృత్యః తదా రామః విజ్వరః ప్రముమోదహ * (రా. బా. 1-85.)
[రాముఁడప్పుడు తనకృత్యములు తీరియుండుటచే చింతతొలఁగినవాఁడయ్యెను.] (893.)

## 894. సదామర్షీ.

"సదా మర్షితుం సోఢుం శీలమస్యేతి సదామర్షీ" అదిమొదలు తాను లభించిన మహాఫలంబునకు ప్రతిఫలముగా ముక్తుడు ఎల్లప్పుడుచేయు కైంకర్యములను స్వీకరించువాఁడు.

* సోఽశ్నుతే సర్వాన్ కామాన్ సహ బ్రహ్మణా విపశ్చితా * (తై. ఉ.)
[వాఁడు సర్వజ్ఞమగు పరబ్రహ్మముతోఁగూడి సకలాభీష్టంబులను అనుభవించును.] (894.)

## 895. లోకాధిష్ఠానమ్.

"లోకానామ్ అధిష్ఠానమ్ లోకాధిష్ఠానమ్"

* అనుత్తమేషు లోకేషు * (ఛా. ఉ. 1-2.) అనినట్లు ముక్తపురుషులకు భోగ్యములగు ఉత్తమలోకములకు ఆధారముగానుండువాడు. (895.)

## 896. అద్భుతః.

ఆలోకములయందు సదా సర్వులును సర్వప్రకారముగా అనుభవించినను అప్పటికప్పుడు నూతనముగా గనబడుటచే అత్యాశ్చర్యముగానుండువాఁడు. (896.)

897. సనాత్. 898. సనాతనతమః.
899. కపిలః. 900. కపిరవ్యయః.

సనాత్ = భాగించుకొని అనుభవింపబడువాడు. సనాతనతమః = ఎల్లప్పుడును భోగ్యముగా నుండువాడు. కపిలః = కాలమేఘవర్ణుడు. కపిరవ్యయః = నిత్యానందమును అనుభవించువాడు.

---

### 897. సనాత్.

ముక్తులచే భాగించుకొని అనుభవింపబడువాఁడు. (897.)

### 898. సనాతనతమః.

ప్రాచీనుఁడయ్యు అప్పుడే జనించినట్లు సదాభోగ్యముగానుండువాఁడు. (898.)

### 899. కపిలః.

విద్యున్మండల (మెఱపు సమూహము) మధ్యమునందుండు కాళమేఘమువంటి వర్ణముగలవాడు. (899.)

### 900. కపిరవ్యయః.

"కం సుఖం పిబతీతి కపిః, అవ్యయః కపిః" తానుగూడ అక్షయంబగు ఆనందంబును పానము చేయుచు అనుభవించువాఁడు (900.)

శ్రీ విష్ణుసహస్రనామవ్యాఖ్యానమున
నవమశతకము
సమాప్తము.

శ్రీమతే రామానుజాయ నమః.

# ద శ మ శ త క ము.



901. స్వస్తిదః. 902. స్వస్తికృత్. 903. స్వస్తి.
904. స్వస్తిభుక్. 905. స్వస్తిదక్షిణః.

స్వస్తిదః = మంగళమునిచ్చువాడు. స్వస్తికృత్ = క్షేమమును కావించుకొనువాడు. స్వస్తి = మంగళమూర్తి. స్వస్తిభుక్ = మంగళములను పాలించువాడు. స్వస్తి దక్షిణః = శరీరాదులను భక్తులకునిచ్చువాడు.

---

## 901. స్వస్తిదః.

"స్వస్తి దదాతీతి స్వస్తిదః" భక్తులకు ఇట్లు మహామంగళంబు నిచ్చువాఁడు. (901)

## 902. స్వస్తికృత్.

"స్వస్తి కరోతీతి స్వస్తికృత్" తనయొక్క కల్యాణగుణంబులచే తనభోగంబునకు క్షేమంబును కావించుకొనువాఁడు. (902.)

## 903. స్వస్తి.

తానే మహామంగళ మూర్తిగానుండువాఁడు. (903.)

## 904. స్వస్తిభుక్.

"స్వస్తి భునక్తీతి స్వస్తిభుక్" ఈమంగళంబులను అన్నిటిని పాలించువాడు. (904.)

## 905. స్వస్తిదక్షిణః.

"స్వస్తి దక్షిణా యస్యసః స్వస్తిదక్షిణః" తనపరిచర్యకుఁదగిన దివ్యశరీరము దివ్యశక్తి మున్నగు ఇతరమంగళంబులను తనదివ్యాత్మస్వరూపదానంబనుయాగంబున ఋత్త్విక్కులుగానుండు నిత్యసూరులకు దక్షిణగా నిచ్చువాఁడు. [అనగా, తనకైంకర్యంబునకు దగినట్టి దివ్యశరీరము శక్తి మున్నగువానిని భక్తుల కిచ్చువాడు అనిభావము.] (905.)

906. అరౌద్రః. 007. కుణ్డలీ. 908. చక్రీ.
909. విక్రమీ. 910. ఊర్జితశాసనః. 911. శబ్దాతిగః.

అరౌద్రః = సౌమ్యుడు. కుణ్డలీ = దివ్యాభరణములను ధరించువాడు. చక్రీ = దివ్యాయుధములను ధరించువాడు. విక్రమీ = దివ్యచేష్టితములంగల వాడు. ఊర్జితశాసనః = దివ్యాజ్ఞలనిచ్చువాడు శబ్దాతిగః = వేదాదులకునగోచరుడు.

---

### 906. అరౌద్రః.

“న రౌద్రః అరౌద్రః” పరమైశ్వర్యముగలవాఁడయ్యు కల్యాణ గుణంబులచే సౌమ్యుడుగానుండువాఁడు. (906.)

### 907. కుణ్డలీ.

“కుణ్డలమ్ అస్యాస్తీతి కుణ్డలీ” దీనికిఁదగినట్లు నిత్యములగు కుండలాది దివ్యాభరణములను ధరించియుండువాఁడు. (907.)

### 908. చక్రీ. (995.)

“చక్రమ్ అస్యాస్తీతి చక్రీ” ఈ దివ్యాభరణములకుందగినట్లు చక్రాది దివ్యాయుధములను ధరించియుండువాఁడు. (908.)

### 909. విక్రమీ.

“విక్రమః అస్యాస్తీతి విక్రమీ” గాంభీర్యమునకుఁదగిన దివ్య చేష్టితములను గలవాఁడు. (909.)

### 910. ఊర్జితశాసనః.

“ఊర్జితం శాసనం యస్యసః ఊర్జితశాసనః” బ్రహ్మేంద్రాదులచే మీఱ జాలని దివ్యాజ్ఞలను చేయువాఁడు. (910.)

### 911. శబ్దాతిగః.

“శబ్దమ్ అతిగచ్ఛతీతి శబ్దాతిగః” అనేక జిహ్వా (నాలిక) లంగల ఆదిశేషుఁడు, అనేక శాఖలుగల వేదము, సాక్షాత్ సరస్వతి వీరలచే ఇట్టిదని చెప్ప జాలని మహామహిమఁగలవాఁడు. (911.)

912. శబ్దసహః. 913. శిశిరః.
914. శర్వరీకరః. 915. అక్రూరః.

శబ్దసహః = గజేంద్రుని యఱపును విన్నవాడు. శిశిరః = అతివేగముగా వచ్చినవాడు. శర్వరీకరః = పంచాయుధముల నప్పుడు ధరించిన వాడు. అక్రూరః = మొసలిని చీల్చినివాడు.

---

(అవతారిక.) గజేంద్రమోక్షవృత్తాంతమును చెప్పుచున్నారు :—

## ‡ 912 శబ్దసహః.

"శబ్దం ఆర్తనాదం సహతి భారమిన వహతీతి శబ్దసహః" స్పష్టముగా నుచ్చరింపఁజాలని జన్మమున (తిర్యగ్జన్మంబున) పుట్టియు ఆర్తితోఁ. పిలిపిన-చో ఆశబ్దంబును మహాభారముగా మోయువాఁడు. (అనగా గజేంద్రుడు మొసలినోటిలో బడి 'ఆదిమూలమా' అని అఱచిన అఱపును దుఃఖముతో విన్నవాడు అనిభావము.)

## 913. శిశిరః.

"శశతీతి శిశిరః" గజేంద్రునియార్తనాదమును విన్నంత నే వానిని రక్షించుటకై అతివేగముగా వచ్చినవాఁడు.

* శ్రుత్వా చక్రగదాధరః। సాన్నిధ్యం కల్పయామాస తస్మిన్ సరసి * [గజేంద్రునియార్తనాదమునువిని చక్రగదాధరుఁడై ఆమడుఁగుయొక్క తీరంబునకు వచ్చెను.] (913.)

## 914. శర్వరీకరః.

"శర్వరీ కరే యస్యసః శర్వరీకరః" అప్పుడు గజేంద్రునిరక్షణార్థమై శత్రువులను హింసించు పంచాయుధంబులను కరంబున ధరించియుండువాఁడు. (914.)

## 915. అక్రూరః.

"కృన్తతీతి క్రూరః, న క్రూరః అక్రూరః" గజేంద్రుని విడిపించుటకై హస్తంబున నే ఆయుధంబులుండినను తొందరపడి మొసలిని చీల్చకుండుటచే క్రూరుడు గానివాడు.

* గ్రాహగ్రస్తం గజేంద్రంచ తం గ్రాహంచ జలాశయాత్। ఉజ్జహారా ప్రమేయాత్మా తరసా మధుసూదనః * [మొసలిచే పట్టువడిన గజేంద్రుని ఆమొసలిని ఆప్రహదంబునుండి అతివేగముగా విష్ణువు పైకెత్తెను.] (915.)

---

‡ ఇది మొదలు 920-వ నామము వఱకు గజేంద్రమోక్షానుభవము.

916. పేశలః. 917. దక్షః. 918. దక్షిణః.
919. క్షమిణాం వరః. 920. విద్వ_త్తమః.

పేశలః = మనోహరుడు దక్షః = వేగముగా వచ్చినవాడు. దక్షిణః=ప్రీతిని జూపినవాడు. క్షమిణాం వరః = ఓర్పరులలో శ్రేష్ఠుడు విద్వ_త్తమః = చక్కగా ఎఱింగినవాడు.

---

## 916. పేశలః.

"పేశం లాతీతి పేశలః" అతిత్వరగా నేగునపుడు మాలలు ఆభరణములు పీతామ్బరము మున్నగునవి తాఱుమాఱుగనుండుటచే అతిమనోహరముగా నుండినవాఁడు. (916.)

## 917. దక్షః. (424.)

"దక్షతే ఇతి దక్షః" గజేంద్రునిరక్షణార్థమై అతిశీఘ్రముగా వచ్చినవాడు. (917.)

## 918. దక్షిణః.

"దక్షతే ఇతి దక్షిణః" వాఁడిట్లు వేవేగముగా వచ్చియు ఏమి ప్రయోజనము, సమయంబున రాలేక దూరంబున నేయుంటినే అని తన్ను నిందించుచు మంచిమాటలచే గజేంద్రుని యోదార్చి ప్రేమఁజూపినవాడు.

* ప్రీతిమాన్ పుణ్డరీకాక్షః శరణాగతవత్సలః । భజన్తం గజరాజానం మధురం మధుసూదనః * [పుండరీకాక్షుండగు మధుసూదనుఁడు శరణాగతవత్సలుండగుటచే గజేంద్రునియందు ప్రీతియుక్తుఁడై వానితోనిట్లనియెను.] (918.)

## 919. క్షమిణాం వరః.

గజేంద్రునిజూచినపిమ్మట నే తనదుఃఖము తీరుటచే ఓర్పరులలో శ్రేష్ఠుఁడు.

## 920. విద్వ_త్తమః.

"అయమతిశయేన విద్వాన్ విద్వ_త్తమః" తన కరస్పర్శాదులచే ఆ గజేంద్రునకు చేయవలసిన చికిత్సలను చక్కగా నెఱింగినవాఁడు.

* ఏవముక్త్వా కురుశ్రేష్ఠ ! గజేన్ద్రం మధుసూదనః । స్పర్శయామాస హస్తేన * [ఇట్లు చెప్పి విష్ణువు గజేంద్రుని తన హస్తంబుచే స్పృశించెను.] (920.)

921. వీతభయః.　922. పుణ్యశ్రవణకీర్తనః.　923. ఉత్తారణః.
924. దుష్కృతిహా.　925. పుణ్యః.

వీతభయః = భయమును తొలగించినవాడు. పుణ్యశ్రవణకీర్తనః = పరిశుద్ధులం గావించువాడు. ఉత్తారణః = దరిజేర్చినవాడు. దుష్కృతిహా = మొసలిని చంపినవాడు. పుణ్యః = పాపమును తొలగించువాడు.

---

## 921. వీతభయః.

" వీతం భయం యస్మాత్సః వీతభయః " తానువచ్చునపుడు గల్గినశబ్దము చెవిసోకినంతనే గజేంద్రునిభయము తొలఁగునట్లుండినవాఁడు. (921.)

## 922. పుణ్యశ్రవణకీర్తనః.

" పుణ్యే శ్రవణకీర్తనే యస్మాత్సః పుణ్యశ్రవణకీర్తనః " * శ్రుతేనహి కురుశ్రేష్ఠ! స్మృతేన కథితేనవా। గజేన్ద్రమోక్షణేనైవ సద్యః పాపాత్ ప్రముచ్యతే * (అర్జునా! గజేంద్రమోక్షమును వినినను స్మరించినను చెప్పినను వెంటనే పాపము తొలఁగినవాఁడగును.) అనినట్లు గజేంద్రమోక్షమును వినినను కీర్తించినను వారలపాపములను తొలఁగించువాడు. (922.)

## 923. ఉత్తారణః.

" ఉత్తారయతీతి ఉత్తారణః " గజేంద్రుని మొసలిని దరిజేర్చినవాఁడు. (923.)

## 924. దుష్కృతిహా.

" దుష్కృతిమ్ హన్తీతి దుష్కృతిహా " * స్థలస్థం దారయామాస గ్రాహం చక్రేణ మాధవః * (వి. ధ.) [తీరంబును చేరిన మొసలిని మధుసూదనుండు తనచక్రంబుచే చీల్చెను.] అనినట్లు భాగవతాపచారపడిన మొసలిని చక్రముచే సంహరించినవాఁడు. (924)

## 925. పుణ్యః. (692)

" పునాతీతి పుణ్యః " ఈకీర్తిచే అస్మదాదులనుగూడ పాపములను తొలగించి శుద్ధులుగా చేయువాడు. (925.)

926. దుస్స్వప్ననాశనః. 927. వీరహా. 928. రక్షణః.
929. సన్తః. 930. జీవనః.

దుస్స్వప్ననాశనః = చెడ్డస్వప్నములను తొలగించువాడు. వీరహా = గజేంద్రుని ప్రకృతిబంధమునుండి విడిపించినవాడు. రక్షణః = రక్షించినవాడు. సన్తః = (1) ఆశ్రితులను వృద్ధిచేయించువాడు. (2) ఆశ్రితులకు ఇష్టమునిచ్చువాడు. జీవనః = మొసలియొక్క శాపమును తొలగించినవాడు.

---

## 926. దుస్స్వప్ననాశనః.

"దుస్స్వప్నం నాశయతీతి దుస్స్వప్ననాశనః" * యే మాం త్వాం చ సరశ్చైవ......దుస్స్వప్నం నశ్యతే తేషామ్ * * దుస్స్వప్నోపశమాయాలమ్ * (వి ధ.) అనినట్లు గజేంద్రమోక్షవృత్తాంతంబును విన్నవారల దుఃస్వప్నంబులను తొలగించువాఁడు. (గజేంద్రమోక్ష కథాశ్రవణంబునకు దుస్స్వప్ననాశము ఫలముగా చెప్పబడియున్నది.) (926.)

## 927. వీరహా. (168.747)

"వీరం హన్తీతి వీరహా" * మోక్షయామాస నాగేన్ద్రం పాశేభ్యః శరణాగతమ్ * [శరణాగతుండగు గజేంద్రుని ప్రకృతిబంధమునుండి తొలఁగించెను.] అనినట్లు విరోధియగు మృత్యువును తొలగించి గజేంద్రుని ప్రకృతిబంధమునుండి విడిపించినవాఁడు.

## 928. రక్షణః.

"రక్షతీతి రక్షణః" స్పృశించుట కౌగలించుకొనుట మంచిమాటలం జెప్పుట మున్నగు వ్యాపారములచే గజేంద్రుని రక్షించినవాఁడు. (928.)

## 929. సన్తః.

(1) "సన్తనోతీతి సన్తః" ఆశ్రితులను వృద్ధిఁజేయించువాఁడు. (2) ఆశ్రితులకు ఇష్టము నిచ్చువాఁడు. (929.)

## 930. జీవనః.

"జీవయతీతి జీవనః" తనహస్తంబులచే చంపుటచే * సహి దేవలశాపేన హూహూర్గన్ధర్వసత్తమః । గ్రాహత్వమగమత్కృష్ణాత్ వధం ప్రాప్య దివంగతః * (వి. ధ.) [దేవలుండనుమహర్షి శాపంబుచే హూహూవను గంధర్వుఁడు మొసలియయ్యె. విష్ణువుచే చంపఁబడి మళ్ళి స్వర్గంబునొందెను.] అనినట్లు మొసలినిగూడ శాపము తొలఁగించి గంధర్వునిగా జీవింపజేసినవాఁడు. (930.)

931. పర్యవస్థితః 932. అనన్తరూపః. 933. అనన్తశ్రీః.
934. జితమన్యుః. 935. భయాపహః.

పర్యవస్థితః = చుట్టుచుండినవాడు. అనన్తరూపః = అనేకరూపములను ధరించువాడు. అనన్తశ్రీః = అనంతైశ్వర్యముగలవాడు. జితమన్యుః = కోపమును జయించినవాడు. భయాపహః = భయమును తొలగించువాడు.

---

## 931. పర్యవస్థితః.

"పరితః అవస్థితః పర్యవస్థితః" "ప్రీతిమాన్ పుణ్డరీకాక్షః శరణాగతవత్సలః" (వి. ధ.) [ప్రీతిగలవాఁడైన పుణ్డరీకాక్షుఁడు శరణాగతవత్సలుఁడు] అనినట్లు వాత్సల్యాతిశయంబుచే గజేంద్రుని చుట్టుచుట్టి వచ్చుచుండినవాడు. (931.)

## 932. అనన్తరూపః.

"అనన్తాని రూపాణి యస్యసః అనన్తరూపః" భక్తులను రక్షించుటకై అనేకదివ్యరూపములను ధరించువాఁడు. (932.)

## 933. అనన్తశ్రీః.

"అనన్తాః శ్రియః యస్యసః అనన్తశ్రీః" * తతోదివ్యవపుర్భూత్వా హస్తిరాట్ పరమంపదమ్। జగామ * (వి. ధ.) [పిమ్మట దివ్యశరీరంబును గైకొని ఆ గజేంద్రుఁడు పరమపదంబునొందెను.] అనినట్లు గజేంద్రునకు ఈ శరీరమును తొలఁగించి దివ్యశరీరమును అనుగ్రహించి తనసాయుజ్యము నిచ్చుటచే ఆశ్రితులకు నివ్వఁదగిన అనంతైశ్వర్యములంగలవాఁడు. (933.)

## 934. జితమన్యుః.

"జితః మన్యుః యేనసః జితమన్యుః" శరణాగతుండగు గజేంద్రునకు కీడొనరించిన జలకీటం (నీటిలోనుండు పురుగు) బగు మొసలిమీఁదంగల కోపమును వెంటనే జయించినవాఁడు. (934.)

## 935. భయాపహః.

"భయమ్ అపహన్తీతి భయాపహః" ఇట్టివాత్సల్యముగలవాఁడగుటచే ఆశ్రితులకుఁగల్గు భయమును తొలగించువాఁడు.

* భయే మహతి మగ్నాంశ్చ త్రాతి నిత్యం జనార్దనః * [మహాభయంబున మునిగియుండువారలను జనార్దనుఁడు రక్షించును.] (935.)

936. చతురశ్రః. 937. గభీరాత్మా. 938. విదిశః.
939. వ్యాదిశః. 940. దిశః.

చతురశ్రః = యుక్తములగు కార్యములఁజేయువాడు. గభీరాత్మా = గంభీర స్వభావుడు. విదిశః = అగోచరుడు. వ్యాదిశః = ఫలములనిచ్చువాడు. దిశః = బ్రహ్మాదులను కార్యములందు నియమించువాడు.

---

## 936. చతురశ్రః.

గజేంద్రునియొద్దకు దివ్యాంబరాదులు తాఱుమాఱగునట్లు వచ్చినను, అల్పమగు జలకీటమునుమీద కోపించినను తనభక్తునకు యుక్తములగుకార్యములం జేయువాఁడు. ఆశ్రితులవిషయమున సంభ్రమమును, ఆశ్రితవిరోధులవిషయమున అధిక కోపమును గల్గుటయు న్యాయమే. (936.)

## 937. గభీరాత్మా.

"గభీరః ఆత్మా యస్యసః గభీరాత్మా" ఇట్లు బ్రహ్మాదులు గజేంద్రునివలె ఆశ్రయింపకుండినను, వారలచే నిర్ణయింపఁజాలని గంభీరస్వభావుఁడు. (937)

## 938. విదిశః.

"వివిధాః దిశాః యస్యసః విదిశః" అతివినయముతో గద్గదస్వరముతో నుతించు ఆబ్రహ్మాదుల వాక్కునకు అగోచరంబగు మహిమను గలవాఁడు. (938.)

## 939. వ్యాదిశః.

"వ్యాదిశతీతి వ్యాదిశః" ఆ బ్రహ్మాదులుగోరిన స్థానంబుల నిచ్చినవాడు.

## 940. దిశః.

"దిశతీతి దిశః" గజేంద్రునివలె ఆబ్రహ్మాదులను అంతరంగులుగా చేసికొనక వారవారల కృత్యములందు నియమించువాడు.

* గజేన్ద్రమోక్షణం దృష్ట్వా సర్వే సేన్ద్రపురోగమాః । బ్రహ్మాణమగ్రతః కృత్వా దేవాః ప్రాఞ్జలయస్తదా । వన్దిరే మహాత్మానం ప్రభుం నారాయణం హరిమ్ * వి. ధ. 69.) [గజేంద్రమోక్షంబునుజూచి ఇంద్రాదిదేవతలండఱు బ్రహ్మను పురస్కరించుకొని అంజలిచేయుచు సర్వవ్యాపకుఁడై మహాత్ముఁడైయుండు శ్రీమన్నారాయణుని నమస్కరించిరి.] (940.)

941. అనాదిః. 942. భూర్భువః. 943. లక్ష్మీః.
944. సువీరః. 945. రుచిరాఙ్గదః.

అనాదిః = స్వీకరింపబడనివాడు. భూర్భువః = స్థానమైనవాడు. లక్ష్మీః = సంపదగానుండువాడు. సువీరః = గొప్పశక్తిగలవాడు. రుచిరాఙ్గదః = తనశరీరంబును భక్తులకు నిచ్చువాడు.

---

(అవతారిక.) తనభక్తులు తిర్యగ్జాతిలోఁబుట్టియుండినను వారలకు వశుడుగానుండును ; బ్రహ్మాదులకోయన్న అల్పఫలంబులనే యిచ్చుచుండును. దీనికిఁ గారణమును దెల్పుచున్నారు :—

## 941. అనాదిః.

" ఆదీయతే ఇతి ఆదిః, న ఆదిః అనాదిః " బ్రహ్మాదులు అన్యపరులై వీనిని స్వామిగా స్వీకరింపకుండుటచే వారలను అల్పఫలముతో నివర్తింప జేయును. (941.)

## 942. భూర్భువః.

" భవతీతి భూః, తస్య భువః భూర్భువః " భగవద్దాస్యమునంగీకరించుటచే ఆత్మలాభమునొందినవారలకు తానే స్థానమైనవాఁడు.

* నివసిష్యసి మయ్యేవ అత ఊర్ధ్వం న సంశయః * (గీ. 12-8) [ఇది మొదలు నన్నేపొంది నాయందే నిలుతువు. దీనియందు సంశయములేదు.] (942.)

## 943. లక్ష్మీః.

* భవద్గతం మే రాజ్యంచ జీవితంచ సుఖానిచ * (రా. యు. 18-౮.) [నారాజ్యము నాజీవితము నాసుఖము అన్నియు మీయధీనమే.] అనునట్లు ఆత్మలాభమునొందిన భక్తులకు తానే సమస్తసంపదగానుండువాఁడు. (943.)

## 944. సువీరః.

" సుతరాం వీరః సువీరః " భక్తులయాపదలను పరిహరించుటకు దగిన గొప్పశక్తిగలవాడు. (944.)

## 945. రుచిరాఙ్గదః.

" రుచిరం అఙ్గం దదాతీతి రుచిరాఙ్గదః " అతిమనోహరమైన తన శరీరమును భక్తులు అనుభవించుటకు నిచ్చువాడు. (945.

946. జననః. 947. జనజన్మాదిః.
948. భీమః. 949. భీమపరాక్రమః.

జననః = జనింపజేయువాడు. జనజన్మాదిః = జనులజన్మంబునకు తామే ఫలముగానుండువాడు. భీమః = భయంకరుడు. భీమపరాక్రమః = భయంకరమగు పరాక్రమముగలవాడు.

---

(అవతారిక.) అనంతరము భగవంతునిసమస్తవ్యాపారంబులకును ప్రయోజనమును చెప్పుచున్నారు :—

## 946. జననః.

“జనయతీతి జననః” తన్ను అనుభవించుటకుఁదగిన కరణంబులుగల పలువురను జనింపఁజేయువాఁడు. (946.)

## 947. జనజన్మాదిః.

“జనానాం జన్మనః ఆదిః జనజన్మాదిః” అట్టి జనములజన్మములకు తామే ప్రయోజనమైనవాఁడు. (అనగా, తన్ను అనుభవించుటకు గానే జనములను సృజించువాడనిభావము.)

* అద్య మే సఫలం జన్మ * (వి. పు, 5. 1-73.) [ఇపుడే నా జన్మము సఫలమయ్యె.] * జన్మన్యవిఫలా నైకా యా గోవిన్దాశ్రయా క్రియా। సుజన్మదేహమత్యన్తం తదేవాఽశేషజన్తుషు। యద్దేన పులకోద్భాసి విష్ణునామని కీర్తితే * [ఏది గోవిందునిగూర్చి చేయబడినదో; అదియొక్కటియే జన్మమునెత్తినందుకు సఫలమైన కార్యము. విష్ణునామమును చెప్పనంతనే ఏది గగుర్పాటు నొందునో; అదియే సమస్తజంతువులలోను శ్రేష్ఠమగుజన్మము.] ఇత్యాది. (947.)

## 948. భీమః. (359.)

“బిభ్యతి అస్మాదితి భీమః” తన్ను అనుభవింపకుండువారలకు గర్భవాసము నరకము మున్నగు దుఃఖములనిచ్చుటచే వారలకు భయంకరమైనవాఁడు. (948.)

## 949. భీమపరాక్రమః.

“భీమః పరాక్రమః యస్యసః భీమపరాక్రమః” లోకములను హింసించుచుండిన హిరణ్యాదులవిషయమున భయంకరమగు పరాక్రమము గలవాడు.

950. ఆధారనిలయః. 951. ధాతా
952. పుష్పహాసః. 953. ప్రజాగరః.

ఆధారనిలయః = ప్రహ్లాదాదులకు నాధారమగువాడు. ధాతా = నిర్వహించువాడు. పుష్పహాసః = పుష్పముయొక్క వికాసమువంటివాడు. ప్రజాగరః = మేలుకొనియుండువాడు.

---

ఇట్లు భయపఱచుటయు అనుగ్రహమేగాని నిగ్రహము కాఁజాలదు పిచ్చిపట్టిన వానికి సంకెళ్ళు వేయుటచే వానికిని వానిచే భాధింపబడు అందఱకును హితముగా నుండునుగదా ?

## 950. ఆధారనిలయః.

"ఆధారాణాం నిలయః ఆధారనిలయః" * వర్ణాశ్రమాచారపరాః సన్తః శాస్త్రైకతత్పరాః। త్వాం ధరే! ధారయిష్యన్తి తేషు త్వత్సారమాహితమ్ * (పి. స్మృ.) [ఓ భూమీ ! వర్ణాశ్రమాచారనిరతులై శాస్త్రనిష్ఠులైయుండు సత్తులు నిన్ను ధరింపఁగలరు. భారము అప్పుడు వారల మీఁద నిల్చును] అనినట్లు ధార్మికులగుటచే జగమునకు ఆదారముగానుండు ప్రహ్లాదవిభీషణపాండవాదులకు ఆధారముగానుండువాడు. (950.)

## 951. ధాతా. (43)

"దధాతీతి ధాతా" ధర్మానుష్ఠానమునకై అచార్యపదంబును తానుగూడ నిర్వహించువాడు. (951.)

## 952. పుష్పహాసః.

"పుష్పస్యేవ హాసః యస్యసః పుష్పహాసః" ఇట్లు తన్ను అనుభవించు వారలకు వికసించిన పుష్పమువంటి తనభోగ్యతను ప్రకాశింపఁజేయువాఁడు. (952.)

## 953. ప్రజాగరః.

"ప్రజాగర్తీతి ప్రజాగరః" * య ఏషు సుప్తేషు జాగర్తి కామం కామం పురుషో నిర్మిమాణః * [ఎవఁడు వీరందఱు నిద్రించునప్పుడును వీరలకు ఇష్టంబు నిచ్చుటకై తాను మేలుకొని యుండునో;] అనినట్లు ఆశ్రితరక్షణార్థమై సదా మేలుకొనియుండువాఁడు. (953.)

954. ఊర్ధ్వగః. 955. సత్పథాచారః. 956. ప్రాణదః.
957. ప్రణవః. 958. పణః.

ఊర్ధ్వగః = గొప్పవాడు. సత్పథాచారః = సన్మార్గంబున ప్రవర్తింపజేయువాడు. ప్రాణదః = ఆత్మోజ్జీవనమునిచ్చువాడు. ప్రణవః = ప్రణమిల్లజేయువాడు. పణః = శేషశేషి భావము మాఱియుండువాడు.

---

## 954. ఊర్ధ్వగః.

"ఊర్ధ్వం గచ్ఛతీతి ఊర్ధ్వగః" వీఁడు నిద్రింపకుండుటకు గారణమే మనఁగా [ఊర్ధ్వగః] వీఁడు స్వతః మహనీయుఁడు.

* మహాత్మనాం సంశ్రయమభ్యుపేతః నైవావసీదత్యతిదుర్గతోఽపి *
[మహనీయులను ఆశ్రయించినవాఁడు ఎట్టి కష్టములనొందినను నశింపఁడు.] (954.)

## 955. సత్పథాచారః.

"సత్పథే ఆచారః యస్యసః సత్పథాచారః" తానిట్లు ఉత్తుంగ స్వభావుఁడుగానుండుటకు ఫలముగా వారలను తనకు కైంకర్యముచేయుట అను సన్మార్గమున ప్రవర్తింపఁజేయువాడు.

* అనిత్యమసుఖం లోకమిమం ప్రాప్య భజస్వ మామ్ * (గీ. 9_33.)
[ఈ లోకసుఖము అనిత్యమై అసుఖమైయుండునని దలంచి నన్ను భజించుము.]

## 956. ప్రాణదః. (66, 323, 401.)

"ప్రాణం దదాతీతి ప్రాణదః" శబ్దాదివిషయాంతరసంగముచే ఆత్మనాశము నొందిన ఆత్మకోటికి ఆత్మోజ్జీవనము నిచ్చువాఁడు. (956.)

## 957. ప్రణవః.

"ప్రణామయతీతి ప్రణవః" చేతనులకును తనకునుగల స్వస్వామిభావ సంబంధమును దెల్పి వారలను తనచరణారవిందములందు ప్రణమిల్ల జేయువాఁడు.

* ప్రాణాన్ సర్వాన్ పరమాత్మని ప్రణామయతి, ఏతస్మాత్ ప్రణవ ఇతి * (అ. శి.) [సమస్తప్రాణములను పరమాత్మయగు తనయందు ప్రణామము కావించుటచే ప్రణవః అని చెప్పఁబడును.] (957.)

## 958. పణః.

"పణతే ఇతి పణః" తాను శేషి, ఇతరులు శేషభూతులు అను క్రమము మాఱునట్లుండువాడు. (అనగా భక్తులకు తాను దాసుడుగానుండుననిభావము.) (958.)

959. ప్రమాణమ్. 960. ప్రాణనిలయః. 961. ప్రాణధృత్.
962. ప్రాణజీవనః. 963. తత్వమ్.

ప్రమాణమ్ = విశ్వాసమును గల్గించువాడు. ప్రాణనిలయః = ప్రాణములకు స్థానమైనవాడు. ప్రాణధృత్ = జీవరాసులను రక్షించువాడు. ప్రాణజీవనః = ఆత్మలను జీవింపజేయువాడు. తత్వమ్ = సారమైనవాడు.

---

959. ప్రమాణమ్. (429)

"ప్రమీయతే అనేనేతి ప్రమాణమ్" ఇట్లు సంశయవిపర్యయములు లేక వేదరహస్యమగు పరమార్థమున విశ్వాసమును గల్గించువాఁడు. (959.)

960. ప్రాణనిలయః.

"ప్రాణాః నిలీయన్తే అస్మిన్నితి ప్రాణనిలయః" పక్షులు గూటిలో నొదుగునట్లు ఆత్మవర్గమును అణఁచుకొనియుండువాఁడు. (960)

961. ప్రాణధృత్.

"ప్రాణాన్ ధరతీతి ప్రాణధృత్" ఆ జీవరాసులను తల్లివలె పోషించువాడు. (961.)

962. ప్రాణజీవనః.

"ప్రాణాన్ జీవయతీతి ప్రాణజీవనః" అన్నపానాదులువలె ఆప్రాణులకు జీవనహేతువుగానుండి జీవింపజేయువాడు. (962.)

963. తత్త్వమ్.

"తతోభావః తత్త్వమ్" పాలు పెరుగు మున్నగువానిలో సారమగు మీగడవలె చిత్తు అచిత్తు అను వీనిలో వ్యాప్త్యాదులచే సారమైనవాఁడు.

* పరమార్థమశేషస్య జగతః ప్రభవాప్యయమ్। శరణ్యం శరణం గచ్ఛన్ గోవిన్దం నావసీదతి * [పరమార్థమై సకలజగత్తులకు నుత్పత్తి స్థానమై లయస్థానమై సర్వరక్షకుఁడై యుండు గోవిందుని శరణమొందిన పిమ్మట దుఃఖింపడు.] * ఏకతో వా జగత్ కృత్స్నమ్ ఏకతో వా జనార్దనః। సారతో జగతః కృత్స్నాదతిరిక్తో జనార్దనః* [ఒకప్రక్క సమస్తలోకములను మఱొకప్రక్క విష్ణువును పెట్టినచో సమస్తలోకములకన్న సారముగా నుండుటచే విష్ణువే అధికుడుగానుండును.] (963.)

964. తత్త్వవిత్. 965. ఏకాత్మా. 966. జన్మమృత్యుజరాతిగః
967. భూర్భువస్స్వ స్తరుః. 968. తారః.

తత్త్వవిత్ = తనతత్త్వమును ఎఱింగినవాడు. ఏకాత్మా = తానొకడే శేషిగా నుండువాడు. జన్మమృత్యుజరాతిగః = జన్మము మరణము ముసలితనము అనునవి లేనివాడు. భూర్భువస్స్వ స్తరుః = ముల్లోకములకును ఆశ్రయముగానుండువాడు. తారః = ఉత్తరింపజేయువాడు.

---

## 964. తత్త్వవిత్.

"తత్త్వం వేత్తీతి తత్త్వవిత్" * త్వమేవ త్వాం వేత్థ * [నిన్నునీవే యెఱుంగుదువు.] * స్వయమేవాత్మనాత్మానం వేత్థ త్వం పురుషోత్తమ * [పురుషోత్తమా! నిన్ను నీవే యెఱుంగుదువు.] అనినట్లు తనతత్త్వంబును తానే యెఱింగియుండువాడు. (964.)

## 965. ఏకాత్మా.

"ఏకః ఆత్మా యస్యసః ఏకాత్మా" చేతనాచేతనవర్గములకన్నిటికిని తానొకఁడే శేషిగాను భోక్తగాను అభిమానిగాను ఉండువాఁడు. (965.)

## 966. జన్మమృత్యుజరాతిగః.

"జన్మచ మృత్యుశ్చ జరాచ జన్మమృత్యుజరాః, తాః అతిగచ్ఛతీతి జన్మమృత్యుజరాతిగః" వాఁడిట్లుండియు చేతనాచేతనధర్మములగు జన్మము మరణము జర (ముసలితనము) ఇవిలేనివాఁడు. (966.)

## 967. భూర్భువస్స్వ స్తరుః.

భూలోక-భువర్లోక-సువర్లోకములందు వసించు ప్రాణికోటికి పక్షులకు వాసస్థానమగు పారిజాతవృక్షమువలె ఆశ్రయముగా నుండువాడు.

* సమాశ్రితాత్ బ్రహ్మతరోరనన్తాత్ నిస్సంశయః పక్వఫలప్రపాతః * [బ్రహ్మమను వృక్షమునాశ్రయించినచో పక్వమగు ఫలము పడియేతీరును.] (967.)

## 968. తారః. (340)

"తారయతీతి తారః" వారలను సంసారమనుసముద్రమునుండి ఉత్తరింపఁజేయువాడు. (968.)

969. సవితా. 970. ప్రపితామహః. 971. యజ్ఞః.
972. యజ్ఞపతిః. 973. యజ్వా. 974. యజ్ఞాఙ్గః.

సవితా = సృజించువాడు. ప్రపితామహః = బ్రహ్మదేవునికి తండ్రి. యజ్ఞః = యజ్ఞమైయుండువాడు. యజ్ఞపతిః = యజ్ఞమునకు పతి. యజ్వా = యజ్ఞమును అనుష్ఠించువాడు. యజ్ఞాఙ్గః = యజ్ఞమును అంగముగాగల వాడు.

---

## 969. సవితా. (887)

"సూతే ఇతి సవితా" సమస్తమును తానే సృజించువాడు. (969.)

## 970. ప్రపితామహః.

"ప్రకృష్టః పితామహః ప్రపితామహః" పితామహుడని పేరొందిన బ్రహ్మదేవునికిని తండ్రి. (970.)

## 971. యజ్ఞః. (446)

తన్నారాధించుటయనెడి సమృద్ధిలేనివారలు ఆసమృద్ధిని గోరినచో వారలకు తానే యజ్ఞమైయుండువాడు. (971.)

## 972. యజ్ఞపతిః.

"యజ్ఞస్య పతిః యజ్ఞపతిః" తన్నారాధించుటయను యజ్ఞమునకు ఫలము నిచ్చుటచే యజ్ఞమునకు పతియైనవాడు. (972.)

## 973. యజ్వా.

"యజతీతి యజ్వా" తనయారాధనరూపమైన యజ్ఞమును అనుష్ఠింప శక్తిలేనివారలకు బదులు తానేయనుష్ఠించుటచే తానే యాగముచేయువాడై యుండువాడు.

* తేషాంతు పావనాయాఽహం నిత్యమేవ యుధిష్ఠిర। ఉభే సంధ్యేఽనుతిష్ఠామి వ్యాసన్నం తద్వ్రతం మమ * (భా. ఆ.) [యుధిష్ఠిరా! వారందఱును పరిశుద్ధులగుటకై నిత్యము రెండు సంధ్యలలోను కర్మములను నేనే అనుష్ఠించుచున్నాను. ఈవ్రతము నాకు ఒకప్పుడును వీడఁదగనిదిగాదు.] (973.)

## 974. యజ్ఞాఙ్గః.

"యజ్ఞః అఙ్గమ్ యస్యాసః యజ్ఞాఙ్గః" శక్తులు అనుష్ఠించు యజ్ఞములన్నియు తానను్ఠించుయాగమునకు అణగినదిగా చేయువాడు. (974.)

975. యజ్ఞవాహనః. 976. యజ్ఞభృత్. 977. యజ్ఞకృత్.
978. యజ్ఞీ. 979. యజ్ఞభుక్.

యజ్ఞవాహనః = యజ్ఞమును నిర్వహించువాడు. యజ్ఞభృత్ = యజ్ఞమును పూర్తిగావించువాడు. యజ్ఞకృత్ = యజ్ఞమును సృజించినవాడు. యజ్ఞీ = యజ్ఞములచే ఆరాధింపబడువాడు. యజ్ఞభుక్ = యజ్ఞములను రక్షించువాడు.

---

## 975. యజ్ఞవాహనః.

"యజ్ఞం వాహయతీతి యజ్ఞవాహనః" వారలకు యజ్ఞమున భక్తి శ్రద్ధలను ఇచ్చి నిర్వహించువాఁడు, (975.)

## 976. యజ్ఞభృత్.

"యజ్ఞం బిభర్తీతి యజ్ఞభృత్" * ప్రమాదాత్ కుర్వతాం కర్మ ప్రచ్యవత్యధ్వరేషు యత్। స్మరణాదేవ తద్విష్ణోః సంపూర్ణం స్యాదితి శ్రుతిః * [యాగంబున ప్రమాదవశముగనేదేని దోషముగల్గినచో అది విష్ణునామస్మరణమాత్రంబుననే తొలగి యాగము పూర్ణమగును అని శ్రుతి.] అనినట్లు వారలనుష్ఠించు యజ్ఞమున లోపముగల్గినచో తన్ను స్మరించుటచేతను తనకు పూర్ణాహుతిగావించుటచేతను ఆయాగమును పూర్తిగావించువాడు. (976.)

## 977. యజ్ఞకృత్.

"యజ్ఞం కరోతి సృజతీతి యజ్ఞకృత్" లోకహితార్థమై యజ్ఞమును ఆదిలో సృజించినవాఁడు. (977.)

## 978. యజ్ఞీ.

"యజ్ఞం అస్యాస్తీతి యజ్ఞీ" సమస్తయజ్ఞములచేత తామే ఆరాధింపబడువాడు. (978.)

## 979. యజ్ఞభుక్.

"యజ్ఞాన్ భుఙ్క్తే ఇతి యజ్ఞభుక్" సమస్తయజ్ఞములకునుగల్గు విఘ్నములను తొలగించి రక్షించువాడు. (979.)

980. యజ్ఞసాధనః.  981. యజ్ఞాన్తకృత్.
982. యజ్ఞగుహ్యమ్.  983. అన్నమ్.

యజ్ఞసాధనః = యజ్ఞములను సాధనముగా గలవాడు. యజ్ఞాన్తకృత్ = యజ్ఞమునకు సిద్ధాంతమును చేయువాడు. యజ్ఞగుహ్యమ్ = యజ్ఞరహస్యముగానుండువాడు. అన్నమ్ = అనుభవింపబడువాడు.

---

## 980. యజ్ఞసాధనః.

"యజ్ఞాః సాధనాని యస్యసః యజ్ఞసాధనః" జ్ఞానమును గల్గించి అజ్ఞానమూలముగా తన్ను పొందింపఁజేయుటచే యజ్ఞమును స్వప్రాప్తిసాధనముగాఁ గలవాడు. (980.)

## 981. యజ్ఞాన్తకృత్.

"యజ్ఞస్య అన్తం కరోతీతి యజ్ఞాన్తకృత్" యజ్ఞమొనర్చుట తనతత్త్వమును తెల్పుటకే అనుసిద్ధాంతంబును చేసినవాఁడు.

* సర్వకర్మాఖిలం పార్థ! జ్ఞానే పరిసమాప్యతే * (గీ. 4_33.) [అర్జునా! సకల కర్మములును జ్ఞానమననే సమప్తినొందును.] (981.)

## 982. యజ్ఞగుహ్యమ్.

"యజ్ఞస్య గుహ్యమ్ యజ్ఞగుహ్యమ్" తాను నిరపేక్షుఁడయ్యు యజ్ఞాదులందు అపేక్షగలవానివలె పురోడాశాదులను భుజించి తాను తృప్తుఁడగుచు ఇతరులను గూడ తృప్తిఁజేయించును అను విషయము యజ్ఞవిధ్యాదుల నెఱింగినవారుదప్ప ఇతరు లెఱుంగకుండునట్లు రహస్యముగా నుండువాడు.

* విదుః కృష్ణం బ్రాహ్మణాః తత్త్వతో యే తేషాం రాజన్ సర్వయజ్ఞాః సమాప్తాః * [ఏ బ్రాహ్మణులు కృష్ణుని యథార్థముగా నెఱుగుదురో; వారే సమస్త యజ్ఞములను పూర్తి గావించినవారగుదురు.] (982.)

## 983. అన్నమ్.

"అద్యతే ఇత్యన్నమ్" ఇట్లు వాని ననుభవించు శక్తిని సంపాదించుకొన్నవారలకు అన్నమువలె ధారకముగా నుండువాఁడు. (అనగా, అన్నమువలె భక్తులచే అనుభవింపబడువాడు అని భావము.) (983.)

984. అన్నాదః. 935 ఆత్మయోనిః. 986. స్వయజ్ఞాతః.
987. వైఖానః 988. సామగాయనః.

అన్నాదః = తన్ను అనుభవించువారలను అనుభవించువాడు. ఆత్మయోనిః = తనతో చేర్చుకొనువాడు. స్వయజ్ఞాతః = తన సంకల్పంబుచే నవతరించినవాడు. వైఖానః = దుఃఖమును తొలగించువాడు. సామగాయనః = సామగానముచేయువాడు.

---

## 984. అన్నాదః.

"అన్నమ్ అత్తీతి అన్నాదః" అన్నము అనఁగా అన్నమువలె భోగ్యులుగానుండువారలు. వారలను భోగ్యముగా తామునుగూడ అనుభవించువాఁడు. (984.)

## [ ఏవ - చ ]

ఏవకారము అవధారణార్థకము. ఈ గుణములన్నియు వీనికే గలవు. ఇతరులకు లేదు అని సూచించును.

చకారము సముచ్చయార్థకము. క్రిందఁ జెప్పిన గుణములు ఇక చెప్పఁబోవు గుణములు అనునవి యన్నియు నొకనియందే యుండుటను తెల్పును.

## 985. ఆత్మయోనిః.

"ఆత్మానం యాతీతి ఆత్మయోనిః" పాలతో శర్కరనుచేర్చినట్లు ఇట్లు తన్ను అనుభవించువారలను తనతో చేర్చుకొనువాఁడు. (985.)

## 986. స్వయజ్ఞాతః.

ఇతరుల ప్రార్థనాదులన పేక్షింపక తనసంకల్పంబుచే తానే యవతరించువాడు.

## 987. వైఖానః.

"విఖానయతీతి విఖానః, విఖాన ఏవ వైఖానః" అవతరించి భక్తులయొక్క సంసారదుఃఖమును చీల్చి తొలగించువాఁడు. (987.)

## 988. సామగాయనః.

"సామాని గాయన్తీతి సామగాయనాః, తే అస్య సన్తీతి సామగాయనః"
* ఏతత్ సామ గాయన్నాస్తే। హా 3 వు హా 3 వు హా 3 వు ॥ (తై.భృగు.-10)
[పరమపదమున హా 3 వు హా 3 వు హా 3 వు అను సామంబును గానము చేయు

989. దేవకీనన్దనః. 990. స్రష్టా. 991. క్షితీశః.
992. పాపనాశనః. 993. శఙ్ఖభృత్.

దేవకీనన్దనః = దేవకీపుత్రుడు. స్రష్టా = సృజించువాడు. క్షితీశః = భూమికి ఈశ్వరుడు. పాపనాశనః = పాపమును తొలగించువాడు. శఙ్ఖభృత్ = శంఖమును పోషించువాడు.

---

చున్నారు.] అనినట్లు స్వప్రాప్తియను మధువును గ్రోలి 'హావు హావు హావు' అని సామగానముచేయు ముక్తులను గలవాడు. (988.)

## 989. దేవకీనన్దనః.

"దేవక్యాః నన్దనః దేవకీనన్దనః" ఇట్టి మహావైభవముగలవాఁడు పరత్వావస్థలోనుండువాఁడా? యన్న; కాఁడు. దేవకీపుత్రుఁడే.

* య ఏష పృథుదీర్ఘాక్షః సమ్బన్ధీ తే జనార్దనః * [ఏవఁడు విశాలములగు నేత్రములతోఁ గూడి నీకు బంధువై యుండునో; వాఁడే జనార్దనుఁడు.] * ఏష భూతం భవిష్యచ్చ భవచ్చ భరతర్షభ * [ఓ యుధిష్ఠిరా! భూతభవిష్యద్వర్తమానంబులంగల సకలపదార్థములును వీఁడే.] (989.)

## 990. స్రష్టా. (595)

"సృజతీతి స్రష్టా" పరత్వావస్థలోనుండి సృజించువాఁడును వాఁడే. (990.)

## 991. క్షితీశః.

"క్షిత్యాః ఈశః క్షితీశః" సర్వేశ్వరుఁడయ్యవతారములచే భూభారమును తొలగించుటచే భూమికి ఈశ్వరుడు.

## 992. పాపనాశనః.

"పాపం నాశయతీతి పాపనాశనః" నవనీతచౌర్యము రాసక్రీడ గోపికావస్త్రాపహరణము మున్నగు అవతారదివ్యచేష్టితములను అనుభవించు తనభక్తులయొక్క బాహ్యాభ్యంతరపాపంబులను నాశముచేయువాఁడు. (992)

## 993. శఙ్ఖభృత్.

"శఙ్ఖం బిభర్తీతి శఙ్ఖభృత్" అవతారములందు తనపరమైశ్వర్యచిహ్నములగు దివ్యాయుధములను ధరించియుండుటచే తనయధరామృతముచే పాంచజన్యమును (శంఖమును) పోషించువాడు. (993.)

994. నన్దకీ. 995. చక్రీ. 996. శార్ఙ్గధన్వా.
997. గదాధరః. 998. రథాఙ్గపాణిః.

నన్దకీ = నందకముగలవాడు. చక్రీ = చక్రముగలవాడు. శార్ఙ్గధన్వా = శార్ఙ్గముగలవాడు. గదాధరః = గదను ధరించియుండువాడు. రథాఙ్గపాణిః = చక్రమును ధరించియుండువాడు.

---

## 994. నన్దకీ.

"నన్దకః అస్యాస్తీతి నన్దకీ" భగవంతుఁడుగూడ 'ఇది నన్ను సంతసింపఁ జేయఁగలదు' అని ప్రార్థింపఁదగియుండుటచే నందకమనఁబడు ఖడ్గంబును నిత్యము ధరించియుండువాఁడు. (994.)

## 995. చక్రీ. (908)

"చక్రమ్ అస్యాస్తీతి చక్రీ" తమభృత్యులగు దేవతలకు శత్రువులుగానుండు అసురరాక్షసాదులరక్తముచే కలుషితమగు జ్వాలలచే ప్రకాశించు చక్రమును సదా ధరించియుండువాఁడు. (995.)

## 996. శార్ఙ్గధన్వా.

"శార్ఙ్గమ్ ధనుః యస్యసః శార్ఙ్గధన్వా" ధనుష్టంకారము చేతను బాణవర్షములచేతను శత్రువులను తపింపఁజేయు శార్ఙ్గంబను ధనుస్సును ధరించినవాఁడు. (996.)

## 997. గదాధరః.

"గదాం ధారయతీతి గదాధరః" చుట్టునప్పుడు ప్రళయాగ్నివలె నిప్పును విసరివేసి శత్రువులను సంహరించి దానిచే సదా తనకు సంతోషమును గల్గించు కౌమోదకియను గదను ధరించినవాఁడు. (997.)

## 998. రథాఙ్గపాణిః.

"రథాఙ్గమ్ పాణౌ యస్యసః రథాఙ్గపాణిః" వీనికిఁదగినట్లు సదా ప్రకాశించు చక్రమును ధరించినవాఁడు.

పై జెప్పియుండు 'చక్రీ' (995) అను నామముచే స్వస్వామిభావసంబంధమును, ఈ నామముచే సదా ప్రకాశించుటయు చెప్పబడుటచే 'చక్రీ, రథాంగపాణిః' అను నామములకు పునరుక్తి లేదు. (998.)

999. అక్షోభ్యః.　　1000. సర్వప్రహరణాయుధః.

అక్షోభ్యః = జయింపజాలనివాడు.　　సర్వప్రహరణాయుధః = సమస్త ఆయుధములను ధరించియుండువాడు.

---

## 999. అక్షోభ్యః. (807.)

"న క్షోభ్యః అక్షోభ్యః" శరణాగతులకు అభయప్రదాన మొనరించుటలో గల ఉత్సాహమును తనమహిమలచే ఎవరివలనను జయింప జాలనివాడు. (999.)

## 1000. సర్వప్రహరణాయుధః.

"సర్వేషాం ప్రహరణాని సర్వప్రహరణాని ఆయుధాని యస్యసః సర్వప్రహరణాయుధః" తన్నే రక్షకముగా ఆశ్రయించియుండువారలకు సకలానిష్టములను సమూలముగా తొలగించు అనంతములై అపారసామర్థ్యములంగలవై తనకుఁదగినవై అనేకాభరణములాయివి అని సందేహించునట్లుండు సదా సర్వత్ర సర్వప్రకారములచేతను ఆశ్రయించినవారలను రక్షించుట అను దీర్ఘ సత్రయాగమున దీక్షితములై సర్వైశ్వర్యభారమును వహించియుండు ఇతరములగు దివ్యాయుధములను గలవాఁడు.

ఇట్లు సమస్తదోషప్రత్యనీకమై ఉపాధి సంఖ్యాదినిమిత్తియుత్తుంగమంగళమై ప్రకాశించు స్వరూప - రూప - గుణ - విభవ - చేష్టితములను గలవాఁడై నిరంకుశైశ్వర్యశాలియై ఆపత్సఖుడై అర్థికల్పకుఁడై ప్రపన్నులకు జీవనౌషధమై శ్రియఃపతియై షాడ్గుణ్యపరిపూర్ణుఁడైయుండు పురుషోత్తముని ఆశ్రయించినవారలకు సమస్తసంపదలును సిద్ధించును. (1000.)



శ్రీ విష్ణుసహస్రనామవ్యాఖ్యానమున

దశమశతకము

సమాప్తము.

శ్రీమతే రామానుజాయ నమః.

# ఫలశ్రుతి.



(అవతారిక.) అనంతరము ఈసహస్రనామముయొక్క మహిమమును జెప్పఁదలంచి భీష్ములు ధర్మపుత్రులతో చెప్పుచున్నారు:—

ఇతీదం కీర్తనీయస్య కేశవస్య మహాత్మనః ।
నామ్నాం సహస్రం దివ్యానామ్ అశేషేణ ప్రకీర్తితమ్ ॥ 1

అర్థము:— ఇతి = ఇట్లు, కీర్తనీయస్య = కీర్తింపఁదగిన, మహాత్మనః = మహాత్ముఁడగు, కేశవస్య = కేశవునియొక్క, దివ్యానామ్ = దివ్యములగు, నామ్నామ్ = నామములయొక్క, ఇదం సహస్రమ్ = ఈవేయి, అశేషేణ = మొత్తము, ప్రకీర్తితమ్ = చెప్పబడియె.

తాత్పర్యము:— ఇట్లింతవఱకు కీర్తింపఁదగిన కేశవునియొక్క వెయ్యి నామములు మొత్తము చెప్పబడియె. (1.)

(అవతారిక.) ఇక అధికారినిర్ణయమును ఫలనిర్ణయమును చెప్పుచున్నారు:—

య ఇదం శ్రుణుయాన్నిత్యం యశ్చాపి పరికీర్తయేత్ ।
నాశుభం ప్రాప్నుయాత్ కిఞ్చిత్ సోఽముత్రేహ చ మానవః ॥ 2

అర్థము:— ఇదమ్ = దీనిని, యః = ఎవఁడు, నిత్యమ్ = ఎల్లప్పుడు, శ్రుణుయాత్ = వినునో, యశ్చ = మఱియెవ్వఁడును, నిత్యం = ఎల్లప్పుడును, పరికీర్తయేత్ = చెప్పునో, సః మానవః = ఆనరుడు, అముత్ర = పరలోకమునను, ఇహ చ = ఈ లోకమునను, అశుభమ్ = అమంగళమును, నప్రాప్నుయాత్ = పొందఁడు.

తాత్పర్యము:— వారివారి యధికారమునకుఁదగినట్లు ఈసహస్రనామమును వినువారలకును చెప్పువారలకును ఇహలోకమునందును పరలోకమునందును అశుభములన్నియు తొలఁగును, అని సామాన్యముగా ఫలము చెప్పఁబడియె. (2.)

(అవతారిక.) బ్రాహ్మణాది నాలుగు వర్ణములవారు ఎట్టిఫలమునుగోరక దీనిని వినినను జపించినను వారలకు దీనిచే గల్గు ఫలమును చెప్పుచున్నారు :—

వేదాన్తగో బ్రాహ్మణః స్యాత్ క్షత్రియో విజయీ భవేత్ ।
వైశ్యో ధనసమృద్ధః స్యాత్ శూద్రః సుఖమవాప్నుయాత్ ॥ 3

అర్థము :— బ్రాహ్మణః = బ్రాహ్మణుఁడు, వేదాన్తగః = వేదాంతముల నెఱింగినవాఁడుగా, స్యాత్ = అగును, క్షత్రియః = క్షత్రియుఁడు, విజయీ=జయ శీలుఁడై, భవేత్ = అగును, వైశ్యః=వైశ్యుడు, ధనసమృద్ధః=ధనముచే నిండినఁవాడుగా స్యాత్=అగును, శూద్రః = శూద్రుఁడు, సుఖమ్ = సుఖమును, అవాప్నుయాత్= పొందును.

తాత్పర్యము :— ఫలంబును అపేక్షింపకయే, బ్రాహ్మణుఁడీ సహస్ర నామమును విన్నను పారాయణముచేసినను వేదాంతములనెఱింగినవాఁడగును, క్షత్రియుడు జయశీలుఁడగును, వైశ్యుఁడు ధనసమృద్ధుడగును, శూద్రుఁడు సుఖము నొందును. (3.)

(అవతారిక.) అనంతరము ఫలమునపేక్షించినచో గల్గు ఫలమును చెప్పుచున్నారు :—

ధర్మార్థీ ప్రాప్నుయాత్ ధర్మమ్ అర్థార్థీచార్థమాప్నుయాత్ ।
కామానవాప్నుయాత్ కామీ ప్రజార్థీచాప్నుయాత్ ప్రజాః ॥

అర్థము :— ధర్మార్థీ = ధర్మమునుగోరినవాఁడు, ధర్మమ్ = ధర్మమును, ప్రాప్నుయాత్ = పొందును, అర్థార్థీ =ధనమును గోరినవాఁడు, అర్థమ్ =ధనమును, ఆప్నుయాత్ = పొందును, కామీ = కామమును గోరినవాఁడు, కామాన్ = కామ ములను, అవాప్నుయాత్ = పొందును. ప్రజార్థీ = సంతతిని గోరినవాఁడు, ప్రజాః = సంతానములను, ఆప్నుయాత్ = పొందును.

తాత్పర్యము :— ధర్మము గోరినవాడు ధర్మమును, ధనము గోరినవాడు ధనమును, ఇటులే సంతానమునో ఇతర ఫలములనో అపేక్షించినచో ఆఫలములను ఇట్లు కోరిన ఫలములనన్నిటిని ఈ సహస్రనామ పారాయణముచే లభించును. (4.)

భక్తిమాన్ యః సదోత్థాయ శుచిః తద్గతమానసః ।
సహస్రం వాసుదేవస్య నామ్నామేతత్ప్రకీర్తయేత్ ॥ 5

యశః ప్రాప్నోతి విపులం జ్ఞాతిప్రాధాన్యమేవచ ।
అచలాం శ్రియమాప్నోతి శ్రేయః ప్రాప్నోత్యనుత్తమమ్ ॥ 6

అర్థము :— యః = ఎవఁడు, భక్తిమాన్ = భక్తిగలవాఁడై, సదా = ఎల్లప్పుడు, ఉత్థాయ = ఉద్యుక్తుడై, శుచిః = పరిశుద్ధుఁడై, తద్గతమానసః = వాని మీఁద నేమనస్సుగలవాఁడై, వాసుదేవస్య = వాసుదేవునియొక్క, ఏతత్ నామ్నాం సహస్రమ్ = ఈ సహస్రనామమును, పరికీర్తయేత్ = కీర్తించునో;

(సః = వాఁడు) విపులమ్ = విశాలమగు, యశః = కీర్తిని, ప్రాప్నోతి = పొందును జ్ఞాతిప్రాధాన్యమేవచ = జ్ఞాతులలో ప్రధానముగా నుండుటను, ప్రాప్నోతి = పొందును, అచలామ్ = చలింపని, శ్రియమ్ = సంపదను, ఆప్నోతి = పొందును, అనుత్తమమ్ = శ్రేష్ఠమైన, శ్రేయః = శ్రేయస్సును, ప్రాప్నోతి = పొందును.

తాత్పర్యము :— ఎవడు భక్తితో శుచియై ఈసహస్రనామమును పారాయణము చేయునో, వాడు గొప్పకీర్తిని జ్ఞాతులలో ప్రాధాన్యమును గొప్ప సంపదను శ్రేయస్సును పొందును. (5-6)

న భయం క్వచిదాప్నోతి వీర్యం తేజశ్చ విన్దతి ।
భవత్యరోగో ద్యుతిమాన్ బలరూపగుణాన్వితః ॥ 7

అర్థము :— క్వచిత్ = ఒక్కడును, భయమ్ = భయమును, నాప్నోతి = పొందడు. వీర్యమ్ = వీర్యంబును, తేజశ్చ = తేజంబును, విన్దతి = పొందును. అరోగః = రోగములేనివాఁడుగను, ద్యుతిమాన్ = కాంతిగలవాఁడుగను, బలరూపగుణాన్వితః = బలము రూపము గుణము వీనితోఁగూడినవాఁడుగను, భవతి = అగును.

తాత్పర్యము :— ఈ సహస్రనామమును పారాయణము చేయువాడు భయమును పొందడు. వీర్యమును తేజస్సును పొందును. రోగము తొలగును. బలము రూపము గుణము మున్నగునవి గల్గును. (7.)

రోగార్తః ముచ్యతే రోగాత్ బద్ధః ముచ్యేత బన్ధనాత్ ।
భయాన్ముచ్యేత భీతస్తు ముచ్యేతాపన్న ఆపదః ॥ 8

అర్థము :— రోగార్తః = రోగముచే పీడింపఁబడినవాఁడు, రోగాత్ = రోగమునుండి, ముచ్యతే = విడువడును, బద్ధః = బంధింపఁబడినవాఁడు, బన్ధనాత్ = బంధమునుండి, ముచ్యేత = విడువడును, భీతః = భయపడినవాడు, భయాత్ = భయమునుండి, ముచ్యేత = విడువడును. ఆపన్నః = ఆపదనొందినవాఁడు, ఆపదః = ఆపదనుండి, ముచ్యేత = విడువడును.

తాత్పర్యము :— వ్యాధిగ్రస్తుడు పారాయణము చేసినచో వ్యాధి తొలగును, జయిలులోనుండువాడయినచో జయిలునుండి విడువడును. భీతుడైనచో భయము తొలగును. ఆపదనొందినవాడైనచో ఆపద తొలగును. (8.)

(అవతారిక.) అనంతరము భగవంతుని ఒకనినే అపేక్షించు అనన్యభక్తి గల పురుషునకు, వాఁడు ప్రార్థింపకుండినను అనర్థనివృత్తి తనంతటనే గల్గునని చున్నారు :—

దుర్గాణ్యతితరత్యాశు పురుషః పురుషోత్తమమ్ ।
స్తువన్నామసహస్రేణ నిత్యం భక్తిసమన్వితః ॥ 9

అర్థము:— పురుషః = పురుషుఁడు, నిత్యమ్ = ప్రతిదినమును, భక్తి సమన్వితః = భక్తితోఁగూడి, పురుషోత్తమమ్ = పురుషోత్తముని, నామసహస్రేణ = సహస్రనామముచే, స్తువన్ (యన్)=స్తోత్రము చేసినచో, ఆశు = శీఘ్రముగా, దుర్గాణి=కష్టములను, అతితరతి = దాటును. (9.)

తాత్పర్యము :—అనన్యప్రయోజనముగా ఈ సహస్రనామమును పారాయణము చేసినచో కష్టములన్నియు తనంతట తానే తొలగును.

వాసుదేవాశ్రయో మర్త్యః వాసుదేవపరాయణః ।
సర్వపాపవిశుద్ధాత్మా యాతి బ్రహ్మ సనాతనమ్ ॥ 10

అర్థము :— వాసుదేవాశ్రయః = వాసుదేవునే ఆశ్రయించినవాఁడై, వాసుదేవపరాయణః = వాసుదేవునే నమ్మినవాఁడైయుండు, మర్త్యః = మనుష్యుఁడు, సర్వపాపవిశుద్ధాత్మా = సమస్తపాపములనుండి విడువడినవాఁడై, సనాతనమ్ = శాశ్వతమైన, బ్రహ్మ = పరబ్రహ్మమును, యాతి = పొందును.

తాత్పర్యము :— విష్ణువునే యాశ్రయించి అనన్యభక్తితో పారాయణము చేయువాడు సమస్తపాపములను తొలగి మోక్షము నొందును. (10.)

న వాసుదేవభక్తానామ్ అశుభం విద్యతే క్వచిత్ ।
జన్మమృత్యుజరావ్యాధిభయం నైవోపజాయతే ॥ 11

అర్థము :— వాసుదేవ భక్తానామ్ = విష్ణుభక్తులకు, క్వచిత్ = ఎచటను, అశుభమ్=అమంగళము, నవిద్యతే=లేదు. జన్మమృత్యుజరావ్యాధిభయమ్ = జననము మరణము జర వ్యాధి వీనిచేగల్గుభయము, నైవోపజాయతే = కలుగనేరదు.

తాత్పర్యము :— విష్ణుభక్తులకు అమంగళమెప్పుడును నేరదు. జన్మాదులును గలుగదు. (11.)

(అవతారిక.) నియమముతో పారాయణముచేయు భక్తునకు అనుషంగికముగా గల్గు ఫలమును తెల్పుచున్నారు :—

ఇమం స్తవమధీయానః శ్రద్ధాభక్తిసమన్వితః ।
యుజ్యేతాత్మసుఖక్షాన్తిశ్రీధృతిస్మృతికీర్తిభిః ॥ 12

అర్థము :— శ్రద్ధా భక్తి సమన్వితః = శ్రద్ధ భక్తి వీనితోఁగూడి, ఇమం స్తవమ్ = ఈస్తోత్రమును, అధీయానః = పఠించునతడు, ఆత్మసుఖక్షాన్తీ శ్రీ ధృతిస్మృతి కీర్తిభిః = ఆత్మసుఖము ఓర్పు ఐశ్వర్యము ధైర్యము కీర్తిఅనువీనితో, యుజ్యేత = కూడును.

తాత్పర్యము :— నియమముతో పారాయణము చేసినచో సుఖసంపదాదులు గల్గును. (12.)

న క్రోధో నచ మాత్సర్యం న లోభో నాశుభా మతిః ।
భవన్తి కృతపుణ్యానాం భక్తానాం పురుషోత్తమే ॥ 13

అర్థము :— కృతపుణ్యానామ్ = పుణ్యమొనరించినవారై, (దానిచే) పురుషోత్తమే = విష్ణువునియందు, భక్తానామ్ = భక్తిగలవారలకు, క్రోధః న = కోపము గలుగనేరదు. మాత్సర్యం న = అసూయ గలుగనేరదు, లోభః న = ఆశ గలుగనేరదు, అశుభా మతిః న = చెడుబుద్ధి గలుగనేరదు.

తాత్పర్యము :— భగవద్భక్తి యనునది గొప్ప పుణ్యములయొక్క ఫలముగా గల్గునదిగాన, అది గల్గినచో క్రోధాదిదోషములు తమంతట తామే నశించును.

(అవతారిక.) క్రిందనిట్లు చెప్పినవి యన్నియు అర్థవాదములే యని భగవద్భక్తివిహీనులు శంకింతురని దలంచి, భగవత్ప్రభావంబునకు అసాధ్యమైనది ఏదియులేదుగాన దీనిని అతివాదంబనియో వేఱువిధముగానో తలంపఁగూడదు అను నభిప్రాయంబుచే భగవత్ప్రభావంబును దెల్పుచున్నారు :—

ద్యౌస్సచన్ద్రార్కనక్షత్రం ఖం దిశో భూః మహోదధిః ।
వాసుదేవస్య వీర్యేణ విధృతాని మహాత్మనః ॥ 14

అర్థము :— ద్యౌః = స్వర్గమును, సచన్ద్రార్కనక్షత్రమ్ = చంద్రుఁడు సూర్యుఁడు నక్షత్రము అను వీనితోఁగూడిన, ఖమ్ = ఆకాశమును, దిశః = దిక్కులును,

భూః = భూమియు, మహోదధిః = మహాసముద్రమును, మహాత్మనః = మహాత్ముయగు, వాసుదేవస్య = వాసుదేవునియొక్క, వీర్యేణ = వీర్యముచే, విధృతాని = ధరింపఁబడినవి.

తాత్పర్యము :— స్వర్గము, చంద్రసూర్యులు నక్షత్రము అను వీనితోఁగూడిన ఆకాశము, దిక్కులు, భూమి, సముద్రము ఇవియన్నియు ఆనారాయణుని ప్రభావముచేతనే ధరింపబడియున్నవి. (14.)

(అవతారిక.) ఇట్లు సమస్తమును వానిశక్తిచే ధరింపఁబడియుండునట్లు చెప్పి, అటులే సమస్తము వానికి వశమైయుండుననుచున్నారు :—

ససురాసురగన్ధర్వం సయక్షోరగరాక్షసమ్ ।
జగద్వశే వర్తతేదం కృష్ణస్య సచరాచరమ్ ॥ 15

అర్థము :—ససురాసురగన్ధర్వమ్ = దేవ అసుర గంధర్వులతోఁగూడిన, సయక్షోరగరాక్షసమ్ = యక్ష ఉరగ రాక్షసులతోఁగూడిన, సచరాచరమ్ = చరాచరములతోఁగూడిన, ఇదం జగత్ = ఈ ప్రపంచము, కృష్ణస్య = కృష్ణునియొక్క, వశే = స్వాధీనమున, వర్తతే = ఉండును.

తాత్పర్యము :— దేవాసురాదులతోఁగూడిన ప్రపంచమంతయు కృష్ణునికి వశమైనది. (15.)

ఇన్ద్రియాణి మనోబుద్ధిః సత్త్వం తేజో బలం ధృతిః ।
వాసుదేవాత్మకాన్యాహుః క్షేత్రం క్షేత్రజ్ఞ ఏవచ ॥ 16

అర్థము :—ఇన్ద్రియాణి = ఇంద్రియములును, మనః = మనసును, బుద్ధిః = బుద్ధియు, సత్త్వమ్ = సత్వమును, తేజః = కాంతియు, బలమ్ = బలమును, ధృతి = ధైర్యమును (అనునివియగు) క్షేత్రమ్ = శరీరమును, క్షేత్రజ్ఞ ఏవచ = ఆత్మయు, వాసుదేవాత్మకాని = వాసుదేవరూపముగా, ఆహుః = (శాస్త్రములు) చెప్పుచున్నవి.

తాత్పర్యము :— ఇంద్రియము మనసు బుద్ధి సత్త్వము తేజసు బలము ధైర్యము ఇవి యన్నియునగు శరీరమును ఆత్మయు భగవదాత్మకములే. (16.)

(అవతారిక.) ఇట్లు తత్త్వశాస్త్రములన్నియు వానియధీనంబులేయని దెల్పి ఇప్పుడు మందాధికారులభయమును తొలఁగింప అనుష్ఠానశాస్త్రములును అటులే వానియధీనములేయనుచున్నారు :—

సర్వాగమానామాచారః ప్రథమం పరికల్పితః ॥
ఆచారప్రభవః ధర్మః ధర్మస్య ప్రభుః అచ్యుతః ॥ 17

అర్థము :—సర్వాగమానామ్ = సమస్తధర్మశాస్త్రములలోను, ఆచారః = సదాచారము, ప్రథమమ్ = మొదటిదిగా, పరికల్పితః = చెప్పఁబడినది, ఆచార ప్రభవః = ఆచారమునుండి పుట్టునది, ధర్మః = ధర్మము, ధర్మస్య = ధర్మమునకు, అచ్యుతః = విష్ణువు, ప్రభుః = స్వామి.

తాత్పర్యము :—సమస్తశాస్త్రములలోను మంచినడతయే ముఖ్యముగా చెప్పబడియున్నది. ఆయాచారమునుండి ధర్మము గల్గును. అధర్మమునకు అచ్యుతుడే స్వామి. (17.)

(అవతారిక.) ధర్మసంబంధులును వానినుండి గల్గినవారలేయను చున్నారు :—

ఋషయః పితరః దేవాః మహాభూతాని ధాతవః ।
జఙ్గమాజఙ్గమఞ్చేదం జగన్నారాయణోద్భవమ్ ॥ 18

అర్థము :—ఋషయః = ఋషులును, పితరః = పితరులును, దేవాః = దేవతలును, మహాభూతాని = ఆకాశాదిమహాభూతములును, ధాతవః = ధాంతువులును, [అనియిట్లుండు] జఙ్గమాజఙ్గమమ్ = చరాచరరూపముగానుండు, ఇదమ్ జగత్ = ఈ లోకమును, నారాయణోద్భవమ్ = నారాయణునియుండి పుట్టినది.

తాత్పర్యము :—ఋషులు పితరులు దేవతలు ఆకాశాదిమహాభూతములు ధాతువులు అను వీనితోగూడిన ఈ ప్రపంచమంతయు భగవంతునియుండి గల్గినవే. (18.)

(అవతారిక.) జ్ఞానంబునకుగూడ వాఁడే కారణమనుచున్నారు :—

యోగజ్ఞానం తథా సాఙ్ఖ్యం విద్యాః శిల్పాదికర్మచ ।
వేదాః శాస్త్రాణి విజ్ఞానం ఏతత్సర్వం జనార్దనాత్ ॥ 19

అర్థము :—యోగజ్ఞానమ్ = యోగశాస్త్రమును, తథా = అటులే, సాఙ్ఖ్యమ్ = తత్త్వనిశ్చయమును, విద్యాః = వ్యాకరణాదివిద్యలును, శిల్పాది = శిల్పము

మున్నగునదియు, కర్మచ = అనుష్ఠింపఁదగినకర్మమును, వేదాః = సర్వప్రధానమగు వేదములును, శాస్త్రాణి = స్మృతీతిహాసపురాణాదులును, విజ్ఞానమ్ = అనునీ శాస్త్రము, ఏతత్సర్వమ్ = ఇవియన్నియు, జనార్దనాత్ = విష్ణువునుండి (కలిగినవి.)

తాత్పర్యము :—యోగజ్ఞానాదిసమస్తంబును విష్ణువునుండియే గల్గినవి. (19.)

(అవతారిక.) ఇట్టి మహావిభూతివైచిత్ర్యంబుచే భగవంతుని మహానిర్వాహమును చెప్పుచున్నారు :—

ఏకో విష్ణుర్మహద్భూతం పృథగ్భూతాన్యనేకశః ।
త్రీన్ లోకాన్ వ్యాప్య భూతాత్మా భుఙ్క్తే విశ్వభుగవ్యయః ॥ 20

అర్థము :—విష్ణుః = విష్ణువు, ఏకః = ఒకఁడే, అనేకశః = అనేకవిధమై, పృథక్ = వేఱువేఱుగానుండు, భూతాని = మహాభూతములను, త్రీన్ లోకాన్ = ములోకములను, వ్యాప్య = వ్యాపించి, భూతాత్మా = ఆభూతములకునాత్మయై, విశ్వభుక్ = సర్వవిధంబునను పాలించుచు, అవ్యయః = వికారములేక, మహద్భూతమ్ = అవాఙ్మనసగోచరుఁడై, భుఙ్క్తే = లీలారసంబుననుభవించుచున్నాఁడు.

తాత్పర్యము :—విష్ణువొకఁడే అంతట వ్యాపించి సమస్తమునకును ఆత్మయై అన్నిటిని పాలించుచు వికారములేక అవాఙ్మనసగోచరుఁడై అనుభవించుచున్నాఁడు. (20.)

ఇమం స్తవం భగవతః విష్ణోః వ్యాసేన కీర్తితమ్ ।
పఠేద్య ఇచ్ఛేత్పురుషః శ్రేయః ప్రాప్తుం సుఖానిచ ॥ 21

అర్థము :—యః పురుషః = ఏ పురుషుఁడు, శ్రేయః = మోక్షమును, సుఖానిచ = ఈలోకసుఖములను, ప్రాప్తుమ్ = పొందుటకు, ఇచ్ఛేత్ = కోరునో ; (సః = వాఁడు) వ్యాసేన = వ్యాసమహర్షిచే, కీర్తితమ్ = చెప్పఁబడిన, భగవతః = షాడ్గుణ్యపరిపూర్ణుఁడగు, విష్ణోః = విష్ణువుయొక్క, ఇమం స్తవమ్ = ఈస్తోత్రంబును, పఠేత్ = పఠింపఁగలఁడు.

తాత్పర్యము :—మహామహిమశాలియగు భగవంతుఁడు ఈ స్తోత్రంబునకు విషయము, ఆ భగవంతుని పూర్ణముగాననుభవించు జ్ఞానమును వాక్కునుగల వ్యాసులు స్తోత్రము చేయువారు, ఆయిద్దఱమహిమగానుండునది ఈ స్తోత్రము, దీనిచే దొలఁగింపఁదగు మహాదారిద్ర్యముగల ఇజ్జగమంతయు ఈ స్తోత్రమునకు అధికారి. కనుక, ఎవరైనను సరే; శ్రేయంబును గోరినచో వారీ స్తోత్రంబును సేవింప వచ్చును. (21.)

విశ్వేశ్వరమజం దేవం జగతః ప్రభుమవ్యయమ్ ।
భజన్తి యే పుష్కరాక్షం న తే యాన్తి పరాభవమ్॥ 22

న తే యాన్తి పరాభవమోన్నమ ఇతి.

ఇతి శ్రీమన్మహాభారతే శతసహస్రసంహితాయాం వైయాసిక్యాం ప్రాక్శాన్తిపర్వణి స్థితః సమ్ప్రతి ఆనుశాసనికే పర్వణి దానధర్మప్రకరణస్థః భీష్మయుధిష్ఠిరసంవాదరూపః ఏకోనపఞ్చాశదధికశతతమః శ్రీవిష్ణోః సహస్రనామస్తోత్రాధ్యాయః సమాప్తః.

అర్థము :—విశ్వేశ్వరమ్ = లోకేశ్వరుఁడై, అజమ్ = జన్మములేనివాఁడై, దేవమ్ = స్వయంప్రకాశమానుఁడై, జగతః ప్రభుమ్ = లోకస్వామియై, అవ్యయమ్ = నాశములేనివాఁడైయుండు, పుష్కరాక్షమ్ = పుణ్డరీకాక్షుని, యే = ఎవరు, భజన్తి = సేవించుచున్నారో, తే = వారు, పరాభవమ్ = పరిభవంబును, న యాన్తి = పొందరు.

తాత్పర్యము :—ఇట్లు స్వతః సమస్త కల్యాణగుణాకరుఁడై, ఆశ్రితులకు కల్పకవృక్షమై, పుణ్డరీకమువంటి నేత్రములుగలవాఁడై శ్రియఃపతియైయుండు భగవంతుని సేవించువారలకు పరిభవము గలదు. (22.)

ఈయర్థమును దృఢపఱచుటకై "నతే యాన్తి పరాభవమ్" అని యావర్తింపఁబడిరెను.

శ్లో॥ అస్మాకమత్ర పరత్రచ సర్వదుఃఖమ్
ఉన్మూల్య సంపదమశేషవిధాం విధాయ ।
శ్రీరఙ్గరాజమహిషీ సచ వైష్ణవానామ్
సఙ్గాత్ సుఖం సహ జయేన సదా క్రియాస్తామ్॥

శ్రీ పరాశరభట్టారకులు సాయించిన
శ్రీవిష్ణుసహస్రనామ వ్యాఖ్యానము
సమాప్తము.

శ్రీమతే రామానుజాయ నమః

# శ్రీ విష్ణు సహస్రనామ ప్రశంస.



సహస్రనామాధ్యాయమున చేరకుండినను శిష్టసంప్రదాయమున అందఱును పారాయణమున అనుసంధించుటచే వ్యాఖ్యానముచేయబడును.

[ భట్టరు వ్యాఖ్యానముగాదు. ]

అర్జున ఉవాచ :—

పద్మపత్రవిశాలాక్ష పద్మనాభ సురోత్తమ ।
భక్తానామనురక్తానాం త్రాతా భవ జనార్దన ॥

అర్థము :—అర్జునుఁడు చెప్పుచున్నాడు. పద్మపత్ర విశాలాక్ష = తామ రాకువలె విశాలమగు నేత్రములు గలవాఁడా! పద్మనాభ = తామరను నాభిలో గలవాడా! సురోత్తమ = దేవతలలో శ్రేష్ఠుఁడా। జనార్దన = జనార్దనుఁడా! అనురక్తానామ్ = అతిప్రీతిగల, భక్తానామ్ = భక్తులకు. త్రాతా = రక్షకుడుగా, భవ = ఉండవలయును.

తాత్పర్యము :— తామరాకువలె విశాలమగు నేత్రములుగలవాఁడా! పద్మనాభుఁడా! దేవశ్రేష్ఠుఁడా! నీవు భక్తులకు రక్షకుడుగానుండవలయును.

శ్రీ భగవానువాచ :—

యో మాం నామసహస్రేణ స్తోతుమిచ్ఛతి పాణ్డవ ।
సోఽహమేకేన శ్లోకేన స్తుత ఏవ న సంశయః ॥
స్తుత ఏవ న సంశయ ఓమ్నమ ఇతి ।

అర్థము :—భగవంతుఁడు చెప్పెను. పాణ్డవ = పాండుపుత్రా! యః = ఎవఁడు, నామసహస్రేణ = సహస్రనామంబుచే, మామ్ = నన్ను, స్తోతుమ్ = స్తోత్రము చేయుటకు, ఇచ్ఛతి = కోరునో, సః = వాఁడు (చెప్పిన), ఏకేన శ్లోకేన = ఒక శ్లోకము చేతనే, అహమ్ = నేను, స్తుతఏవ = స్తోత్రము చేయఁబడినవాఁడనే, న సంశయః = సందేహములేదు

తాత్పర్యము :—పాండుపుత్రా! సహస్రనామముతో నన్ను స్తోత్రము చేయదలంచినచో వాడొక శ్లోకము చెప్పినంతనే నేను తృప్తుడగుదును అని భగవంతుడనెను.

వ్యాస ఉవాచ :—

వాసనాద్వాసుదేవస్య వాసితం తే జగత్త్రయమ్।
సర్వభూతనివాసోఽసి వాసుదేవ నమోఽస్తు తే॥
శ్రీవాసుదేవ నమోఽస్తు తే ఓం నమ ఇతి॥

అర్థము :—వాసనాత్ = వసించుటచే, వాసుదేవస్య = వాసుదేవుండనంబడు, తే = మీచేత, జగత్త్రయమ్ = మూఁడులోకములును, వాసితమ్ = వాసము చేయఁబడినది, సర్వభూత నివాసః = సమస్తభూతములకును వాసస్థానముగా, అసి = అగుచున్నారు, వాసుదేవ = వసుదేవుని పుత్రుఁడా! తే = నీకు, నమః అస్తు = నమస్కారము.

పార్వత్యువాచ :—

* కేనోపాయేన లఘునా విష్ణోర్నామ సహస్రకమ్।
పఠ్యతే పండితైర్నిత్యం శ్రోతుమిచ్ఛామ్యహం ప్రభో॥

అర్థము :—లఘునా = సులభమగు, కేన ఉపాయేన = ఏయుపాయంబుచే, విష్ణోః = విష్ణువుయొక్క, నామసహస్రకమ్ = సహస్రనామము, పణ్డితైః = పండితులచే, నిత్యమ్ = ఎల్లప్పుడును, పఠ్యతే = పఠింపఁబడునో, ప్రభో = స్వామీ! శ్రోతుమ్ = (ఆ యుపాయంబును) వినుటకు, ఇచ్ఛామి = కోరుచున్నాను.

---

* పార్వతి ప్రతిదినము శ్రీవిష్ణుసహస్రనామమును పారాయణము చేయుచుండును. ఒకప్పుడు పారాయణమధ్యమున ఈశ్వరుఁడు రాగా పార్వతి వేవేగముగా పారాయణంబును పూర్తిచేసి భర్తృశుశ్రూషకు వెళ్ళెను. అప్పుడు రుద్రునింజూచి పార్వతి 'నాథా! శ్రీవిష్ణుసహస్రనామమును లఘువుగా పారాయణము చేయుటకు నేదయిన మార్గమున్నచో తెల్పవలయును' అనియడుగగా ఈశ్వరుడు 'శ్రీరామరామ అని శ్రీరామనామస్మరణము గావించినచో ప్రతిరామనామమును సహస్రనామమునకు సమమగును' అని చెప్పెను. అని పెద్దలిచట ఐతిహ్యము చెప్పుదురు.

ఈశ్వర ఉవాచ :—

శ్రీరామ రామ రామేతి రమే రామే మనోరమే ।
సహస్రనామతస్తుల్యం రామనామ వరాననే ॥

శ్రీరామనామ వరానన ఓమ్ నమ ఇతి.

అర్థము :—ఈశ్వరుఁడు చెప్పెను. మనోరమే = మనంబునకు ప్రియుండగు, రామే = రామునియందు, శ్రీరామరామరామేతి = శ్రీరామరామరామ అని, రమే = రమించెదను, వరాననే = అందమగు ముఖముగలదానా! రామనామ = రామనామము, సహస్రనామతః తుల్యమ్ = సహస్రనామంబునకు సమము.

బ్రహ్మోవాచ :—

నమో స్త్వనన్తాయ సహస్రమూర్తయే
సహస్రపాదాక్షి శిరోరుబాహవే ।
సహస్రనామ్నే పురుషాయ శాశ్వతే
సహస్రకోటీయుగధారిణే నమః ॥

శ్రీ సహస్రకోటీయుగధారిణే ఓమ్ నమ ఇతి.

అర్థము :—బ్రహ్మ చెప్పెను. అనన్తాయ = అపరిచ్ఛిన్నుఁడై, సహస్రమూర్తయే = వెయ్యిమూర్తులను గలవాఁడై, సహస్రపాదాక్షిశిరోరుబాహవే = అనేక పాదములు నేత్రములు శిరంబులు ఊరువులు బాహువులు గలవాఁడై, సహస్రనామ్నే = వెయ్యినామములు గలవాఁడై, సహస్రకోటీ యుగధారిణే = అనేకకోటియుగములను ధరించియుండువాఁడైయుండు, శాశ్వతే పురుషాయ = శాశ్వతపురుషునకు, నమః = నమస్కారము.

సఞ్జయ ఉవాచ :—

యత్ర యోగేశ్వరః కృష్ణః యత్ర పార్థో ధనుర్ధరః ।
తత్ర శ్రీః విజయః భూతిః ధ్రువా నీతిః మతిర్మమ ॥

అర్థము :—సంజయుఁడు చెప్పెను. యత్ర = ఎచట, యోగేశ్వరః = యోగేశ్వరుండగు, కృష్ణః = కృష్ణుఁడో. యత్ర = ఎచట, ధనుర్ధరః = ధనుస్సును

